## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc
www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆర్యవిజ్ఞానం - 3

# కలిశకవిజ్ఞానము

## తృతీయభాగము

కలిరాజవంశావళి శేషం

(గుప్తరాజులు; బ్రాహ్మణరాజులు; వివిధరాజ్యములు)

కలి. 2775 — 5049 వఱకు

యు. శ. 2811 — 5085 ,,

క్రీ. పూ. 327 క్రీ. శ. 1947 ,,


గ్రంథకర్త అండ్ ప్రకటనకర్త:

**శ్రీ కోట వెంకటాచలం**

గాంధినగరం : : విజయవాడ 2.

అద్వైతబోధినీ, నిర్విచార జీవనం, బ్రహ్మాండసృష్టి విజ్ఞానం, మానవసృష్టివిజ్ఞానం, కలిశకవిజ్ఞానం 3 భాగములు, ఆభాసక్రైస్తవం, ఆంధ్రులెవరు ?. జంబూద్వీపం యిత్యాది గ్రంథముల గ్రంథకర్త.



విరోధినామ సం॥ర పుష్య శుద్ధ ద్వాదశి ఆదివారము

కలి 5050 క్రీ. శ. జనవరినెల — 1950

వెల : 4—8—0

ప్రథమ ముద్రణం
1000 ప్రతులు

కవితిలక ప్రెస్
విజయవాడ - 2

# కలిశక విజ్ఞానం తృతీయభాగం

(కలిరాజ వంశావళి శేషం)

*

## విషయసూచిక


| | విషయము | పుట |
|---|---|---|
| 1 | ఆంధ్ర సామ్రాజ్య పతనము | ౧ |
| 2 | గుప్తవంశపు రాజులు | ౩ |
| 3 | అలెగ్జాండరు దండయాత్ర: బ్రాహ్మణుల ప్రతిఘటన | |
| 4 | పేర్ల పోలిక | ౮ |
| 5 | సప్తర్షి చలనము ననుసరించి చారిత్రక కాలములను సరిచేసుకొనెడి విధానము | ౧౨ |
| 6 | ఖారవేల శాసనము | ౧౫ |
| 7 | గుప్తశక నిర్ణయము | ౨౩ |
| 8 | గుప్తరాజులు | ౩౧ |
| 9 | ధర్మ సంస్థాపన | ౩౭ |
| 10 | ఉజ్జయినీ చరిత్ర | ౪౦ |
| 11 | గోవింద భగవత్పాదాచార్యులు | ౪౨ |
| 12 | కుమారిలభట్టు | ౫౩ |
| 13 | శ్రీ శంకరాచార్యులు | ౫౬ |
| 14 | కదంబ, పల్లవ వంశములు బ్రాహ్మణవంశములు | ౬౭ |
| 15 | ఆంధ్ర సామ్రాజ్య విభాగము | ౭౦ |
| 16 | అగ్నికులక్షత్రియులు లేక బ్రహ్మక్షత్రులు | ౭౪ |
| 17 | విస్మృతి | ౭౬ |
| 18 | పాశ్చాత్యవిద్య | ౭౯ |
| 19 | శ్రోత్రియులు | ౮౩ |
| 20 | వేదశాస్త్రాది ప్రాచీనవిద్యల సంరక్షణము | ౮౫ |
| 21 | పాశ్చాత్య పండితుల వేదస్తుతి | ౯౨ |
| 22 | సంస్కృత సారస్వత స్తుతి | ౧౦౧ |

23 బ్రాహ్మణ స్తుతి ౧౦౮
24 భారతవర్ష స్తుతి ౧౨౨
25 దానార్హులు ౧౨౩
26 వేదము ౧౨౯
27 వేదభాగములు ౧౩౧
28 ఋగ్వేదము ,,
29 యజుర్వేదము ౧౩౨
30 సామవేదము ౧౩౫
31 అథర్వణవేదము ,,
32 ఉపనిషత్తులు ౧౩౬
33 దశోపనిషత్తులు ౧౩౭
34 ఉపవేదములు ,,
35 వేదాంగములు ,,
36 వేదము నిత్యము – అపౌరుషేయము ౧౪౨
37 వేదవిభాగము ౧౪౮
38 భాష్యకర్తలు ౧౪౯
39 కృష్ణ యజుర్వేదము ,,
40 వేదములో స్వరభేదమునుబట్టి అర్థభేదము ౧౫౧
41 ఇంగ్లీషుభాషలోకూడను స్వరభేదమునుబట్టి అర్థముమారును ౧౫౩
42 వేదాధ్యయన మొకకళ ౧౫౪
43 వేదము – యజ్ఞము ౧౫౫
44 కులవైషమ్యము జాతి నాశనహేతువు. ౧౫౮
45 వైదిక నియోగశాఖలు ౧౬౦
46 అయోధ్యయందలి ప్రజల వర్ణనము ౧౬౨
47 నాలుగు కులములవారిని గురించి ౧౬౫
48 భారతీయులు సత్యవ్రతులు ౧౬౬
49 బ్రహ్మక్షత్ర వంశములు ౧౭౧
50 "స్మిత్" మహాశయుని వర్ణసంకర గాథలు ౧౭౩
51 బ్రహ్మక్షత్రులు ౧౮౫

| | | |
|---|---|---|
| 52 | బ్రాహ్మణరాజులు | ౧౮౮ |
| 53 | ప్రమరవంశపు రాజులు | ౧౯౦ |
| 54 | తోమర లేక వయహానివంశము | ౧౯౩ |
| 55 | కనోజి పట్టణము | ౧౯౬ |
| 56 | తోమరవంశపు రాజ వంశావళి | ౧౯౭ |
| 57 | శుక్ల వంశము | ౧౯౯ |
| 58 | శుక్ల లేక చాళుక్యవంశపు రాజవంశావళి | ౨౦౦ |
| 59 | పరిహార లేక ప్రతిహారవంశము | ౨౦౨ |
| 60 | వైశ్యరాజవంశము | ౨౦౩ |
| 61 | వివిధ రాజ్యములు | ౨౦౯ |
| 62 | మహమ్మదీయ నవాబులు | ౨౧౨ |
| 63 | శహాబుద్దీన్ గోరీ | ౨౧౪ |
| 64 | గోరీకాలమునాటి భారతదేశములోని రాజ్యములు | ౨౧౫ |
| 65 | కనోజ్ | ౨౧౬ |
| 66 | అన్హిలపురము | ,, |
| 67 | మేవాడ్ రాజ్యము | ౨౧౭ |
| 68 | అజ్మీరు, ఢిల్లీ రాజ్యములు | ,, |
| 69 | తైమూరులంగ్ దండయాత్ర | ౨౧౮ |
| 70 | మొగలాయి రాజ్యము – బాబరు | ౨౨౧ |
| 71 | ఖురాన్ షరీఫులోని హింసాప్రేరిత వాక్యములు | ౨౨౪ |
| 72 | ఓరుగంటి కాకతీయులు | ౨౩౦ |
| 73 | గణపతి దేవరాజు | ౨౩౨ |
| 74 | రుద్రమదేవి | ౨౩౩ |
| 75 | ప్రతాపరుద్రుడు | ౨౩౪ |
| 76 | విజయనగర సామ్రాజ్యము | ౨౩౫ |
| 77 | విజయనగర రాజులు | ౨౩౭ |
| 78 | బుక్క భూపాలుడు | ౨౩౮ |
| 79 | రెండవ హరిహరరాయలు | ౨౩౯ |
| 80 | రెండవ బుక్కరాయలు | ,, |

81 తుళువవంశము ౨౪౧

82 కృష్ణదేవరాయలు ౨౪౨

83 అచ్యుతదేవరాయలు ౨౪౪

84 సదాశివరాయలు ,,

85 కృతయుగాది ద్వాపరాంతంవఱకు పరిపాలించిన రాజవంశములు } ౨౪౭

86 పూర్వ చారిత్రిక శకములు ౨౫౪

87 చారిత్రక శకములు ,,

88 భారతయుద్ధము లగాయతు సామ్రాజ్యములు ౨౫౫

89 కలిరాజవంశములు యు. శ. 5085 వఱకు ,,

90 అనుబంధము ౨౫౮


## జంబూద్వీపము


91 జంబూద్వీపము, విభాగములు 3

92 భూగోళస్థిత జంబూద్వీపము 5

93 జంబూద్వీప నవవర్ష విభాగము 9

94 ప్రాచీన వర్ష విభాగములో చేరిన వర్షవిభాగములు 15

95 అమెరికాలో రాక్షసుల అస్థిపంజరాలు 19

96 ఇండియాలో 16 అడుగుల అస్థిపంజరము 20

97 ఆంధ్రమహాజనులకు విజ్ఞప్తి 21

98 సహాయముగోరు విధానము 22

99 ఆర్యవిజ్ఞాన గ్రంథములు 23

100 ప్రముఖుల ప్రశంసా వాక్యములు 27

101 పత్రికా సమీక్షలు 33

102 అచ్చులోనున్న గ్రంథముల విషయసూచికలు 37


## పటములు


1 ప్రాచీన భూగోళపటము 5

2 జంబూద్వీపము, నవవర్ష విభాగము 9

3 ప్రాచీన, నవీనభాగములను, జంబూద్వీపములో సముద్రమున మునిగిపోయిన భూభాగములను జూపుపటము } 15

4 డిటో వేఱొకవిధముగాజూపు పటము 17

# ఆ ర్య వి జ్ఞా న ము



గ్రంథకర్త:

[ వయస్సు 64 సంవత్సరములు ]

ఓమ్

ఆర్యావర్తః పుణ్యభూమిః



# కలిశకవిజ్ఞానం - తృతీయభాగం

## కలిరాజవంశావళి శేషం

## ఆంధ్రసామ్రాజ్య పతనము

గుప్తవంశము; బ్రాహ్మణరాజులు; వివిధరాజ్యములు.

యు. శ. 2811 ల
యు. శ. 5085 వరకు ] కలిశకం 2775–5049 [ క్రీ. పూ. 327 ల
క్రీ. శ. 1947 వరకు

ఆంధ్రమహాసామ్రాజ్యముయొక్క చివరశతాబ్దముల నుండి సామంతరాజులు ప్రబలి భారతవర్షమందనేక చిన్నరాజ్యములేర్పడి నందున రాజ్యము బలహీనమైనది. సామంతరాజుల నదపులో నుంచ గల శక్తి శాతవాహనరాజులకు లోపించినది. నామమాత్ర చక్రవర్తులుగా నుండిరేగాని అధికారమును చలాయించ లేకపోయిరి. అచ్చటచ్చట కొన్నిచిన్నరాజ్యములు తప్ప మిగతా ఆసేతుహిమాచలముగాగల దేశమంతయు శాతవాహనరాజుల బంధుకోటిలోని బ్రాహ్మణరాజులచేతను, వారివలన రాష్ట్రపరిపాలకులుగా నియమింపబడిన సర్దారులచేతను పరిపాలింపబడుచుండినది. క్రమముగా వారందరు స్వతంత్రులైరి. బంగాళదేశము సేనవంశబ్రాహ్మణరాజులచేతను, కళింగము చేతవంశబ్రాహ్మణరాజులచేతను, పల్లవ, చోళ, కేరళ, రాష్ట్రకూట, ప్రమర, చాళుక్య, కదంబ, తోమర, పరిహార లేక ప్రతిహార, వల్లభి, రాజపుటానాలోని రాజపుత్రులు మొదలుగాగల బ్రాహ్మణరాజుల చేతను, స్వతంత్రులైన రెడ్డి, యాదవ మొదలుగాగల యితర సరదారులచేతను పరిపాలింపబడుచు సామ్రాజ్యమంతయు అల్పరాజ్యముల క్రింద విడిపోయినది. అంతటితో సామ్రాజ్యమంతరించినది. మగధలో నామమాత్ర చక్రవర్తిత్వము మాత్రము మిగిలియున్నది. అల్పరాజ్య

ములనేకములుగా నేర్పడి యెవరికి వారు స్వాతంత్ర్యులైనను రాజ్యపరి
పాలన ధర్మముగా జరుపుచు ప్రజలను రాజులు సుఖపెట్టుచుండిరి.
ప్రజలును తమ రాజులను దైవస్వరూపులుగా నెంచుచు రాజభక్తి కలిగి
యుండిరి. ఆకాలమున మతచర్చలు హెచ్చి యనేక మతములుద్భ
వించినవి.

శకులు, హూణులు మొదలుగాగల విదేశీయ దోపిడీగాండ్రు
పశ్చిమమునుండి పంజాబు ప్రాంతములలోనికి జొచ్చి దేశమును కొల్ల
గొట్టుచు, గ్రంథాలయముల నగ్నికాహుతిజేయుచు, స్త్రీల చెరపట్టి మాన
భంగము చేయుచుండిరి. అల్పరాజ్యములు తమలో తాము కలహించి యుద్ధము
లకు దిగుచుండిరిగాని శక, హూణాది విదేశీయుల నెదిరించుటకు యేకీ
భవింపజాలరైరి. ఇట్టి స్థితిలో ఆంధ్ర శాతవాహన రాజులలో ఆఖరు
వాడగు "చంద్రశ్రీ" మైనరుగా నుండెను. అతని సంరక్షణాభార
మును వహించిన ఆంధ్రరాజ్య సేనాపతియైన చంద్రగుప్తుడను నేపాళ
దేశపు గుప్తవంశస్థుడైన క్షత్రియుడు మగధ చక్రవర్తుల యధికారమును
తన చేతులలోనుంచుకొని రాజ్యమును నడపుచుండెను. ఇట్టి స్థితిలో
క్రీ॥ పూ॥ 327 సంవత్సరమున అలెగ్జాండరు దండయాత్ర వచ్చినది.
ఆ దండయాత్రకాలమున గుప్త చంద్రగుప్తుడును నాతని కుమారుడు
సముద్రగుప్తుడును గొప్ప సైన్యంతో తన్నెదుర్కొనుటకు వచ్చు
చున్నట్లు విని అలెగ్జాండరు దండయాత్రను విరమించుకొని స్వదేశము
నకు మరలెను. ఆ సందర్భమున గ్రీకు చరిత్రకారులు ముగ్గురు హిందూ
రాజులను పేర్కొనిరి. వారిచే వ్రాయబడిన పేర్లు. (1) శాతవాహన
వంశములోని ఆఖరు రాజు మైనరు చంద్రశ్రీ. ఇతనినే గ్రీకు చరిత్ర
కారులు "జాండ్రేమ్సు" అని వ్రాసియుండిరి. (2) మైనరు చంద్రశ్రీకి
గార్డియన్‌గా నుండిన "చంద్రగుప్తుడు. ఇతనే గ్రీకులచే వ్రాయబడిన
"శాండ్రోకొట్టసు". (3) యాతని కుమారుడు "సముద్రగుప్తుడు."
యీతడే గ్రీకులచే వర్ణింపబడిన "శాండ్రోసిప్టసు."

పైన వర్ణింపబడిన క్లిష్టపరిస్థితులను బురస్కరించుకొని చంద్ర
గుప్తుడు తన సంరక్షణములోనుండిన ఆంధ్రరాజు మైనరు "చంద్రశ్రీ"ని
సంహరించి తాను క్రీ॥ పూ॥ 327 సంవత్సరమున రాజై మగధ సింహా

సనమున గుప్త వంశమును, గుప్త శకమును, స్థాపించెను. ఆంధ్రవంశపు రాజులు శాఖోపశాఖలుగా జీలిపోయి దేశమందనేక ప్రదేశములలో రాజ్యస్థాపనలు చేసియుండిరి. గాని ఆంధ్రవంశమంతరించ లేదు.

## గుప్తవంశపు రాజులు

అలెగ్జాండరు దండయాత్ర: బ్రాహ్మణుల ప్రతిఘటన

ఆంధ్రశాతవాహన వంశములోని ఆఖరురాజు "చంద్రశ్రీ" మైనరుగా నుండెను. ఈతని తండ్రి "పూడపవులోమాయి." తండ్రి చనిపోవునాటికి ఆతని కుమారుడైన "చంద్రశ్రీ" ద్వాదశాబ్దములు యీడుగల మైనరు. ఆంధ్రసామ్రాజ్యసైన్యములకు సేనానాయకుడైన నేపాళదేశపు క్షత్రియుడు గుప్తచంద్రగుప్తుడు మైనరు చక్రవర్తియైన "చంద్రశ్రీ"కి గార్డియన్‌గా నేర్పడెను. "చంద్రశ్రీ" చక్రవర్తిపేరున గుప్తచంద్రగుప్తుడును ఆతని కుమారుడు సముద్రగుప్తుడును" అధికారమును చలాయించుచుండిరి. ఇట్టి కాలమున క్రీ॥ పూ॥ 327 సం॥రమున "అలెగ్జాండరు" అను గ్రీకురాజు దేశముపైకి దండెత్తివచ్చి పంజాబు ప్రాంతమునగల అల్పరాజ్యములను జయించుచుండెను. ఆదండయాత్రలో నాతని నెదిరించుటకు రాజులను, సైన్యములను సన్నిద్ధపరచుచు అవసరమైన చోటుల తాము కూడ యుద్ధములలో పాల్గొనుచు బ్రాహ్మణులు దేశమును పరరాజు దండయాత్రనుండి కాపాడుట కెచ్చుగా పాటుబడుచుండిరి. అలెగ్జాండరు సైన్యముల నెదిర్చి బ్రాహ్మణులు ఆగ్నేయ, వారుణాస్త్రములచే అలెగ్జాండరు సైన్యమును చిందరవందర గావించినట్లు అలెగ్జాండరుతో వచ్చిన చరిత్రకారుడు "తెమిస్టసు" (Themistius) వ్రాయుచున్నాడు.

" The Brahmins were fighting at a distance with lightning and thunder" (orat XXVII P. 337)

('See A. P. Dutens' Origin of the discoveries attributed to the Moderns P. 196)

తా॥ బ్రాహ్మణులు దూరమందుండి పిడుగులను, మెరుపులను మాపై వెదజల్లుచు యుద్ధముగావించిరి." అని వ్రాసియున్నాడు.

అలెగ్జాండరు చక్రవర్తి యిండియానుండి వెడలిపోయిన పిమ్మట "అరిస్టాటలు"కు (Aristottle) యొక్క యుత్తరము వ్రాయుచు అందిట్లు వ్రాసియున్నాడు.

"The terrific flashes of flame which he beheld showered on his army in India."

(See Dante's Inferno, XIV, 31-7)

తా॥ నాసైన్యము హిందూదేశములో దావాగ్ని సన్నిభంబులగు యస్త్రములలో ముంచివేయబడెనని వ్రాసియున్నాడు.

అలెగ్జాండరనేక బ్రాహ్మణ ఋషీశ్వరుల ఆశ్రమములను ముట్టడించి వాటిని నాశనముచేసి అచ్చట బ్రాహ్మణుల స్త్రీ బాలాదులందరిని వధించియున్నాడు – ఆసందర్భమున.

"ఫిలోస్ట్రాటసు" (Philostratus) అను చరిత్రకారు డిట్లు వర్ణించియున్నాడు.

"Should an enemy make war upon them, they drive him off by means of tempests and thunders as if sent down from heaven. The sages remained unconcerned spectators until the assault was made, when it was repulsed by fiery whirl-winds and thunders which being hurled from above dealt destruction on invaders."

(Philostrati Vit. Apollon, Lib. II C. 33).

తా॥ విరోధులెవ్వరైనను వారిపైకి యుద్ధమునకు వచ్చినచో యాకసమునుండి జార్చినట్లు తుపానులను, పిడుగులను, శత్రువులపై వెదజల్లి తరిమివేసెదరు. శత్రురాజులు (అనగా గ్రీకులు) ముట్టడించు వరకీ బ్రాహ్మణ ఋషీశ్వరులు నిశ్చింతగా జూచుచుండి వారు ముట్టడి సాగించినవెంటనే సుడిగాడ్పులను పిడుగులను మింటనుండి గురిపించి వారల నాశనముగావించి పారద్రోలియున్నారు అని వ్రాసియున్నాడు.

ఈ విధముగా అలెగ్జాండరు యొక్క సైన్యములు భారత దేశ మందు రాజులతో చేయబడిన యుద్ధములందుకంటె బ్రాహ్మణులవలన హెచ్చు నష్టమును పొందియున్నవి. గనుక అలెగ్జాండరు బ్రాహ్మణాగ్రహారములను ముట్టడించి కొన్ని ముట్టడులలో తన సైన్యములు నష్టమును పొందినను కొన్నిఅగ్రహారములలో స్త్రీ, బాల, వృద్ధులను భేదము లేకుండా బ్రాహ్మణ జాతీయులనందరను వధించియున్నాడు. ఇది చాలా దారుణమని గ్రీకు చరిత్రకారులు సూచించియుండిరి. ఆ విషయమును గురించి ఇ. జె. రాప్సను మహాశయుడు తన కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా వాల్యూము I. Ancient India 378 పేజీలో నిట్లు వ్రాసియున్నాడు.

"The Europeans (i. e. Greeks) in this region had more implacable enemies than the native princes. The power behind the throne was the Brahman community; and here for the first time we come upon an opposition inspired by the conception of a national religion, the only germ to be found in ancient times of the idea of Indian nationality. It was the philosophers i. e. the Brahmans who denounced the princes, if they submitted to the foreigner, and goaded the free tribes into revolt." (Vide Plutarch Alexandar 59)

"A city of Brahmans had to be stormed, (Diod XVII 103. I) whilst the operations against Sambus were going on." (Arr VI 16,5)

"The Europeans knew, however who were their worst enmies, and their hand fell heavily upon the Brahmans. They were put to death wholesale; their bodies too were hung up for the kites and vultures by the roads to the unspeakable horror, we may believe, of the people of the land."

(Rapson's Ancient India P. 378)

తా॥ ఐరోపీయులు (గ్రీకులు) యీ ప్రదేశమున (పంజాబు సింధు దేశముల) స్వదేశసంస్థానాధీశ్వరులైన రాజులకన్న యెక్కువైన పట్టుదలతో గూడిన శత్రువులను గలిగియుండిరి. రాజ్యమునకు వెనుక

అండగా నుండిన మహాశక్తి బ్రాహ్మణసంఘము. ప్రాచీనకాలమున భారతజాతీయతా బీజమని చెప్పదగిన ఏకమతాభినివేశమున యుద్రేకింపబడిన ప్రతిఘటన యిచ్చట ప్రదర్శింపబడినది. పరదేశీయునికి లోబడిన రాజులను నిరసించుచూ బ్రాహ్మణులు కొండజాతులను ప్రేరేపించి గ్రీకులను ప్రతిఘటించునట్లు చేయబడినది. గ్రీకులచే బ్రాహ్మణులతో నిండియున్న యొక్క మహానగరము, "సాంబసు" అను కొండజాతి నాయకునిమీద యుద్ధము జరుగుచుండిన కాలముననే ముట్టడింపబడినది.

వారికి (గ్రీకులకు) గర్భశత్రువు లెవరో వారు తెలుసుకొనిరి. వారి ప్రతీకారము బ్రాహ్మణులమీద దారుణముగాపడెను. (ఆ పట్టణములో) నుండిన బ్రాహ్మణులందరు స్త్రీ బాలవృద్ధాదులనుభేదములేక) నరికివేయబడిరి. వారి శవములు గ్రద్దలు రాబందులు తినునట్లు దారి పొడుగునా చెట్లకు వ్రేలాడకట్టబడెను ఈ విధముగా నోటచెప్పుటకు వీలులేని విధమున యా దేశప్రజలయందు (యవనరాక్షసులు) అతి దారుణముగా ప్రవర్తించిరి. అని డియోడోరసు, ఆరయన్ అను యవన చరిత్రకారులు వ్రాసియుండిరి.

పరదేశీయులు దేశముమీదకు దండెత్తి వచ్చిన కాలమున బ్రాహ్మణులు తమశక్తివంచన లేకుండ రాజులకు తోడ్పడియు, అప్పటికి తమచేత మిగిలియుండిన అస్త్రాదులను ప్రయోగించియు దేశమును పరాధీనము కానీయక కాపాడియుండిరి. ఈ ప్రకారము అలెగ్జాండరు యొక్క దండయాత్ర కడ్డంకులు గలుగుచుండినందున ముందుకు చొచ్చుకొని పోవుటకు జంకుగలిగి అలెగ్జాండరు తూర్పు భారతదేశమునగల రాజులను, వారి సైనికబలములను విచారింప మొదలిడెను. ఆసందర్భమున తూర్పు భారతదేశమున మగధసామ్రాజ్యాధిపతియైన బ్రాహ్మణరాజొకడు గలడనియు ఆతని పేరు "జాంద్రేమ్సు" లేక "ఆగ్రేమ్సు" అనియు నాతనికి యిరువదివేల ఆశ్వికసైన్యమును, రెండు లక్షలకాల్బలమును, రెండువేల రథములును, మూడు లేక నాలుగు వేల యేనుగులును నెల్లపుడు యుద్ధమునకు సన్నద్ధముగా నుండు ననియు సైన్యముతో నాబ్రాహ్మణరాజు తన నెదుర్కొనుటకు బయలు

దేరియున్నాడనియు అలెగ్జాండరుకు తెలియువచ్చెను. అంతటితో నాతడు దండయాత్ర చాలించి వెనుకకు మఱలెను.

Alexanandar was told "King Agrammes or Xandrames kept in the field an army of 20,000 cavalary, 200,000 infantry, 2000 chariots and 3000 or 4000 elephants. (Rapson's Ancient India P. 469)

ఈ సందర్భమున "చంద్రశ్రీ"యను ఆంధ్రరాజుకు "జాండ్రేమ్సు లేక అగ్రేమ్సు" అను పేర్లు గ్రీకుచరిత్రకారులచే వాడబడినవి. అందు "అగ్రేమ్సు" (Agrammes) అని "Curtius" (కర్టియసు) అను చరిత్రకారుడును "జాండ్రేమ్సు" (Xandrames) అని "Diodorus" (డియోడోరసు) అను చరిత్రకారుడును వ్రాసియుండిరి. ఈ గ్రీకు పదములకు సరియైన సంస్కృత పేరు "చంద్రమాన్"గా నుండునని "ఇ. జె రాప్సన్" మహాశయుడు తన కేంబ్రిడ్జి హిస్టరీ వాల్యూము I ప్రాచీనభారతవర్షము (Ancient India) 1922 సం॥ కూర్పు **469-470** పేజీలలో యిట్లు వ్రాసియున్నాడు.

"Chandramas would be the equivalent of his Greek -appellative" (P. 469 - 470)

తా॥ "(అగ్రేమ్సు జాండ్రేమ్సు) అను గ్రీకునామమునకు "చంద్రమాన్" అనుశబ్దము సమానముగా నుండును." అని వ్రాసియున్నాడు.

"చంద్రమాన్" = "చంద్రశ్రీ" దీనిలోని "శ్రీ"కారమునుచ్చరింపలేక "శ్రీ" అను దానిని "మాన్"గా మార్చి యుచ్చరింపబడినది. గనుక అలెగ్జాండరు కాలమున మగధయందుండిన రాజు "చంద్రశ్రీ"యను పైనరు ఆంధ్రబ్రాహ్మణరాజు. ఈతనికి గార్డియనులుగా నుండినవారు చంద్రగుప్తుడును ఆతని కుమారుడు సముద్రగుప్తుడునునై యుండిరి.

1. చంద్రశ్రీ 2. చంద్రగుప్తుడు 3. సముద్రగుప్తుడు. ఈ మూడుపేర్లకు గ్రీకు చరిత్రకారులు. 1. జాండ్రేమ్సు 2. శాండ్రొకొట్టసు 3. శాండ్రొసిప్టసు అని వాడియుండిరి. ఇందులోని రెండవ పేరు "శాండ్రొకొట్టసు" చంద్రగుప్తుడుగా గుర్తింపబడినది. ఈ చంద్ర

గుప్తుడు మౌర్య చంద్రగుప్తుడుగా గుర్తింపబడెను. అప్పటికి గుప్త వంశమొకటి ఆంధ్ర వంశము చివర వచ్చియున్నట్లు పాశ్చాత్య చరిత్ర కారులకు తెలియదు. ఇటీవల దొరకబడిన శాసనములవలన గుప్తవంశ మొకటున్నటుల తెలియవచ్చినది. ఆంధ్రవంశము ఏడు శాఖలుగా చీలిపోగలదనియు దేశమున అరాజకము ప్రబలుననియు పురాణములందు చెప్పబడినవిగాని యీ గుప్త వంశము చెప్పబడియుండలేదు. ఆంధ్రవంశములోని ఆఖరువాడగు మైనరు "చంద్రశ్రీ"ని చంపి గుప్త చంద్రగుప్తుడు మగధలో మాత్రము రాజుకాగలిగినాడు. కాని ఆతడు మగధలో పట్టాభిషిక్తుడుగాక మగధను విడిచి పాటలీపుత్రమున పట్టాభి షిక్తుడయ్యెను. అందువలన "మగధరాజ వంశావళి" చెప్పబడునని ప్రారంభించిన పురాణములు ఆంధ్ర రాజవంశముతో ఆగి ఆంధ్రవంశము యేడు శాఖలగునని చెప్పి పిమ్మట సమకాలికులుగా రాజ్యములు చేయు చుండిన అల్పరాజ్యములను పేర్కొని శక, హూణాది దండయాత్రల వలన దేశమరాజముగానున్నందున దాని నరాజక కాలముగావర్ణించినవి. అదియుగాక గుప్త రాజైన చంద్రగుప్తుడు అల్పరాజ్యమునకు ప్రభువు గాని చక్రవర్తికాడు.

అందువలన పురాణములు గుప్తరాజులను మగధచక్రవర్తుల జాబితాలో చేర్చియుండలేదు. శాంఢ్రోకొట్టసు అనగా మౌర్యచంద్ర గుప్తుడని పాశ్చాత్య పండితులు పొరబడి చరిత్రలలో నెక్కించిరిగాని ఆతడు మౌర్యచంద్రగుప్తుడుకాడు. ఆతడు గుప్తచంద్రగుప్తుడైయుండెను.

## పేర్ల పోలిక:

1. గుప్తచంద్రగుప్తునికి పూర్వుడు మైనరు ఆంధ్రరాజు "చంద్రశ్రీ". మౌర్యచంద్రగుప్తునికి పూర్వుడు నందవంశపురాజు "మహాపద్మనంద". గ్రీకులు పిలచినపేరు జాండ్రేమ్సు లేక ఆండ్రేమ్సు = "చంద్రమాస్" పై వానిలో గ్రీకుల జాండ్రేమ్సుకున్నూ మౌర్యచంద్ర గుప్తునికి పూర్వుడైన "మహాపద్మనంద"కున్నూ యెట్టి పోలికయును కనబడదు. గ్రీకు "జాండ్రేమ్సుకు" సమానమైన పేరు "చంద్రమాస్" ఇతడు చంద్రగుప్తునికి పూర్వుడు—

2. గుప్తచంద్రగుప్తునికి తరువాత వచ్చినవాడు "సముద్రగుప్తుడు". మౌర్యచంద్రగుప్తునికి తరువాత వచ్చినవాడు "బిందుసారుడు". గ్రీకులు సముద్రగుప్తుని "శాంద్రోసిప్టసు" అని పిలచియున్నారు — మౌర్య బిందుసారుని "అమిత్రోఛేట్సు" అని గ్రీకులు పిలచిన పేరు.

"శాంద్రోసిప్టసు"కు "అమిత్రోఛేట్సు"కు యెట్టి పోలికయు లేదు. రాప్సన్ మహాశయుడు తన హిందూదేశ చరిత్ర 433 పేజీలో యిట్లు చెప్పుచున్నాడు.

"Chandragupta's son Bindusara - or Amitrochates to give him his Greek name." (P. 433 Ancient India By E. J. Rapson)

తా॥ మౌర్యచంద్ర గుప్తునియొక్క కుమారుడు "బిందుసారుడు' అతని గ్రీకు పేరు "అమిత్రోఛేట్సు" అని వ్రాసియున్నాడు. బిందుసారునికి "అమిత్రఘాత" యను బిరుదుగలదు. బౌద్ధపురాణములలో యీ పేరెచ్చుగా యుపయోగింపబడినందున దానికి గ్రీకు భాషలో "అమిత్రోఛేట్సు" అని వ్రాయబడినది.

చంద్రగుప్తుడు రెండువంశములలోను సమానము = గ్రీకుల "శాంద్రోకొట్టసు."

గ్రీకుపేర్లు:—1. జాంద్రమేస్సు, 2. శాంద్రోకొట్టసు, 3. శాంద్రోసిప్టసు.
మౌర్యవంశములోని పేర్లు :—1. మహాపద్మనంద, 2. చంద్రగుప్తుడు,
3. బిందుసారుడు లేక అమిత్రఘాతుడు.

ఆంధ్ర గుప్తవంశములోని పేర్లు :—1. చంద్రశ్రీ, 2. చంద్రగుప్తుడు,
3. సముద్రగుప్తుడు.

గ్రీకుల జాంద్రమేస్సు = చంద్రమాస్ = ఆంధ్రవంశం. "చంద్రశ్రీ" సరిగా పోల్చబడుచున్నది.

,, శాంద్రోసిప్టసు = సముద్రగుప్తుడు = గుప్తవంశం సముద్రగుప్తుడు.

,, అమిత్రోఛేట్సు = మౌర్యుల అమిత్రఘాత లేక బిందుసార.

గ్రీకులచే చెప్పబడిన పేర్లు గుప్తవంశపు రాజులకును వారికి పూర్వుడగు "చంద్రశ్రీ"కని సరిపోలుచున్నవి. గనుక అలెగ్జాండరు దండయాత్రాకాలమునకు భారతదేశమందు సమకాలికులుగా పోల్చదగినవారు ఆంధ్రరాజైన "చంద్రశ్రీ"యును, గుప్తవంశరాజులైన చంద్రగుప్త, సముద్రగుప్తులుగాని మహాపద్మనంద, మౌర్యచంద్రగుప్తుడు, బిందుసారుడు అనెడివారలు కారు.

అలెగ్జాండరుకు సమకాలికులైనవారు మౌర్యవంశములోని శాంద్రోకొట్టసు, శాంద్రోసిప్టసులని అభిప్రాయపడిన మొదటి పాశ్చాత్య విద్వాంసుడు సర్. విలియం జోన్సు అను పండితుడు ఇతనిచే బెంగాలులో స్థాపింపబడిన "History and antiquities, the Arts, Sciences and Literature of Asia suggested in his presidential address 1793 లో పై అభిప్రాయమును దెలిపియున్నాడు. (Vide Asiatic Researches Vol. IV P. 11) పిమ్మట కలనల్ విల్‌ఫర్డు (Col. Wilford) పండితుడు దానిని బలపరిచెను. (Vide Asiatic Researches Vols V & lx) దీనికి ప్రమాణముగా వీరికి దొరకినది ముద్రారాక్షస మను నాటకము (దీనిని సోమదేవుడను కవి వ్రాసియున్నాడు). పిమ్మట సర్. విలియం జోన్సు, మాక్సుమూలరు పండితులును వారి ననుసరించిరి. కాని యీ అభిప్రాయమును బహుమంది ఐరోపియ, భారతీయ పండితులానాడే యంగీకరింపలేదు. పైన వుదహరింపబడిన జోన్సు మొదలుగాగల పండితులప్పటికి గుప్తవంశ మొకటున్నటులను, అందు రెండవవానిపేరు చంద్రగుప్తుడనియు, ఆతని కుమారుడు సముద్రగుప్తుడనియు, వారు అలెగ్జాండరు దండయాత్రాకాలము క్రీ॥ పూ॥ 327 సం॥రమునం దున్నట్లును వారెఱుగరు – ఈవిషయమున "ట్రాయరు" (Trayar) అను పాశ్చాత్య పండితుడు అనేక సందేహాలను వెలిబుచ్చి "శాంద్రోకొట్టసు" మౌర్య చంద్రగుప్తుడు కాడని సహేతుకముగా జూపియుండెను. మాక్సుమూలరు పండితుడు ఆతని సహేతుక వాదమునకు సమాధాన మీయ లేకపోయెను.

అట్లు సక్రమ సమాధాన మీయలేకపోయినను తన యభిప్రాయమును మార్చుకొని యుండవలసినది అట్లు మార్చుకొని యుండలేదు. ఆవాదము చేయువారు నేటికిని "ట్రాయరు" పండితుని పూర్వపక్షమునకు సమాధాన మిచ్చియుండలేదు. ప్రాచీన భారతవర్ష చరిత్రను రచించిన "కుప్పయ్య" అను హైందవ పండితుడావాదమును ఖండించుచూ గ్రీకు చరిత్రకారులచే వ్రాయబడిన "శాండ్రో కొట్టసు, శాండ్రో సిప్టసు" లు మౌర్య చంద్రగుప్తాదులు కారనియు, వారు గుప్త వంశస్థాపకుడైన "గుప్త చంద్రగుప్తుడును నాతని కుమారుడు సముద్రగుప్తుడు"నై యుండిరనియు ఋజువుచేసియుండెను. (Vide Ancient History of Cuppaiah )P. 198, 199).

పిమ్మట పాశ్చాత్య విద్వాంసులు తమ తప్పు నుపసంహరించుకొని యుండవలసినది, అట్లు చేయకపోగా తమ పొరపాటభిప్రాయముతో గూడిన మౌర్య చంద్రగుప్తునే అలెగ్జాండరుకు సమకాలికునిగా చేసి అలెగ్జాండరు దండయాత్రాకాలము క్రీ॥ పూ॥ 327 సం॥రమే మౌర్యచంద్రగుప్తుని కాలముగా నిర్ణయించి చరిత్రల నల్లి భారతీయ రాజవంశావళుల కాలములను తారుమారొనర్చిరి. ఆతప్పుదారినే నేటి భారతీయ విద్యార్థులును నిర్విచారముగా నేటికికూడను ననుసరించుచు తమ ప్రాచీనతయుంటను, తమ శాస్త్ర వాఙ్మయమందును నమ్మకములేనివారగుటయేగాక భారతీయశకములైన యుధిష్ఠిరశకము, కలిశకము, యుధిష్ఠిరకాలము లేక సప్తర్షిశకము, శ్రీహర్షశకము, విక్రమార్క-శకము మొదలగు వానినన్నిటిని తప్పుశకములక్రింద జమకట్టి తమ పాశ్చాత్య గురువుల తప్పు వూహాలనే ప్రమాణముగా నెంచుచుండిరి.

"పండిట్ భగవాన్‌లాల్ ఇంద్రాజీ"గారిచే వ్రాయబడిన నేపాళరాజవంశావళి" చరిత్రలో కలియుగాబ్దము లీయబడియున్నవి. (Indian Antiquity Vol. XIII. P. 411). కాని పాశ్చాత్య పండితులు వానిని తప్పులని త్రోసివేసిరి. ఈ చరిత్రలో నేపాళరాజవంశములు భారతయుద్ధమునకు పూర్వమునుండి క్రీ. శ. 17 వ, శతాబ్దము వఱకు నీయబడినవి. అందులో అయిదవ రాజవంశము సూర్య

వంశమనియు, ఆరవది టాకూరువంశమనియు చెప్పబడినది. సూర్య వంశములోని రాజులపేర్లు, వారు పరిపాలించిన సంవత్సరములు అన్నియు కలియుగాబ్దములలో చెప్పబడగా అవితమచే నిర్ణయమైన తప్పు కాలనిర్ణయములకు విరుద్ధముగానున్నవని వానిని తప్పులని త్రోసివైచి కొన్ని విపరీత కల్పనలుచేసి తమ తప్పు నిర్ణయమునే సమర్థించుకొనిరి. కాని తమ తప్పులను సవరించికొనినవారలు కారైరి. ఈ నేపాళరాజవంశావళి చరిత్ర మాచే ప్రచురింపబడిన "కలిశక విజ్ఞాన ప్రథమభాగము"న వివరింపబడియున్నది. అచ్చట చూడగలరు.

## సప్తర్షి చలనమునను సరించి చారిత్రకకాలములను సరిచేసుకొనెడి విధానము.

పాశ్చాత్య పండితుల పొరపాటును తెలుసుకొనుటకు వీరు ప్రమాణముగా అంగీకరించి "కలిరాజవంశావళి"ని తీసుకొన్న మత్స్య, వాయు, విష్ణు, బ్రహ్మాండ, భాగవతాది పురాణములలో సులభమై, ప్రకృతిశాస్త్రసిద్ధమైన యొక లెక్క కూడను యీయబడినది ఈ గ్రంథ ద్వితీయభాగమున దానిని వివరముగా చర్చించియుంటిమి కాని ప్రస్తుతవిషయమునకు సంబంధించినంతవఱకు సమన్వయించుకొందము. ఆలెక్క సప్తర్షి మండల చలనము. సప్తర్షి మండలమొక నక్షత్రములో నూరు సంవత్సరములుండునని జ్యోతిశ్శాస్త్రనిర్ణయము. అది 27 నక్షత్రములుగల జ్యోతిశ్చక్రమునంతను చుట్టుటకు 2700 సంవత్సరములు పట్టును. ఈ లెఖ్ఖను ప్రాక్పశ్చిమ ఖగోళశాస్త్రజ్ఞులందరంగీకరించి యుండిరి. భారతయుద్ధము లేక పరీక్షిజ్జననకాలమున అది మఘానక్షత్రమునందున్నట్లు పురాణములన్నియును, జ్యోతిసిద్ధాంతగ్రంథములును యేకగ్రీవముగా జెప్పుచున్నవి. పరీక్షిత్తుజననము లగాయతు మహాపద్మనంద పట్టాభిషేకమువరకు 1500సంవత్సరములు. దీనిని పురాణములలోనున్నట్లు పర్గిటరు పండితుడంగీకరించినాడు. కాని పరీక్షిత్తు లగాయతు ఆంధ్రుల ఆఖరుకు 1886 సంవత్సరములని తన స్వంత వూహాచే నిర్ణయించియున్నాడు.

కనుక పర్గీటరు పండితుని లెక్కను రెండువిధముల పరీక్షింతుము. పరీక్షిత్తు జననం లేక భారతయుద్ధము యు.శ. 1 సం॥లగాయతు మహాపద్మనందవఱకు 1500 సం॥రములు. నందవంశము 100 సం॥రములు. మౌర్యవంశము 137. శుంగవంశము 112 సం॥రములు. కాణ్వావంశము 45 సం॥రములు. ఆంధ్రవంశము 460 సం॥రములు. వెరశి పై లెఖ్ఖప్రకారము ఆంధ్రుల ఆఖరుకు అనగా పాశ్చాత్య పండితులిచ్చిన లెఖ్ఖప్రకారం క్రీ॥శ 240 సం॥రముకు 2354 సం॥రములు. సప్తర్షి మండలం ఒక చుట్టుతిరుగుటకు 2700 సంవత్సరములు పట్టును. గనుక 2700_2354_346 సం॥రములు. ఆంధ్రులకు పిమ్మట గడచిన అనగా ఆంధ్రుల చివర క్రీ॥ శ॥ 240+346=క్రీ॥ శ॥ 586 సం॥రంకు ఒకచుట్టు పూర్తిచేసి సప్తర్షి మండలం తిరిగి మఖలోనికి వచ్చినదన్నమాట. తిరిగి రెండవ ఆవర్తి తిరుగుటకు క్రీ॥ శ॥ 586 లో ప్రారంభించి క్రీ॥ శ॥ 1944 సం॥రంకు 1944 - 586 = 1358 పదమూడు నక్షత్రములు దాటి పదునాలుగవ నక్షత్రముకు వచ్చియుండవలెను. అట్లుగాక రెండు ఆవర్తులు పూర్తిచేసి యిప్పుడు మఖను దాటి పూర్వాఫల్గునీకివచ్చియున్నది. ఇది ప్రత్యక్షవిషయము. తేడా 1342 సం॥రములు గనుక యీ లెఖ్ఖప్రకారం వారి లెఖ్ఖ తప్పని స్పష్టపడుచున్నది. ఇకను పర్గీటరు పండితుని స్వంతయూహననుసరించి పరీక్షిత్తు లగాయతు ఆంధ్రుల చివరకు 1886 సం॥రములు. ఆంధ్రులచివర అనగా క్రీ॥ శ॥ 240. (2700 - 1886=) 814 ఆంధ్రుల చివరనుంచి అనగా 240+814= క్రీ॥ శ॥1054 సం॥రముకు ఒక ఆవర్తిపూర్తిచేసి పిమ్మట 890 సం॥రములలో రెండవ ఆవర్తిలో తొమ్మిది నక్షత్రములు మాత్రమే తిరిగియుండవలసినది. అట్లుగాక రెండు ఆవర్తులు పూర్తిచేసినది గనుక ఈ లెఖ్ఖకూడా శుద్ధతప్పు. ప్రకృతి శాస్త్రమునకు సంబంధించిన లెఖ్ఖప్రకారం పురాణములలో చెప్పబడినలెఖ్ఖ ననుసరించనందున పాశ్చాత్యులచే వ్రాయబడిన భారతదేశ కలిరాజవంశావళి తప్పుగా పరిగణించి చారిత్రక కాలములన్నియు తప్పిపోయినవి. సరియైన కాలనియములేని దానిని చరిత్రగా అంగీకరింపకూడదని చెప్పుచు యేదియో యొకతప్పు కాలనిర్ణయముతో చరిత్రలనుపేరున తప్పుడుగ్రంథములను

వ్రాసి మనకిచ్చియుండిరని స్పష్టపడుచున్నది. సప్తర్షి మండలం యిప్పుడు 2527 సం॥రములలోనె యొక ఆవర్తి తిరుగుచున్నదని ప్రథమ భాగమున ఋజువుచేసి యుంటిమి. రెండు ఆవర్తులు తిరుగుటకు 2527 × 2=5054 సం॥రములు పట్టును. పరీక్షిత్తులగాయతు క్రీ॥ శ॥ 1944 సం॥రంకు 5082 సం॥రములు ప్రతిపంచాంగములోను చూడ వచ్చును. ఇది సరియైన లెఖ్ఖగా స్పష్టపడుచున్నది.

| | |
|---|---|
| పర్గీటరుపండితుడు పురాణములను మథించి నిర్ణయించిన కాలములప్రకారం మౌర్యచంద్రగుప్తుని పట్టాభిషేకము క్రీ॥పూ | 323 సం॥ |
| మౌర్యవంశముయొక్క రాజ్యకాలము పర్గీటరు పండితుని లెఖ్ఖప్రకారం పురాణమునుండి యుద్ధరింపబడినది | 137 సం॥ |
| దానికి పిమ్మట రాబడిన శుంగవంశము రాజ్యము చేసినకాలము పర్గీటరుపండితుని పురాణపరిశోధనప్రకారం | 112 సం॥ |
| దానితరువాత వచ్చిన కాణ్వావంశకాలము | 45 సం॥ |
| అందుకు పిమ్మట రాబడిన ఆంధ్రవంశ రాజ్య కాలము పర్గీటరు పండితుని ప్రకారము | 460 సం॥ |
| వెరశి మొత్తం | 754 సం॥ |

మౌర్యచంద్రగుప్తుని పట్టాభిషేకము నుండి ఆంధ్రవంశము చివరకు గడచిన కాలము 754 సంవత్సరములని పర్గీటరు పండితుడు నిర్ణయించియున్నాడు. మౌర్యచంద్రగుప్తుని పట్టాభిషేకము క్రీ॥ పూ 323 సం॥రం అనియు, ఆంధ్రవంశాంతం క్రీస్తుకు పిమ్మట 240 సం॥రం అనియు నిర్ణయింపబడి వాడబడుచున్నది. ఆప్రకారం లెఖ్ఖచూచిన 323+240=563 సం॥రములు మాత్రమే అగును. కాని పైన చూపిన పర్గీటరుగారి లెఖ్ఖ 754 సం॥రములు 754—323=క్రీ॥శ॥431సం॥రము వఱకు ఆంధ్ర వంశముండవలెనుగదా ! మౌర్యవంశారంభము క్రీ॥పూ॥ 323గా నిర్ణయింపబడిన ఆంధ్రవంశము చివర క్రీ॥శ॥ 431 కావలయును. గాని క్రీ॥ శ॥ 220 యెప్పటికిని కానేరదు. ఇప్పుడు ప్రతివారును ఆంధ్రవంశ ప్రారంభం క్రీ॥ శ॥ 220 అనియు ఆంధ్రవంశాంతము క్రీ॥ శ॥

240 అనియు చరిత్రలలో, వ్యాసములలో, అనేక యితర గ్రంథము లలో నీయబడుచున్న లెఖ్ఖ తప్పులెఖ్ఖయని స్పష్టముగా బోధపడు చున్నదిగదా! దీనినెట్లు మన హైందవ చరిత్రకారులంగీకరించిరో తెలియకున్నది. పాశ్చాత్యపండితులు "దున్నపోతు యీనినదని" చెప్ప గనే మనవారు "దూడనుకట్టివేసితిమ"ని చెప్పుచున్నట్లున్నదని నిర సించుటలో దోషమేమియు లేదని మనవిచేయుచుంటిమి. తప్పుకాలము లతో గూడిన చరిత్రలను విసర్జించి తిరిగి క్రొత్త చరిత్రలు సరియైన కాలములతో వ్రాసుకొనుట యెంతైన అవసరము.

అలెగ్జాండరుకు సమకాలికుడుగానున్నది మౌర్యచంద్రగుప్తుడని తమచే చేయబడిన నిర్ణయమును సమర్థించుకొనుటకు పాశ్చాత్య పండితులు ఖారవేల శాసనములో "రాజామురియా" $\frac{165}{164}$ సం॥రమని చెప్పబడియున్నదనియు, అలెగ్జాండరు కాలము క్రీ॥ పూ 323 సం॥ర మనియు, అప్పుడే మౌర్యచంద్రగుప్తు డుండియుండెననియు 323 నుండి 165 తీసివేయగా క్రీ॥ పూ॥ 158 సం॥లో ఖారవేల శాసనము వేయబడె ననియు కల్పనచేసియుండిరి. విచారింపగా ఖారవేల శాసనములో తేదీ యేమియు చెప్పబడియుండలేదని తెలియుచున్నది. ఇది పాశ్చాత్య పండితుల కల్పనయేగాని ఆ శాసనమున తేదీ చెప్పబడియుండలేదు గనుక ఖారవేలశాసనములోని వ్రాతను పరీక్షింపుదము.

## ఖారవేల శాసనము

ఖారవేలుని హాతిగుంఫ (నె 1345) శాసనమును గురించి ఇ. జె. రాప్సన్ మహాశయుడిట్లు వ్రాయుచున్నాడు :

"This is one of the most celebrated, and also one of the most perplexing, of a[l the historical monuments of India. Unfortunately it has been badly preserved. Of its seventeen lines only the first four remain in their entirety. These describe the fifteen years of the king's boy hood, the nine years of his rule as prince (yuvaraja) his coronation as king when his twenty -

fourth year was completed, and events in the first two years of his reign. All the other lines are more or less fragmentary. Many passages are irretrievably lost, while others are particularly obliterated and can only be restored conjecturally. Time has thus either destroyed or obscured much of the historical value of this record.

Even the fundamental question whether the inscription is dated or not is still in dispute. Some scholars contend that a passage in the sixteenth line can only be interpreted to mean that the inscription was engraved in the 165th year of the Maurya kings, or of the Maurya king while others deny the existence of any such date." (The Cambridge History of India Vol. I. Ancient India By E. J. Rapson M. A. Ed. 1922 P. 534.)

తా॥ ఖారవేల శాసనము భారతదేశమున చారిత్రక విలువ గలిగిన ప్రసిద్ధమైన శాసనములలో నొకటి. అయినను యిది సందేహములను కలుగచేయు శాసనములలో ముఖ్యమైనదిగా నున్నది. దురదృష్టవశాత్తు అది జాగ్రతగా కాపాడబడి యుండలేదు. దానిలో గల పదిహేడుపంక్తులలో నాలుగుపంక్తులు మాత్రము పూర్తిగా చదువుటకు వీలుగా నున్నవి. అందు ఖారవేలుని పదిహేనవ సంవత్సరమునకు గల బాల్యమును గురించియు, పిమ్మట తొమ్మిది సం॥రములు యువరాజుగా నుండుటయు, యిరువదినాలుగవ సం॥రం పూర్తికాగానే రాజు పట్టాభిషేకము జరుగుటయు, పిమ్మట ఆతని రెండుసంవత్సరముల పరిపాలనా విషయములను వర్ణింపబడి యున్నవి. మిగత పంక్తు లన్నియు చెడిపోయినవి. అందచ్చటచ్చట కొన్ని మాటలు మాత్రము గానవగును. అనేక భాగములు తిరిగి పూర్తిచేయుటకు వీలు లేని విధమున నష్టపడిపోయినవి. కొన్ని భాగములు ప్రత్యేకముగా తుడిచివేయబడినవి. అవి (సంశయాత్మకమైన) యూహాపోహాలతో భర్తీ చేసుకోవలసినవై యున్నవి. ఈ చారిత్రాత్మకమైన

వస్తావేజులో చాలాభాగము కాలప్రభావమున నాశనముచేయబడినది. లేక యెవరికిని తెలియుటకు వీలులేనట్లు చెడగొట్టబడినది.

చరిత్రకు మూలాధార విషయమైన తేదీ యీ శాసనములో చెప్పబడినదా ? లేదా ? యనెడి ప్రశ్న యింకను తగాదాలోనేయుండి యున్నది. శాసనములో శిథిలమైయుండిన పదహారవపంక్తిలో మౌర్య రాజులు లేక మౌర్యరాజునుండి 165/164 సం॥రములో యీ శాసనము వేయబడినట్లు అర్థమిచ్చు వాక్యముండవచ్చునని కొందరు పండితులు వాదించుచుండిరి. గాని యితరపండితులందరును అట్టి తేదీ యేమియు అందు చెప్పబడియుండ లేదని నిరాకరించుచుండిరి. అని వ్రాసియున్నాడు ఖారవేల శాసనములోని మొదటి నాలుగు పంక్తులలో ఖారవేలుని 15 సం॥రముల వయస్సువరకు బాల్యమునుగురించియు, పిమ్మట తొమ్మిది సం॥రములాయన యువరాజుగా చేసిన పాలనమును, యిరువది నాలుగవ సంవత్సరములో జరిగిన పట్టాభిషేక విషయములును, తరువాత రెండు సంవత్సరముల పరిపాలనలోని వివరములును వ్రాయబడియున్నవి. ఆశాసనములోగల 17 పంక్తులలో నాలుగుపంక్తులు పైన వివరింపబడిన విషయములను చెప్పుచున్నవి. మిగత 13 పంక్తులలో కొన్ని తుడిచివేయబడియు, కొన్ని శిథిలములై పోయియున్నవి. అచ్చటచ్చట ఒకటిరెండక్షరములు మాత్రము నిలిచియున్నవి. అట్లు నిలిచియుండిన యొకటిరెండక్షరములకు తమకనుకూలమైన అర్థమును కలిగించెడి వాక్యము లగులాగున కొన్ని యక్షరము లూహింపబడి వానికి చేర్చబడి వాక్యములుగా చేయబడినవి. అట్లు తమచే కల్పింపబడి తయారుచేయబడిన శాసనమును పాశ్చాత్యపండితులు నిజమైన శాసనవాక్యములుగా లోకులు నమ్ములాగున చరిత్రలలో నెక్కించిరి. అందులో లేని తేదీయొకటి "రాజామురియా $\frac{165}{164}$" యున్నట్లు కల్పన చేయడమేగాక అట్టి తేదీయేమియు లేదని చెప్పెడి పండితులను నిరాకరించి తమ చరిత్రలలో తమచే కల్పింపబడిన తేదీనివేసి, అది మౌర్య చంద్రగుప్తుని కాలమును రుజువుచేయుచున్నదని కల్పించి ప్రకటించిరి. సత్యముగా చూచిన ఖారవేలశాసనములో యింతవఱకు చెరిగిపోక నిలిచియుండిన మొదటి నాలుగుపంక్తులే చరిత్రకు పనికివచ్చునవి.

ఆ శాసనమందున్నట్లు కల్పింపబడిన మిగత విషయములన్నియు పాశ్చాత్యుల కల్పన. అందు రాజామురియాగాని, నందివర్ధనుడుకాని, పుష్యమిత్ర శుంగుడుగాని, శాతకర్ణిగాని, $\frac{165}{164}$ అని చెప్పతగిన తేదీకి సంబంధించిన విషయముగాని యేవియు వుండియుండలేదు. కల్పిత వాక్యములు చరిత్రలు గానేరవు. క్రీ॥ పూ 327 సం॥రం అలెగ్జాండరు దండయాత్ర వచ్చుట తటస్థించినది. అలెగ్జాండరు దండయాత్రా కాలమున వున్నవారు ఆంధ్రరాజులలో చివర రాజైన "చంద్రశ్రీ" యును, అతనికి గార్డియనుగానుండిన గుప్త చంద్రగుప్తుడును, చంద్రగుప్తుని కుమారుడైన సముద్రగుప్తుడునని గుర్తింపబడినయెడల భారతయుద్ధంనుండి వరుసను రాబడిన రాజవంశముల కాలములను సరిచేసుకొనుట కనుకూలముగా నుండియుండేది. అట్లుగాక క్రీ॥ పూ 327_323 సంవత్సరముల అలెగ్జాండరు దండయాత్రా కాలముకు మౌర్య చంద్రగుప్తుని తెచ్చినందున కలిరాజవంశావళిలో 1200 సం॥రములు తగ్గిపోయినవి. పాశ్చాత్యులకు కావలసినది భారతదేశ ప్రాచీనత నిన్న మొన్నటిదిగ చెప్పుటయేయై యున్నందున వారిట్టి యల్పభావములకు లోనైరి.

పైన వివరించిన ప్రకారం అలెగ్జాండరు దండయాత్రా కాలమున ఆంధ్రరాజ వంశ విభాగము, గుప్తవంశ మధికారమునకు వచ్చుటయు గుర్తింపబడినందున చారిత్రక కాలములలో గొప్ప మార్పు జరుగవలసి యున్నది. అందు బుద్ధుని జననం క్రీ॥ పూర్వము అయిదవ శతాబ్దముగాక క్రీ॥ పూ 1887 సం॥రమునకు పోవలసి యున్నది. బుద్ధుడు అయోధ్య రాజులలో 23 వ వాడగు శుద్ధోదన మహారాజు కుమారుడు. భారతయుద్ధము లగాయతు అనగా పరీక్షిత్తు జననము లగాయతు "మహాపద్మనంద" వరకు 1500 సం॥రములు జరిగినటుల పురాణములన్నియు చెప్పుచున్నటుల "పర్గిటరు" పండితుడు మొదలుగాగల పాశ్చాత్య పండితు లంగీకరించియుండిరి. ఈ పదిహేను వందల సం॥రముల కాలములో మగధరాజులు ముప్పది యేడుమందియు, అయోధ్యరాజులు ముప్పదిమందియు రాజ్యముచేసి యుండిరి. బుద్ధుడు అయోధ్యరాజుల్లలోని 23వ రాజకుమారుడు. గనుక

భారతయుద్ధము లేక పరీక్షిత్తుజననము లగాయతు1500సం॥లోపు కాలము లోనే బుద్ధజననము అయియుండవలెను. భారతయుద్ధము లేక పరీక్షిత్తు జననము క్రీ॥ పూ॥ 3138 వ, సం॥రము. క్రీ॥ పూ॥ 3138—1500=1638 వరకు అయోధ్యరాజులు 30 మంది రాజ్యముచేసియుండిరి. అందు 23 వ వాడగు శుద్ధోదనమహారాజు మగధరాజులలో శిశునాగవంశ ములో నాల్గవవాడగు "క్షేమజిత్తు"కు సమకాలికుడు. ఆతనికాలమున క్రీ॥ పూ॥ 1887 సం॥రమున బుద్ధుడు జన్మించియుండెను. క్రీ॥ పూ॥ 3138 ల॥ 1638 సం॥రంలోపునయున్న బుద్ధుని క్రీ॥ పూ॥ అయిదవ శతా బ్దములోనికి దెచ్చుట యసంగతవిషయముగా స్పష్టపడుచున్నది. దీనిని బట్టి పాశ్చాత్య పండితులచే భారతదేశ చరిత్రను చిత్రించుటలో జరుప బడిన దురాగతము వెల్లడియగుచున్నది. ఫ్లీటరు పండితుని స్వంత కల్పన ప్రకారము మహాభారతయుద్ధము లేక పరీక్షిత్తు జననము లగా యతు మహాపద్మనంద వరకు 1050 సం॥రములుగా నంగీకరించిన యీ కాలములోనే బుద్ధుడు జన్మించియుండవలెనుగదా! అట్లైన మహా భారతయుద్ధకాలము లేక పరీక్షిత్తు జననకాలము అయిన క్రీ॥ పూ॥ 3138 నుండి 1050 మినహాయించగా క్రీ॥ పూ॥ 2088 సం॥రముకు కొన్ని శతాబ్దములకు ముందే బుద్ధుండుండి యుండవలెను. ఈ పాశ్చాత్యపండి తుల కాలనిర్ణయమంతయు అసంగత ప్రసంగముగా స్పష్టపడుచున్నది. బుద్ధుని జననకాల నిర్ణయవిషయమున ఇ. జె. రాప్సన్ మహా శయుడు తనచే వ్రాయబడిన "Cambridge History of India Vol. I. Ancient India. 171 పేజీలో నిట్లు వ్రాసియున్నాడు. "Unfortunately, even after all that has been written on the subject of early Buddhist chronology, we are still uncertain as to the exact date of the Buddha's birth. The date 483 B. C. which is adopted in this history must still be regarded as provisional. (P. 171).

తా॥ దురదృష్టవశమున ప్రాచీన బౌద్ధవాఙ్మయములో వంశా వళుల ప్రకారము గూడను బుద్ధజననమును సరిగా ధృవపరచగల యంశము లేవియు దొరకియుండలేదు. ఆవిషయమున మనమింకను అనిశ్చితమైన స్థితియందే యుంటిమి. బుద్ధజననమును గురించి యీ

చరిత్రలో అంగీకరింపబడి తీసుకొనబడిన తేదీ క్రీ॥ పూ॥ 483 సం॥ తాత్కాలికముగా (యీ చరిత్ర భర్తీచేసుకొనుటకు) చేయబడిన నిర్ణయముగా యెంచబడవలెను. (అనగా సరియైన తేదీగా యెంచబడి స్థాయిముగా నెన్నదగినది కాదని తాత్పర్యము).

పాశ్చాత్య పండితులచే వ్రాయబడిన చరిత్రలన్నిటిలో నీయబడిన తేదీలన్నియు నిట్లు తాత్కాలిక యేర్పాటుమీద తేదీలు లేని యెడ చరిత్రకు విలువలేదని సిద్ధాంతముచేసి దాని ననుసరించి తమ తప్పుడు చరిత్రలు సత్యచరిత్రలుగా చెల్లుబడి కాగలందుకుగాను తాత్కాలికముగా యొకతప్పుడు తేదీని వూహించి నిశ్చయించి దానిని స్థిరపరచెడి యుద్దేశ్యముతో యితరవిధములైన అనేక కల్పనలనుచేసి (Forgeries) అట్టి కల్పనలతో తమ చరిత్రలను నింపియుండిరి. వారిచే వ్రాయబడినవన్నియు హెచ్చు విమర్శనలతో గూడియున్నవనియు వాటిని తప్పు అనిగాని పొరబాటనిగాని చెప్పుటకు వీలులేదనియు, భారతీయపండితులు వారిననుసరించి వారిచే యీయబడిన తేదీలనే తమచే వ్రాయబడిన చరిత్రలలో నిచ్చుచుండిరి. ఇప్పుడు ఇంటరు మీడియేటు చదువుచుండిన యొకవిద్యార్థిని పిలిచి ప్రశ్నించిన ఋగ్వేదము క్రీ॥ పూ॥ 1200 సం॥రములో వ్రాయబడియున్నదనియు, అటు పిమ్మట రెండువందల సం॥రములు చొప్పున తక్కువగా మిగల వేదములు వ్రాయబడినవనియు నిర్విచారముగా జవాబిచ్చును. (అనగా యజుర్వేదము క్రీ॥ పూ॥ 1000 సం॥రము సామవేదము క్రీ॥ పూ॥ 800 సం॥ అధర్వణవేదము క్రీ॥ పూ॥ 700 సం॥ బ్రాహ్మణములు, ఆరణ్యకములు మొదలుగాగలవి క్రీ॥ పూ॥ 600 సం॥రము అని) వేదములు వ్రాయబడినవనిన్ని వాటికాలనిర్ణయములనున్నూ మొదట కల్పించినవాడు మాక్సుమూలరు పండితుడు. కాని ఆతడు వేదకాలములు తనచే నిరంకుశముగా కల్పింపబడినవిగాని సత్యమైస్థిరమైన తేదీ నెంచవద్దనియు, వేదకాలము క్రీ॥ పూ॥ 1200, 1500, 2000, 3000, యింత నంతకు పూర్వకాలమున వ్రాయబడినవో నిర్ణయించుట కెవరికిని సమర్థతలేదనియు, అట్లు నిర్ణయించుటసంభవమనియు దీని నిర్ణయవిషయమున తన భావమును గుర్తించుటలో జాగరూకులై

యుండవలసినదనియు తాను తాత్కాలికముగా మాత్రమే నా తేదీలను చరిత్ర భర్తీకొరకవలంబించితిననియు హెచ్చరించి యుండెను. కాని వాని హెచ్చరికనెవరును గమనింపక ఆయనగారిచే కల్పింపబడిన తప్పు తేదీలను మాత్ర మవలంబించి గట్టిగా ఋజువుకాబడిన తేదీలనువలె వానినంగీకరించి తమ చరిత్రలను నింపుకొనుటయేగాక పాఠశాలలో పిల్లలకుకూడను నేర్పి వారిని తప్పుదారిని పెట్టుచుండిరి ( Winternitz ) వింటరునెట్జు పండితుడు హెచ్చరించిన విధమున మాక్సు మూలరు పండితునిచే వ్రాయబడిన పంక్తుల నీదిగువ నిచ్చుచుంటిమి చూడుడు.

"Max-muller, in 1890, was (Gifford Lectures 1890) careful enongh to warn students that his intervals of 200 years were purely arbitrary, that it was only the terminus adquem, that it was impossible to fix the earliest date; that 'whether the Vedic Hyms were composed in 1000 or 1500 or 2000 or 300 years B. C., No power on earth could ever fix'. Th extremely important caution, however, was igno as Winternitz points out, by most writers the v majority took the suppositions of Max-Muller proved facts, and held that the date 1200—1000 B. for the Rig-Veda was quite proved."

(Vide Pre-historic India Vol I. P. 217
By V. Rangacharya.)

పాశ్చాత్య పండితులచే వ్రాయబడిన చరిత్రలలో పూర్వ చరిత్రల ప్రమాణము లేవియు నుండవు. ఒక పండితునిచే వ్రాయబడిన తప్పు తేదీలతో గూడి సంశయాత్మక వాక్యములతో గూర్చబడిన చరిత్ర వేరొక పండితునికి ప్రమాణ గ్రంథమై, మొదటి పండితునిచే వ్రాయబడిన సంశయాత్మక ఊహాజన్యములైన వాక్యము లన్నియు, రెండవ పండితునికి ప్రమాణవాక్యములుగా చేయబడి నాతనిచే వ్రాయబడిన చరిత్రయందు ఖాయపువాక్యములుగా పరిణమించినవి

It is presumed = అలాభావింపబడినది

It is possible = అలా సంభవింపవచ్చును

It is supposed = అలా వూహింపబడినది

It may be taken = అలా అంగీకరింపవచ్చును

It may be certain = అది వాస్తవముగావచ్చును

It is probable = బహుశః అట్లు కావచ్చును

It is explained = అట్లు వివరింపబడినది.

యీ పై ప్రకారమైన సందేహ వాక్యములతో ప్రతి ప్రాచీన విషయము భారతదేశ చరిత్రలో పాశ్చాత్య పండితులచే ప్రారంభింప బడినది. అటుపిమ్మట వ్రాయబడిన వాక్యములలో తాము ప్రారంభ మున సందేహించిన విషయము ఖాయమైన సత్యవిషయముగా నెంచ బడులాగున వ్రాయబడి యుండినది. ఇట్టి విరుద్ధభావములు గలిగి సంశ యములతో గూడి తమకేమియు సత్యము తెలియనివారలచే చరిత్రలను పేరున అసత్య విషయములతో గూడిన గ్రంధములు వ్రాయబడి మన కందీయబడినవి. అందు సత్యముగాని, యుక్తియుక్తమైన యెట్టి విచారణ గానియుండి యుండలేదు. ఇట్టి యసత్యములతో గూడిన తప్పుడు చరిత్ర ను కల్పించినవారు మన విద్యాధికుల పాలిట మహాపండితులుగా ంచబడుచుండిరి. ఈపండితులచే నిర్ణయింపబడిన వేదశాస్త్ర, పురాణ, తిహాసాది కాలములు యాస్కముని కాలము, ఆర్యభట్టు, బుద్ధుడు, తంజలి, శ్రీ శంకరాచార్యులు మొదలగు మహామహుల కాలము న్నియు తారుమారు చేయబడిన అసత్య నిర్ణయములు. అన్నిటిలోను వక్రమార్గమే యనుసరింపబడినది. గనుక ఆ చరిత్రలు, వానిలోని కాల నిర్ణయములన్నియు నిరాకరింపదగినవై యున్నవి.

పాశ్చాత్య పండితుల చరిత్రలను పఠించి పండితులైన వారల కాతప్పుడు కాలములే స్థిరమైనవిగా ఏర్పడినవి. వీరికిప్పుడు నచ్చుచెప్పుద మనినను తమ నిశ్చయమునకు వ్యతిరేకముగా చెప్పువారందరు ప్రపంచ జ్ఞానములేనివారని వారెంచుచుండిరి. తమరే నవీన నాగరిక

తతో గూడిన విద్వాంసులమని వారి తాత్పర్యము. తమ చదువు తప్పులతోడను, అసత్యములతోడను, వంచనతోడను గూడినదని వారెరుగరు. తమ సాంప్రదాయమునకు, తమ శాస్త్రవాఙ్మయమునకు వ్యతిరేకమైన యీ విద్యాపద్ధతేమి? యని వారు విచారింపరు. వేయేల వారికి తోచదు. ఇతరులు చెప్పుదానిని వినిపించుకొనరు. వీరిని ప్రబోధింపజేసి శాస్త్రీయమార్గమునకు దెచ్చు యుపాయముకనుపించుటలేదు. (ఇది యీ గ్రంథకర్తగారి స్వానుభవము.) ఇప్పటితరమువారు గతించిన రాబోవు తరమువారిలో కొంతమార్పు రావచ్చునని ఆశించుచున్నాము. పైన వ్రాసిన విధముగా హూణవిద్యాధికులందరున్నారని భావింపకుడు. యుక్తి యుక్తమైన వాక్యముల నామోదించి వానిననుసరించి తమ యభిప్రాయములను మార్చుకొనిన విద్వాంసులు లేకపోలేదు. (అట్టి స్నేహితులు యీ గ్రంథకర్తగారికి తటస్థమైనవారనేకులుగలరు. గనుక పైనచెప్పబడిన ఆరోపణ అందరి విషయము కాదని తెలియవలెను). భారతీయ పండితులు వెనుకకు తిరిగి తమ వాఙ్మయమును పరిశోధించి నూతన చరిత్రలు వ్రాయవలసిన కాలమాసన్నమైనదని మనవి చేయుచుంటిమి.

## గుప్తశక నిర్ణయము

గుప్తరాజులు తమశాసనములలో నుదహరించిన గుప్తశక ప్రారంభమునుగురించి పాశ్చాత్య ప్రాచ్య పండితులనేక విధముల వితర్కించిరి. గుప్తరాజులవలన వ్రాయింపబడిన శాసనము లనేకములు దొరకినవి. చాలాభాగ మవిదానపత్రములు - రాగిరేకులమీద చెక్కబడినవి. స్కందగుప్తుని వలన ఒక కొండరాతిమీద చెక్కబడిన శాసనమొకటి జునగడలో నుండియున్నది. సముద్రగుప్తుని ప్రసిద్ధమైన రాతిస్తంభముమీద చెక్కబడిన శాసనము అలహాబాదులోగలదు. ఇంకను బిటారి, కహాం, బిల్సాదు, ఈరన్ మొదలుగా అనేకములుగలవు. ఉదయగిరియందలి యొకకొండ గుహభాగముల చెక్కబడిన రెండవ చంద్రగుప్తుని శాసనములు రెండుగలవు. కన్నింగుహాముచే 'మంకువారు' గ్రామమునందలి యొకతోటలో కనుగొనబడిన కూర్చుండిన

బుద్ధ విగ్రహముయొక్క పీఠముమీద చెక్కబడియున్న మొదటి కుమారగుప్తుని కాలమును దెలుపుయొక శాసనము పండిత్ భగవాన్ లాల్ ఇంద్రాజీగారిచే కనుగొనబడినది. షాపూరులోని యొకరాతి విగ్రహము అడుగున చెక్కబడిన ఆదిత్యసేనుని శాసనమొకటిగలది. అదేమాదిరిగల సారానాధులో దొరికిన కుమారగుప్త, బుధగుప్తుల యొక్క రెండు రాతిశాసనములుగలవు. మందారగుట్టమీద ఆదిత్య సేనుని శాసనమొకటి గలదు.

ఇదిగాక నింకననేక రాతిశాసనములు గుప్తరాజులను వారికి సమకాలికులుగా నుండిన యితరరాజులను దెలిపెడివిగలవు. గుప్తరాజుల నాణెములును, ఆ కాలముయొక్క స్థితిగతులను అప్పటినాగరికతను దెలుపగల యితర శాసనములు, నాణెములనేకములు దొరకియున్నవి. గుప్తశాసనములు, నాణెములు చాలాభాగము ఉత్తరహిందూస్థానములో గలవు. దక్షిణభారతదేశమునను కొద్దిభాగముండియున్నవి. పై గుప్తశాసనములు ప్రకటింప బడినవి. గుప్తశాసనములు చాలాభాగము గుప్తలిపిలో వ్రాయబడి యున్నవి. ఆ శాసనములలో వ్రాయ బడిన తేదీలుగలవి హెచ్చుగాగలవు. ప్రాచీన శాసనములలో తేదీలు వేయు పద్ధతి మూడువిధములుగానున్నది. అందు కలిశక సంవత్సర ములు వేయుపద్ధతి యొకటిది. కలిశకము క్రీ॥ పూ॥ 3102 సం॥రమని అందరచేతను విశ్వసింపబడుచున్నది. రెండవది అప్పటి దేశీయ సం॥ రము మాసము వేయునది. మూడవది గుప్త రాజుల శాసనములలో వాడిన గుప్తశకము. ఈ గుప్తశక ప్రారంభ మెప్పుడని వివిధ మార్గ ముల నన్వేషించి, తర్కవితర్కములు చేయబడినవి. కాని పండితులం దరు యిప్పటికిని యేకాభిప్రాయమునకు రాలేకపోయిరి.

డాక్టరు ఫ్లీటు (Dr. Fleet) పండితుడనేక విధముల తర్కించి క్రీ॥ శ 319-320 గా నిర్ణయించెను. వల్లభి శకముకూడను యీ క్రీ॥ శ 319-20 సం॥ రమే ప్రారంభమని యెంచెను. యం. జి. పాయి (M G. Pai) పండితుడు అనేక విధముల తర్కించి గుప్తశకము 61 సం॥ క్రీ॥ శ 334 సం॥ రమునకు సమానమని సిద్ధాంతీకరించెను. అనగా క్రీ॥ శ॥ 272-73 సం॥ రం గుప్తశక ప్రారంభము

డి. యన్. ముఖర్జీ పండితుడు (D. N. Mukherjee) "ఫ్లీటు" గారణ సరియైనది కాదని త్రోసిపుచ్చి క్రీ॥ శ॥ 419-20 గా నిర్ణయిం సు. శ్యామశాస్త్రియను పండితుడు పై వారినందరను త్రోసిపుచ్చి ప్తశక ప్రారంభము క్రీ॥ శ॥ 200-201 అని నిర్ధారణ చేసెను.

ఆల్బెరూని పండితుడు క్రీ॥ శ 319-320 సం॥గు ప్తశక ప్రారంభ లమని వ్రాసియుండెను.

కన్నింగ్‌హాం పండితుడు క్రీ॥ శ॥ 167 అని చెప్పెను.

బైలీ పండితుడు క్రీ॥ శ 190 గు ప్తశక ప్రారంభమనెను.

పైవాని నన్నిటిని విచారించి ఆర్. యన్. దండేకారు పండి ను (పూనాలోని ఫర్గూసన్ కాలేజీలో సంస్కృతోపాధ్యాయులు) "గుప్త చరిత్ర"లో ఆల్బెరూనిచే నిర్ణయింపబడిన క్రీ॥శ 319-320 ॥మని దాని ననుసరించెను.

గుప్తశక ప్రారంభకాలము ననుసరించిన తర్జనభర్జనలతో వారి త్రలను నింపిరిగాని యేకాభిప్రాయమును పొందలేకపోయిరి. ఇందు ని ననుసరింపవలెను ? సత్యము తెలియకనే తమకు తోచినదాని సరించి యీ పండితులచే వ్రాయబడిన చరిత్ర లెట్లు సత్యచరిత్ర ను ? తప్పు చరిత్రల వలన గలుగు ప్రయోజనమేమి ? సందేహింప న విషయమును సందేహములో నుంచిన బాగుండునుగాని సందే ముతోగూడిన తమ నిర్ణయములతో తేదీలను సరిపుచ్చుకొని మైన సత్యమైన కాలనిర్ణయములను చేసినట్లు వ్రాసి రాజవంశావళి త్రను తారుమారు చేయుటేటిన్యాయము ? ఇందరు పండితులచే యబడిన ఆర్భాటమంతయు గుప్తశక కాలమును క్రీ॥ శకమునకు వ్కట కాలమునకు తెచ్చుటకేగాని యిందొకరును క్రీ॥ పూర్వకాల యుండునేమోయని విచారించినవారు కారు. ఆంధ్రరాజుల కాల నకు పిమ్మట మూడు నాలుగు శతాబ్దములరాజకముగానుండి మన నాకాలపు చరిత్ర మనకగమ్యగోచరముగా నుండినటుల వీరి త్రలలో వ్రాసికొనియుండిరి. కాని యిటీవల కనుగొనబడిన మహా న బౌద్ధశాఖకు చెందిన "మంజుశ్రీ మూలకల్ప" మనెడి

గ్రంథములో క్రీ॥పూ॥ 700 సం॥రమునుండి క్రీ॥ శ॥ 750 వరకు తెంపు లేకుండా మగధలో రాజ్యముచేసి ఆంధ్రగుప్త చక్రవర్తులను, ఆపిమ్మట గల గుప్తరాజులను వరుసక్రమమున చెప్పబడియున్నది. ఆ విషయము గురించి ఆర్. యన్. దండేకారుచే వ్రాయబడిన "గుప్తరాజు చరిత్ర" రెండవపేజీలో యిట్లు వ్రాసియున్నాడు—

"The momentous discovery of "Manju Sri Mulakalpa" (మంజుశ్రీ మూలకల్ప) a remarkble Mahayana chronicle of the succession of imperial powers in India, from 700 B. C. to 750 A. D. without a break, has adequately supplied the account of the Early Gupta and Later Gupta periods, which had been a blank in the history of ancient India so far written."

(A History of the Guptas By R. N. Dandekar, M. A. P. H. D, Poona Ed. 1941—Page 2.)

తా॥ ఇటీవల కనుగొనబడిన మహాయానబౌద్ధమతమునకు చెందినట్టి "మంజుశ్రీమూలకల్ప"మనెడి అతి ప్రాముఖ్యముగల చరిత్రగ్రంథములో క్రీ॥ పూ॥ 700 సం॥రమునుండి క్రీ॥ శ॥ 750 వరకు మగధ సింహాసనమున కూర్చుండి రాజ్యముచేసిన రాజులను తెంపులేకుండా వరుసను జెప్పబడిన జాబితాలో ప్రారంభకాలగుప్తరాజులయొక్కయు, పిమ్మటగల గుప్తరాజులయొక్కయు వివరములీయబడినవి. ఇంతవరకు వ్రాయబడిన ప్రాచీన హిందూదేశ చరిత్రయందీరాజవంశములీయబడక ఖాళీగా వదలివేయబడినది.—అని వ్రాసియున్నాడు.

మఱియు R. N. దండేకారుగారు తమ గుప్తచరిత్ర 14 పేజీలో నిట్లు వ్రాసియున్నాడు—

"The latest known date of that monarch (Chandragupta—Gupta II) is 93 (G. E.); and the latest date of the Satrap dynasty is 304.

తా॥ రెండవచంద్రగుప్తుని చివరకాలము గుప్తశకం 93 సం॥రంకు ఆఖరు శాత్రపవంశమువారి రాజ్యకాలము 304. ఇది గుప్తశక

మని కొందరును, శాలివాహనశకమని కొందరును తర్జనభర్జనలు జరిపి శాలివాహనశకమని నిర్ణయించినందున గుప్తశకకాలమిప్పటికి నందర సమ్మతిని పొందక సందేహములోనే యుండియున్నది శాస్త్రవుల 304 సైరసు దిగ్రేట్లుశకమైయున్నది. దాని ప్రారంభం క్రీ॥ పూ॥ 550 (కలిశకం 2552 సం॥) గనుక సైరసుశకంలోని 304 గుప్తశకం 93సం॥ రముకు సమానము. అనగా (304—93 = 211) సైరసుశక 211 సం॥ రమున గుప్తశకప్రారంభమైయున్నది సైరసుశకం 211 క్రీ॥ పూ॥ 339 సం॥ అగును (550—211 = 339) క్రీ॥ పూ॥ 339 సం॥ కలిశకం 2763 సమానము. ఈ గ్రంథములో నీయబడిన ప్రకారం గుప్తశకం 1 = కలిశకం 2775. ఈ రెంటికి తేడా 12 సం॥రములు యీ తేడా పాశ్చాత్యపండితులచే చేయబడిన వికల్పములకు సరిపుచ్చ ప్రయత్నించుటవలన కలిగియున్నది. ద్వితీయ చంద్రగుప్తుడు గుప్త శకం 58 సం॥ లగాయతు 94 సం॥వరకు రాజ్యమేలెను. శాస్త్రవుల 304 సం॥రం ద్వితీయచంద్రగుప్తుని 93 సం॥రముకు సమానమని యూహాగానము చేయబడినది. అట్లెందు కూహింపవలయునో తెలియ కున్నది. శాస్త్రవుల 304 సం॥రం ద్వితీయచంద్రగుప్తుని కాలమున గుప్తశకం 81 సం॥రముగా తీసికొనిన యీ తేడాసరిపోవుచున్నది. శాస్త్రవులచే లెక్కించబడిన శకం సైరసుశకం. శాస్త్రవుల 304 సైరసు శకములో 304 సం॥రం. అగును. సైరసుశక ప్రారంభము క్రీ॥ పూ॥ 550 సం॥ అయియున్నది. క్రీ॥ పూ॥ 550 నుండి శాస్త్రవుల 304 మినహా యించగా (550—304 = 246) క్రీ॥ పూ॥ 246 సం॥ అగును. క్రీ॥ పూ॥ 246 సం॥రం గుప్తశకం 81 సం॥రంకు సమానము. గనుక గుప్తశక ప్రారంభం క్రీ॥ పూ॥ 246 + 81 = క్రీ॥పూ॥ 327 సం॥ అగును. భారత యుద్ధములగాయతు వరుసను రాజవంశావళులను స్వప్రమాణాముగా ననుసరించిన గుప్తచంద్రగుప్తుని కాలము క్రీ॥ పూ॥ 327 సం॥రం వచ్చును. ఆకాలముననే అలెగ్జాండరు దండయాత్ర రాబడినది. ఆ సం॥రముననే గుప్తశకం ప్రారంభింపబడినది. గుప్తచంద్రగుప్తుడా సంవత్సరముననే పట్టాభిషిక్తుడై శకప్రారంభ మొనర్చెను. ఆంధ్ర శాతవాహన వంశము యేడుశాఖలుగా చీలి దేశములో అనేక అల్ప

రాజ్యములను స్థాపించియుండెను. ఆ కాలముననే దేశమందనేక ప్రదేశములలో శక, యవన, హూణ, మ్లేచ్ఛాదులు ప్రబలి స్త్రీలనవమానించుచు స్త్రీ బాలాదులను వధించుచు దేశమందచ్చటచ్చటజేరి ప్రజలను దోచుకొనుచుండిరి. గుప్తవంశమువారిలో సముద్రగుప్తుడు కొంతవరకు వారినదపులో నుంచగలిగినను విచ్ఛిన్నమై ఆరింబేసి దేశము నల్లకల్లోల మొనర్చి రెండుశతాబ్దములలో గుప్తరాజ్యము నంతరింప జేసిరి. దీనినే అరాజక కాలముగా పురాణములు నర్ణించినవి. గుప్త రాజులు ప్రయాగ, అయోధ్య, మగధ ప్రాంతములు మాత్రమే పరిపాలించిరి. పాటలీపుత్రమువారికి రాజధాని. దేశమందెచ్చుభాగమును స్వాధీనపరచుకొని చక్రవర్తులు కాలేకపోయిరి. సముద్రగుప్తుని దండయాత్రలో జయమును పొందినను దానిని స్థిరపరచుకొన లేకపోయెను. గుప్తరాజ్యముగాక మిగత దేశమున మ్లేచ్ఛులవలన ప్రజలు బాధల నొందినందున దాని నరాజక కాలముగా పురాణములు వర్ణించినవి.

అలెగ్జాండరు దండయాత్రా కాలమునకు భారతదేశములో నున్నటుల చెప్పబడిన రాజు శాండ్రోకొట్టను. ఈ శాండ్రోకొట్టను మౌర్య చంద్రగుప్తుడు కాదని చెప్పియుంటిమి. ఇతడు గుప్తవంశములోని చంద్రగుప్తుడు. ఇతనికి పూర్వుడు జాండ్రమేమ్సు అని గ్రీకు చరిత్రకారులు వ్రాసియుండిరి. మౌర్య చంద్రగుప్తునికి పూర్వుడు మహాపద్మనంద. జాండ్రమేమ్సు పేరుకు మహాపద్మనంద పేరుకు యెట్టి పోలికలేదు. గుప్త చంద్రగుప్తునికి పూర్వుడు ఆంధ్ర రాజులలో చివరివాడున్నూ, మైనరున్నూ అయిన చంద్రశ్రీ అయియున్నాడు. చంద్రశ్రీ పేరు జాండ్రమేమ్సు అని గ్రీకులు చర్చించియుండిరి. రెండు పేర్లు పోలికలలో సరిపోవుచున్నవి. చంద్రగుప్తునను పేరు గ్రీకుల శాండ్రో కొట్టను. మౌర్య, గుప్త చంద్రగుప్తులలో యెవరైనను యీపేరు పోల్చుకొనుట కనకాశము గలిగినందుననే పొరబడుట కలిగినది. గ్రీకు చరిత్రకారులచే వ్రాయబడిన మూడవ పేరు శాండ్రోకొట్టను కొడుకు "శాండ్రో సిప్టను". మౌర్య చంద్ర గుప్తుని కుమారుడైన "బింబుసారుడు" "శాండ్రో సిప్టను" లను పేర్లకు యెట్టి పోలికయు కుదురదు. గుప్తచంద్రగుప్తుని కుమారుడు

కాని గుప్తశక ప్రారంభం క్రీ॥ పూ॥ 327 సం॥రమునుండి గుప్తశక సం॥రములు 209 తీసి వేయగా (327-209 = 118) క్రీ॥ పూ॥ 118 సం॥రములో "ఖో"శాసనములు వేయబడినట్లు స్పష్టముగా తెలియుచున్నది. ఈ గ్రంథములో నీయబడిన రాజవంశావళి ననుసరించి గుప్తవంశము క్రీ॥ పూ॥ 82 సం॥రము వరకు రాజ్యము చేసియున్నందున పరస్పర విరుద్ధమేమియు నుండదు—

"శశాంకుని" "గంజాంశాసనముల"లో గుప్తశకం 300 వేయబడియున్నది. గుప్తశకం 300 అనగా క్రీ॥ పూ॥ 27 సం॥ అగును.

హార్జవర్మయొక్క ఫెజిపూరులోని రాతిశాసనము (Rock Inscription) లో గుప్తశకం 510 సం॥ర్ధం అని వేయబడినది. కామరూపరాజవంశములో పై "హార్జవర్మ", "సాలస్తంభుని" నుండి తొమ్మిది లేక పదవతరమువాడు. సాలస్తంభుని కాలమితరమార్గముల ద్వారా పై పండితుల పొరబాటభిప్రాయముల ననుసరించి విచారింపబడి క్రీ॥ శ॥ 650 సం॥రముగా నిర్ణయింపబడినది. సాలస్తంభ; హార్జవర్మల మధ్యపదితరములకు 179 సం॥రములుండవచ్చునని యూహించి క్రీ॥ శ॥ 650 + 179 = క్రీ॥ శ॥ 829 సం॥రమనియు, ఫ్లీటు పండితుని ప్రకారం గుప్తశక ప్రారంభం 319 + 510 = 829 క్రీస్తుశకమగుననియు, ఆ ప్రకారమూహించిన సరిపోవచ్చుననియు నిశ్చయించి దండేకారుగారు ఫ్లీటు పండితుని మార్గము ననుసరించిరి. కాని యీ లెఖ సరియైనదికాదు. సాలస్తంభుని కాలనిర్ణయమెట్లు చేయబడినదియు చెప్పబడనందున సరిచూచెడి యవకాశము కలిగినదికాదు- అది వారి యూహాప్రపంచములోనిదేగాని యెట్టి లెక్క ననుసరించియు నిర్ణయింపబడినదికాదు- హార్జవర్మయొక్క ఫెజిపూరు రాతి శాసనములోని గుప్తశకం 510 వ, సం॥రం క్రీ॥ శ॥ 183 సం॥రముకు సమానము. (గుప్తశక ప్రారంభం క్రీ॥ పూ॥ 327 సం॥రములు గుప్తశకము 510 నుండి తీసివేయగా క్రీ॥ శ. 183 అగును) కనుక "హార్జవర్మ"కాలము క్రీ॥ శ. 183 వ సం॥రం అగును. హార్జవర్మకు సాలస్తంభుడు పదితరముల ముందువాడు. తరముకు సగటున ముప్పది సం॥రములుగా తీసికొనిన 300 సం॥రములు ముందువాడై యుండును. హార్జవర్మ క్రీ॥ శ.

హరిసేనుడు ఈ రాజుయొక్క విజయములను వర్ణించియున్నాడు. కాశ్మీరపు రాజైన అశోకుడు పాతించిన స్తంభముమీద యీతడు తన జయము లన్నింటిని వ్రాయించి యున్నాడు. ఇతనిన్నియు చంద్రగుప్త మౌర్యునికి పాశ్చాత్య పండితు లంటగట్టిరి.

అలహాబాదులోని రాతిస్తంభముమీద చెక్కించిన వివరములు సముద్రగుప్తుడు అత్యుత, నాగసేనులను జయించెను. మహేంద్ర, కోసల, మహాకాంతార రాజగు వ్యాఘ్రరాజును, కేరళదేశపు "మంత రాజు"ను, పిష్టపుర రాజగు మహేంద్రుని, కొట్టూరదేశపు స్వామి దత్తుని, ఇరండపల్లపు దమనుని, కంచిలోని విష్ణుగోపుని, అవముక్త దేశపు నీలరాజును, వేంగిదేశపు హస్తివర్మను, లాక దేశపు ఉగ్రసేనుని, దేవరాష్ట్రపు కుబేరుని, కుస్థలాపురాధీశ్వరుడగు ధనంజయ మొదలయిన దక్షిణదేశపు రాజుల నందరను జయించెను. రుద్రదేవ, మాతిల, నాగదత్త, చంద్రవర్మన్, గణపతినాగ, నందిన్, బలవర్మన్ మొదలుగాగల అనేకులయిన ఆర్యావర్తపు రాజులను, నాశనమొనర్చెను. దేవపుత్రులను, సాహిలు, షాహానుసాహులు, శకులు, మురుండులను, యవనులను సింహళదేశస్థులను ఇంకా ఇతర ద్వీపములలోని రాజులను రాజ్యభ్రష్టుల నొనర్చెను అని ఆ స్తంభముమీద చెక్కబడి యున్నది.

ఈరాజుయొక్క దిగ్విజయములను హరిసేను డిట్లు వివరించి యున్నాడు.

(1) దక్షిణదేశపురాజులు పదకొండుగురు (2) పేర్లు చెప్పబడిన ఆర్యావర్తపు రాజులు తొమ్మండుగురు, పేర్లుచెప్పనివారు చాలామంది గలరు (3) కొండజాతుల నాయకులందరు (4) పశ్చిమోత్తర సరిహద్దున గల రాజ్యములు, ప్రజాసత్తాకములు (Republics) హిందూదేశపు సరిహద్దునుండి పశ్చిమా దేశపు సరిహద్దువరకున్న జాతులు 1. శకులు (పారశీకులు) 2. తుషారులు (పార్ధియనులు) 3. యవనులు (బాక్ట్రియాలో గ్రీకురాజులు) 4. మరుండులు (ఇండోసిథియనులు) మొదలైన జాతులనున్నూ, సమతాలి, కామరూప, దావక మొదలుగాగల తూర్పుసరిహద్దు రాష్ట్రములనున్నూ పశ్చిమమున మాలర,

పింపబడియు తప్పించుకొనిపోయి గొప్ప సైన్యముతో తిరిగివచ్చి అలెగ్జాండరు సైన్యములను తరిమివేయుటయేగాక తనకురాజ్యమీయ నిరాకరించిన తండ్రినికూడా వధించి క్రీ॥ పూ 320 సం॥రములో రాజ్యమునకు వచ్చినవాడు. క్రీ॥పూ 302 సం॥రమున అలెగ్జాండరుకు పిమ్మట రాజైన ఆతని సేనానియగు సెల్యూకసు 'మెగస్థనీసు' అను తనరాయబారిని సముద్రగుప్తుని కోర్టుకు పంపియుండెను- గ్రీకులచే వాడబడిన పేర్లు.

జాండ్రేమ్సు (Xandrames) = ఆంధ్రరాజులలో చివరవాడును మైనరునగు చంద్రశ్రీ

శాండ్రోకొట్టసు (Sandrocottus) = చంద్రగుప్తుడు(సముద్రగుప్తుని తండ్రి)

శాండ్రో సిప్టసు (Sandrocyptus) = సముద్రగుప్తుడు

ఈ ప్రకారము న్యాయముగా గుర్తించిన పురాణవాక్యములకు సరిపోవును. ఇంతవరకు పాశ్చాత్య పండితులచేతను వారి యనుయాయులైన హైందవ పండితులచేతను వ్రాయబడిన హైందవచరిత్ర లన్నిటిని సవరించి భారతీయ చరిత్రను తిరిగి వ్రాయవలసి యుండును.

సముద్రగుప్తుని చరిత్ర లోకమునకు వెల్లడియైన పిమ్మట విన్సెంటు స్మిత్ పండితుడిట్లు వ్రాసియున్నాడు.

"By a strange irony of fate this Great King—Warrior, poet, musician — who conquered nearly all India, and whose alliance extended from the oxus to Ceylon, is unknown even by name to the historians of India. His last fame has been slowly recovered by the minute and laborious study of inscriptions and coins during the last 70 years; and the fact that it is now possible to write a long narrative of the events of his memorable reign is perhaps the most conspicuous illustration of the success gained by patient archæological research in piecing to-gether the fragments from which alone the chart of the anthentic early history of India can be constructed."

(Early History of India—By V. A. Smith, Page 306)

తా॥ దురదృష్టవశమున యీగొప్పరాజు, వీరుడు, కవి, గాయకుడు, హిందూదేశమునంతయు జయించినట్టివాడు, ఆక్సునదిలగాయతు, సింహళమువఱకుగల రాజ్యములతో స్నేహసంబంధములు గలవాడునునగు మహారాజు నామమాత్రముగానైనను హైందవచరిత్రకారులకు తెలియకుండెను. 'గతడెబ్బది సం॥రముల నుండియు దొరుకబడిన శాసనములు, నాణెములు, శ్రద్ధగా పరిశీలింపబడిన మీదట మఱువబడి నష్టమైపోయిన నీతని కీర్తి లోకమునకు తిరిగి వెల్లడియైనది. ఇటీవలి హిందూదేశచరిత్ర వ్రాయుట కుపకరించెడి భూగర్భవస్తు పరిశోధనలవలన యీతని రాజ్యపాలనాది వ్యాపారములకు సంబంధించిన పెద్దచరిత్ర వ్రాయుట కవకాశము దొరికినది. అని వ్రాసియున్నాడు.

సముద్రగుప్తునియొక్క చరిత్ర లోకమునకు వెల్లడియైన పిమ్మటనైనను వారిచే లోగడ చేయబడిన పొరబాటును దిద్దుకొనుటకు ప్రయత్నింపక బోవుటెంతయు శోచనీయము.

| రాజ్య కాలం | వరుస సంఖ్య | రాజుపేరు |
|---|---|---|
| 36 | (3) | ద్వితీయచంద్రగుప్త (విక్రమాదిత్య) |

| కలిశకం | యు. శ. | క్రీ॥ పూ॥ | గుప్తశకం |
|---|---|---|---|
| 2833_2869 | 2869_2905 | 269_233 | 58_94 |

ఈతడు కధియవారును లోబరచుకొనెను. వంగదేశమును జయించెను. తన శత్రువుల నందఱ సంహరించెను. సింధునదియొక్క యేడు ఉపనదులనుదాటి పశ్చిమసరిహద్దున స్థావరమేర్పరచుకొనిన బాహ్లీక జాతివారిని తరిమివేసెను.

| రాజ్య కాలం | వరుస సంఖ్య | రాజుపేరు |
|---|---|---|
| 42 | (4) | మొదటి కుమారగుప్త (మహేంద్రాదిత్య) |

| కలిశకం | యు. శ. | క్రీ॥ పూ॥ | గుప్తశకం |
|---|---|---|---|
| 2869_2911 | 2905_2947 | 233_191 | 94_136 |

ఈతడశ్వమేధయాగ మొనర్చెను. పశ్చిమోత్తరమునుండి దేశముమీదికి దండెత్తిన హూణులను పారదోలెను.

25 (5) స్కందగుప్త
ప్రతాపాదిత్య
2911-2936 2947-2972 191-166 136-161

ఈతడు హూణులను దేశమునుండి వెడలగొట్టెను.

5 (6) నరశింహగుప్త
మైనరుగానున్నందున గార్డియన్
తండ్రి 'స్థిరగుప్త' ప్రకాశాదిత్య
యని బిరుదు (మైనరురాజు
స్కందగుప్తునికి మేనల్లుడు)
2936-2941 2972-2977 166-161 161-166

35 ,, నరశింహగుప్త (బాలాదిత్య)
మేజరై రాజ్యముచేసెను
2941-2976 2977-3012 161-126 166-201

ఈతడు వైదికమతమునందు భక్తిగలిగియున్నను బౌద్ధులను కూడా చాలాభక్తితో సేవించుచుండువాడు, బౌద్ధులవిశ్వ విద్యాలయముగల నలాందాయందొకస్తూపమును కట్టించి దానిని బంగారుతోను, నవరత్నములతోను పొదిగించి యలంకరించెను.

44 (7) ద్వితీయకుమారగుప్త
(క్రమాదిత్య)
2976-3020 3012-3056 126-82 201-245.

యుధిష్ఠిరశకం 3056 (కలి 3020; క్రీ॥ పూ॥ 82; గు॥ శ 245) సం॥రములో హూణులు మిడుతలదండువలె దేశములోనికి జొరబడి గుప్తరాజ్యము నంతరింపజేసిరి. ఈ రాజు జీవితమంతయు హూణులతో యుద్ధముజేయుటలో గడచిపోయినది. ఇంతటితో గుప్తరాజ్య మంతరించినది. కాని గుప్తవంశములోని రాజులు క్రీ॥ శ॥ ఏడవశతాబ్ద మధ్యకాలమువఱకు అచ్చటచ్చట యల్పరాజ్యములను గలిగి పరిపాలించుచుండిరి. వీరికి సమకాలికులుగాను అటుపిమ్మట క్రీ॥ శ॥ 1193 వఱకు నుండిన బ్రాహ్మణరాజ్యములను గురించి రాగలపుటలలో వర్ణింపబడును.

# ధర్మ సంస్థాపన

అనాదికాలమునుండియు జరుగుచుండిన ప్రతిబ్రహ్మసృష్టిలోను వచ్చుచుండిన ప్రతికల్పము (అనగా బ్రహ్మయొక్క అహోరాత్రము) వేయి ఉదయకల్పములు, వేయిక్షయకల్పములతోను గూడియుండును. ఉదయకల్పమున సృష్టి ప్రవర్తించుచుండినకాలము. ఇది బ్రహ్మకు పగలు. దీని పరిమితి 432 కోట్లమానవ సం॥రములు. క్షయకల్పమున సృష్టి ప్రకృతియందులీనమైయుండినకాలము. ఇది బ్రహ్మకు రాత్రి కాలము. దీని పరిమితికూడా 432 కోట్లమానవ సం॥రములు. బ్రహ్మకు పగలు, రాత్రి కలిసిన యెనిమిదివందల అరువదినాలుగుకోట్ల మానవ సంవత్సరములగును. బ్రహ్మయొక్క పగటికాలము 432 కోట్ల మానవ సంవత్సరములలోను వేయి మహాయుగములగును. మహాయుగ మనగా 1. కృతయుగము 17,28,000 సం॥రములు 2. త్రేతాయుగము 12,96,000 సం॥రములు 3 ద్వాపరయుగము 8,64,000 సం॥రములు 4. కలియుగము 4,32,000 వెరశి నాలుగుయుగములు కలిసినకాలము 43,20,000 సం॥రములు ఒకమహాయుగమగును. అట్టి మహాయుగములు వేయిగడచిన బ్రహ్మకొకపగలగును. (43,20,000 × 1000 = 432,00,00,000 నాలుగువందల ముప్పదిరెండు కోట్ల సం॥రములు) ఈవిధమైన లెఖ ప్రకారము :

ఇప్పుడుండిన బ్రహ్మకు యేబది సం॥రముల వయస్సు గడచినది. దానికి ప్రథమపరార్థమని పేరు. బ్రహ్మయొక్క ద్వితీయపరార్థమున మొదటి సం॥రము మొదటిరోజుకు శ్వేతవరాహకల్పమని పేరు. ఈకల్పములో జరుగవలసిన మనువులకాలము పదునాలుగింటిలో ఆరుగురు మనువులు గతించిరి. వారి పేర్లు 1. స్వాయంభువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుష. అనువారలు. ఒక్కొకరు 30,67,20,000 సం॥రములు చొ॥ గడపి విరమించిరి. ఇప్పుడు యేడవమనువు వైవస్వతమనువుకాలము జరుగుచున్నది. దీనిని మనము నిత్యము సంకల్పములలో స్మరించుచునేయున్నాము. ఒక్కొక మనువుకాలము లెఖ ప్రకారం 71 మహాయుగములగును. అందిప్పుడు

వైవస్వతమన్వంతరములో యిరువదెనిమిదవ మహాయుగము జరుగుచున్నది. దాని చరిత్రమిచ్చట క్లుప్తముగా నీయబడుచున్నది.

ప్రతిమహాయుగము కృతయుగముతో ప్రారంభమగును. కృతయుగకాలమున వేదధర్మముల చాతుర్వర్ణ్య ప్రజలు స్వాభావికముగా నాచరించుచు తపో, సత్య, దయాశౌచాదులు గలిగియుందురు. రాజులు యెట్టి శ్రమలేకనే ధర్మమును పరిపాలించుచు ప్రజాపరిపాలన మొనర్చుచుందురు. కృతయుగమున జనులు రోగము నెఱుగరు. అందరును సంపూర్ణారోగ్యవంతులై యుందురు. దరిద్రము నెఱుగరు. సర్వవస్తుసంపూర్ణత గలిగియుందురు. వారికి దురాశ, క్రోధము, అసూయ మొదలైన గుణములు లేవు సర్వజీవులకు మేలుగోరినవారలై ప్రాణిహింసజేయక సుఖించుచుందురు. త్రేతాయుగమున యజ్ఞము లెక్కువగా నాచరించుచు సుగణసంపదలతోగూడి ప్రజలు సుఖించుదురు. ద్వాపరమున ప్రజలు ప్రభువులు యుద్ధశాంతుగలవారలై యుందురు. కలియందు హీనబుద్ధి గలవారలై నిరంతరపాపచింతలతోగూడి పరదార, ధనాదుల నపహరింపగోరుచు అందుకు దగిన యుక్తులనరయుచుందురు. పరలోకభయముండదు. వర్ణసంకరము జేయుట యందాసక్తిమెండు.

"స్వభావాత్కూరకర్మాణశ్చాన్యోన్యమవిశంకితాః। భవితారో నరాస్సర్వే సంప్రాప్తే యుగసంక్షయే॥" (భారతం. అరణ్యపర్వము) కలియుగాంతమునకు ప్రజలు స్వభావముగా క్రూరకర్ములై యొకరొకరిని హింసించుకొనుచు నశింతురని చెప్పబడినది. అదేప్రకారము యీ కలియుగమున అయిదువేల సంవత్సరములు నిండిన పిమ్మటనుండి కలిధర్మములైన దురాగతములు ప్రారంభమైనవి. అవి కలియుగాంతమునకు పూర్ణములై కాగల కార్యమును పూర్తిచేసి తిరిగి కృతయుగ ధర్మాచరణమునకు దారితీయును.

కృత, త్రేత, ద్వాపరయుగములు మూడింటిలోను క్షత్రియులు యీ భారతవర్షమున ప్రభుత్వమునందుండి వైదికధర్మమును పరిపాలించిరి. ద్వాపరయుగాంతమున రాబడిన భారతయుద్ధమునకు పిమ్మట అయోధ్యయందు సూర్యవంశపు క్షత్రియులును, హస్తినాపురము,

మగధలయందు చంద్రవంశపు క్షత్రియులు రాజులుగానుండి యు॥శ॥ 1504 (క్రీ॥పూ 1634 సం॥రం) సంవత్సరము వఱకు ప్రజలను ధర్మ యుక్తముగా పరిపాలించియుండిరి. ఆపిమ్మట యు. శ 1504 లగాయతు 1604 వఱకు నూరుసంవత్సరములు చతుర్థ కులజులైన నందవంశము వారు ధర్మయుక్తముగా పాలించిరి. యు. శ. 1604 లగాయితు యు. శ. 1920 సం॥రము వఱకు మౌర్యవంశమువారు రాజ్యమును పాలించిరి. కాని వీరిలో మొదటిరాజు చంద్రగుప్త మౌర్యుడు, రెండవ రాజు బిందుసారుడు బౌద్ధమత భావములను గలిగియున్నను వైదిక ధర్మమునుకూడను పోషించియుండిరి. మౌర్యవంశములోని మూడవ రాజు "అశోకుడు" బౌద్ధ ధర్మదీక్షను గ్రహించి బౌద్ధమతమునే రాజ మతముగా నొనర్చినందున వైదికధర్మమునకు ప్రజలలో ప్రచారము, పోషణ తగ్గిపోయి, బౌద్ధమునకు ప్రచార, పోషణ లెక్కువయ్యెను. అందువలన వైదికధర్మముక్షీణింప మొదలిడెను. వైదికధర్మ మును సంరక్షింపవలసిన క్షత్రియులు నశించిపోయిరి. వారిస్థానమున వచ్చిన ప్రభువులు బౌద్ధులై బౌద్ధధర్మదీక్షను పుచ్చుకున్నవారైనందున వైదిక ధర్మమును ద్వేషించి యెట్టి యుపకార మొనర్పకున్నను పోషణ సన్నగిలినది. అట్టి స్థితిలో ధర్మ సంరక్షణార్థము బ్రాహ్మణులు ఖడ్గధారణచేసి రాజ్యాధికారమును చేపట్టుటావశ్యకమయ్యెను. ఇట్టి స్థితిలో మౌర్యవంశము నంతరింపజేసి "శుంగవంశ బ్రాహ్మణులు" రాజులైరి. శుంగ, కాణ్వ, ఆంధ్ర శాతవాహన బ్రాహ్మణ వంశము వారలు యు. శ. 1920 లగాయితు యు. శ 2811 వఱకు 891 సం॥ర ములు (క్రీ॥పూ 1218_327 వఱకు) రాజ్యముచేసి వైదికధర్మమును తిరిగి ప్రతిష్ఠించిరి. రాజమతము ననుసరించి ప్రజలు సంచరించుట స్వభావమైనందున ప్రజలలో బౌద్ధమత భావములు సన్నగిలి వైదిక ధర్మ నిష్ఠగలవారలై వర్ణధర్మముల యథావిధి నాచరించుచుండిరి. ఈ బ్రాహ్మణ ప్రభువులు వైదిక ధర్మమును పోషించినట్లే బౌద్ధ ధర్మమునకును విశేషమైన దానధర్మములు చేసియుండిరి. ఆ విషయము లోగడ వివరించియుంటిమి. శాతవాహన వంశీయులు యెవరికివారు స్వతంత్రులై దేశమందనేక స్వల్ప రాజ్యములను స్థాపించియుండిన

కాలములో ఆఖరు శాతవాహన చక్రవర్తియైన ఆంధ్రరాజు నైనవారు "చంద్రశ్రీ" ని సంహరించి గుప్తవంశీయుడైన క్షత్రియుడు రాజై వైదికధర్మమును పోషించెను. గుప్తరాజ్యము క్రీ. పూ 82 సం॥ర ములో నశింప ధర్మ సంరక్షణార్థము అగ్నికుల క్షత్రియులను పేరున బ్రాహ్మణ ప్రభువులు క్రీ॥పూ॥ నాలుగవ శతాబ్దమునుండి దేశములో రాజ్యస్థాపనలు చేసియు కొంతకాలము శాతవాహనులకును, కొంత కాలము గుప్తరాజులకును లోబడియుండి క్రీ॥ పూ॥ మొదటి శతాబ్ద ములో గుప్తరాజుల అనంతరము ప్రాముఖ్యమునకు వచ్చిరి. వారి చరిత్రము క్లుప్తముగా మాకు తెలియవచ్చినంతవఱకు ముందు గ్రంథ మున కీర్తింపబడును.

## ఉజ్జయినీ చరిత్ర

C. H. Payne M. A. సి హెచ్. పేయిన్, ఎం. ఏ. అను పాశ్చాత్యపండితుడు "Memoir of Central India" (మాధ్య భారత చరిత్ర) అను నొకగ్రంథమును వ్రాసియున్నాడు (ఈయన "టాడ్స్ ఎన్నల్సు ఆఫ్ మీవారు" అను గ్రంథమునుకూర్చి అచ్చు వేయించి యుండెను). అందు ఉజ్జయినీ పట్టణము రాజధానిగాకల 'మాల్వా" రాష్ట్రమునుగురించి యీ విధముగా వ్రాసియున్నాడు.

"In Indian manuscripts we find Malwa noticed as a separate province eight hundred and fifty years before the Christian era, when Dunji, to whom a divine origin is attributed, is said to have established the power of the Brahmins, and to have been the founder of a powerful dynasty." The family of Dunji is said to have reigned three hundred eighty seven years when Putraj, the fifth, in descent, dying without issue, Adab Ponwa'r a prince of a Rajput clan still numerous in Malwa, ascended the throne, establishing the Ponwar dynasty which continued to hold sway for upwards of one thousand and fifty eight years."

(Memoir of Central India—By C. H. Payne, M. A, P. 7)

"During the period that Dunji's family held Malwa, we find no particular mention of them until about seven hundred and thirty years before Christ, when Dunji's successor is said to have shaken off his dependence on the sovereign of Delhi. From this time we lose all trace of kingdom of Malwa until near our own era, when Vikramaditya, a prince whom all Hindu authors agree in describing as the encourager of learning and the arts, obtained the sovereignty."

(P. P. 7—8.)

తా॥ హిందువుల వ్రాతగ్రంథములలో క్రీ॥ పూ॥ 850 సం॥రముకు చాలా పూర్వమునుండి "మాల్వా" రాష్ట్రము ప్రత్యేకరాష్ట్రముగా నున్నట్లును, దైవాంశసంభూతుడైన "ధుంజీ" యను బ్రాహ్మణుని వలన బలిష్ఠమైన యొక బ్రాహ్మణరాజ్యము స్థాపింప బడినట్లును చెప్పబడినది. శక్తివంతమైన యొక బ్రాహ్మణరాజ్యమునకు "ధుంజీ" మూలపురుషుడయ్యెను. "ధుంజీ" వంశమువారు మూడువందల యెనుబది యేడు సం॥రములు రాజ్యముచేసిరి. ధుంజీనుండి ఐదవతరము రాజైన "పుత్రరాజ" అను రాజు చనిపోయెడి సమయమున తనకు సంతానము లేనందున మాల్వారాష్ట్రములో యిప్పటికిని నివసించుచుండిన "అదాత్ పాన్వారు" వంశములోని యొక పిల్లవానిని పెంచుకొని రాజ్యమునిచ్చియుండగా అతడు రాజై "పాన్వారువంశము"ను రాజ్యమున స్థిరపరచెను.

ఈ పాన్వారు బ్రాహ్మణ వంశమువారు వేయియేబది యెనిమిది (1058 సం॥) సంవత్సరములు రాజ్యముచేసిరి. ధుంజీవంశములోని యొక రాజు ఢిల్లీచక్రవర్తుల (మగధచక్రవర్తుల) సార్వభౌమత్వమునుండి తప్పించుకొని స్వాతంత్రమును పొందిన క్రీ॥ పూ॥ ఏడువందల ముప్పదవ సంవత్సరమువఱకు యెచ్చట నుదహరింపబడి యుండ లేదు. ఈ కాలము నుండి క్రీ॥ పూర్వము మొదట శతాబ్దములో విద్యాకళాపోషకుడైన విక్రమార్కుడను రాజు రాజ్యమునకు వచ్చువఱకు మాల్వారాష్ట్రమును గురించి మనకేమియు తెలియవచ్చియుండ లేదు, అని వ్రాసియున్నాడు.

పాన్వారు బ్రాహ్మణ వంశమున క్రీ॥ పూర్వము ఆఱవశతాబ్దములో మాల్వారాష్ట్రమును పరిపాలించుచుండిన బ్రాహ్మణ రాజుకు యొక పుత్రిక గలదు. ఆమెను భారతవర్షమున అఖండ పండితుడని పేరొందిన "చంద్రశర్మ" యను బ్రాహ్మణునకిచ్చి వివాహ మొనర్చి యుండిరి. (ఈ పాన్వారువంశము ఆంధ్రబ్రాహ్మణవంశమై యున్నది)

ఈ పుణ్యదంపతుల కొకకుమారు డుదయించెను. ఈ కుమారునికి మాతామహుని రాజ్యము సంక్రమించినది. ఈ మహారాజే శకకర్తయైన "శ్రీహర్ష విక్రముడు". చంద్రశర్మ నలుబదవ సం॥రం వఱకు విద్యాభ్యాస మొనర్చి గొప్పపాండిత్యమును సంపాదించి భారతవర్షమందంతటను ప్రతిష్ఠను పొందిరి కుమారుడుదయించి ప్రభుత్వమును చేపట్టగనే యీ యన గృహస్థాశ్రమమునువీడి సన్యసించెను. చంద్రశర్మ పండితునియొద్ద విద్యాభ్యాస మొనర్చి గొప్పపాండిత్యమును సంపాదించిన వారలా కాలమందనేకులు గలరు.

## గోవిందభగవత్పాదాచార్యులు

ఉజ్జయినీరాజున్ను శకకర్తయునైన "శ్రీహర్ష విక్రముని" తండ్రియైన "చంద్రశర్మ" శ్రీ గౌడ పాదాచార్యులవారికి శిష్యులై సన్యాసాశ్రమమును స్వీకరించి బ్రహ్మవిద్యను పొందిరి. వీరికి సన్యాసాశ్రమ నామము "శ్రీ గోవింద పాదాచార్యులు". వీరు మాండూక్య కారికలను వ్రాసి లోకమున కనుగ్రహించిరి. ఇప్పుడు మనకు సంక్రమించిన వైదికవాఙ్మయములో చాలాభాగము చంద్రశర్మనుండి సంక్రమించినదే. ఆయన పతంజలి మహాభాష్యమును శ్రీ గౌడ పాదాచార్యుల వద్ద చదువుకొనెను. శ్రీ గౌడ పాదాచార్యులవారు వ్యాకరణ మహాభాష్యమును భాష్యకర్తయైన "పతంజలి" మహర్షియనుగ్రహమున గ్రహించెననియు, శ్రీ శుకమహర్షి వలన బ్రహ్మవిద్యను పొందెననియు చెప్పెదరు. అట్టి మహామహుల శిష్యుడును అఖండపండితుడునైన "చంద్రశర్మ"యొక్క కుమారుడే ఉజ్జయినీరాజైన "శ్రీ హర్ష విక్రముడు". ఈరాజు నేపాలువఱకు రాజ్యమును జయించి పరిపాలించెను. శకహూణాదుల నోడించి దేశమునుండి పారదోలెను. యు॥ శ॥ 2681

కలి 2645 క్రీ॥పూ॥ 457 సం॥రములో శ్రీహర్ష విక్రముడు చనిపోయెను. ఈతనిపేరున యు॥ శ॥ 2681 కలి 2645 క్రీ॥ పూ॥ 457 సం॥రంనుండి "శ్రీహర్ష శకము ప్రారంభింపబడి ఉత్తరదేశమునను, నేపాలురాజ్యమునను వాడబడినది."

ఉజ్జయినీపట్టణమతిప్రాచీనకాలమునుండియు ఖగోళశాస్త్రమునకు ప్రసిద్ధి. భారతీయ ఖగోళశాస్త్రమునకు జనకుడని చెప్పదగినట్టియు త్రేతాయుగప్రారంభమున "సూర్యసిద్ధాంతము"ను రచించి లోకమునకనుగ్రహించినట్టియు 'మయుడు' "లంక"నుండి గ్రహచలనాదులను లక్షించుచు యుజ్జయినీపట్టణము లేన నక్షత్రశాల యున్న లంకనుండి యామ్యోత్తర రేఖమీద (Meridian = మెరిడియన్) యున్నటుల సూర్యసిద్ధాంతమందుదహరించియున్నాడు. సూర్యసిద్ధాంతము వ్రాయబడిన త్రేతాయుగాదికి పూర్వము 1200 సం॥రము నుండి యిప్పటికి 21,66,244 సం॥రములు. అంతకు పూర్వమే ఉజ్జయినీపట్టణమున్నటుల స్పష్టపడుచున్నది. దీనినిబట్టి ఆర్యావర్త ప్రాచీనత మనకు బోధపడగలదు. ద్వాదశజ్యోతిర్లింగములలో నొకటగు "మహాకాల"యను జ్యోతిర్లింగ ముజ్జయినీ యందుగలదు. క్రీ॥ పూ॥ 57 సం॥రము నుం ప్రారంభింపబడిన విక్రమశకకర్తయైన విక్రమార్క-మహారాజుచే యుపాసింపబడిన "మహాకాళి" దేవాలయమిప్పటికిని యుజ్జయినీ యందు గలదు. ఈతడు ప్రమరవంశమను పేరుగల బ్రహ్మక్షత్రవంశమునకు చెందిన ఆంధ్రబ్రాహ్మణరాజు. ఈతని సాహసమును వర్ణించెడి కథలు విక్రమార్కుని కథలను గ్రంథమున మనము చదువుచున్నాము. క్రీ॥ పూ॥ 57 సం॥రము నుండి యీతని పేరున విక్రమశకము ప్రారంభింపబడి వాడుకలోనున్నది. అతని కుమారుడు "దేవభక్త"యనువాడు పది సం॥రములు రాజ్యమేలెను ఆతని కుమారుడు శాలివాహనుడు యు. శ. 3192 (కలి. 3156 క్రీ॥ శ॥ 54) రాజ్యమునకు వచ్చెను. ఆయన యు. శ. 3216 (కలి. 3180 క్రీ॥ శ॥ 78) లో శకులను జయించినందున అప్పటినుండి శాలివాహనశకము ప్రారంభింపబడి నేటికిని వాడబడుచున్నది. ఇది చాంద్రమానము ప్రకారము చైత్రశుద్ధపాడ్యమి రోజున సూర్యచంద్రులున్నూ, గురువును మేషములో ప్రవేశించిన

సమయము ఇది చాంద్ర, బార్హస్పత్యమానములు కలిసిన సంవత్సర ముగా యెంచబడినది.

శాలివాహనుడు యు.శ. 3276 (క్రీ॥శ. 138)లో చనిపోయినాడు. ఇతనిది ప్రమారవంశము ఈ వంశముననే యిరువదవవాడు భోజ మహారాజు. ద్వితీయకాళిదాస కవి యీతని యాస్థానములోనివాడు - విక్రమార్కుని యాస్థానమందుండి "జ్యోతిర్విదాభరణము" రఘు వంశాదికావ్యములను వ్రాసిన కాళిదాసమహాకవిని ప్రథమకాళిదాసు అని పిలువవచ్చును. శకకర్తయైన శ్రీహర్షుడు క్రీ॥ పూ॥ అయిదవ శతాబ్దములోనివాడు. చంద్రగుప్తమౌర్యుని అలెగ్జాండరుకు సమకాలి కుడుగా గుర్తింపబడిన పొరబాటువలన కలిగిన తేడా 1200 సం॥ర ములు పొడుగునా అడ్డువచ్చినందున రాజవంశావళి తారుమారైనది. హర్షశకకర్తయైన శ్రీహర్షుడు క్రీ॥ పూ॥ 457 సం॥ గాని క్రీ॥ శ॥ ఏడవ శతాబ్దములోని శ్రీహర్షుడుకాడు. క్రీ॥ శ॥ ఏడవ శతాబ్దములో శ్రీహర్షశక మొకటి ప్రవర్తిల్లినట్లుగా కాని ప్రమాణము లేదు. క్రీ॥ శ॥ పదకొండవ శతాబ్దములో యీదేశమునకు వచ్చియుండిన "ఆల్బెరూని" పండితుడు అప్పటికి యీదేశమందు వాడుకలోనుండిన శకములన్నిటిని వివరముగా చెప్పియున్నాడు. అందులో క్రీ॥ పూ॥ 457 శ్రీహర్షశకము చెప్పబడినదిగాని క్రీస్తుకు పిమ్మట యేడవ శతాబ్ద ములో శ్రీహర్షశక మొకటి యున్నట్టుల చెప్పబడియుండలేదు. తమ పొరబాటును కప్పిపుచ్చుకొనుటకును, భారతీయ ప్రాచీనతను తక్కువ కాలములోకి తెచ్చుటకును క్రీ॥ పూ॥ 457 లోని శ్రీహర్షశకము నొదలి క్రీ॥ శ॥ ఏడవశతాబ్దములో అట్టి శక మొకటున్నట్టుల పాశ్చాత్య విద్వాంసులు కల్పించిరేగాని సత్యముగా క్రీ॥ శ॥ ఆరు ఏడు శతాబ్ద ములలో అట్టి శకమేదియు ప్రవర్తితము కాలేదు.

విక్రమాదిత్యుని నుండి పదకొండవవాడు "భోజరాజు" (Memoir of Central India P. 8) పిమ్మట తోమర వంశీకులు రాజులైరి. వీరు 142 సం॥రములు రాజ్యముచేసిన పిమ్మట "చోహాన్" లేక "చాహమాన" రాజులకు సంక్రమించినది. (డిటో పేజి 8)

వీరును తోమరవంశీయులే యైయుండిరి. వీరందరు అగ్నికుల క్షత్రియులనియు, బ్రహ్మక్షత్రులనియు పిలువబడుచుండిన బ్రాహ్మణవంశమునకు చెందినవారు.

విక్రమార్క మహారాజు యు. శ 3056 (కలి 3020. క్రీ॥ పూ॥ 82) సం॥రమున మాల్వారాష్ట్ర రాజధానియైన "ఉజ్జయినీ" పట్టణమందభిషేకింపబడెను. అంతకు పూర్వము 1058 పది వందల యేబది యెనిమిది సం॥ రములు పాన్వారు వంశమువారు యు. శ. 1998 క్రీ॥పూ॥ 1140 లగాయతు ఉజ్జయినీయందు రాజ్యముచేసియుండిరి. వారికి పూర్వము ధుంజీ వంశమువారు 387 సం॥రములు అనగా యు. శ. 1611; కలి 1575; క్రీ॥పూ 1527 సంవత్సరమునుండి రాజ్యముచేసియుండిరి. విక్రమార్క మహారాజు పాన్వారు బ్రాహ్మణ వంశస్థుడైయున్నాడు. విక్రమార్కుని వంశమువారు ఉజ్జయినీ యందు యు. శ 4331; కలి 4295; క్రీ. శ. 1193 సం॥రం వరకు రాజ్యము చేసియుండిరి. మొత్తం 2720 సంవత్సరములు మాల్వా రాష్ట్రము ప్రత్యేకముగా బ్రాహ్మణరాజుల పరిపాలన యందుండియున్నట్లు స్పష్టపడుచున్నది.

తోమర లేక రాథోరు రాజపుత్రులు "బ్రహ్మక్షత్రులు" అనగా క్షాత్రమవలంబించి రాజ్యములుచేసిన బ్రాహ్మణవంశస్థులు. వీరిది గౌతమస గోత్రము. మాధ్యందిన శాఖ. శుక్రాచార్యులు గురువు. "గర్రబ్జి" (గార్హపత్యాగ్ని) అగ్నినుపాసించెదరు. "పంఖనీ" దేవి వీరి కులదేవత. బ్రహ్మక్షత్రులలో "లాంగులు" అనుకొక తెగ బ్రాహ్మణులు గలరు.

"The Langas were Rajputs; and they are in fact a sub-division of the Solanki or Chaluk race, one of the four Agnikula "

(Annals and Antiquities of Rajastan — By Col. Tod. Vol. II. Ed. 1880. P. 213).

తా॥ "లాంగులు" అను తెగవారు రాజపుత్రులు. నిజమునకు వీరు సోలంకి లేక చాలుక్య అనెడి బ్రహ్మక్షత్రవంశమునకు చెందిన

యొక యంతశ్శాఖ. ఈచాలుక్యవంశము అగ్నికులులను నాలుగు శాఖలలో నొకటియైయున్నది.

"నయనపాలు" అను రాఠోరురాజు కనోజి లేక కన్యాకుబ్జ రాజైన అజపాలు అను రాజునుచంపి విక్రమశకం 526; క్రీ॥ శ॥ 470 సం॥రములో కనోజికి తానురాజాయెను. అప్పటినుండియు కనోజీయ రాఠోరువంశమని వీరికి పేరుకలిగెను. జయసింగు లేక జయచంద్ర అను రాజు ఆఖరురాజు. ఈతడు పృధ్వీరాజుభార్యా సంయుక్తకు తండ్రి. ఇతడు క్రీ॥ శ॥ 1193 సం॥రములో మహమ్మదీయులచే చంపబడెను. అంతటితో యీ రాజ్యమంతరించినది. క్రీ॥ శ. 1212 లో యీతని మేనల్లుడు "సియోజి లేక సేవాజి" కొద్దిమనుష్యులతో పోయి మార్వారురాష్ట్రమును సంపాదించెను. క్రీ॥శ॥ 1735 లో రాజాజస్వంత సింగు రాజ్యముచేసియుండెను. ఈతని మనుమడు "అభ్యసింగు". ఇతను "సూరజ్ ప్రకాశ" అను గ్రంథమును వ్రాయించెను. ఇందు 7500 చరణములుగలవు. పద్యకావ్యము. ఇందు సృష్టిలగాయతు ప్రారంభింపబడి ఇక్ష్వాకువంశ మంతరించిన "సుమిత్రుని" వఱకు చెప్పెను. (అనగా యు॥ శ॥ 1504 వఱకు) పిమ్మట యు॥ శ॥ 3608, క్రీ॥శ॥ 470 లగాయతు తిరిగి ప్రారంభించి 'జస్వంతసింగు' వఱకు అనగా యు॥ శ॥ 4872 వఱకు (క్రీ॥ శ॥ 1734) చెప్పెను. జస్వంతసింగు కుమారుడు 'అజితుసింగు'. మనుమడు "అభ్యసింగు". ఇతడే యీ చరిత్రను వ్రాయించినవాడు.

(Vide Annals of Marwar—By Col. Tod. Ed. 1902.)

రాఠోరు, చౌహాన్ మొదలుగాగల రాజపుత్ర వంశములు క్షత్రియులుగారు. వీరందరును బ్రాహ్మణ వంశీయులు. చిరకాల రాజ్య పరిపాలనాదులవలన వీరు తాముక్షత్రియులమని భ్రాంతిజెంది తమ వంశములను సూర్యచంద్ర వంశములతో కలుపుకొనుచు క్రీ॥ శకమున కిటీవలి కాలమున చరిత్రలను వ్రాయించుకొని యుండిరి. ఇవి నిజముగా క్షత్రియవంశములై ఇక్ష్వాకుల కాలమునుండి పరంపరా వచ్చుచుండిన వైనయెడల మహాభారతమున ఈ క్షత్రియవంశముల చరిత్ర కొంచెమైనను చెప్పబడియుండెడిది. కాని అట్టిక్షత్రియవంశములు

లేనందుననే భారతమున వారి ప్రసంగము లేమియు వచ్చియుండ లేదు. మహాభారతయుద్ధములో పాల్గొనిన యవనులు, రోమనులు, ఆరబ్బులు మొదలుగాగల జాతులుదహరింపబడి యున్నవిగాని యీ రాజపుత్ర వంశముల ప్రసక్తియేమియు వచ్చియుండ లేదు. ఆకాలమునాటికి రాజ పుత్రులను జాతియేర్పడి యుండ లేదు. క్రీ॥పూ॥ 13, 12 శతాబ్ద ప్రాంత ముల శుంగవంశ బ్రాహ్మణచక్రవర్తుల లగాయతు దేశము నేకఛత్ర ముగా పరిపాలించిన శుంగ, కాణ్వ, శాతవాహన చక్రవర్తుల కాల మున వారి జ్యేష్ఠపుత్రులుగాక మిగతా రాజపుత్రులును, వారి దౌహిత్రులును రాజపుటానాలో అల్పరాజ్యము లీయబడి ప్రభువులుగా జేయబడిరి. బ్రాహ్మణ సరదారులును, కొందరు రాజబంధువులును దేశపరిపాలనలో హెచ్చుగాఁ ప్రమేయమును కల్పించుగొనిన కాల మున రాజపుటానాలోని బ్రాహ్మణ కుటుంబములనేకములు రాజ్య సంరక్షణార్థము యుద్ధవిద్యయందు ప్రవీణులై రాజులకు సహాయముగా నుండి క్రమముగా కొందఱు అల్పభాగములకు రాజులైరి. వీరు క్రమ క్రమముగా క్షత్రియులమనెడి భ్రాంతిలోపడి తమ వంశములను సూర్య చంద్రవంశములతో కలుపుకొని చరిత్రలను వ్రాయించుకొనుటకు క్రీ॥శ॥ పన్నెండవ శతాబ్దమున ప్రారంభించిరి. సూర్యచంద్రవంశములు యు॥ శ॥ పదిహేనవ శతాబ్దాంతమున సుమిత్రుడను రాజుతో సూర్య వంశమును, క్షేమకుడను రాజుతో చంద్రవంశమును అంతరించినట్లుపురా ణము లన్నియు నేకగ్రీవముగా జెప్పుచున్నవి. ఆ పిమ్మట నంద, మౌర్య వంశములు నాలుగువందల సం॥రములు రాజ్యమేలిరి. పిమ్మట సామ వేదశాఖీయులును "శుంగభారద్వాజ" గోత్రజులైన బ్రాహ్మణవంశము వారు శుంగవంశమను పేరున రాజ్యమునకు వచ్చియుండిరి. యుధి ష్ఠిర శకం 19 శతాబ్దములగాయతు నలుబది మూడవశతాబ్దమువరకు శుంగ, కాణ్వ, శాతవాహన, బ్రహ్మక్షత్రవంశస్థులైన బ్రాహ్మణ రాజులు యిరువది నాలుగు శతాబ్దములు పరిపాలించిరి. ఆ పిమ్మట దేశము పరాధీనమై హెచ్చుభాగము మహమ్మదీయుల చేజిక్కినది.

రాజపుత్ర వంశములను దెలుపు గ్రంథములు.

**1.** కల్హణుని రాజతరంగిణి (కాశ్మీర దేశ రాజవంశావళి): ఇది క్రీ॥ శ॥ **1159** వ సం॥ రమున వ్రాయబడినది. ఇది రాజపుత్రులలోని శాఖలను దెల్పును.

2. "పృథ్వీరాజరసా": ఇది **16**వ శతాబ్దములో వ్రాయించ బడినది.

**3.** "కుమారపాలచరితము" అను సంస్కృతగ్రంథము. పై మూడిటిలోను రాజపుత్రులలో **11** వ శతాబ్దమునకుగల శాఖలను గుఱించిన జాబితాగలదు.

**4.** క్రీ॥ శ॥ **18** శతాబ్దములో అభ్యసింగు వ్రాయించిన "నూరజ్ ప్రకాశ" అను గ్రంథమొకటి.

'చంద్రగహద్వాలా' అనురాజు యీ శాఖల జాబితా క్రీ॥ శ॥ పదకొండవశతాబ్దములో వ్రాయించినాడు. అదియే కల్హణరాజ తరం గిణికి పునాది.

రాజపుటానాలో యీ బ్రాహ్మణరాజవంశములు **36** గలవు.

"పృథ్వీరాజ రసా"యను గ్రంథములో నీయబడిన జాబితా (**16** వ శతాబ్దము)లో 22 శాఖలే యీయబడినవి. మిగతా శాఖలంత రించియుండవచ్చును.

**1.** రవి, **2.** శశి, **3.** యదు, **4.** కాకుస్థ, **5.** పరమార, **6.** సదా వర లేక తోమర, **7.** చౌహాణ్, 8. చాలుక్య, 9. ఛిందక, **10.** సిలార, **11.** అభీర, **12.** దోయమట లేక మక్వానా, **13.** చహోట్కట, **14.** పరిహార, **15.** ధాన్యపాలక, **16.** రాజ్యపాలక, **17.** నికుంప, **18.** హూణ, **19.** గుహిల లేక గుహిలపుట్ట, **20.** రాధోడు, **21.** కారట్ట పాల, **22.** అనిగ. యీపేర్లు కొద్ది మార్పులతో "కుమారపాల చరితము"న గలవు. — (గుహిల = ఓహిల; అనిగ = అనగ, యిత్యాది మార్పులు.)

ఇందులో 1. కాకుస్థవంశము వారిది గ్వాలియరురాష్ట్రము

2. పరమారవంశము వారిది మాల్వా (ఉజ్జయిని ముఖ్యపట్టణము)

3. సదావర లేక తోమరవంశము వారిది ఢిల్లీ

4. చౌహానమానవంశము వారిది సంభార్

5. ఛందాక లేక ఛండెల్లా వారిది జిఝ్హోటి (బుందేలుఖండు అని యిప్పటి పేరు).

(ఇది నె 9 రు భిండకవంశము కావచ్చును.)

6. సిలార లేక సిలాహారులకు తానారాష్ట్రము

7. అభీరులు – దక్షిణయిండియాలో రాజ్యము

8. ఛపోట్కటులు – అనహల్వాడ

9. పరిహార – కనోజ్, మండవార్

10. గుహిలాటులకు – మేవాడునూ, కథియవాడులోని మంగ్రోలు.

యాదవ, భాటీ, జాడేజా చూడాసమఅనెడి యితరకులములలో చేరి యుద్ధవిద్యయందారి తేరిన శాఖలు కథియవారులో గలవు. వీరి రాజ్యములు బియానా, మధుర, మహావన, అనునవై యున్నవి.

ఈరాజపుత్రరాజులకు "రాణాల"ని బిరుదునామము. వీరందరు దేశములను కొల్లగొట్టి స్త్రీ బాలవధాదులను జేయుచు తిరుగుచుండెడి హూణగూర్జరులను గుంపులవారికి పుట్టినవారని పాశ్చాత్యపండితులును, వారి ననుసరించి భండార్కారుగారును వ్రాసియుండిరి. దాని మీద "పండిట్ మోహన్‌లాల్ విష్ణులాల్ పాండియా" యనెడి పండితుడు పైవారి వ్రాతలను ఖండించుచూ గ్రంధమును వ్రాసి రాజపుటానాలోని "రాణాలందరు" "బ్రహ్మక్షత్ర"వంశములకు చెందిన బ్రాహ్మణులనియు, వారు వల్లభిరాజులవంశస్థులనియు, డెబ్బది సం॥ర

ముల క్రిందటనే బుజువుచేసియుండెను. ఈ విషయమును గురించి రాబోవుపుటలలో "స్మిత్ పండితుని వర్ణసంకరగాథలు"అను ప్రకరణమున సప్రమాణముగా వ్రాసియుంటిమి.

"The Brahmin dynasty which uprooted the Buddhist Mauryas andsucceeded to the imperial throne of India. The dynasty adopted the Gotra Name Sunga as its title."

(The Glories of Magadha—By Samaddar Ed. 1927. Page 25 Foot-note 1.)

"According to Panini (IV, I, 117) they (the Sungas) claimed to be the descendents of Bharadwaja."

(Vide Cambridge History of India Vol. I Ancient India—By E. J. Rapson, M. A. Ed. 1922 P. 518).

తా॥ బౌద్ధులైన మౌర్యవంశము నంతరింపజేసిన బ్రాహ్మణ వంశీయులు తమ గోత్రనామమైన "శుంగ"నామమునే తమ వంశమునకు పెట్టుకొనిరి"

"శుంగవంశపు బ్రాహ్మణరాజులు "భారద్వాజసగోత్రీకుల"ని పాణిని చెప్పుచున్నాడు."

దీనినిబట్టి శుంగవంశపు బ్రాహ్మణరాజులగోత్రము "శుంగ భారద్వాజస" అని స్పష్టపడుచున్నది. ఆంధ్రదేశమున "శుంగ భారద్వాజస"గోత్రముగల కుటుంబము లనేకము లిప్పటికిని గలవు.

రాతోరు లేక రహాతోరులు క్రీ॥పూ 5,4 శతాబ్దములలో ఆంధ్ర శాతవాహనుల వలన రాజపుటానా, మార్వారు మొదలు గాగల భాగములకు రాష్ట్రాధిపతులుగా నియోగింపబడిన రాజబంధువులై యుండిరి. కొంత కాలమునకు వారు తమ యుత్పత్తికి సంబంధించిన చరిత్రను మఱచి తాము రాజ్యపాలనము చేయుచున్నందున క్షత్రియులమని భ్రాంతిపడి, తామునూర్యవంశీయులమనియు, యువనాశ్వుని సంతానమనియు క్రీ॥ శ పంద్రెండవ శతాబ్దములో వంశవృక్షమును వ్రాయించుకొనిరి – "వీరికి మూలపురుషుడు "నయునపాలు"

ఈ వంశవృక్షము క్రీ॥ శ॥ 470 సం॥రమునుండి వ్రాయబడినది. ఆసం॥ర మునకే నయనపాలు కనోజిరాజ్యమును జయించెను. ఆపిమ్మట క్రీ॥ శ 18 శతాబ్దములో ఆ వంశములోని "అభయసింగు" అనునాతడు తన వంశవృక్షమును క్రీ॥ శ 470 సం॥రమునుండి ప్రారంభించి 1734 సం॥రం వఱకు అనగా "జస్వంతసింగు" రాజ్యకాలము వఱకు వ్రాయించియున్నాడు. ఈఅభయసింగు"జస్వంతసింగుకుమారుడు"

(Tod's Rajasthan Vol. II Ed. 1880. 3rd reprint,

ఈ రాష్ట్రాధిపతులు రాష్ట్రకూటులని, రాష్ట్రపతులని, పిలువబడిరి. వారు స్వతంత్రులై రాజ్యములను పరిపాలించు కాలమున "రాష్ట్రకూటరాజులని" పేరొందిరి. వీరిలో బ్రాహ్మణరాజులేగాక, రెడ్డి, యాదవ మొదలుగా యితర కులస్థులు కూడను రాష్ట్రాధిపతులుగా మొదట నియోగింపబడి క్రమక్రమముగా స్వతంత్ర రాజులైరి. ఆంధ్ర శాతవాహన వంశపు రాజులు బలహీనులుగా నుండిన కాలమున వారి యేలుబడిలోనుండిన రాష్ట్రముల అధిపతులు స్వతంత్ర రాజులుగా మారిపోయిరి.

Burnel was inclined to hold that the Malkhed Rashtrakutas were Telugus and were of the same stock as the Reddis of the Andhra land."

(South Indian Palaeography P. 101). (Vide The Rashtrakutas and their times. P. 17—By A.S. Altekar)

తా॥ మాల్ఖేడు రాష్ట్రకూటులు తెలుగువారు. ఆంధ్రదేశములోని రెడ్డిరాజుల వంశమునకు చెందినవారు" అని బర్నెలు మహాశయుడు వ్రాసియుండెను.

"From the Hirahadagalli grant of Sivaskandha Varman we find that district officers were known as Rathikas."

(A. S. Altekar's Rashtrakutas Page 26) and Vide E. I. 1. P. P. 2 f. f.)

తా॥ శివస్కంధవర్మయొక్క "హిరహడగల్లి" శాసనములో జిల్లాఅధికారులు "రథికులని" పేర్కొనబడియున్నది.

"రాష్ట్రపతి" అని "జిల్లాగవర్నరుకు పేరు

(I. A. X P. 284; XIII P. I5; P. 77 etc.)

"Ghatotkacha cave inscription of Hastibhoja, a minister of the Vakata king Devesena informs us that Hastibhoja's ancestor Brahmana Soma had married a Kshatriya lady in accordance with the precepts of the revelation and tradition."

(Altekar's Rashtrakutas P 337). and Vide A. S. W. I. IV Page 140.)

తా॥ హస్తిభోజుని ఘటోత్కచ గుహాశాసనమున, వాకట రాజు యొక్క మంత్రి దేవసేనుడిట్లు చెప్పియుండెను. – "హస్తిభోజుని పూర్వీకుడగు బ్రాహ్మణసోమ(శర్మ)యను నాతడు క్షత్రియ స్త్రీని శాస్త్రీయ మార్గమున వివాహమాడినట్లు వ్రాసియుండెను." (ఈమె బ్రాహ్మ క్షత్ర వంశపు ఆడపడుచని తెలియవలెను) పై విచారణవలన రాష్ట్రకూటులను వారు రాష్ట్రాధికారులుగానుండిన గవర్నర్లు స్వతంత్ర రాజులైనట్లును. వారలలో బ్రాహ్మణ రాష్ట్రకూటులు; రెడ్డి రాష్ట్రకూటులును యింకను యితర కులస్థులును వుండియున్నట్లు తెలియుచున్నది. రాష్ట్రకూటులందరు యేక కులస్థులు కారు. ఏ కులమువారా కులముననె వివాహములు చేసుకొనుచు తమ తమ సనాతన వర్ణ సాంప్రదాయమును నిలుపుకొనుచుండిరని తెలియుచున్నది.

"Rashtrakuta is an official position name meaning ead of the country, and is used as such in Eastern lukya inscriptions, and the name may be borne by erent clans and even castes like the modern names hapande or Joshi."

(Downfall of Hindu India — By C. V. Vaidya l. III. Page 217.)

"The Rashtrakuta Kula consists of many ranches." (Do 219)

తా॥ "రాష్ట్రకూటయనునది రాష్ట్రాధిపతికి పేరు- ఇది తూర్పు చాళుక్యశాసనములలో వాడబడినది ఆపేరు వివిధశాఖలు వివిధకాలములలోని రాష్ట్రాధిపతులకు నవీనదేశపాండ్యా, జోష్యాశీ అనెడి పేర్ల వలెనే వర్తించును."

"రాష్ట్రకూటకులము అనేక శాఖలను కలిగియున్నది" అని వ్రాసియున్నాడు.

## కుమారిలభట్టు

యు॥ శ॥ 2681 (కలి. 2645-క్రీ॥ పూ॥ 457) సంవత్సరములో చనిపోయిన ఉజ్జయిని రాజైన శ్రీ హర్షవిక్రమునికి తండ్రియైన "చంద్రశర్మ" శ్రీ గౌడపాదాచార్యులవలన సన్యాసాశ్రమమును స్వీకరించెను. వారి సన్యాసాశ్రమ నామము శ్రీ గోవింద భగవత్పాదాచార్యులవారు వైదిక ధర్మ రక్షణ నిమిత్తం బ్రతికియుండగనే తన దేహము నగ్నియందాహుతి యొనర్చిన "కుమారిలభట్టు" వీరి శిష్యుడు - గంజాం జిల్లాలోని "జయమంగళ"మను గ్రామమున కుమారిలభట్టు జన్మించెననియు, ఆంధ్రుడనియు, తైత్తిరీయ శాఖీయుడనియు యజ్ఞేశ్వర శర్మ, చంద్రగుణాయను పుణ్యదంపతులకు జన్మించెననియు, వేదాభిమానియనియు, వాదములో యజేయుడైనవాడనియు జైన మతస్థుడుగా వేషమునైచుకొని జైనగురువువద్ద చదువుకొని జైనమత రహస్యములను గ్రహించి జైనమతమును ఖండించిన గురుద్రోహియైన మహాపాపియనియు "జినవిజయము" అను జైనగ్రంథమునందు చెప్పబడినది.

శ్లో॥ "ఆంధ్రోత్కలానాంసంయోగే పవిత్రే జయమంగళే
గ్రామే తస్మిన్ మహోనద్యాం భట్టాచార్య కుమారకః
ఆంధ్రజాతి స్త్రిత్రిరో మాతా చంద్రగుణాసతీ యజ్ఞేశ్వర పితా
యస్య మహావాదిగ్మహాన ఘోరశ్రుతీనాంచాభిమానవాన్
జినానామంతః సాహత గురుద్వేష్ట్యాతి పాపవాన్ "

(జినవిజయము)

ఆయన యేడవయేట ఉపనయన సంస్కారము నొంది గురు కులమున నివసించి పదునెనిమిదవయేడు వచ్చుసరికి సకల విద్యాపా రంగతుడయ్యెను. దేశములో జైన, బౌద్ధ స్త్రీపురుషులు సన్యాసులై యింద్రియ నిగ్రహము లేనందున వారలు ప్రవర్తించెడి నీతి బాహ్య ప్రవర్తనలను, వారిచే యేర్పడెడి భ్రూణ హత్య, శిశుహత్యాదు లను జూచి యెట్లయినను యీ మతములను భారతవర్షమం దంతరింప జేయ సంకల్పించి బౌద్ధమత గ్రంథములను చదివి వానిని ఖండింప నారంభించెను. కాని జైనులు తమ మతము నవలంబించినవారికి తప్ప యితరులకు జైనమత రహస్యములను చెప్పనందున తాను జైన గురువువద్ద చేరి జైనమతస్థుడనని జైనమత రహస్యములను తెలుసు కొనెను. ఇట్లుండగా నొకనాడు జైనగురువు వేదములను దూషించుచు పాఠములను చెప్పుచుండగా విని భరింపలేక కుమారిభట్టు లోపలనుండి వచ్చిన దుఃఖము నాపలేక కళ్ళవెంట నీరుకార్చెను. ఈ దృశ్యమును జూచి జైనగురువు "నీవు జైనుడవుకావు. వైదిక బ్రాహ్మణుడవు" నిజము చెప్పుమనగా కుమారిలభట్టు సత్యమును దాచక యొప్పు కొనెను. అంత నతని నాగురువు తన పాఠశాలనుండి వెడలగొట్టెను. జైన, బౌద్ధమతముల నీ దేశమున లేకుండ జేయువరకు తానింటికి పోగూడదని శపథము చేసి కుమారిలభట్టు జైన, బౌద్ధు లెక్కువగా గల కాశీ పట్టణము చేరి జైన, బౌద్ధ భిక్షువులను మతవాదమున కాహ్వానించెను. అప్పుడు కాశీపట్టణ ములో యిరువదివేల బౌద్ధభిక్షువు లుండిరి. వారిలో హెచ్చు మంది బ్రాహ్మణులును, గొప్పపండితులునై యుండిరి. సుధన్వుడను పేరుగల కాశీమహారాజు మధ్యస్థుడై యీవాదమును నడపెను. ఓడిన వారు వారి మతమును త్యజించి గెలిచినవారి మతమును స్వీకరింప ప్రతిజ్ఞచేయబడినది. మహారాజుకు సలహాదారులుగా నిష్పాక్షికులైన ండితుల నుభయమతములలోనుండి యేరి సభ నేర్పాటుచేసిరి. ాదములో బౌద్ధులోడిపోయినట్లు తాటస్థ్యసభవారభిప్రాయము పగిరి. అంతటితో బౌద్ధభిక్షువులలో కొందరు బౌద్ధమతమును వీడి దికధర్మము నవలంబించి యత్యాశ్రమమును స్వీకరించి భిక్షుక

వృత్తితో కాలక్షేపముచేసిరి. కాని కొందఱు మతత్యాగమునకు మన సొప్పక దేశమును వీడి చీనా మొదలైన యితరదేశములకు బోయి మతబోధజేయుచుండిరి. ఈవిధముగా కుమారిలభట్టు వివిధరాజ్యము లను దర్శించి ప్రజలను ప్రబోధించి బౌద్ధమతాభిమానము నంతరింపజేసి వైదికధర్మమును బ్రతిష్ఠించెను. పిమ్మటాయన ప్రయాగవద్ద నివసించి గృహస్థవృత్తి నవలంబించి అనేక యాగములొనర్చుచు విద్యార్థులకు వేదశాస్త్రాదుల నధ్యయనము చేయించుచు కాలక్షేపముచేసి యు. శ. 2645 సంగరమున మున్ను తనచే జేయబడిన జైనగురు ద్రోహమునకు ప్రాయశ్చిత్తముగా ధర్మశాస్త్రముచే విధింపబడిన "అగ్నిప్రవేశ ప్రాయశ్చిత్తము" చేసికొన నిశ్చయించి తనశరీరము నగ్నికాహుతిజేసి కుమారిలభట్టు యీలోకమును వీడి స్వర్గమును జేరెను.

కుమారిలభట్టుతో మతవాదమున నోడిపోయిన బౌద్ధులు బుద్ధిపూర్వకముగనే బౌద్ధమతమును త్యజించి వైదికధర్మావలంబు లైరి. అట్టివారలు వేదోక్తమైన ప్రాయశ్చిత్తాదులచే పునీతులుకాబడి తిరిగి వారివారి కులాచారధర్మములందు ప్రవర్తించిరి. వైదికధర్మము యితర మతములమీద దౌర్జన్య మెప్పుడునుచేసి యుండలేదు. క్రీస్తు శకం యెనిమిదవ శతాబ్దమునుండి పండ్రెండవశతాబ్దమువరకు గాబ డిన మహమ్మదీయ దౌర్జన్యమువలన బౌద్ధమతము పూర్తిగా నశించి నది. పశ్చిమపంజాబు, గాంధారము (ఆఫ్గనిస్థానము) తూర్పువంగ దేశ మందెచ్చుగా నుండిన బౌద్ధులందరును మహమ్మదీయులైరి. అందు వలననే నారాష్ట్రములలో మహమ్మదీయు లెచ్చుగానుండుట తటస్థించి నది. సనాతనమైన వేదధర్మ మవలంబించిన చాతుర్వర్ణ్యములవారును అనులోమ విలోమజాతీయులును తమ ధర్మమును కాపాడుకొనుటలో ప్రాణముల నర్పించిరేగాని తమవర్ణాశ్రమములను విడిచి హెచ్చుమంది మహమ్మదీయులుగా మారియుండలేదు. పరమ పవిత్రమైన వేద ధర్మము సర్వమత సామరస్యముగలిగి అందరిని సంరక్షించినదిగాని హింసాపూర్వకముగా నెప్పుడును బ్రవర్తించి యుండలేదు. ఈ విష యమున వి. ఎ. స్మిత్ మహాశయుడు తన అర్లీహిస్టరీ ఆఫ్ ఇండియా 384 పేజీలో నిట్లువ్రాసియున్నాడు.

"The furious massacres perpetrated by Musalman invaders were more efficacious than orthodox Hindu persecution, and had a great deal to do with the disappearance of Buddhism in several provinces."

(Early His. of India—By V. A. Smith Page 382)

తా॥ హిందూశాస్త్ర సమ్మతమైన బహిష్కారాది సాధనముల వలన గలిగింపబడిన యొత్తిడికంటె క్రూరమైన మహమ్మదీయ దండ నాథులవలన గావింపబడిన జనసంహారాది క్రూరకర్మము లెక్కువ పటుత్వముగలవై హిందూదేశమందలి చాలారాష్ట్రములలో బౌద్ధ మతము తుడిచిపెట్టుకొని పోవుటకు హెచ్చుగా కారణమైనవి.

## శ్రీ శంకరాచార్యులు

ఈ కాలములోనే యు. శ. 2629 సం॥ లేక కలి. శ. 2593 సం॥ (క్రీ॥ పూ॥ 509 సం॥రము)లో శ్రీవిద్యాశంకరభగవత్పాదులవారు మళయాళదేశములోని కాలడియను అగ్రహారము నందవతరించి యెని మిదవ సం॥రము వయసుననే సన్యాసాశ్రమమును స్వీకరించి దేశమం దంతటను అద్వైతమతమును స్థాపించి భారతీ సాంప్రదాయమును ప్రతిష్ఠించిరి. వీరు దశోపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు, శ్రీమద్భగ వద్గీతాదులకు భాష్యములను వ్రాసి లోకమున కనుగ్రహించిరి. ఇంక ననేక వేదాంతగ్రంధముల రచించి అద్వైతభావమును ముముక్షువులకు కరతలామలక మొనర్చిరి.

శ్రీశంకరులు ఆంధ్రబ్రాహ్మణవంశజులు. తండ్రి శివగురువు. తల్లి ఆర్యాంబ. జననము కాలటి అగ్రహారము. వీరి జననీజనకుల కాపురము ఆంధ్రదేశములోని పిఠాపురమునకు సమీపమున నున్న 'సర్పవరము'. దీనికి అహిక్షేత్రమని పేరు. ఈక్షేత్రమహాత్మ్యము

---

బ్రహ్మకైవర్తపురాణమునందుగలదు. ఒకప్పుడు మళయాళదేశమును ఆంధ్రబ్రాహ్మణవంశజులైన శాతవాహనులను రాజులకు సంబంధించిన యొకానొకరాజు జయించి పరిపాలించెను. ఈరాజులు కదంబవంశ మనుపేరున బిలువబడిరి. మళయాళమును పరిపాలించిన కదంబవంశము

బ్రాహ్మణవంశమని అంగీకరించినదే. ఆదేశమునందు బ్రాహ్మణు లప్పటికి లేకుంటచే కదంబవంశపురాజైన మయూరశర్మ తన జన్మ దేశమైన ఆంధ్ర దేశములోని గోదావరిమండలమునుండి ఆంధ్ర బ్రాహ్మణకుటుంబములను గొన్నిటిని తీసికొనివెళ్లి మళయాళ దేశము నందు నెలకొల్పెను. అట్టి వానిలో శివగురుపుకుటుంబ మొకటి. వీరు నంబూద్రీలను పేరున పిలువబడిరి. ఈ నంబూద్రి బ్రాహ్మణుల మూల పురుషులు ఆంధ్ర బ్రాహ్మణులు. ఆంధ్రబ్రాహ్మణుల ఆచారములు, సాంప్రదాయములు మొదలైన వానిలో ఈ ఉభయులకు చాలా పోలిక లిప్పటికిని గలవు.

1. శ్రీశంకరులవారి జననము క్రీ॥ పూ॥ 36 సం॥రమని శృంగేరి పీఠజగద్గురు పరంపరవలన తెలియుచున్నటుల కొందరభిప్రాయపడు చుండిరి. కాని ఆపీఠమునందిటీవల కలిగిన కలతలవలన ఆరికార్డంతయు వ్యతిరేకులచేత జిక్కుటయు, వారు వారి కనుకూలముగా పరంపరను దెలుపుభాగములో కొన్నిటిని తీసివేసియు, గొన్నిటిని మార్చియు పరంపరను దెలిపెడిభాగమును చెడగొట్టిరి. ఇప్పుడు శృంగేరీపీఠము నందుగల దొక సరియైన జాబితాకాదు. దాని ననుసరించుటకు వీలులేదు. ప్రథమపీఠస్వామియైన శ్రీశంకరులవారిశిష్యులైన సురేశ్వరాచార్యుల తరువాత ఆరునందల సం॥రముల కాలమునగల గురుపరంపర కనుబడుటలేదు. అందువలన సురేశ్వరాచార్యులే 600 సం॥ లున్నటుల ఆపరంపరను తెలుపుపత్రములందు వ్రాహరింపబడినది.

2. శ్రీకాంచీ కామకోటిపీఠమునందలి గురుపరంపరవలన క్రీ॥ పూ॥ 508_509 అని తెలియుచున్నది. ఇదిమన కనుసరణీయమైనది.

3. జగన్నాథమునందలి గురుపరంపర క్రీ॥ పూ॥ 516 సం॥.

4. ద్వారకా మఠగురుపరంపరవలన క్రీ॥ పూ॥ 541 సం॥.

5. శ్రీశృంగేరి విరూపాక్షపీఠములోని (శ్రీశ్రీశ్రీ కల్యాణానంద భారతీ మహాంతాచార్యస్వామివారి) గురుపరంపరవలన కలి. 2593 సం॥ క్రీ॥ పూ॥ 509.

మన పంచాంగములలో ప్రతి సం॥ జూపబడునది క్రీ॥ పూ॥ 72 సం॥. పంచాంగములు శృంగేరీపీఠపరంపర ననుసరించినటుల దోచు

చున్నది. పై అయిదింటిలోను శృంగేరిపరంపర పరస్పరస్పర్ధగల యిరువురి మధ్యబడి విచ్ఛిన్నము చేయబడినందున దానిని, దానిననుసరించు వానిని ప్రమాణముగా నంగీకరింప వీలులేదు మిగత నాలుగు పీఠములందలి గురుపరంపర వారినామములతోను, వారు పీఠమధిష్ఠించిన కాలములలోను కొంచెమించుమించు సరిగానే యున్నందున (1) కాంచీ కామకోటిపీఠము (2) జగన్నాథములోని పీఠము (3) ద్వారకా పీఠము (4) శ్రీశృంగేరి విరూపాక్షపీఠము గుంటూరు. ఈ నాల్గింటిలో చరిత్రకారు లవలంబించెడి పద్ధతిప్రకారం తక్కువసంఖ్యయైన కామకోటి పీఠము శ్రీ శృంగేరివిరూపాక్ష పీఠములయొక్క పరంపర ననుసరించి క్రీ॥ పూ॥ 509 సం॥రమునే తీసికొందము.

బొంబయి హైకోర్టుజడ్జి శ్రీ కాశీనాథత్ర్యంబక తెలాంగుగారు బ్రహ్మసూత్రము ౨.౧.౧౮ భాష్యమందు "సుఘ్న, పాటలీపుత్ర" నగరనామములను శంకరులు స్మరించుటచేతను, ఆ సూత్రమందే పూర్ణవర్మయనురాజు యొక్కనామము స్మరింపబడుటచేతను పూర్ణవర్మ యనురాజు క్రీ॥ శ॥ 680 సం॥రములో ఉన్నటుల కన్నింగుహాము పండితుడు నిర్ణయించియుండుటచేతను శంకరు లాఅవశతాబ్దాంత్య భాగము వారని వ్రాసియుండిరి.

ఈ తర్కములో నెట్టిపటుత్వమును కనుపించుటలేదు. వేదాంత విషయములను బోధించునప్పుడు చెప్పబడిన కల్పితదృష్టాంతములలోని పేర్లను నిజమైన వానిగానెంచి వానిని చరిత్రాధారములుగా తీసుకొని వ్రాయబడినచరిత్రల కెట్టివిలువగలదో యూహింపుడు.

శంకరాచార్యులవారు తత్త్వవిషయమును బోధింపుచూ శ్రోతలకు సుబోధకముగా నుండుటకు నుపమానముగా పై పట్టణములను మనుష్యులపేర్లను చెప్పియుండిరి. ఈ పట్టణములపేర్లను బ్రహ్మసూత్రములు 4-2-5 లో కూడనిచ్చి యుండిరి.

"యోపి స్రుఘ్నాన్మథురాంగత్వా మథురాయాః పాటలీపుత్రంవ్రజతి సోపిస్రుఘ్నాత్ పాటలీపుత్రం యాతీతి శక్యతేవక్తుం"

తా॥ ఒకానొకడు స్రుఘ్న(గ్రామము)నుండి మధురకువెళ్ళి మధురనుండి పాటలిపుత్రమునకు వెళ్లెనని చెప్పబడగా నాతడు స్రుఘ్న

నుండి పాటలీపుత్రమునకు వెళ్లెనని చెప్పవచ్చును అని చెప్పియుండిరి. అంతమాత్రమున ఆ పట్టణముల పుట్టుక వృద్ధి, క్షయములతో శంకరుల జననకాలము నెంచుటకెట్టి ప్రసక్తియు గలుగదు. ఆ నిస్మరణమువలన అవి కట్టబడిన కాలములో శ్రీ శంకరున్నటుల యోచవచ్చునా? ఆ పట్టణములు శంకరుల కాలమునకు పూర్వమనేక వందల సం॥రముల నుండియు గలవు. పాటలీపుత్రము పతంజలివలనకూడను స్మరింపబడి నది. దాని కాలము క్రీ॥ పూ॥ 150 సం॥రముగా నెంచబడుచున్నది. ఇది సరియైన కాలనిర్ణయముకాదు. అది అలెగ్జాండరు హిందూదేశ దండయాత్ర కాలమునకు సమకాలికుడు మౌర్యచంద్రగుప్తుడుగా గుర్తింపబడుటవలన గలిగిన పొరబాటు. మౌర్యచంద్రగుప్తుడు క్రీ॥ పూ॥ 1534_15 0 సం॥రములలో రాజ్యముచేసియుండెను అలెగ్జాం డరుకు సమకాలికుడు గుప్తచంద్రగుప్తుడుగాని చంద్రగుప్త మౌర్యుడు కాడు. ఈ విషయమును మౌర్య, గుప్తవంశముల చరిత్రమున యీ గ్రంథములో వివరింపబడినది. గుప్త చంద్రగుప్తుడు క్రీ॥ పూ॥ 327 _ 320 సం॥రములలో అలెగ్జాండరు దండయాత్రకాలమున యుండి యుండెను. ఈ యిద్దరికిని మధ్య తేడా 1200 సం॥పై చిలుకు _ గనుక మౌర్య చంద్రగుప్తునికి 173 సం॥పిమ్మట క్రీ॥పూ॥ 150 సం॥రమున యున్నటుల చెప్పబడిన పతంజలి మహర్షి క్రీ॥పూ॥ 1361 సం॥ రమం దున్నటుల చెప్పబడవలెను. కలిశక విజ్ఞాన ద్వితీయ భాగమందీ విష యము చర్చింపబడినది. మౌర్య చంద్రగుప్తుని కాలము 1534 సం॥రము నుంచి 173 సం॥రములు తీసివేయుగా (1534_173 =) 1361 సం॥ర మగును.

ఇకను ఆచార్యులవారి భాష్యము ౨_౧_౧౮ లో స్మరింపబడిన పూర్ణవర్మ క్రీ॥ శ 630 సం॥రమునందున్నటుల కన్నింగుహాము దార వ్రాసియుండుటవలన శంకరులతని కాలమువాడని నిర్ణయించిరి. ఈ నిర్ణయము హాస్యాస్పదము. శంకరులు ఆధ్యాత్మిక విషయములను బోధించుట కుపయోగించుకొనిన యుపమానములలో కొన్ని పేర్లను స్మరించి యుండిరి. ఈ పేర్లుగల పురుషులు నిజముగా వుండనక్కర లేదు. దేవదత్తుడు, యజ్ఞదత్తుడను పేర్లను తరచుగా ఆచార్యులవారి

యుపమానములలో స్మరించియుండిరి. కాని యీపేర్లుగలవార లెప్పుడును లేరు. కేవల కల్పిత నామములు. అట్లు కల్పింపబడిన పేరుగల యొకానొక రాజుపేరున లోకములో యొక రాజుండుట కాకతాళీయముగా తటస్థించిన ఆ రాజుకాలములో శ్రీ శంకరు లున్నారనుట హాస్యాస్పదము. పూర్ణవర్మపేరునే కాక శ్రీ శంకరులితరపేర్లు కొన్నిటి నింకను యుదాహరించిరి. బ్రహ్మసూత్రములు 2-4-1 లో

" యథాసింహ స్తథా బలవర్మేతి" అని బలవర్మనామమున్నూ డిటో 4-3-5 లో

" గచ్ఛత్వమితో బలవర్మాణం తతో జయసింహం తతః కృష్ణగుప్తమితి " ఇందు బలవర్మ, జయసింహ, కృష్ణగుప్తులను మూడు పేర్లను స్మరించియుండిరి. బలవర్మయను యొకరాజు క్రీ॥ శ 767-785 సం॥రములలో యుండియుండెను. పూర్ణవర్మ స్మరణవలన క్రీ॥ శ॥ 630 సం॥లో శంకరులున్నారని కొందరును, బలవర్మస్మరణవలన 767 సం॥రమని కొందరును నిర్ణయించుచున్నారు ఇందేది నిజము ? జయసింహ, కృష్ణగుప్తులే కాలమునను లేనందున కల్పితులట, ఇదిగాక ఆచార్యులవారు తమ ఛాందోగ్యోపనిషద్భాష్యము 1-23 లో

"యథాపూర్ణవర్మణః సేవాభక్త పరిధాన మాత్రఫలా,
రాజవర్మణస్తు సేవారాజ్య తుల్యఫలేతి"॥

ఈ వాక్యములో పూర్ణవర్మ, రాజవర్మలను రెండుపేర్లుదాహరింపబడినవి. ఈ ప్రకారము ఆచార్యులవారిచే యుపమానమునిచ్చుటకు కల్పింపబడినపేర్లను అట్టిపేరుగల యేదియోయొక పురుషునికి సమన్వయించి వారును వీరును సమకాలికులని చెప్పనగునా ? అట్లు వ్రాయబడినది చరిత్రయగునా ? కృష్ణగుప్తుడను పేరుగల యొకరాజు క్రీ॥ పూ॥ మూడువేల సం॥రముల క్రిందట యున్నాడనుకొందము. ఆ పేరుదాహరింపబడినందున ఆచార్యులవారు ఆకాలమువారని చెప్పనగునా ? యీ పండితుల బాల్యచేష్టలు గర్హింపతగినవి. ఆచార్యులవారి కాలమును నిర్ణయించుటకు వారిచే నిర్మింపబడి యుండినట్టిగాని లేక దరిమిలా వారి శిష్యప్రశిష్యకోటి వలన నిర్మింపబడినట్టిగాని

పీఠములలో పాటింపబడిన సాంప్రదాయసిద్ధముగా కాపాడబడినట్టిగాని లేక వారిసాంప్రదాయసిద్ధముగా వచ్చుచుండిన కాలమును నిర్ణయించి నట్టిగాని గురుపరంపరను బట్టి నిర్ధారణచేయుట న్యాయముగాని వ్యర్థములైన యూహాలనుజేసి చరిత్రాలకు హాస్యాస్పదమైన కాలనిర్ణ యముచేయుట న్యాయపార మీరాపండితులకు తగదని మనవి చేయుచున్నాము. శ్రీ శంకరుల కాలము క్రీ॥ పూ॥ 509 సం॥ అనుటయే సిద్ధాంతము.

మాక్సుమూలరు మహాశయుడు 'శంకరమందార సౌరభము' నందలి

శ్లో॥ "ప్రాసూత తిష్య శరదామతి యాతవత్యా
మేకాదశాధికశతోన చతుస్సహస్ర్యాం
సంవత్సరే విభవనామ్ని శుభే ము
హూర్తే రాధే సితే శివగురోర్గృహిణీ దశమ్యాం॥"

పై శ్లోకములో కలియుగాబ్దములు 3889 (క్రీ॥ శ॥ 787 సం॥ విభవ సం॥ వైశాఖశుద్ధ దశమితిథియందు శంకరులు జన్మించియుండి రని చెప్పబడిన వాక్యమును తీసుకొని శంకరుల జననము క్రీ॥శ 787 సం॥ర మని నిర్ణయించిరి. పైన పుదహరింపబడిన "శంకరమందార సౌరభము" యిటీవల వ్రాయబడిన గ్రంథము. శంకరుల జననమునకు పిమ్మట వేయిసంవత్సరముల పైకాలము జరిగినపిమ్మట వ్రాయబడినది. అప్పటికి శంకరుల జననకాలమునుగురించి మఱుపునకువచ్చి దానిని నిర్ణయించుటకు తర్జనభర్జనలు జరిగియుండిన కాలమున పైనిర్ణయము నా గ్రంథకర్త యూహించివ్రాసి యుండవచ్చును లేక హైందవ ప్రాచీనతను తగ్గింపతలంపు గలిగిన బుద్ధిమంతులచే కల్పింపబడి అందు చేర్చబడియుండవచ్చును. హైందవ చారిత్రకపురుషుల కాలములను నిన్నమొన్నటిదిగ నిర్ణయించుట కుత్సాహపడుచుండిన పాశ్చాత్య పండితులకీ ప్రక్షిప్త వాక్యము ప్రమాణమైనది. (శ్రీశంకరుల జననము వైశాఖశుద్ధ పంచమి అని యీనాటివరకు ఆచరింపబడుచుండగా పైశ్లోకమున దశమి అని వ్రాయబడినది.)

ఆగ్రంథము పొరబాటభిప్రాయములతో గూడినదై యున్నందున ప్రమాణముగా తీసికొనుటకు పనికిరాదు. శ్రీ ఆదిశంకరుల వారిచే స్థాపింపబడిన పీఠములలో కాపాడబడుచుండిన గురుపరంపర ప్రకారము క్రీ॥ పూ॥ ఆఱవశతాబ్దములో అనగా కంచి కామకోటి పీఠములో 509 బి. సి.

| | |
|---|---|
| శ్రీ జగన్నాథములోని రికార్డునుబట్టి | 516 బి. సి. |
| శ్రీ ద్వారకాపీఠములోని రికార్డునుబట్టి | 541 బి. సి. |
| శ్రీ శృంగేరీ విరూపాక్షపీఠము గుంటూరు | 509 బి. సి. |

శంకరుల జననము సిద్ధమగుచుండగా అన్నిటికన్న తక్కువ కాలము నిశ్చిన శంకరమందార సౌరభమేల వీరికి ప్రమాణము కావలెను ? ఆ గ్రంథమే క్రీ॥పూర్వకాలములో శ్రీ శంకరజననమును చెప్పియుండినయెడల యీ మహామహుడు దానిని తప్పని త్రోసివేసి యుండెడివాడే. న్యాయముగా విచారించిన ఎక్కువమందియొక్క అభిప్రాయమును ప్రామాణ్యముగా తీసుకొనుట సమంజసము. అదిగాక శ్రీ శంకరులవారిచే స్థాపింపబడిన పీఠములైదింటిలో నాలుగు పీఠములలో కాపాడబడుచుండిన దస్తావేజుల దాఖలా గురుపరంపరను శ్రీ ఆది శంకరుల లగాయతు యిప్పటివరకు చూపుచూ క్రీ॥ పూ॥ ఆరవశతాబ్దమును నిర్ణయించుచుండగా దానిని కాదని త్రోసివేసి ఆపిమ్మట అనేక శతాబ్దములకు వ్రాయబడిన గ్రంథములో వూహాపోహాలతోగూడిన తెలియని నిర్ణయమో లేక దుష్టసంకల్పముతో ప్రాచీనతను తగ్గించుటకు కల్పింపబడి నా గ్రంథములో దూర్చబడినదియో యని సందేహింపకనే పాశ్చాత్య విద్వాంసులు తక్కువకాలముగనుక నంగీకరించిరి.

ఈపాశ్చాత్యవిద్వాంసులే మనపురాణములలో నీయబడిన రాజవంశావళిని, కలి ప్రవేశకాలమును నంగీకరింపక అలెగ్జాండరు దండయాత్ర నాధారముగా గొని మహాభారతయుద్ధమును, కలిప్రవేశకాలమును ఆపిమ్మట గల రాజవంశావళిని కలి సంవత్సరములలో జెప్పబడిన వాటిని కొన్నిటిని ప్రక్షిప్తములని కొన్నిటిని యవిశ్వాసనీయము

లన్నిత్రోసివేసిరి. కలి సం॥రములలో చెప్పబడిననేపాళరాజవంశావళిలో సం॥రము లంగీకరింపక త్రోసివేసిరి. కాని శంకరులకాలమును తక్కువ కాలములో చెప్పుటకు వీలుగానుండిన శంకరమందారసౌరభములోని కలిశక సంవత్సరమును తేలికగా నంగీకరించిరి. వీరు యీవిషయములో కలిసం॥రములను న్యాయబుద్ధితో సంగీకరించిన యెడల దీనిననుసరించి వారిచేవ్రాయబడిన హిందూదేశచరిత్రలలో నీయబడిన రాజవంశావళి కాలముల నెందుకు సవరించుకొనియుండలేరు ? వారు నిజముగా కలి సం॥రములు క్రీ॥ శ 788 నాటికి 3889 అని నమ్మిన యెడల కలిశక ప్రారంభము క్రీ॥ పూ॥ 3102 అని అంగీకరింపక తప్పదు. అట్లంగీకరించిన వారిచే వ్రాయబడిన చరిత్రలలో నీయబడిన కాలములను తప్పక సవరించుకొనవలసియుండును. శ్రీశంకరులవలన స్థాపింపబడిన గురుపరంపర దాఖలా నాలుగు మఠములలో నీయబడిన శంకరులకాలము క్రీ॥ పూ॥509 లేక కలి 2593 సం॥రముగా నిర్ణయించుటయే న్యాయము. అదియేసత్యమైన నిర్ణయము.

యీవిషయములో శ్రీకవితాభూషణ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారిచే వ్రాయబడిన శ్రీశంకరవిజయాంధ్ర పద్యకావ్యపీఠికలో నీవిధముగా యితర ప్రమాణములు చేర్చి వ్రాసిన వాక్యములను చూడుడు :—

"మళయాళమందలి బ్రాహ్మణులును వారిలోనుండి యుద్భవించిన శంకరులును "ఆంధ్రులు" అనుట స్పష్టము. ఇందువిషయమై యితర పండితుల వ్రాతల నిచ్చుచున్నాము.

దక్షిణామండియావర్ణములు— తెగలు అనుగ్రంథము 7 సంపుటములుగా మద్రాసు దొరతనమువారిచే ప్రచురింపబడెను. అందు మళయాళ(కేరళ) దేశబ్రాహ్మణులను గురించి యిట్లు వ్రాయబడెను.

1. బ్రాహ్మణులయొక్క లిఖితములైన కొన్నిగ్రంథములలో కదంబవంశజుడైన మయూరవర్మకాలమున నాంధ్రబ్రాహ్మణులు కొందఱు దక్షిణకన్నడమునకు తీసికొనిపోబడిరని చెప్పబడియున్నది.

2. బ్రాహ్మణుల కాలగణన ప్రకారము మయూరవర్మ క్రీ॥ పూ॥ 455 మొదలు 445 వఱకు రాజ్యముచేసెను.

3. పరశురాముని శాపానంతరము కదంబవంశములోని మయూరవర్మ అహిక్షేత్రమునుండి తూలుబ్రాహ్మణులను తీసుకొని వచ్చువఱకును నా దేశమునందు బ్రాహ్మణులు లేరు.

4. ప్రస్తుతమందున్న బ్రాహ్మణులను మయూర వర్మ తీసికొనివచ్చెనని చెప్పటలో సాంప్రదాయిక కథలన్నియు నేకీభావము వహించుచున్నవి

5. ఉత్తర కన్నడములోని బనవాసి రాజధానిగా రాజ్యము చేసిన కదంబవంశమునకు మూలపురుషుడు మయూరవర్మయని శాసనములు చెప్పుచున్నవి.

6. గోదావరి తీరమందున్న యహిక్షేత్రమునుండి బ్రాహ్మణులు తీసికొని రాబడిరని చెప్పబడుచున్నది.

7. నంబూతిరీలును వీరి సంప్రదాయ కథలును మయూర వర్మ వఱకునుబోవును

8. మయూరవర్మచే బ్రాహ్మణులు కొనిరాబడినప్పుడు వారు భట్టాచార్యులవారి (అనగా కుమారిలభట్టు) శిష్యులుగా నెంచబడిరి. కాని పడమటితీరమునకు వీరు వచ్చిన వెంటనే మళయాళదేశపు వేదాంత గురువగు శంకరాచార్యులవారి సిద్ధాంతముల నంగీకరించిరి.

పై గ్రంథముననే మైదవ సంపుటమున సుబ్రహ్మణ్య అయ్యరు గారిట్లు వ్రాయుచున్నారు.

9. కేరళ మహాత్మ్యములో వ్రాయబడిన దంతకథాపరంపర నంబూతిరీ లహిక్షేత్రమునుండి వచ్చినట్లుగా చెప్పును. ఈ పై పేర్కొనబడిన తొమ్మిది స్థానములలోని యుదాహృత వాక్యములు, కేరళ మహాత్మ్యము, కేరళోత్పత్తియను సంస్కృత గ్రంథములనుండి గ్రహింపబడినవి.”

“మయూర వర్మ భట్టాచార్యులవారు- శంకరాచార్యుల వారును ‘ఆంధ్రుల’ని నే నొక్కచోటనే వ్రాయుటలేదు. ఆంధ్రమహా

సభవారిచే ప్రచురింపబడిన 'ఆంధ్ర ప్రచలనము' అను చిన్న గ్రంథమున ప్రథమసూరాంధ్రసభానంతరము కాబోలును ప్రచురింపబడెను. మఱి కొన్ని దంతకథలును పై విధముననే చెప్పుచున్నవి." అని వ్రాసియుండెను.

కదంబ వంశము బ్రాహ్మణవంశమని లోగడ గ్రంథమున వి. ఎ. స్మిత్ పండితుడు వ్రాసిన వాక్యముల నిచ్చియుంటిమి. మయూరశర్మ కదంబవంశమునకు మూలపురుషుడనియు, వాని కాలము క్రీ॥పూ॥ ఆరవ, అయిదవ శతాబ్దమనియు చెప్పబడియున్నది. దీనినిబట్టికూడను శ్రీ శంకరుల జననము క్రీ॥ పూ॥ 509 సం॥ర మనుట స్పష్టము. సంశయము లేదు. పైన వుదహరింపబడిన నాలుగు శంకర మతములలోని గురు పరంపర సత్యమైనదని మద్రాసు దొర తనమువారిచే ప్రకటింపబడిన దక్షిణ యిండియా వర్ణములు. తెగలు అను గ్రంథము కూడను ధృవపరచుచున్నది.

ఇదిగాక "అనంత సదాశివ ఆల్టేకారు" అను హైందవ పండితుడు తనచే వ్రాయబడిన "రాష్ట్రకూటులు, వారి కాలము" క్రీ॥శ750ల॥ 1000 వరకు The Rashtrakutas and their times A. D. 750 to 1000 A. D. అను గ్రంథము 280 పుటలో శ్రీ శంకరులను గురించి యిట్లు వ్రాసియున్నాడు.

"It is to be regretted that there should be so far discovered no trace of Sankara and his work in Epigraphical documents. This is rather strange, for tradition claims that he toured about preaching, discussing, controverting and founding monastic establishments throughout the length and breadth of India."

తా॥ ఇంతవరకు దొరకబడిన శాసనములలో నెచ్చటను శ్రీ శంకరులీ కాలములో (క్రీ॥శ 750-1000 ల మధ్య) నున్నట్లు చూపగల గుర్తు లెచ్చటను గనుపడనందుకు చింతిలవలసియున్నది. ఇది చాలా విచిత్రము. ఎందువల్లనంటే శ్రీ శంకరులు దేశము నలు

మూలలను తన అద్వైత మతమును ప్రజలకు బోధింపుచు, వాదించుచు, యితరమతముల ఖండించుచూ, మఠములను స్థాపించుచూ ప్రయాణించినట్లు ఆయనకు సంబంధించిన గ్రంథములు, ప్రజలలో పరంపరా వచ్చుచున్న సాంప్రదాయములును చెప్పుచున్నవి. అని వ్రాసియున్నాడు.

ఈ విషయములో యీ పండితు డాశ్చర్యపడవలసిన దేమియు లేదు. చింతిలవలసినదియు లేదు. శ్రీ శంకరు లీకాలమున నుండిన గదా వీరికట్టి గుర్తులు కనుపించవలసినది. శ్రీ శంకరులు వీరి చరిత్ర కాలమునకు 1500 సం॥ రములకు పూర్వమే గతించి యుండగా వీరికాలమునగల శాసనములలో కెట్లు వచ్చును? దీని ననుసరించి కూడను శ్రీ శంకరులకాలము క్రీ॥ శకమున 8వ శతాబ్దికాదనియు, క్రీ॥ పూ॥ 509 సం॥ రమే సత్యమనియు ఋజువగుచున్నది. ఇది గాక యిప్పుడు తెలియవచ్చిన చారిత్రాత్మకమైన నూతన ఋజువు ది 17 జులయి 1949 సం॥ "హిందూ" పత్రిక 15 వ పుటలో యిట్లుదాహరింపబడినది—దీనిని కాదనుటకేరికిని వీలు లేదు.

## "PILGRIMAGES IN KASHMIR"

"Shankaracharya"—"This shrine is situated in the City of Srinagar. Shankaracharya is an ancient temple crowning the Takht-i-Sulaiman hill and standing 1000 ft. above the valley. The temple and the hill on which it stands take their name from Shankaracharya —the great South Indian Teacher of Monism, who came to Kashmir from Travancore. This temple was built by king Gopaditya who reigned in Kashmir from 368 to 308 B. C. It was repaired later by the liberal-minded Muslim King Zain-ul-Abdin."

(The Hindu Dated 17-7-1949) P. 15 2nd Column).

తా॥ శంకరాచార్య :— "ఈ దేవాలయము శ్రీనగరుపట్టణమున గలదు. శంకరాచార్యుని దేవళము 'తాక్త్-సు-లేమాన్' గుట్ట

మీద లోయకు వేయిఅడుగుల యెత్తున గలదు. ఆదేవాలయమునకును, కొండకును "శంకరాచార్య" అను పేరు గలిగియున్నది. ఈయన దక్షిణ ఇండియాలోని తిరువాన్కూరురాష్ట్రమునుంచి రాబడిన అద్వైత మత గురువు. ఈదేవాలయము క్రీస్తుకు పూర్వము 368 లగాయతు 308 సం॥ రమువరకు కాశ్మీరదేశమును పరిపాలించిన "గోపాదిత్యుడు" నెడి రాజు వలన కట్టబడినది. పిమ్మట పులిసమాన భావముగల "జైన్-ఉల్-అబ్డిన్" అను ముజ్లిము రాజువలన మరమ్మతుచేయబడినది"—అని ప్రకటింప బడినది. ఇది చారిత్రక విషయము. దీనినిబట్టి శ్రీశంకరులవారు క్రీస్తుకు పూర్వము నాలుగవ శతాబ్దమునకు పూర్వుడని స్పష్టముగా తెలియు చున్నది. ఈయన "అద్వైతమతము"ను ప్రచారమునకు దెచ్చెను. "విశిష్టాద్వైతమత"మును ప్రచారమునకు దెచ్చిన శ్రీ రామానుజస్వామి వారి యింటిపేరు "ఆసూరి"వారు. ఇటిపేర్లు తెలుగువారికేగాని అరవ వారికి లేవు. అందువలన శ్రీరామానుజులవారు ద్రవిడదేశమున నివసించిన "ఆంధ్రబ్రాహ్మణులే"నని వేఱుగ జెప్పనక్కరలేదు. వీరిది "వెలనాటి వైదికశాఖ". కృష్ణా గోదావరి గుంటూరుజిల్లాలలో "ఆసూరి వారిప్పటి కిని గలరు. ద్వైతమత" ప్రచారకులగు "మధ్వాచార్యుల"వారి యింటి పేరు "మధ్యగేహ" "మధ్యగేహ"అనగా నడిమింటివారు. ఆయనపేరు "భట్టు లేక భట్టాచార్యులు". గనుక వీరును ఆంధ్రులే. త్రిపీఠస్థాపనా చార్యులగు "ఆచార్యత్రయము" ఆంధ్రబ్రాహ్మణులైయుండిరి.

## కదంబ, పల్లవ, వంశములు బ్రాహ్మణవంశములు

"From the Talgunda inscription of Kakusta-Varman, we learn that the Kadamba King Mayura Sarman went to the City of the Pallavas i. e. Kanchi with his preceptor Virasarman to study the whole of the sacred lore, but soon took to arms, showed great courage in defeating the frontier guards of the Pallavas, and establishing himself in the forest streaching to the gates of Sriparvata, he levied tribute from the great Banas and other Kings."

(Ancient Dekhan P. 22-23—By K. V. Subramanya Iyyar, Ed. 1915.)

తా॥ "కాకుస్థవర్మ్మయొక్క తాళ్గుండ" "శాసనమును బట్టి కదంబ వంశపు మూలపురుషుడైన మయూరశర్మ్మ వేదశాస్త్రాధ్యయనము కొరకు తన యుపాధ్యాయుడైన వీరశర్మ్మతో కలసి పల్లవరాజధానియగు కంచిపట్టణమునకు బోయెననియు, అచ్చటకు వెళ్ళిన కొద్దికాలమునకే యుద్ధసన్నిద్ధుడై యెక్కువ ధైర్యసాహసములనుజూపి పల్లవరాజుయొక్క సరిహద్దు కాపలా సైన్యములగెల్చి కంచిలో శ్రీ పర్వతమువరకు (నాగార్జునకొండకు శ్రీ పర్వతమని ఆకాలమున పేరు) గల ఆరణ్య ప్రదేశమునంతను స్వాధీనపరచుకొని బాణులు మొదలుగాగల రాజు లందరివల్లను కప్పములు పుచ్చుకొనెను" అని తెలియుచున్నది. (ప్రాచీన దక్కను 22, 23 పేజీలు చూడుడు.)

"కదంబవంశమునకు మూలపురుషుడు మయూరశర్మ్మ క్రీ॥ పూ॥ ఆరవశతాబ్దములో నుండెను. ఈ వంశములో కాకుస్థవర్మ్మ అనేరాజు క్రీ॥ శ॥ 550 లోపున నుండెను" (Ancient Dekhan Page 27)

"శర్మ్మ" శబ్దమువలన మయూరశర్మ్మ బ్రాహ్మణుడనియు, యీతడు కదంబవంశ మూలపురుషుడగుట వలన కదంబవంశము బ్రాహ్మణవంశమనియు తెలియుచున్నది.

సేన, పల్లవ, చోడరాజులును, తూర్పుచాళుక్య, పశ్చిమ చాళుక్య, రాష్ట్రకూట, కదంబ మొదలుగాగల పేర్లతో ఆంధ్రశాత వాహనవంశము చీలి ఏడుశాఖలై శాతవాహన సామ్రాజ్యమంతరించిన పిమ్మట దేశమును విభాగించుకొని రాజ్యములు చేసియుండిరి. వీరంద రును పరస్పర సంబంధబాంధవ్యములు గలిగియుండిరి. పల్లవులు భారద్వాజసగోత్రీకులు. కదంబవంశమునకు గోత్రము మానవ్యస గోత్రము. ఈ వంశములు ఆంధ్రశాతవాహనులకు జౌరసులు దాహి త్రులునై యుండిరి. ఇవన్నియు ఆంధ్రబ్రాహ్మణ వంశములై యున్నవి.

కదంబరాజులలో కాకుస్థవర్మ్మ మనుమడగు మృగేశవర్మ్మ గౌతమ గోత్రుడైన సోమశర్మ్మయను బ్రాహ్మణునకు "కదళీకళని" యను గ్రామ

మును దానముచేసి వ్రాయించిన శాసనములో తమ వంశమును గురించి యిట్లు వ్రాయించి యున్నాడు.

"స్వస్తివిజయ వైజయన్త్యామ్ స్వామిమహాసేన మాతృగణా ధ్యాతాభిషిక్తానామ్ మానవ్యస గోత్రానామ్, హారీతి పుత్రాణామ్ ప్రతికృత స్వాధ్యాయ చర్చాపారగానామ్ కదంబనామ్ ఆశ్రితాం బానామ్ శ్రీమత్కాకుస్థ తనయస్సుతః శ్రీమృగేశ్వరవర్మా అన యానుపూర్వ్యాస్య..."(ఎపిగ్రాఫియా కర్నాటికా సంచిక 8 భాగం 2 సొరచితా త్రామశాసనం 33 చూడుడు)

పై శాసనములో కదంబవంశపు రాజులు బ్రాహ్మణులనియు, మానవ్యసగోత్రులనియు, హారీతి పుత్రులనియు (అనగా హారీత గోత్రికు కుల దౌహిత్రులని తెలియుచున్నది) వేద వేదాంగములను పూర్తిగా నధ్యయనము చేసిన వారనియు స్పష్టముగా తెలియుచున్నది. క్షత్రియ ధర్మమైన రాజ్యపాలనమును వృత్తిగా నవలంబించినందున వారిపేర్ల తుదనుజన్మచేత బ్రాహ్మణులుగనుక "శర్మ" అనియు క్షాత్రవృత్తి నవలంబించి నందున "వర్మ" యనియు శర్మవర్మ భేదమును పాటింప కనే చేర్చుచుండిరి. చాళుక్యవంశమువారికి గూడను ఇదే గోత్రప్రవర లనియు రాజరాజ నరేంద్రు డావంశములోని వాడనియు నన్నయభట్టు ఆంధ్రమహాభారతమున గలదు. బహుకాల మావంశమువారలు రాజ్యపరిపాలన చేయుచు తమ పేర్లకు క్షత్రియుల కుంతదగిన "వర్మ" శబ్దమును చేర్చుకొనుచుండుటవలన తాము క్షత్రియులైనట్లు భ్రమిం తమ వంశమును సూర్యచంద్రవంశపు మూలపురుషులకు యిటీవ తగిలించుకొని యుండిరి. ఇది భ్రమప్రమాదజనితము.

"The Pallavas trace their ancestry from Aswathama the son of Drona, the General of the Kurus. Some trace descent from the sacrificial fire, such as Paramaras, Chahumanas, and others."

(Vide History of India P. 39. By Mahamahopadhyaya Hara Prasada Sastry. M. A.)

తా॥ పల్లవులు కౌరవ సైన్యాధిపతియైన ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామ నుండి తమ వంశమును చెప్పుకొందురు. వీరిది భారద్వాజస గోత్రము. కొందరు పరమార, చాహుమాన మొదలగువారలు అగ్నికులులమని చెప్పుకొందురు. (అగ్నికులులనగా "హోత్రమును పొందిన బ్రాహ్మణులు" అని అర్థము. వీరికుత్తర దేశమున "బ్రహ్మ క్షత్రులనియు, ఆంధ్రదేశమున "నియోగ బ్రాహ్మణులనియు" నామములు." వీరందరు ఆంధ్ర శాతవాహన వంశమునకు చెందినవారు. ఆంధ్ర బ్రాహ్మణులు మగధయందు రాజ్యముచేసిన చక్రవర్తులైనందున ఆంధ్రబ్రాహ్మణులలో రాచకార్యములయందు నియోగింపబడినవారు "నియోగులని"యు, బ్రాహ్మణ ధర్మము నంటిపెట్టుకొనినవారు "వైదికుల" నియు క్రీ॥పూ॥ ఐదవ శతాబ్దమునుండి రెండు శాఖ లేర్పడుటకు కారణమైనది. మన దేశమందలి ఇతర రాష్ట్రములలోని బ్రాహ్మణులు రాజ్యములు చేసియుండనందున వారిలోనిట్టి శాఖాభేదములు లేవు.

## ఆంధ్ర సామ్రాజ్య విభాగము

అంధ్ర శాతవాహనులయొక్క కుమాళ్ళలో జ్యేష్ఠులు రాజ్యార్హులై యుండుటచే మిగత రాజకుమారులకును, చక్రవర్తుల కూతుల కుమాళ్ళు (దౌహిత్రులు) కును, రాజపుటానా యందల్పరాజ్యముల నొసంగి వారిని సామ్రాజ్యమునకు లోబడియుండునటుల చేయబడినది. "రాజపుత్రులు" అనగా రాజులయొక్క కుమాళ్ళు అని అర్థము. [illegible]రందఱు ఆంధ్ర బ్రాహ్మణులు. క్రీ॥పూర్వము తొమ్మిదవ శతాబ్దము [illegible]ండి శాతవాహన సామ్రాజ్యము అల్పరాజ్యములుగా విడిపోయిన [illegible]॥ పూ॥ 327 సం॥రంవరకు ఐదువందల సంవత్సరములలో రాబడిన రాజకుమారు లందరకు రాజపుటానాలో వసతులు కల్పింపబడినందున ఆ రాష్ట్రమునకు రాజపుత్రస్థానమని పేరుకలిగినది. వీరందఱు తగు సైన్యముల వదవులో నుంచుకొని చక్రవర్తులకు తోడ్పడుచుండెడి వారు. వీరి సైన్యములలో అధికముగా చేరియున్నవారు బ్రాహ్మణ సైనికులై యుండిరి. వీరిలో 36 కుటుంబములు వివిధ నామములతో

ఱుప్పాచుండిరి. క్రీస్తుకుపూర్వము నాలుగవ శతాబ్దములో శాతవాహన ్రాజ్యము బలహీనమగుచుండిన కాలమున ధర్మ సంరక్షణార్థము రినుండి నాలుగు కుటుంబములవారి నేటి వారిచే వీరస్థులు రాజ ఫుటానాలోని ఆబూ పర్వతముమీద అగ్నియందు హోమహవనాదులు ేయించి వారియందు బ్రహ్మతేజముతోపాటు, క్షాత్రతేజముకూడా లుచునట్లు వేదమంత్రములచే సంస్కరించిరి. వీరిని అగ్నికుల క్షత్రియు నియు' క్షాత్రోపేత బ్రాహ్మణులనియు, పేరిడిరి. క్రమక్రమముగా ్తర దేశమున వీరు "బ్రహ్మక్షత్ర" లనియు ఆంధ్ర దేశమున నియోగ బ్రాహ్మణులనియు పిలువబడిరి. దేశము నాలుగు భాగ ములుగా విభాగింపబడి యీ నలుగురును నాలుగు భాగముల కధిపు ంగా చేయబడి, యేభాగములో చేరియుండిన అల్పరాజన్యుల ాభాగాధిపతియైనవానికి సామంతులుగ నుండునట్లొనర్ప బడిరి. ఈ నలుగురు రాజులు వారివారి భాగమునందుండిన సామంతులతో ాడ కలిసి దేశరక్షణమునందు నియోగింపబడిరి. ఆకాలమున శక ూణాది దోపిడి దొంగలగుంపులు పశ్చిమ దిశనుండి దేశములో ొరబడి అల్పరాజ్యములను దోచుకొనుచు, స్త్రీ బాలాదుల వధిం చుచు దేశములో నెమ్మదిలేకుండిన కాలమున యీ నాలుగురాజ్య ములు స్థాపింపబడినవి. వీరందరును ఆంధ్ర బ్రాహ్మణులే యైనను ారే దేశమందుండిరో నాదేశ ప్రజల వేషభాషాదు లవలంబించి పజారంజకముగా రాజ్యపాలన మొనర్చిరి. అదేప్రకారము రాజపుత్రు ందరు భాషాభేదముగలవారైనను ఆంధ్ర శాలివాహన వంశజులై యుండిరి. రాజపుత్ర కుటుంబములు ముప్పదిఆరు. అందు పోయినవి ోగా యిప్పుడు 22 మాత్రము మిగిలియున్నవి ఆ శాఖల ాబితా యీ గ్రంథమునందీయబడినది. అందు ప్రమర, చాళుక్య ంశములు ఆంధ్రదేశమున రాజ్యపాలన మొనర్చి తమ అధికార మును దక్షిణదేశమందంతటను విస్తరింపజేసిరి. క్రీస్తుశకం ప్రథమ ాతాబ్దమునుండి ఉజ్జయినీని రాజధానిగ జేసుకొని పరిపాలించిన క్రమార్కుడు, శాలివాహనుడు, భోజరాజు మొదలయిన రాజులు ప్రమరవంశపరంపరలో చేరిన ఆంధ్రబ్రాహ్మణరాజులు. తోమర, లేక

రాధోరులనెడి బ్రహ్మక్షత్రవంశమువారు పంజాబులగాయితు పాటలీ పుత్రమువరకు ఉత్తరమున హిమాలయమునవఱకుగల దేశమున తమ అధికారమును చలాయింపజేసిరి. పృధ్వీరాజీవంశములోనివాడు. పరిహార లేక ప్రతిహారవంశమువారు బెంగాలు లేక వంగదేశమున స్థిరపడి రాజ్యపాలనమొనర్చిరి. సేనవంశము రాజులీపరిహారవంశమునకు చెందిన వారు ఆంధ్రశాతవాహనకుటుంబములనుండి క్రీ॥ పూ॥ ఆరు, అయిదు శతాబ్దములలో చీలిపోయిన పల్లవులు, చోళులు, కదంబులు దక్షిణ దేశమును, కేరళదేశమును పరిపాలించిరి. ఈవిధముగా ఆంధ్రబ్రాహ్మణ రాజులు భారతవర్షమునందంతటను రాజ్యస్థాపనలుచేసి పరిపాలించిరి. మహావీరులై యుద్ధములందు వెనుదీయక శక, హూణ, గూర్జరాది దోపిడి మూకలను దేశములో జొరనీయక కాపాడిరి. క్రీ॥ శ. ఏడవ శతాబ్దమునుండి పండ్రెండవ శతాబ్దాంతమువఱకు మహమ్మదీయాది పరదేశీయులతో పోరాడి దేశప్రజలను భారతీయ సాంప్రదాయము లను సంరక్షించిరి.

వీరు గాక దూరప్రదేశములకు పాలకులుగా (గవర్నర్లుగా) పంప బడిన చక్రవర్తుల బంధువులు క్రమక్రమముగా స్వతంత్రులైరి. వీరే రాష్ట్రకూటులనువారు. ఆంధ్రశాతవాహనవంశము మొదట ఐదు శాఖలుగాను, పిమ్మట ఏడుశాఖలుగాను చీలి దేశమందంతటను రాజ్య ములు స్థాపించునని పురాణములు చెప్పుచున్నవి. పిమ్మటాశాఖల యందంతశ్శాఖలు కొన్ని విడిపోయినవి. వాని వివరములు :—

1. పల్లవవంశము :—ఇది ఆంధ్రదేశమున, దక్షిణదేశమున రాజ్యముచేసినది.

2. సేనవంశము :—ఇది పరిహారవంశ (బ్రహ్మక్షత్ర)ములో చేరిన అంతశ్శాఖ. వంగదేశమున రాజ్యముచేసినది.

3. చేత (లేకచేది) వంశము :—కళింగదేశమున రాజ్యము చేసినది.

4. కదంబవంశము :—ఇది కేరళదేశమున రాజ్యముచేసినది.

5. రాష్ట్రకూటవంశము :— వీరు సౌరాష్ట్ర, మహారాష్ట్ర, తూర్పు రాజపుత్రానాలలో రాజ్యము చేసియుండి క్రమముగా దక్షిణమునకు వ్యాపించిరి. వీరిలో కొందఱు రెడ్లకూడను గలరు.

6. విష్ణుకుండినులు
7. శాలంకాయనులు
8. బృహత్ఫలాయనులు
9. వాకటక వంశమువారు
10. బాణులు
11. వల్లభి వంశమువారు
12. గాంగులు
13. వైదుంబులు
14. హొసలులు
15. నోలంబులు
16. రాజపుత్రులు

వీరందఱు పంజాబు లగాయతు దక్షిణమున కన్యాకుమారి వఱకును, తూర్పున అస్సాంమువఱకును అనేక అల్ప రాజ్యములను స్థాపించి పరిపాలించిరి.

ఇట్టి అనేకత్వమువలనను, ఎవరికివారు స్వతంత్రులుగా నుండవలయుననెడి కోరికతో, ఏక రాజ్యము, ఏక నాయకత్వమున కొడబడని స్వభావము గలవారగుటవలనను, ఆంధ్రులు గొప్ప సామ్రాజ్యమును పోగొట్టుకొనుటయేగాక యితరులకు లోనుగావలసివచ్చినది. ఈ స్వభావ మిప్పటికిని ఆంధ్రజాతియందు దృఢముగా నాటుకొనియుండుటవలననే నేటికిని "ఆంధ్రరాష్ట్రము" ను పొందలేక పోవుచుండిరి. వ్యక్తి స్వాతంత్ర్యమను పిచ్చిభావముపోయి, ఏక నాయకత్వ మంగీకరించిననాడు ఆంధ్ర తేజము తిరిగి ప్రదీప్త మగును.

ఈశ్వరానుగ్రహమునది 11-11-1949 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసభ్యులు కృష్ణాతీరస్థ విజయవాడ పట్టణమందే కేంద్రించి "ఆంధ్రజిల్లాలు ప్రత్యేక రాష్ట్రముగా చేయబడవలె"నని యేకగ్రీవముగా తీర్మానించి భారత ప్రభుత్వమునకు పంపుట ముదావహము. ఇందుకు కారకులైన శ్రీ భో. పట్టాభి, శ్రీ కళా వెంకటరావు మొదలుగాగల ఆంధ్రనాయకులకు లందఱి నభినందించుచుంటిమి. ఇట్టి యైకమత్య మాచంద్రార్కమగుగాక! (ఈ శుభవార్త యీ భాగమచ్చగుచుండిన కాలమునందు వచ్చుటచే యిందు చేర్చగలిగితిమి.)

పైన చూపబడిన పదహారు శాఖలవారును బ్రాహ్మణ వంశజులు. వీరి నుండియే "అగ్నికులక్షత్రియులు" లేక "బ్రహ్మక్షత్ర" యని పిలువబడు నాలుగు వంశములు వచ్చియున్నవి

గంగపల్లవులనువారలు, పల్లవులకు భిన్నులుగానందున వారిని వేరుశాఖగా చూపియుండలేదు.

"The Ganga Pallavas are not different from the regular Pallavas and that they have no seperate existence."

(Ancient Dekkan—By K. V. Subrahmanya Iyyar' Ed. 1915 P. 52).

తా॥ గంగపల్లవులు అసలుపల్లవులను శాఖకంటె భిన్నులు కారు. వారికి ప్రత్యేకశాఖయని చెప్పదగిన యునికిలేదు." అని చెప్పబడినది.

## అగ్నికుల క్షత్రియులు లేక బ్రహ్మక్షత్రులు

ఆంధ్రశాతవాహనవంశమనేక విభాగములై దేశములో అల్ప రాష్ట్రములను స్థాపించి యెవరికి వారు స్వతంత్రులుగానుండిరి. మౌర్య, శుంగవంశములంతరించిన పిమ్మటావంశములలోని రాజులు కొందరు దక్షిణములోను, మధ్యఇండియాలోను అల్పరాజ్యములను స్థాపించి యుండిరి. రాజపుత్రులను శాతవాహనవంశజులు రాజపుటానాలో అనేక అల్పరాజ్యములను స్థాపించియుండిరి. ఉత్తర, పశ్చిమ భారత దేశమున శక, హూణ, గూర్జరాది జాతులవారు అల్పరాజ్యములకు ప్రభువులై అవకాశము దొరకినప్పుడెల్లను దేశమును కొల్లగొట్టుచు స్త్రీ, బాల, వృద్ధులను సైతము హింసించుచుండిరి. అల్పరాజ్యముల, నేకముజేసి నాయకత్వమును వహించి పరదేశీయుల బాడినుండి దేశ మును రక్షింపగల చక్రవర్తిత్వము లేక పోయినది. దేశమరాజకముగా నున్నట్లేర్పడెను. హిందూరాజులు పీఠాధిపులకు శిష్యులై దేశమును ధర్మయుక్తముగ పాలించుచుండిరి. ఇట్టి స్థితిలో పీఠాధిపులు బ్రాహ్మణ రాజవంశముల నుండి వీరులగు నాలుగు కుటుంబములవారినేరి, వారి

యందు బ్రహ్మతేజస్సును, క్షాత్రతేజమును, నిలుచునట్లు సంకల్పించి వేదమంత్రములచే అగ్ని నుపాసింపజేసి వారిచే హోమాదులను జేయించి దేశమును నాలుగుభాగములుగా నొనర్చి వారి నలుగురిని నాయాభాగములకు అధినాథులుగా నొనర్చి క్రీ॥ పూ॥ నాలుగవశతాబ్దములో వారిని దేశరక్షణకు నియోగించిరి. ఆయాభాగములందుగల అల్పరాజ్యాధిపతులను వారికి సామంతులుగా జేసి దేశమంతటిని నాలుగుకూటములుగ నొనర్చిరి. ఈకూటములవారు తమతో చేరి తమ నాయకత్వమంగీకరించిన సామంతరాజులతో కలిసి విదేశీయులగు శకహూణాదులనుండి దేశమున కెట్టి బాధయు కలుగకుండ కాపాడ గలిగిరి. ప్రమరవంశసంభవుడైన విక్రమాదిత్యుడు ఉజ్జయినీలో స్థిరపడిన శకరాజు నోడించి వానిని హిందూదేశ సరిహద్దును దాటించి బయటకు గెంటివేసెను. అదే ప్రకారము మిగతవారును దేశమును కాపాడిరి. విదేశీయులవల్ల దేశప్రజలకు యెట్టి బాధయు కలుగకుండు నటుల జేయగలిగిరి——ఈనాలుగువంశములవారును అగ్నికులక్షత్రియులని పిలువబడిరి. క్రమముగా వీరి ననుసరించి రాచకార్యముల యందు నియమింపబడిన బ్రాహ్మణులుకూడను బ్రహ్మక్షత్రియ లేక నియోగ బ్రాహ్మణులని పేరొందిరి. అగ్నికులులనగా అగ్నిదేవుని కులమునకు చెందినవారు. అగ్నిదేవతలలో బ్రాహ్మణుడు. అగ్నికులమన బ్రాహ్మణ వర్ణము, బ్రాహ్మణవర్ణమందుబుట్టి క్షాత్రమవలంబించినవాడు "అగ్నికులక్షత్రియుడనియు, బ్రహ్మక్షత్రుడనియు" పిలువబడెను. ఈ అగ్నికులునికే ఉత్తరదేశమున "బ్రహ్మక్షత్ర"యనియు, ఆంధ్రదేశమున "నియోగబ్రాహ్మణు"డనియు పేర్లు గలిగెను. ఏపేరున పిలచినను నిమిత్తమాత్రము క్షాత్రమందు నియోగింపబడిన బ్రాహ్మణుడని అర్థము.

అగ్నిదేవతలలో బ్రాహ్మణుడని శ్రుతి వినబడుచున్నది.

శ్రుతి : "అగ్నిమీళేపురోహితం" (ఋగ్వే ౧-౧-౧-౧)

తా॥ దేవతలకు పురోహితుడైన అగ్నినిస్తుతించుచున్నాను.

శ్రుతి : "ఆగ్నేయోవై బ్రాహ్మణః । సౌమోరాజన్యః"

(తై॰ సం॰ ౨-౧-౩-౧)

తా॥ బ్రాహ్మణుడు (దేవతలలో బ్రాహ్మణుడైన) అగ్నికుల మునకును రాజు (క్షత్రియుడు దేవతలలో క్షత్రియుడైన) సోముని కులమునకును సంబంధులు.

శ్రుతి : "అగ్నిశ్శుచిర్విప్రః" (తై॥ సం॥)

తా॥ అగ్ని (దేవుడు) స్వచ్ఛమైన బ్రాహ్మణుడు, అని వేద వచనములు వినబడుచున్నందున "అగ్నికులుడనగా బ్రాహ్మణ కులము నకు చెందినవాడని అర్థము. వైదిక ధర్మ సంరక్షణము నిమిత్తము బ్రాహ్మణ ధర్మమునకు తోడు నిమిత్తమాత్ర క్షాత్రమునుకూడా నవలం బించినందున "క్షాత్రమవలంబించిన బ్రాహ్మణుడు" లేక "బ్రహ్మక్షత్ర" లేక నియోగ బ్రాహ్మణ" అని పిలువబడెను.

## విస్మృతి

కాలము గడువగా నీ బ్రాహ్మణరాజులు తాము బ్రాహ్మణుల మనెడి గుర్తునుకూడా మఱచి క్షత్రియులుగా నెంచుకొని తమ వంశ మును సూర్య, చంద్రవంశములలో యొకానొక ప్రసిద్ధ పురుషునితో కలుపుకొనుచుండిరి. అదేప్రకారముగా క్రీ॥ శ॥ పదకొండవ శతా బ్దము లగాయతు శాసనములలో వ్రాయించుకొనిరి. ఉత్తర భారత ములో వీరు సంపూర్తిగా మార్పుజెందిరి. వీరుత్తర దేశమున బ్రహ్మ క్షత్రులనియు, ఆంధ్రదేశమున "నియోగ బ్రాహ్మణుల" నియు పిలువబడిరి. ఈ నియోగ బ్రాహ్మణవంశీయులు (బ్రహ్మక్షత్రులు) దక్షిణదేశములో రాజులుగానుండి రాజ్యములను పాలించిరి. చాళుక్య, పల్లవ, కదంబ, చేడ, (కళింగదేశమును పరిపాలించిన ఖారవేలుడీ చేడ వంశములోనివాడు) మొదలుగాగల వంశము లన్నియు యీ ఆంధ్రనియోగ బ్రాహ్మణ ప్రభువులని చెప్పుటకు సందేహింప నక్కరలేదు. చాళుక్య వంశజుడగు రాజరాజనరేంద్రుడీ "బ్రహ్మ క్షత్ర" లేక "నియోగ బ్రాహ్మణ" వంశీయుడే. ఈ ఆంధ్ర నియోగ బ్రాహ్మణులే రాజులుగాను, మంత్రులుగాను, సేనాపతులు గాను, రాష్ట్రాధిపతులుగాను నియోగింపబడి రాచకార్యములను నిర్వ

హించుచుండెడివారు. దేశపాండ్యాలను పేరున పరగణాలను పరిపాలించిరి. వీరే గ్రామాధికారులుగా నియోగింపబడి గ్రామకరణాలను నామములను బొందిరి. ఇతరు లందరితోపాటు వీరు సైన్యములలో సిపాయిలుగా జేరి యుద్ధవిద్యయందారితేరి బలపరాక్రమము లందును, ధైర్య సాహసములందును అద్వితీయులనెడి ఖ్యాతిని గడించిరి వీరు దేశపరిపాలనకు నియోగింపబడిన బ్రాహ్మణులే యైయుండినందున వేదవేదాంగాదుల నధ్యయనము చేయుచు మొదటిలో వైదికకర్మ నిష్ఠ గలిగియుండిరి. క్రమక్రమముగా లౌకికకర్మలయందు నిరంతరము నిమగ్నులై యున్నకారణమున వైదిక కర్మాచరణకు సావకాశము దొరకనందునను, లోకవ్యాపారములందు పూర్తిగా ప్రసరించిన చిత్తము వైదికకర్మ నిష్ఠయందు నిలుకడ గలిగియుండనందునను తామాచరింపవలసిన నిత్యాగ్ని హోత్రాది కర్మలు వ్యవహార నిమగ్నులుగాక వేదాధ్యయనాదులయందును కర్మ నిష్ఠయందును నిరంతరము నిమగ్నులై యుండెడి బ్రాహ్మణులచేత చేయించుకొనుచుండెడివారు — అంతటితో ఆంధ్రబ్రాహ్మణులలో వైదికులు, నియోగులనెడి రెండుశాఖ లేర్పడినవి. క్రీ॥ పూర్వము నాలుగవ శతాబ్దము నుండి క్రీ॥ శకం పదవ శతాబ్దమువఱకు జరిగిన 1400 పదునాలుగు వందల సం॥రములలో రాజులుగానుండి ప్రభుత్వము చేయుచుండిన వారు తమ పేర్లకు చివర క్షత్రియ లాంఛనమైన "వర్మ" శబ్దము నుంచుకొనుచు క్రమక్రమముగా తాము క్షత్రియులమనెడి భ్రాంతిలో పడిరి. రాజకీయోద్యోగులైన బ్రాహ్మణులకుండిన నియోగబ్రాహ్మణ పదము కుదింపబడి"నియోగులని పిలుచుకొనుచుండిరి. క్రమక్రమముగా బ్రాహ్మణ ప్రభుత్వము లంతరించి విజాతీయుల ప్రభుత్వము లేర్పడుటతో నియోగ వైదిక శాఖలు దృఢమైనవి. నియోగులు విజాతీయప్రభుత్వములలో గూడను మంత్రులుగాను, రాష్ట్ర, గ్రామాధికారములను బొందుచు క్రమక్రమముగా బ్రాహ్మణధర్మ మాచరింప మాని వైదికుల పరము చేయుచుండిరి. విజాతీయుల సంపర్కమున బ్రాహ్మణాచారములుకూడ నియోగులలో తగ్గిపోయెను. ఆచార సంపత్తులు సక్రమముగా జరుపనందున నియోగుల యిండ్లలో

వైదికులు భుజించుట మాని స్వాంతముగా పాకము చేసుకొని భుజించుచుండిరి. తమ స్థితి తమకు బాగుగా తెలిసియున్నందున తాము అధికారములోనుండి ఐశ్వర్యయుతులుగా నుండినను వైదికధర్మమును గౌరవించుచుండిరిగాని యెట్టి అసూయను చెందియుండలేదు. కాలము గడువగా "నియోగులు" తాము "కరణము" లను వేఱు శాఖగా నెంచుకొనుచు తమ బ్రాహ్మణత్వమునే మఱచిరి. ప్రథమమున బ్రాహ్మణులైయుండియు ధర్మసంరక్షణార్థము క్షాత్రమవలంబింప జేయబడి దేశసంరక్షణమందు నియోగింపబడి రాజులుగాను, మంత్రులు, సేనాపతులు, సైనికులుగాను, గ్రామ, నగర, రాష్ట్రపరిపాలకులుగాను దేశపరిపాలనము చేసియున్నందునను, అట్టిరాజులతోను, వారి కుటుంబములతోను చేరియున్నందున రాజశబ్దము వారిపేర్లకు చివర చేర్చబడినది. రాజులైనవారు "శర్మ" శబ్దమునకు బదులు క్షత్రియలాంఛనమైన "వర్మ" శబ్దము నుంచుకొనుచువచ్చిరి. రానురాను తాము క్షత్రియులమనెడి భ్రాంతిలోపడిరి. క్రీ॥శకము పదవశతాబ్దమునాటికి తాము సూర్య, చంద్రవంశ క్షత్రియశాఖలకు చెందినవారమని శాసనములలో వ్రాయించుకొన మొదలిడిరి. పదవశతాబ్ద ప్రారంభము వరకట్టి వ్రాతలు లేవు. కాని వారిలోను సామాన్యజనులందరు యెటుచెప్పుటకు దోచక "కరణముల" మని మాత్రము చెప్పుకొనుచుండిరి. గ్రామములలో నియోగులు బ్రాహ్మణులనగా వైదికులనియు తాము కరణములమనియు చెప్పుచుండిరి.

"The Niyogis are not referred to by the name Brahmin, Vaidikis being so called. Even Niyogis themselves point to Vaidikis when asked about Brahmans."

(Castes and Tribes of Southern India—By E. Thurston Vol. I Page 365 Ed. 1909)

తా॥ నియోగులు బ్రాహ్మణనామమున పిలువబడుటలేదు. వైదికులు బ్రాహ్మణులుగా పిలువబడుచున్నారు. బ్రాహ్మణు లెవరని ప్రశ్నింపగా నియోగులే వైదికులను చూపెదరు. అని వ్రాయబడినది.

వారే వారికులమును మఱచి క్షత్రియుల మనుకొనె స్థితియం దుండగా వారితో భోజనములుమాని, సంబంధ బాంధవ్యములు లేక యుండిన శ్రోత్రియబ్రాహ్మణులు ప్రమాదపడి వారు క్షత్రియులని యూహించుటలో తప్పేమియు లేదు. బ్రిటిషుప్రభుత్వములో రాజ్యములు, మంత్రిత్వములు, రాష్ట్రపాలకత్వాదియుద్యోగములు పోయి కచేరీలలో సామాన్యగుమాస్తాలు, గ్రామకరణములు, రివిన్యూ యిన్స్పెక్టరులు, తహశ్శీల్దారు మొదలగు నల్పాధికారములుగల యుద్యోగములు సంప్రాప్తించినవి. ఒక నియోగబ్రాహ్మణులే గాక, వైదికులు, మిగత యితరకులములవారును యుద్యోగులగుచుండిరి. ఇట్టి స్థితిలో గొప్పయుద్యోగములు లేనందున లౌకిక గౌరవము తగ్గిపోయినది. వైదికధర్మనిష్ఠ యేనాడో వదలిపోయినందున వైదికధర్మ నిష్ఠులగు బ్రాహ్మణసంఘములో గౌరవము సన్నగిలినది. వైదికులు వీరిని కరణములనియు, ఐశ్వర్యయుతులుగాగాని, గొప్పపదవులలోగాని యుండిన వారిని "నియోగప్రభువు"లనియు ఆశ్రయించి కాలము పుచ్చుచుండినను, బ్రాహ్మణసంఘములో రెండవ స్థానమిచ్చుచుండిరి.

## పాశ్చాత్య విద్య

క్రమక్రమముగ హూణవిద్యాభ్యాసమెచ్చిన కొలది పెద్దల తిరస్కారము, వేదశాస్త్రములయందు విశ్వాసము తగ్గుట, పరలోక భయముపోవుట ప్రారంభించి నాస్తికత్వము హెచ్చినది. "నాస్తికుడ" నగా దేవుడు లేడనువాడు కాదు "నాస్తికో వేదనిందకః" నాస్తికుడనగా వేదమును నిందించువాడని అర్థము. పాశ్చాత్యులచే వ్రాయబడిన తప్పుడు చరిత్రలలో ఆర్యులెచ్చటనుండియో యీదేశమునకు మూడు, నాలుగు వేలసంవత్సరముల క్రింద వచ్చుట, ఋగ్వేదము క్రీ॥ పూ॥ 1200 సం॥రములో వ్రాయబడుట, పిమ్మట క్రమక్రమముగా మిగత వేదములు వ్రాయబడుట, ఆపిమ్మట శాస్త్రములు, స్మృతులు, వ్రాయబడుటయు, మొన్న మొన్న క్రీస్తుశకము మొదటిశతాబ్దమునకు పిమ్మట మహాభారతము, ఆపిమ్మట రామాయణము, పురాణములు వ్రాయబడుట మొదలుగాగల యసంగత, అనృతప్రసంగము

లతో గూడిన చరిత్రలు వ్రాయబడి పాఠశాలలలో పిల్లలకు నేర్పబడు టతో వేదశాస్త్రనింద చేయు నాస్తికులుగా తయారైరి. కృతయుగాది నుండి భారతజాతియందు గల వివిధవర్ణములవారును యొకరి నొకరు గౌరవించుకొనుచు యొకరి కొకరు సహకారులుగా ప్రవర్తించుచు సుఖించుచుండిరి.

హూణవిద్యాభ్యాసముతో పరిస్థితులు తలక్రిందైనవి. "ఆత్మ గౌరవము" సంఘగౌరవము" అనెడి భావములు వృద్ధిబొందినందున తాను గౌరవింపబడవలయు ననుభావమున యితర గౌరవము మరువ బడినది. తన కులగౌరవము ముందు యితరకులముల గౌరవించుట మానిరి. క్రమక్రమముగా యీభావము "ఆత్మస్తుతి" "పరనింద"గా పరిణమించి యితరసంఘనాశనముమీద తమ సంఘాభివృద్ధిగలదని అన్నికులములవారును భావింపదొడగిరి. తమకంటె తెలివిగలసంఘ మును క్రిందకు దిగలాగియు, తమకంటె ధనవంతముగా నున్న సంఘ మును దోచుకొనియు వానిని తమతో సమానము జేయజూచుచుండెరి. కాని తాము విద్యనార్జించి తెలివిగల వారిని మించవలెననిగాని, తాము కష్టించి మితజీవనము చేయుచు ధనమార్జించి ధనవంతులము కావలయుననిగాని కాదు. ప్రజలలోని యీభావప్రకోపము దేశమంతట నావరించి రాజ్యనిర్వాహకులయందుకూడను మార్పును కలుగజేసి నది. లౌకిక సంబంధము లిట్లుండగా మతసంబంధముకూడను తలక్రిందు లైనది. హిందూజాతియందు నాస్తికబుద్ధి తగ్గినందున వేదశాస్త్రాధ్యయ నము చేయువారిని గౌరవింపక వారిని నిరుత్సాహపరచుచుండిరి. ఈ విధమైన నాస్తికభావములు ప్రజలలో ప్రబలినందున ప్రాచీనశాస్త్ర ములు నధ్యయనము జేయువారు తగ్గిపోవుచుండిరి. <u>భారతదేశము ప్రపంచములో గౌరవమును పొందుచున్నదీ ప్రాచీన విద్యలను గలిగి యుండుటవలననే యనెడి విషయమును ప్రజలు మఱచుచున్నారు.</u> భారతీయుల వేదశాస్త్రాదివిద్యలు మానవులచే అధ్యయనముచేసి కాపాడబడవలసినవిగాని గ్రంథస్థముచేసి బీరువాలలో పెట్టి కాపాడి నంత మాత్రమున కాపాడబడవు. అట్లు గ్రంథస్థము చేయబడి దాచి

యుంచబడిన యితర దేశములలోని ప్రాచీన విద్యలన్నియు రెండువేల సం॥రములలో పేరు లేకుండ నశించినవని మనకు యితర దేశచరిత్రలు చెప్పుచున్నవి. ముఖస్థముగా నుండుటకు వీలుగాక గ్రంథస్థము చేయబడిన శాస్త్రములన్నియు భారతదేశములోనే నశించి పోయినవి. ముఖస్థముగా చేయబడి జీవితకాలమంతయు వల్లించబడుచుండిన వేదములు మాత్రమే యీరోజువరకు బ్రాహ్మణజాతీయుల యనుగ్రహమున సజీవముగా నిలువగలిగినవి. దేశవిప్లవ కాలములందు తమహృదయము లందు దాచి మంచికాలము రాగా వేదాది విద్యలను యీ బ్రాహ్మణ జాతీయులు లోకమున కనుగ్రహించుచుండిరి. విషయసుఖములను త్యజించి యత్యంత మితజీవనము నలవర్చుకొని యీ బ్రాహ్మణులు సృష్ట్యాదినుండియు వేదవిద్యలను కాపాడుచుండిరి. గనుక బ్రాహ్మణులలో యిటీవల లౌకికావసరముల నిమిత్తం కల్పింపబడిన శాఖలన్నియు నేకమై వేదశాస్త్రాదులను యీదుష్కాలమున తిరిగి కాపాడుకొనుట త్యావసరము. వైదికధర్మమునకు హానికలిగిన కాలముననే బౌద్ధులైన మౌర్యవంశము వారిప్రాబల్యము నంతరింపజేసి "శుంగ"వంశ బ్రాహ్మణులు రాజ్యాధికారమును చేబూని వైదికధర్మమును తిరిగి ప్రతిష్ఠించిరి. వారికి పిమ్మట "కాణ్వ" బ్రాహ్మణవంశీయులును, అటు పిమ్మట "ఆంధ్రశాతవాహన" వంశీయులును రాజ్యాధికారమును వహించి వేదశాస్త్రాదివిద్యలను, వైదికధర్మమును, శిల్పాదికళలను కాపాడిరి. ఆంధ్రవంశమంతరించి ధర్మహాని కలుగనుండిన కాలమున గుప్తరాజులు ధర్మహాని లేకుండునటులజేసిరి. అటు పిమ్మట బ్రాహ్మణ సంఘమునుండి యొకభాగము వేరుచేయబడి ధర్మసంరక్షణార్థమును, ప్రజాక్షేమము నిమిత్తమును నియోగింపబడినది. అట్లు నియోగింపబడిన బ్రాహ్మణులే "బ్రహ్మక్షత్రి"లనియు "నియోగబ్రాహ్మణుల"నియు పిలువబడుచుండిరి. ఈ బ్రహ్మక్షత్రి లేక నియోగబ్రాహ్మణులను విభాగము శాతవాహనరాజవంశాంతమున కలిగినది. అనగా క్రీ॥ పూ॥ నాలుగు, అయిదు శతాబ్దములయం దేర్పడినది. అంతకు ముందు బ్రాహ్మణులలో నీవిభాగము లేదు. శాతవాహనుడను బ్రాహ్మణరాజుల రాజ్యకాలము చివరశతాబ్దములలో వచ్చియున్నది. అది యొక కార్య

సాధననిమిత్త మేర్పడినది. ఇప్పుడా కార్యము తీరిపోయినందున యీ విభాగమునంతరింపజేయుట మంచిది. 'వైదికులు', 'నియోగులు' అనునవి రెండుకావు. వారు యొకేవర్ణస్థులైన బ్రాహ్మణులు. బ్రాహ్మణులలో వైదికులు, నియోగులను భేదము రాజ్యాధికారమును పొందిన ఆంధ్ర బ్రాహ్మణులలోనే గలదుగాని అరవ, కన్నడ, దేశబ్రాహ్మణులలో వుండియుండలేదు.

## శ్రోత్రియులు

బ్రాహ్మణజాతియొక్క ప్రత్యేకత లేనినాడు వేదశాస్త్రాదులు గ్రంథములయందు మాత్రమే యుండగలవు. బ్రాహ్మణులు ఒక్క భారతదేశమునకే గాక ప్రపంచమంతటికిని జ్ఞానదాతలైయున్నారు. సృష్ట్యాదినుండియు మానవజాతికి జ్ఞానమును, నాగరికతను, శాంత శమదమాది గుణ సంపత్తి నొసంగగల ఆధ్యాత్మిక విషయములను, ఐహికాముష్మిక సుఖసాధనంబులగు యితరోపాయములను ప్రసాదించినదీ బ్రాహ్మణజాతియే యైయున్నది. ఇందునుగురించి మాక్సుమూలరు పండితునిచే వ్రాయబడిన వాక్యము లుదాహరింపబడుచున్నవి.

"Wherever the European mind has risen into heights of Philosophy, it was done so, because the Brahmin was the pioneer. There is no intellectual problem in the West which had not its earlier discussion in the East and there is no modern solution of that problem which will not be found anticipated in the East."
(India What Can it teach us.)

తా॥ పాశ్చాత్యుల బుద్ధితత్త్వ చింతనములో నెంతెంత యభివృద్ధిని బొందుచున్నట్లు కాన్పించుచున్నదో, అదియంతయు, మహామేధావియగు బ్రాహ్మణుడు మార్గదర్శకుడగుటవలననే యైయున్నది.

తూర్పున ఇండియాలో పూర్వము (బ్రాహ్మణులవలన) విచారణ కాని విజ్ఞాన సంబంధమైన యే సమస్యయు పాశ్చాత్యదేశములో విచారణకు

వచ్చియుండలేదు. అట్టి సమస్యా పరిష్కారములు తూర్పున ఇండి
యాలో ముందుగా పరిష్కరింపబడక నిలచియుండి ఆధునికులచే
పరిష్కరింపబడిన వేమియు లేవు. (అనగా సమస్తమైన విజ్ఞాన పరి
ష్కారములు ఇండియాలో బ్రాహ్మణులచే పూర్వమే పరిష్కరింపబడి
యున్నవని తాత్పర్యము).

"Much ancient Sanskrit lore will be lost for ever when that race of Srotriyas becomes extinct.

(India What Can it teach us P. 210)

తా॥ ఇండియాలోని "శ్రోత్రియులుగా నుండు బ్రాహ్మణజాతి
యంతరించినయెడల అతి ప్రాచీన వాఙ్మయములో గొప్ప భాగము
శాశ్వతముగా నశించిపోవును" గనుక వారిని కాపాడుకొనుటత్యావస
రమని మాక్సుమూలరు మహాశయుడు ఐరోపీయులను, భారతీయులను
గూడను హెచ్చరించియున్నారు. అదే ప్రకారం యీ అరువది డెబ్బది
సంవత్సరముల కాలములో వేదాధ్యయనపరులగు బ్రాహ్మణులలో
నూటికి తొంబదిమంది అంతరించియున్నారు. ఆనాటికుండినవారిలో
నూటికి పదిమంది మాత్రమే యిప్పుడు మిగిలియున్నారు. ఇంకొక
యిరువది సంవత్సరములలో యీ కొద్దిమందికూడను అంతరించునట్లు
కనుపించుచున్నది. అధర్వణవేదము నధ్యయనము చేయగలవారినాడు
చూచిన ఇండియాదేశము మొత్తముమీద కాశీలో యొక్కరు
మాత్రము మిగిలియున్నారు. అధర్వణ వేదము గ్రంథములయందు
భద్రపరుపబడి యున్నను దాని నధ్యయనము జేయునగు విధాన మంత
రించి పోవుచుండినందున ఆంధ్రరాష్ట్ర బ్రాహ్మణ సభవారు 1948సం॥
రములో ఆంధ్రదేశమునుండి యొక యజుర్వేద క్రమాంతస్వాధ్యాయి
యైన బ్రాహ్మణుని కాశీకి పంపి అధర్వణ వేదాధ్యయన పరునియొద్ద
ఒక సంవత్సరము అధర్వణవేదాధ్యయనము చేయించిరి. వారిందు
తీర్ణులై వచ్చి యిచ్చట విద్యార్థులకు అధర్వణ వేదమును చెప్పు
చున్నారు. ఈ విధముగా తిరిగి బ్రాహ్మణులును, దేశములో ప్రజలును,
ప్రభుత్వమువారును పూనుకొని వేదశాస్త్రాధ్యయనము చేయగల
బ్రాహ్మణ కుటుంబములను కాపాడుకొనుట శ్రేయము. అట్లు కాని

యెడల వేదశాస్త్రాది విద్యలు సంపూర్ణంగా నశించగలవు. ప్రపంచ మంతటికి గురుస్థానము వహించగల గౌరవ మీ భారతవర్షమునకు గలుగుటకే వేదశాస్త్రాది ప్రాచీన విద్యలును వాని నధ్యయనముచేసి లోకమున కెప్పటికప్పు డనుగ్రహించుచుండిన బ్రాహ్మణ జాతీయులును కారణములు. ప్రపంచ మందరివలనను పూజ్య భావముతో జేర్కొనబడుచుండిన సంస్కృతభాషను, ఆభాషయందుగల వేదాది విద్యలను, వాని నధ్యయనముజేయగల బ్రాహ్మణజాతీయులను కలిగి యున్నందుకు యీ భారతజాతి గర్వించవలసియున్నది.

"No country except India and no language except the Sanskrit can boast of a possession so ancient or venerable. No Nation except the Hindus can stand before the world with such a sacred heirloom in its possession, unapproachable in grandeur and infinitely above all in glory. The Vedas stand alone in their solitary splendour, serving as a beacon of divine light for the onward march of humanity."

(Hindu Superiority P. 180)

తా॥ "ఇంత ప్రాచీనము, ఇంత పూజనీయమైన సొత్తు భారతవర్షమందు దక్క అన్య దేశములందును, సంస్కృతభాషలో దక్క అన్య భాషలందును, గానరాదు. మహత్త్వములో వేదములకు సాటిలేనే లేదు. వాటి మహిమాతిశయము నిరుపమానము. వాని దివ్యప్రకాశ మద్వితీయము. అవి దివ్య కాంతుల ప్రసరింపజేయుచు, మానవసంఘ పురోగమనమునకు మార్గదర్శకములై వెలుగుచున్నవి. ఇవి హిందువుల యదృష్టమువలన వారికి వంశక్రమేణ ప్రాప్తించిన నిక్షేప విశేషమని చెప్పవచ్చును ఇట్టి పవిత్ర ద్రవ్యము మాకుగలదని సగర్వముగ జాటింపగల భాగ్యము హిందువులకే దక్కినదిగాని యన్యులకు సాధ్యమగునే." అని యనేకమంది పాశ్చాత్య విద్వాంసులు నిర్ఘాంతపడి ఆశ్చర్యముతో నుడువుచుండిరి.

## వేదశాస్త్రాది ప్రాచీనవిద్యల సంరక్షణము

ప్రపంచమందన్ని దేశములలోగల బుద్ధిమంతులగు పండితులచే బాగ త్తను గాంచుచున్న వేదశాస్త్రాది సంస్కృతవాఙ్మయమును పొంది దానిని కాపాడుకొనుచు లోకమున కనుగ్రహించుచుండిన బ్రాహ్మణసంఘమిూ కలికాలప్రారంభముననే కేవలముదరపోషణార్థమై యితరవిద్యలను నేర్చుచు వేదవిద్యను పరిత్యజించుట బ్రాహ్మణసంఘమునకు, భారత దేశమునకును పతనకారణమగును. గనుక ప్రజలందరును ప్రభుత్వమువారును భక్తిశ్రద్ధలతో వేదశాస్త్రాది వైదిక వాఙ్మయమును, బ్రాహ్మణజాతిని, సంస్కృతవిద్యను కాపాడుకొనుట ధర్మము, దేశాభ్యుదయకరమునై యున్నది.

ఈకాలమున మనము చేయవలసిన పని బ్రాహ్మణులలోని అంతశ్శాఖలన్నియు పరస్పరవైమనస్యభావములు లేక యేకసంఘముగా నేర్పడి ప్రాచీనవిద్యలైన వేదశాస్త్రాధ్యయన వ్యాప్తికొరకు కృషి చేయుటత్యవసరము. లౌకికవృత్తితో కాలక్షేపము చేయుచుండెడి బ్రాహ్మణులు తమ సంపాదనలో పదహారవవంతు సొమ్మును ప్రత్యేకించి యొకచోట చేర్చి దాని సంరక్షణమున కొరకు బ్రాహ్మణసభ నేర్పాటు చేసి ప్రతిరాష్ట్రమందును వేదశాస్త్రాధ్యయనము చేయువారి కుటుంబములకు తగు జీవనమును కల్పించుట ముఖ్యావసరము. అపిమ్మట ప్రజలందరయందైకమత్యము నెలకొలిపి వేదవిద్యల నధ్యయనము చేయు బ్రాహ్మణులందరిని పోషింపదగు విధమున ద్రవ్యాదులను సమకూర్చి యధ్యయనపరులను పోషించుటత్యవసరము.

గతకాలమున ప్రజలందరును తమకొరకే బ్రాహ్మణులు వేదాధ్యయనము చేయుచున్నారనియు వారికి కించిద్ద్రవ్యము నొసంగిన తమకు పురుషార్థహేతువగుననియు అట్టివారిని పోషించుట తమధర్మమనియు తలచి వేదాధ్యయనము చేసినవారి నాదరించి భక్తిశ్రద్ధలతో పూజించి వారిని నాలుగుకులములవారును గౌరవించుచుండెడివారు. ఇప్పుడట్లుగాక హూణవిద్యాభ్యాసమున నాస్తికభావములు పట్టుబడినందున అధ్యయనపరుల నాదరింపక మానిరి. బ్రాహ్మణులలో పరస్పరవైరుద్ధ్యములు గలవారలై యొక శాఖవారింకొక

శాఖీయులను సత్కరింపకుండిరి. హూణవిద్యనభ్యసించి లౌకిక వ్యాపారమున ధనార్జనము చేయుచుండినవారలలో హెచ్చుమంది బైటికి వేద శాస్త్రాదులయందాదరబుద్ధి గలిగియున్నటుల మాటలాడుచున్నను ఆర్థిక సహాయ మొనర్పకుండుట మనము ప్రత్యక్షముగా చూచుచుంటిమి. వేదాధ్యయనమును బ్రాహ్మణుడు తన పొట్టకూటికే చేయుచుండెనను భావము లోకులయందేనాడు కలిగినదో ఆనాడే బ్రాహ్మణుడు వేదాధ్యయ నాదుల కట్టిపెట్టె వేదమునంతను కంఠపాఠముచేసి జీవితకాలమంతయు శిష్యులకు పాఠముచెప్పుచు, తాను వల్లించుచు ఒక్క పొర్లయినను పోకుండునటుల కాపాడి ముందుతరముల వారికప్పచెప్పెడి తన మేధా సంపద నంతను లౌకిక వ్యాపారము నందుపయోగించి ధనము నార్జించి యితరులమీద యాధారపడకనే జీవింపగలనని లోకమునకు చాటగలుగుచున్నాడు. ఇతరులెవరును సాధింపలేని యుత్తమ కార్య మును సాధింపగలవారి నాదరించి వేదశాస్త్రముల నిలుపుకొనుట నీతియో లేక అసూయాద్వేషములు గలవారలై అట్టివారి నాదరింపక నాకార్యమును భగ్నముచేయుట నీతియో యాలోచించుకొనుడు.

వేదశాస్త్రములకు, బ్రాహ్మణజాతికి, సంస్కృతభాషకు నివి చెడురోజులు. ఆపత్కాలమిది. ఈ సమయమున వేదశాస్త్రాది ప్రాచీన విద్యలను కాపాడుకొనుట కేమిచేయవలయును? అని యెవరును ప్రశ్నించుకొనుచుండినటుల కనుపడదు.

గురువు చెప్పనిది వేదవిద్యలు రానేరవు. దారిద్ర్య మనుభ వించుచు జీవితకాలమంతయు శ్రమచేయవలసిన దైయున్నది. గ్రంథ ములను చూచి చదువతగినవి కావు. తమకధ్యయనమున కవకాశము లేని యీ ప్రాచీన విద్యల నేల ప్రోత్సహించవలయునని యితరకుల ములవారిలో నిరుత్సాహము ప్రబలియున్నది. ఒక్క అధ్యయన విధానం తప్ప వేదమంత్రముల యర్థమును, భావమును సులభమైన భాషలో పురాణేతిహాస రూపమున మానవజాతికంతకు నందీయబడినదిగాని దాయబడియుండలేదు. స్వరాపరాధమున నశించెదరను భయముననే వేదాధ్యయనమునకు హద్దులేర్పఱుపబడుటకు కారణమైయుండనోపు. ఈ హద్దును వేదమే యేర్పరచియున్నది. అది మానవకృతము కాదు.

మును వహించ సమర్థమైన వేదశాస్త్రాదివిద్యలను, అవి వ్రాయబడి యుండిన సంస్కృతభాషను, తాము దరిద్రమనుభవించుచున్నను ప్రాచీనవిద్యాసంరక్షణమె ధర్మముగా నెంచి, దానినంటిపెట్టుకొని నిరంతర అధ్యయనాధ్యాపనముల నొకపాలైనను పోకుండ సస్వరముగా వానిని కాపాడుచుండిన బ్రాహ్మణసంఘమును, యుపేక్షాభావమున జూచుచు, వారియందనూయాపరులై వేదశాస్త్రాది విద్యాపోషణమున విముఖులగుచుండిరి. ఇంతకాలమువఱకే ప్రాచీనవిద్యల నెట్లు స్వచ్ఛముగా కాపాడగలిగిరని పాశ్చాత్యపండితు లాశ్చర్యపడుచుండ వాటిని గ్రంథస్థము చేసి తదధ్యయనపరుల నుపేక్షించుట మహాదోషము. భారతీయుల యందొకసంఘమును ప్రత్యేకించి వేదశాస్త్రాది ప్రాచీన విద్యాసంరక్షణము చేయబడినందువలననే నేటివరకా విద్యలు యెట్టి స్వల్పమార్పులేకుండునట్లు స్వచ్ఛముగా కాపాడబడిన వను సంగతి నీజాతి మఱువకూడదు.

ఇందును గురించి మాక్సుమూలరు పండితుడిట్లు ఆశ్చర్యముతో వ్రాసియున్నాడు:

"The Sacred Hymns of the Brahmins stand unpalleled in the literature of the whole world and their preservation may well be called miraculous."

తా॥ "బ్రాహ్మణులయొక్క పవిత్రములగు మంత్రములు ప్రపంచవాఙ్మయము నందద్వితీయములై విలసిల్లుచున్నవి. నేటివఱకు వాటిని స్వచ్ఛముగా కాపాడిన పద్ధతి మహిమాన్వితవిషయమని చెప్పవలసియున్నది." అని ఆశ్చర్యముతో నుడివియున్నాడు.

అందువలన వేదశాస్త్రాది ప్రాచీనవిద్యలు నశించుటకు హేతువగుచున్నది. ప్రపంచ గౌరవ హేతువైన యీ ప్రాచీన విద్యల నశింపు చేసుకొని వీరేముఖము పెట్టుకొని ప్రపంచమును చూడగలుగుదురు? ఇతర దేశీయులకన్న యిప్పుడు వీరైశ్వర్యవంతులుగా లేరు. వ్యాపారములోగాని, వృత్తి విద్యలలోగాని ప్రకృతి శాస్త్ర సంబంధమైన ఐహిక సుఖ సాధనంబులు మొదలైనవానిలోగాని ప్రపంచములో

వీరిదాఖరుస్థానమై యున్నది. ప్రపంచ గౌరవమునకు మూలమైన వేదశాస్త్రాది విద్యలయందును, నిరంతరము వాని నధ్యయనము చేయుటలో తమ జీవితమునంతను యర్పించగలిగిన బ్రాహ్మణజాతి యందును అసూయా ద్వేషభావములతో గూడిన వారలై తమ ప్రాచీన విద్యలను నశింపు జేయుటకు కారణభూతులగుచు, ప్రపంచమునకు తమయందుగలిగియున్న గురుభావమును బోగొట్టుకొనుచుంటిమను సంగతిని గ్రహింపకుండినందుకు విచారించుచుంటిమి. ఇట్టి వైషమ్యభావముల నొదిలి భారతీయులు తమ నిక్షేపమైన వేదశాస్త్రాది ప్రాచీన విద్యలను, వాని సాంప్రదాయములను, అవి వ్రాయబడియున్న సంస్కృత భాషను, వాని నధ్యయనము చేయుచు, శిష్యులచే నధ్యయనము చేయించుచు అల్ప సంతోషులై నిత్య సంతుష్టులై యుండెడి బ్రాహ్మణులను కాపాడుకొని ప్రపంచ గౌరవమును నిలుపుకొందురుగాక !

ప్రాచీన విద్యలు నశించిన ప్రపంచమందన్ని జాతులకును తీరని నష్టము వాటిల్లగలదు. గనుక భారతీయులు మాత్రమేగాక ప్రపంచమందన్ని జాతులవారును యీ ప్రాచీన విద్యా సంరక్షణమందు శ్రద్ధ వహించులాగున భారతీయులలో బుద్ధిమంతులు, సమర్థులగువారలందరు నేకీభవించి పనిచేయుదురుగాక !— ప్రాచీన విద్యాసంరక్షణమందభిమానముగల హైందవ హూణ విద్యాధికులు ప్రయత్నించిన తప్పక యీ దేశములోననే తగినంత ద్రవ్యము చేకూరగలదు. లేనియెడల వీరమెరికా మొదలైన పాశ్చాత్యదేశములలో పనిచేసి యిట్టి సత్కార్యమున కనేక కోట్ల ద్రవ్యమును సమకూర్చి వేదశాస్త్రాది ప్రాచీన విద్యలను పోషించి వాని నిలుపుకొనుట మేలు.

సృష్ట్యాదినుండియు నేటివరకు వేదశాస్త్రాది విద్యల నధ్యయనము చేయుటలో నాగ తేరిన బ్రాహ్మణులు దాని నుపేక్షించి వదలిరి. ఇఁకను వేదశాస్త్రాదివిద్యలను నధ్యయనముచేసి తిరిగి వప్పగించగల మహామేధావులుదయించుటకల్ల ఇంతటితో నీ విద్యలంతరించి పోవలసినవే. ఇతర సంఘములవారెవరును దీనిని సాధించ లేరు. 195 కోట్ల సం॥రముల నుండియు వంశపరంపరావచ్చునుండిన సంస్కారము బ్రాహ్మణ

జాతియందు ప్రస్ఫుటమై లోకుల నీనాడును నాశ్చర్యము గొలుపుచున్నది. ఇప్పుడు పేక్షించి యీసంఘమును బోగొట్టుకొనిన తిరిగి యిట్టి సంఘమును తయారుచేయగలరా? యని ప్రశ్నించుచున్నాము. తమ జాతియందిట్టి అపూర్వప్రజ్ఞాసమన్వితమైన సంఘమొకటి యున్నందుకుప్పొంగుచు దానిని కాపాడుటయే గాక అట్టి మేధాసంపదవృద్ధి యగునటుల పోటీ పరీక్షలు పెట్టి ఒక వేదమును వల్లించి వప్పగించగల వారిని, రెండు వేదములను, మూడు వేదములను, నాలుగు వేదములను వప్పగించగల వారినిగా తయారుచేసి చూచి యానందింపవలసిన యీభారతజాతి వారి నసూయాద్వేషములతో చూచి నా విద్యలు నశింపుచుండగా నానందించుచు బ్రాహ్మణుల నేమో సాధించుచుంటిమని భ్రాంతిని చెందుచుండిరి గాని సృష్ట్యాదినుండియు ప్రపంచములో నగ్రస్థానము వహించుచుండిన భారతజాతి గౌరవమును నేడు మట్టిలో గలుపుకొనుచుంటిమని తెలుసుకొనలేని అజ్ఞానములో పడినందుకు విచారించవలసియున్నది. వేదవిద్యల నొదిలి ప్రాపంచిక విద్యల నార్జించిన బ్రాహ్మణులు యితరుల కెవరికిని తీసిపోక ప్రాపంచిక వ్యవహారములలో గాని ఐశ్వర్యాదుల సంపాదనయందుగాని సమర్థులుగా నుండుట మనము చూచుచుంటిమి. ఇక వీరు బ్రాహ్మణులను సాధించినదేమి? వేదశాస్త్రాదిప్రాచీన విద్యానాశనమునే గద! ప్రాచీన విద్యల నధ్యయనము చేసినవారిని, పోషించుట ద్వారా అధ్యయన కళను కాపాడుకొనక పోయిన యిక నొకటి రెండుతరములలో నీ విద్యలు పూర్తిగా నశించిపోవును. అనగా వానినిప్పుడధ్యయనము చేయువారి సంతానముగూడను లౌకిక విద్యలకు మరలి వేదాధ్యయనము నొదల గలరు. ప్రాచీనవిద్యలు చదివినవారలే తమ జీవనమున కితరుల నాశ్రయించి శ్రమపడుచుండిరిగాని వాని నొదిలి వ్యాపారాదులలోనికి దిగినవారు యితరులకంటె యెక్కువగనే సుఖించుచుండిరి. బ్రహ్మవిద్యనే సాధింపగలిగిన వీరికి అల్పమైన లౌకిక విద్యలను, వృత్తులను సాధించుట సులభమేగాని కష్టముకాదు. వేదశాస్త్రాది విద్యలు జీవు లందరి నిమిత్తము బ్రాహ్మణు డధ్యయనము చేయుచున్నాడుగాని తన పక్కడికొరకును కాదు. తాను

దరిద్ర మనుభవించుచు ప్రపంచ భోగముల నొదిలి తన జీవితములో నాల్గవవంతుకు మించిన కాలము వాని నార్జించుటకును, మిగత యాయుశ్శేషము అందు జెప్పబడిన, లోకులందరకు సుఖసాధనంబులైన కర్మల నాచరించుచు, తాను విశేష శ్రమతో నార్జించిన వేదాధ్యయనాదులు మఱపురాకుండునటుల తిరిగితిరిగి నిత్యము ఆవృత్తులు చెప్పుకొనుచు, శిష్యులకు పాఠప్రవచనములు చేయుచు జీవితమంతయు నా విద్యావ్యాసంగమున గడుపుచు, యొక్క పొల్లయినను తప్పు రాకుండునటుల సస్వరముగా వేదమును కాపాడగలుగుచున్నాడు. అందువలన వారి పోషణ సంఘమంతయు చేయవలసిన బాధ్యత యైనది. న్యాయముగా తామాచరించవలసిన ధర్మమును భారత జాతి ద్వేషాసూయలతో గూడినదై యేనాడుపేక్షించి బ్రాహ్మణుడు తన పొట్టకొరకు వేదాధ్యయనమును చేయుచున్నాడని యెంచి నదో ఆనాడే బ్రాహ్మణుడు దానినొదిలి తన పోషణకు స్వాతంత్ర వృత్తుల నవలంబించి లౌకిక వృత్తులలో యితరులకు తీసిపోనని లోకమునకు చాటగలుగుచున్నాడు. ఈ వైషమ్య భావమున గలిగిన ఫలితమేమి ? దేనిని గలిగియుండుటవలన భారతజాతికి నాగరికత, ఇహలోక పరలోకజ్ఞానములు మొదలుగా సమస్త జ్ఞానములు కలిగినవో, దేనిని చూచి లోకమంతయు అతి పురాతనకాలమునుండియు భారతజాతిని బొగడుచు వీరి సహాయ మర్థించుచూ తాము వృద్ధిబొందుచుండిరో తమకు, లోకమునకు మహోపకారములైన వేదశాస్త్రాది ప్రాచీన విద్యల నాశనమునే యీ సంఘ వైషమ్యమున వీరు సాధింపగలిగినది. శాంతచిత్తులై భారతీయు లిప్పటి తమలోని వివిధ సంఘస్థితుల నాలోచించుకొనిన నిజము తెలుసుకొనబడి ప్రాచీన వేదశాస్త్రాది విద్యలను గ్రంధరూపమున గాక సజీవ గ్రంధము లనదగి, సృష్ట్యాది నుండియు వంశ పరంపరా వచ్చుచుండిన సంస్కారములతో గూడి వేదశాస్త్రాది విద్యల నధ్యయనము చేసి కాపాడగలిగిన తమలోని బ్రాహ్మణ సంఘ ప్రత్యేకతను కాపాడి వారిని పోషించుకొనుచు తమకు, లోకమునకు క్షేమము నొనగూర్చుదురుగాక !

# పాశ్చాత్యపండితుల వేదస్తుతి

మాక్సుమూలరు పండితుడు :—

"The Vedic literature" opens to us a chapter in what has been called the education of the human race, towhich we can find no parallel anywhere else.

(India-What can it teach us? Page 89.)

తా॥ "మానవసంఘముయొక్క విద్యాభ్యాసములో జతుర్వేదములును, తత్సంబంధమైన వాఙ్మయమును ప్రత్యేకాధ్యాయమని చెప్పనగును. ఎక్కడను దీనికి తులదూగునది లేదు."

"In the History of th world, the Vedas fill a gap which no literary work in any other language could fill." (Wilson's Essays Vol. III Page 339.)

తా॥ "ప్రపంచచరిత్రములో వేదములు లేనియెడల అట్టికొఱతను దీర్పగల యింకొక గ్రంధమే యితరభాషలలోను గాన్పింపదు."

"I maintain that to everybody who cares for himself, for his ancestors, for his history, for his intellectual development, a study of Vedic literature is indispensable." (India, What can it teach us? P. 121.)

తా॥ "తననుగూర్చియు, తనపూర్వులగూర్చియు, తన చరిత్రమునుగూర్చియు, తనబుద్ధి వికాసమును గూర్చియు, లక్ష్యముగలవాడెవ్వడును వేదసారస్వతమును బఠింపకుండ జనదని నా నిశ్చితాభిప్రాయము."

"The Vedas are the oldest of books in the library of Mankind."

తా॥ "లోకములో నెల్ల వేదములు ప్రాచీనతమ గ్రంధములనుట నిర్వివాదము."

'మాన్సు, లీయర్ డెల్బాన్' అనుపండితుడు :—

"There is no monument of Greece or Rome" he asserts, "more precious than the Rig-Veda."

(Paper on the Vedas read before the International Literary Association at Paris, 14 July 1884).

తా॥ "యవనరోమక రాష్ట్రముల పూర్వ్యాన్నత్య స్మారక చిహ్నములలో ఋగ్వేదముకంటె ప్రశస్తములైనవి లేవని నొక్కి వక్కాణించుచున్నాను."

(Prof. Valtaire) వాల్టేయురను పాశ్చాత్యపండితుని కొకరు యజుర్వేదమును బహూకరింపగా నాతడిట్లనెను.

"It (the Yajur Veda) was the most precious gift for which the West had been ever indebted to the East." (Wilson's Essays Vol. III Page 304.)

తా॥ "తూర్పునుండి (అనగా భారతదేశమునుండి) పాశ్చాత్త్యులకు వచ్చిన యమూల్య బహుమానములలో నిది యుత్తమమైనది. వారి ఋణము పాశ్చాత్త్యులెన్నడును దీర్చుకొనజాలరు."

మాక్సుమూలరుపండితుడు :—

"It (a new world of ancient Vedic literature) possesses one charm, it is real, it is of natural growth, and like everything of natural, I believe it had a hidden purpose, and man intended to teach us some kind of lesson that is worth learning, and that certainly we could learn nowhere else."

తా॥ "వైదిక వాఙ్మయమందొక యందమున్నది. అది సత్యము. అది స్వాభావికాభివృద్ధి గలది. అందు నిగూఢమైన ప్రయోజనమున్నది. ప్రపంచ మందెందును తెలుసుకొనలేని అమూల్య విషయములను మనమా వేదములో తెలుసుకొనగలుగుదుము."

'మాతృశ్రీ బ్లావెట్‌స్కీ':

"Nor can Science ever solve the problem of the origin of man if it rejects the evidence of the oldest records in the world."

(The Secret Doctrine—By Madam Blavetsky 3rd and revised edition 2nd Vol. Page 20.)

తా॥ ప్రపంచములోకెల్ల పురాతన దస్తావేజు లనదగిన ఋగ్వేదాదులను తిరస్కరించినయెడల మానవుని యుత్పత్తిని గురించిన సమస్యను ప్రకృతి శాస్త్ర మెన్నటికిని పరిష్కరింపజాలదు.

"It (The Veda) Carries us back to times of which we have no records anywhere and gives the very words of a generation of men whom otherwise we could form but the vague estimate by means of conjectures and inferences. As long as man continues to take an interest in the history of his race, and as long as we collect in libraries and museums the relics of former ages, the first place in that long row of books which contains the records of the Aryan branch of mankind, will belong forever to the Rig-Veda."

తా॥ ప్రపంచంలో యెచ్చటను చరిత్రలేని కాలముకు అది (వేదము) మనను తీసుకొనిపోయి అప్పటి సంతతివారియొక్క మాటలను వున్నదున్నట్లుగా మనకు జెప్పును. వేదమే లేనియెడల అనేక పౌరబాటభిప్రాయములు వసియుండును. ప్రపంచములో మనము ప్రోగుచేయు పుస్తకములు, గుర్తులు మొదలైనవానిలో ఋగ్వేదమునకే అగ్రస్థాన మీయబడును."

(Vide Max-Muller's History of Ancient Literature Page 63 Ed. 1859.)

"The Veda, I feel convinced, will occupy scholars for centuries to come, and will take and maintain for ever, its position as the most ancient book in the library of mankind."

(Vide the Rig-Veda Samhita Translated and Explained — By F. Max-Muller. Vol. I Ed. 1869 Preface Page X.)

తా॥ వేదమును విమర్శించి తెలుసుకొనుటకు శాస్త్రజ్ఞులకు రాబోవు శతాబ్దము లనేకములు పట్టును. మానవజాతియొక్క చరిత్రలో పురాతనమైన గ్రంథముగా యెల్లకాలము గణింపబడుచుండునని నేనొప్పుకొనుచున్నాను."

మాక్సుమూలరుపండితుడు వేదాధ్యయనముయొక్క ప్రాశస్త్యమును గురించి "India, what can it teach us". ("ఇండియా దేశము మనకేమి నేర్పగలదు") అను గ్రంథము 254, 255 పుటలలో

నీ విధమైన ఉపసంహారవాక్యములతో తన గ్రంథమును ముగించు చున్నాడు.

"I feel convinced that, placed as we are here in this life, we have lessons to learn from the Veda, quite as important as the lessons we learn at school.........etc.

"I do believe that not to know what a study of Sanskrit, and particularly a study of the Veda, has already done for illuminating the darkest passages in the history of the human mind, of that mind on which we ourselves are feeding and living, is a misfortune, or, at all events, a loss, just as I should count it a loss to have passed through life without knowing something, however little, of the earth and its geo-logical formation, of the movenents of the sun, the moon, and the stars - and of the thought, or the will or the law, that governs these movements."

తా॥ మనము పాఠశాలలలో నేర్చుకొను పాఠములవంటి అతి ప్రాముఖ్యమైన విషయములను మనము యీజీవితములోనే వేదము నుండి తెలిసికొనవలసియున్నదని నేనొప్పుకొనుచున్నాను.... ... ...

మనమే జ్ఞానమువలన బుద్ధివికాసమును బొంది జీవితమును నడుపుచుంటిమో, మానవుని బుద్ధికందని విషయములను ప్రకాశింప జేయుచుండినట్టిదేదియో అట్టి సంస్కృతభాషను అందుముఖ్యముగా వేదములను చదువకపోవుట దురదృష్టమని నేను గట్టిగా నమ్ము చున్నాను. వేదమును చదువకపోవుట జీవితములో అన్నివిధముల నష్ట దాయకమగు సంఘటన. మనము నివసించెడి యీభూమిని గురించిన జ్ఞానమునుగాని, భూగర్భమేర్పడిన విధానమునుగాని, సూర్య, చంద్ర నక్షత్రాదుల చలనములను గురించిగాని, యిట్టి చలనాదులకు కారణ మగు విధానము లేక శక్తిని గురించిగాని స్వల్పముగానైనను తెలిసి కొనకుండు వాని జీవితమెట్టి వ్యర్థజీవితమో (వేదము చదువని వాని జీవితము కూడను) అట్టి వ్యర్థజీవితమని నేను భావించుచుంటిని.

" The Vedic religion was the only one the developement of which took place without any extraneous, influences and could be watched through a longer series of centuries than ony other religion."

(Max - Muller's India P. 124)

" In India alone, and more particularly in Vedic India, we see a plant entirely nurtured by native air. For this reason, because the religion of the Veda was so completely guarded from all strange infections, it is full of lessons which the student of religion could learn nowhere else." (P. 125)

" I think I may say that there really is no trace whatever of any foreign influence in the language, the religion or the ceremonial of the ancient Vedic literature of India." (P. 140)

తా॥ " ప్రపంచమందలి మతములన్నిటిలో అధిక ప్రాచీనమైనది, బయటనుండి రాబడిన యితర మతములయొక్క యెట్టి పలుకుబడి లేక వృద్ధి పొందబడినది వేదమత మొక్కటియే యైయున్నది."

" కేవలము స్వకీయమైన లేక స్వాభావికమైన వాతావరణములో పెంచబడిన మొక్కను ఒక్క భారతదేశమున అందు ముఖ్యముగా వేదము ప్రాముఖ్యము గాగల కాలమందలి భారతదేశములో మాత్రమే మనము చూడగలిగితిమి. వైదిక మతము బయటనుండి (అన్యదేశములనుండి) రాబడిన అంటువ్యాధులచే (అనగా యితరమత సాంకర్యముచే) చెడిపోకుండ సంపూర్ణముగా కాపాడబడి యున్నందువలన మతవిద్య నార్జింపగోరెడి విద్యార్థి నేర్వదగిన పాఠములతో ఆ వేదము నిండియున్నది. అట్టి పాఠము లొక్క వేదములో తప్ప మరెచ్చటను (అనగా మరేమతగ్రంథములలోను) తెలుసుకొనబడవు."

" భారతదేశములోని ప్రాచీన వైదికవాఙ్మయమందలి భాషలోగాని, మతములోగాని, ఆచారములోగాని పరదేశీయమైన పలుకుబడి (లేక సంబంధము) యున్నట్లు గుర్తులేమియు సత్యముగా లేవని నేను చెప్పగలను."

"Philosophy is the highest religion, and the oldest name of the oldest system of philosophy in India is Vedanta, that is, the end, the goal, the highest object of the Veda", (Max - Muller's India. P. 244).

తా॥ "తత్త్వజ్ఞానము మతములలో శ్రేష్ఠమైనది. ప్రాచీన తత్త్వశాస్త్రమునకు భారతదేశములో వేదాంతమని పేరు. అనగా వేదముయొక్క పర్యవసానము, గమ్యస్థానము. గొప్పఫలము."

"To the present day India acknowledges no higher authority in matters of religion, ceremonial, customs, and law than the Veda, and so long as India is India nothing will extinguish that ancient spirit of Vedantism which is breathed by every Hindu from his earliest youth, and pervades in various forms the prayers even of the idolater, the speculations of the philosopher, and the proverbs of the beggar", (P. 250)

"For purely practical reasons therefore,......an acquaintance with their religion, which is founded on the Veda, and with their philosophy, which is founded on the Vedanta, is highly desirble." (P. 250).

తా॥ "మతములలోగాని, కర్మలలోగాని, ఆచారములలోగాని, ధర్మశాస్త్రములోగాని భారతదేశము వేదమును తప్ప యితరమైన ప్రమాణము నీ రోజువఱకంగీకరించుటలేదు. ఎంతవరకు భారతదేశము భారతదేశముగా నుండునో (అనగా యితరదేశాచారసాంకర్యము నొందక తన జాతీయతను నిలుపుకొనునో) అంతవఱకు తన బాల్యము లగాయతు ప్రతిభారతీయుడు తనయందు జీర్ణింపచేసుకొనియుండిన నా ప్రాచీన వేదాంతభావమును (ప్రపంచమున) యేశక్తియు నశింప జేయలేదు. ఆవేదాంతభావమే విగ్రహారాధకుని ఆరాధనలయందును, తత్త్వశాస్త్రజ్ఞునిచింతనములోను, భిక్షకుని సామెతలలోను (అనగా పాటలు) సర్వత్ర వ్యాపించియున్నది."

"వేదముమీద ఆధారపడివారగు మతజ్ఞానము నొందుటయును, వేదాంతము (ఉపనిషత్తులు) మీద ఆధారపడి వారు తత్త్వశాస్త్ర జ్ఞానమునొందుటయును అనుభవనీయమైన కారణములను బురస్కరించుకొని చూచిన భారతీయుల కత్యావసరము."

"It is due almost entirely to the dis-covery of the Veda that we, in this nineteenth century of ours have been allowed to watch again these early phases of thought and religion which has passed away long before the first beginnings of other literatures. In the Veda an ancient city has been laid bare before our eyes which in the history of all other religions is filled up with rubbish and built over by new architects"

(India, what can it teach us? P. 244)

తా॥ ఇతరజాతుల వాఙ్మయ ప్రారంభదశకు పూర్వ మతిపురాతన కాలమునందే నాటిపోయిన ప్రారంభ కాలమునాటి (సృష్ట్యాది యందుగల) అభిప్రాయమును, మతమును మనయీ పందొమ్మిదవశతాబ్దములో తిరిగి తెలుసుకొనుటకు ముఖ్యకారణము వేదము కనుగొనబడినందువలననే యైయున్నది. ఒక ప్రాచీన కట్టడము మనకు వేదమునందు కళ్ళకుకట్టినటుల స్పష్టముగ కనుపించుచున్నది. ఇతర మతముల చరిత్రలలో చెత్తచెదారములతో పూడ్చబడిన పునాదులమీద క్రొత్త కట్టడములు కట్టబడినవి."

గైగాల్టు (Guigault) పండితుడు:—

"The Rig-Veda is the most sublime conception of the great highways of humanity."

తా॥ మానవసంఘములయొక్క విశాలపథములగూర్చి ఋగ్వేదమత్యున్నతభావముల బ్రకటించుచున్నది. దీనికి సాటి వచ్చునది లేదు."

సర్. విలియంహంటరు పండితుడు:—

"The age of this venerable hymmal (Rig-Veda) is unknown."

(His. of the Indian people, by. W. W. Hunter P. 45.)

తా॥ "పూజనీయమైన యీ భగవత్స్తోత్రరత్నాకరమేనాటిదో తెలియదు" అని ఋగ్వేదమును స్తుతించెను.

హీరన్ పండితుడు (Prof. Heeren):—

"They (the Vedas) are without doubt, the oldest works composed in Sanskrit."

(Historical Researches Vol. II Page 164,)

తా॥ వేదములు నిస్సంశయముగ సంస్కృతభాషలో ప్రాచీన తమ గ్రంథములు."

"Even the most ancient Sanskrit writings allow the Vedas as already existing."

(Heeren's Historical Researches Vol. II P. 127.)

తా॥ "అతి పురాతన సంస్కృత గ్రంథములలో సైతము వేదములంతకు బూర్వమే యున్నట్లునహరింప బడియున్నది."

పి. గురుదత్తపండితుడు :—

"The Vedas contain the germs of all knowledge, and that their teachings are in complete consonance with the principles of science."

(See P. Guru Datta's Vedic Texts No. 2 Printed at the Virajananda Press, Lahore.)

తా॥ "సమస్త విజ్ఞాన బీజములు వేదములలో గలవు. శ్రుతి వాక్యములు ప్రకృతి శాస్త్ర సిద్ధములు"

బార్తు పండితుడు (Prof. Barth) :—

After pointing out some of the Metaphysical theories contained in the Vedas he proceeds :—

"These alone are sufficent to prove, if necessary, how profoundly sacerdotal this poetry is, and they ought to have suggested reflections to those who have affected to see in it only the work of primitive shepherds celebrating the praises of their gods as they lead their flocks to the pasture."

(Barth's Religions of India Page 38.)

తా॥ బార్తుపండితుడు వేదములలో నక్కడక్కడ కొన్ని యాధ్యాత్మిక సిద్ధాంతముల నుదహరించి యిట్లనియె. "ఈగీతములు ప్రధానముగ నీశ్వరోపాసనాపరములని తెలియుటకు బూర్వోదాహృత వాక్యములు చాలును. ఎవరో కొండతాదిమ కాలపు గొల్లలు తమ మందలమేతకు దోలుకొనుచు తమ దేవతలను స్తుతిచేయుచుండిరనియు వారొనర్చిన స్తోత్రములే వేదములందు [illegible] చున్నవనియు నటించెడివారు సైయు [illegible] హరణముల గాంచిన మొదట తమ యూహాలు

తప్పులని తెలిసికొని వెనుకముందులాలోచింప గడంగుదురు." అని వ్రాసియున్నాడు.

మాక్సుమూలరు పండితుడు :—

"The Europeans 'are still on the mere surface of Vedic literature', and must not reject it as useless if they do not find in it corrobaration of their preconceived theories of anthropology and sociology."
(India What can it teach us. Page 133)

తా॥ "ఐరోపీయుపండితులింకను వేదసారస్వతములో పైపైననే యున్నారుగాని లోతుకుదిగి చూచినది లేదు. కావున వారు మనుష్య వర్ణనశాస్త్రము సాంఘికశాస్త్రములలో, యేనాడో గావించిన సిద్ధాంతములను శ్రుతులు సమర్థించుట లేదని కల్పించినప్పుడు ఆశ్రుతులను నిష్ప్రయోజనములని త్రోసిపుచ్చుచుందురు. అది యెంతమాత్రము తగదు."

"To fathom ancient India, all knowledge acquired in Europe avails nought; the study must recommence as the infant learns to read; then you will have been initiated, and India will appear to you the Mother of human race, the cradle of all our traditions." (India What can it teach us. P. 17.)

తా॥ ప్రాచీన భారతవర్షముయొక్క లోతును తెలుసుకొనవలయునసిన మనము ఐరోపాఖండములో (బాల్యమునుండియు) సంపాదించిన జ్ఞానమెందుకును కొఱగాదు. పసిబాలునివలె మనము తిరిగి (హైందవ పండితునియొద్ద) విద్యాభ్యాసమును చేయవలసియున్నది. వారియొద్ద (హైందవపండితులవద్ద భారతీయ సాంప్రదాయములను) యుపదేశమును బొందిన పిమ్మట, భారతవర్షము మానవకోటికి తల్లియనియు, మన (ఐరోపీయుల) సాంప్రదాయములన్నిటికి మూలస్థానమనియు మనము తెలిసికొందుము."

# సంస్కృత సారస్వతస్తుతి

డబ్ల్యు. సి. టైలరు ( W. C. Taylor ) పండితుడు :—

"రాజ్యములుమారినను, కాలము తారుమారయినను, హిందూస్థానమునందు వివిధశబ్దసంపదయందు నిరుపమానమగు, సాంప్రదాయక భాషలని ఐరోపాలో మక్కువతో బిలువబడుచుండు ప్రాదేశిక భాషలన్నిటికిని మాతృకయును, యవన(గ్రీకు) భాషానవ్యతకును, రోమీయ భాషాపట్టిష్ఠతకును మూలాధారముతు, అగుభాష యొకటి యుండుట గాంచి నిర్ఘాంతపోయితిని. సంస్కృత తత్త్వశాస్త్రముల ప్రాచీనత నాలోచించుచో పైథాగోరసుబోధలు నిన్న మొన్నటివివలె నుండును. తత్త్వవిచారములో ప్రదర్శించిన తెగువనవలోకించినపుడు ప్లేటోసాహసకృత్యములు పేలవములై ప్రాకృతములుగ గన్పట్టును. మన మిదివరలో నూహించి యెఱుగని బుద్ధివైశద్యప్రధానమైన కవితయు నాభాషలోగలదు. ఎంత జ్యోతిషము గుణించి చూచినను వారి (భారతీయుల) శాస్త్రముల ప్రాచీనత్వము నెఱుంగుట అసాధ్యము. ఇట్టి యీబ్రహ్మాండమైన సారస్వతమును వర్ణింపబూనినప్పుడు చదువరులు అతిశయోక్తియనియు, ఆడంబరమనియు అపోహపడుటయు కద్దు. సంస్కృతవాఙ్మయమితరములతో గలియక ప్రత్యేకస్థానమున విరాజిల్లుచున్నది. తక్కుంగలవానితో దాని కగత్యము లేదు. అది స్వయంభువు." అని టైలరు పండితుడు స్తుతించియున్నాడు.

(ఇంగ్లీషువాక్యమునకు Journal of the Royal Asiatic Society Vol. II 1834 Taylor's Paper on Sanskrit Literature.) చూడుడు.

"Sanskrit leterature, if studied only in a right sprit, is full of human interests, full of lessons which even Greek could never teach us;

(Max - Muller's India P. 5.)

తా॥ "సంస్కృత సారస్వతము మంచిభావములతో చదివిన మానవుల కవసరమగు ప్రయోజనములతోను, గ్రీకుభాష మనకెప్పుడు నేర్పజాలని ఉపదేశములతోడను నిండియున్నది."

"ఈభాషలో బరిపూర్ణపాండిత్యమును సంపాదించుట కొక్క జీవితకాలము ధారవోయవలెను. ఎంత చదివినను సంస్కృతవాఙ్మయము తఱుగనిది. ఊహాశక్తిని సంపూర్ణముగ విజృంభింపజేసినను అపారములైన సంస్కృత పురాణముల నవగాహన చేసికొనజాలము. అతిక్లిష్టములయినట్టి యాధ్యాత్మిక సమస్యలను సంస్కృతదర్శన శాస్త్రము లెదుర్కొనినవి. హిందూజాతిలో నెన్నికులములు యెన్ని శాఖలు కలవో వారి కందఱుకన్వయించునట్లు ధర్మశాస్త్రములును వేర్వేఱుగ వ్రాయబడియున్నవి."

(Journal of the Royal Asiatic Society Vol II 1834 or Hindu Superiority P. 163)

కౌంటుజార్జ్ స్టైర్నా పండితుడిట్లు స్తుతించుచున్నాడు:—

"The literature of India makes us acquainted with a great nation of past ages, which grasped every branch of knowledge, and which will always occupy a distinguished place in the history of the civilisation of mankind." (Theogony of the Hindus P. 85)

తా॥ "భారతీయసారస్వతము ద్వారా మనకు గతయుగముల నాడు మహద్దశలోనుండిన యొకజాతితో బరిచయము పొందుచున్నాము. శాఖోపశాఖలుగ వ్యాపించియున్న విజ్ఞానసర్వస్వమును ఆజాతి లోబఱచుకొనగలెను. మానవసభ్యతా పరిణామచరిత్రమునందు ప్రాచీన హిందూజాతి ప్రముఖమైన స్థానము వహించుచున్నది."

మాక్సుమూలరు పండితుడు :—

"Although there is hardly any department of learning which has not received new light and new life from the ancient literature of India, yet nowhere is the light that comes to us from India so important,

novel and so rich as in the study of religion and mythology."
(Max - Muller's India, What can it teach us. P. 140)

తా॥ "ప్రాచీన భారతీయవాఙ్మయమునలన నూతన జీవనమును, నూతన ప్రకాశమును బొందనట్టి విద్య యొకటియు లేదనుట సత్యము. అందులో ముఖ్యముగా మతము, పురాణములు యీరెండింటిలో భారతి సారస్వతము మనపై గురిపించిన ప్రకాశము అగ్రగణ్యము, అపూర్వము, దివ్యము".

మాగ్డొనలు పండితుడు :—

"The intellectual debt of Europe to sanskrit literature has been undeniably great. It may perhaps become greater still in the years to come."

(History of Sanskrit literature P. 42. By prof. Macdonell.)

ఐరోపీయుల బుద్ధి వికాసమునకు సంస్కృత సారస్వము చేసిన సేవ యత్యధికమనుటకు సందేహము లేదు. మున్ముందీ ఋణము వృద్ధిగా వచ్చుననియు నేనూహించుచున్నాను."

కెప్టెన్ కన్నింగుహాం పండితుడిట్లు సూచించుచున్నాడు :—

"హిందువులు గణితశాస్త్రమునందు పరిపూర్ణ పండితులగుట వలనను, ఖగోళ వేధలు సమగ్రముగ గావించిన వారగుటవలనను వారు రవిచంద్రులగమన పథముల స్ఫుటముగ గనిపెట్టగలిగిరి. దర్శన పరిజ్ఞానము కొలది పండితులకుమాత్రము లభ్యము. పామరజనులకు విశ్వాసమే శరణ్యము. అట్టి సాంఖ్య లబ్ధ బ్రహ్మజ్ఞానమును విశ్వాస నిష్ఠిత బ్రహ్మజ్ఞానములో ప్రప్రథమమున సమన్వయము చేసినవారు హిందువులు. బ్రహ్మైకత్వము, ప్రపంచోత్పత్తి, ఆత్మ నిత్యత్వము, జీవుని బాధ్యత, యీ విషయములను బ్రాహ్మణమతము నమ్మికపై నాధారపరచెను. (అనగా వీనిని గూర్చి జ్ఞానులు, కనిపెట్టిన సిద్ధాంతములపై భక్తియుంచి నమ్మవలయునేగాని శంకింప జనదు.) మరణానంతర జీవితమునుగూర్చి మోషే ఒక్క పలుకాడ లేదు ఆడినకొలది పలుకులబట్టి అతని అభిప్రాయము తెలియజాలము. కాని మనకత్యంత

దూరస్థులైన గంగాతీరవాసులు మరణానంతరము జీవుని గతి యెట్టిదో స్ఫుటముగ దెలిపియున్నారు." ఇత్యాది—

(Cunningham's History of the Sikhs)

సర్. వి. జోన్సు పండితుడు :—

"సంస్కృత భాషానిర్మాణ మద్భుతమని; గ్రీకు భాషకంటె నెక్కువ లోపరహితము; బరిపూర్ణము: లాటినుభాషకంటె బాహుళ్యమైనది. రెండింటికంటె స్వచ్ఛమైనది."

(Asiatic Researches Vol. I P. 422)

మాక్సుమూలరు పండితుడు :—

"సంస్కృతము భాషలకుభాష" "జ్యోతిషమునకు గణితమెట్లో భాషాశాస్త్రమునకు సంస్కృతమట్లు అనుటలో అసత్యము లేశమును లేదు."

(Science of Language P. 203)

'దూబాయి' పండితుడు :—

"వర్తమాన ఐరోపియ భాషలన్నింటికి సంస్కృతమాది మూలాధారము."

(Bible in India. By Prof. Duboi)

వేదములు సంస్కృత భాషలో మిక్కిలి ముఖ్యములైన గ్రంథములని మాత్రమేగాక ప్రపంచ సార్వస్వతములో నుత్తమ స్థానము వహించుచున్నవనియు నెల్లరంగీకరించిరి. ప్రాచీన భారతవర్షమందభ్యసింపబడిన యితర శాస్త్రాదులకు సంబంధించిన ముఖ్య గ్రంథములన్నియు నశించినప్పటికిని, అన్నింటికంటె ముఖ్యములైనట్టియు సమస్త జ్ఞానమునకు మూలాధారమైనట్టియు, సర్వశాస్త్ర సాహిత్యములకు మాతృకయైనట్టియు వేదములు నేటివఱకు చెక్కుచెదరక నిలువగలిగి యుండుట వింతగదా!......భాష అననుకరణీయమగు మహత్త్వముగలదగుటం జేసియు, విషయము మహత్తర మగుటయు, వేదములలో ప్రక్షిప్తముల జొప్పింపబడు నవకాశము లేదు.

(డి. టి. యస్. రావుగారి హిందువుల ఆధిక్యము 288 పేజి)

చేయబడిన యనేక సాంకర్యములకు లోనగును, గనుక భారతీయులు సర్వవిధముల చేతను అనాదినుండియు భారతజాతికిని, ప్రపంచమునగల యితరజాతుల వారికిని ఇహపరసౌఖ్యముల కొనగూర్చుచు సర్వవిద్యల కాకరమైన వేదవాఙ్మయమును ఉన్నదున్నట్లు కాపాడుకొనుట ధర్మము. అట్లు కాని యెడల అచిరకాలములో వేదవిద్యలు నశించి పోగల సమయమాసన్నమైనది. ఇంతవఱకు వేదవాఙ్మయము కాపాడ బడిన విధము జూచి "మాక్సు మూలరుపండితుడు తనచే వ్రాయబడిన ఋగ్వేదసంహితవ ల్యూం IV, LIXXX లో నీ విధముగా వ్రాసి యున్నాడు.

"The Rig - Veda etc; are the oldest literary documents."

"The sacred Hyms of the Brahmins stand unparalleled in the literature of the whole World and their preservation may well be called miraculous."

తా॥ "ఋగ్వేదాదులు అతిపురాతనములగు వాఙ్మయదస్తావేజులు."

"బ్రాహ్మణులయొక్క పవిత్రములగు మంత్రములు ప్రపంచ వాఙ్మయమునం దద్వితీయములై విలసిల్లుచున్నవి. నేటివఱకు వాటిని స్వచ్ఛముగా కాపాడినపద్ధతి మహిమాన్విత విషయమని చెప్పవలసి యున్నది." అని ఆశ్చర్యముతో నుడివియున్నాడు. ఇట్టి అపూర్వ వాఙ్మయమును గ్రంథస్థము చేసి దాచియుంచుకొనవచ్చుననెడి భావము కేవలము అజ్ఞానముతో గూడినదని తెలియవలెను. గురుశిష్యపరంపరా చేయబడుచున్న అధ్యయనవిధానము తప్ప యింకేవిధముననూ వేదముయొక్క స్వచ్ఛత కాపాడబడదు. గనుక భారతప్రభుత్వము వారు కుల, మత, వర్గరహిత రాజ్యధర్మముల నవలంబించిన వారైనను సర్వమానవజాతి కల్యాణముకొఱకైనను వేదవిద్యను కాపాడు ధర్మమును తమరాజకీయము నందొక యంశముగా జేర్చుకొని దానిని పరిపాలించుట స్థితియని మనవి చేయుచుంటిమి. — వేదశాస్త్రాది ప్రాచీనవిద్యలు మానవజాతికంతకు (అన్నిమతముల వారికి) అన్నికాలములలోను నుపయోగపడునను విషయములో మాక్సుమూలరు పండి

తుడు తన పాశ్చాత్యదేశీయుల కుపదేశించిన వాక్యముల నిచ్చు చుంటిమి.

"Sanskrit —— will open before you large layers of literature, as yet almost unknown and unexplored, and allow you an insight into strata of thought dee - per than any you have known before, and rich in less - ons that appeal to the deepest spmpathies of the human heart." (India what can it teach us. P, 14)

తా॥ "ఇంతవరకు నెవరికిని తెలియబడని, పరిశోధనకురాని అనేకమైన గొప్ప విజ్ఞానసమూహములను సంస్కృతభాష మీ ముందు పెట్టి యింతవఱకు మీరెఱుంగని యనేక విషయములయందంతర్దృష్టి నొసంగును, సంస్కృతభాష మానవహృదయమును వికసింపజేసి విజ్ఞానజ్యోతిని ప్రకాశింప జేసెడి శిక్ష నొసంగగల గొప్ప శక్తిగలదై యున్నది."

"In that study of ourselves, of our true selves, India occupies a place second to no other Country. Whatever sphere of the Human mind you may select for your special study, whether it be language or religion or mythology, or philosophy, whether it be laws, or customs, primitive art or primitive science, every where, you have to go to India whether you like it or not, because some of the most valuable and most instructive materials in the history of man are treasured up in India, and in india only,"

(Do. Book P. 15)

తా॥ ప్రపంచమందంతటిలోను హిందూదేశ మాత్మవిచారణ యందగ్రగణ్యము. నీవేవిద్య నభ్యసింప ప్రత్యేకించుకొనినను, అది భాషాశాస్త్రముగాని, మతవిద్యగాని, పురాణములుగాని, తత్త్వశాస్త్రముగాని, సకలశాస్త్రములు, కళలు మొదలగు సమస్త విద్యలకు నీ కిష్టమున్నను, లేకున్నను నీవు హిందూదేశమునకే వెళ్ళవలయును. ఎందుకన గొప్ప విలువగల, మంచి క్రమశిక్ష నొసంగగల శాస్త్రము లన్నియు ఇండియాలోనే (అనగా బ్రాహ్మణ జాతియందే) నిక్షేపింప బడియున్నవి. అవి మరే దేశమందును దొరుకవు."

"The Aryans are the fathers of the most natural of natural religions." (India. What can it teach us' P. 15)

తా॥ "స్వాభావికమైనవానిలో స్వాభావికమైన (అనగా ప్రకృతి సిద్ధమైన) మతమునకు ఆర్యులే పితామహులై యుండిరి."

"Sanskrit literature opens to us a chapter in what has been called the education of the Human race, to which we can find no parallel anywhere else."

(Do. Book P. 89.)

తా॥ "ప్రపంచసారస్వత మందెచ్చటను మనము కనుగొనలేని, మానవజాతియొక్క ప్రాచీనచరిత్రను సంస్కృతవాఙ్మయము మన కిచ్చుచున్నది."

## బ్రాహ్మణస్తుతి

పాశ్చాత్యపండితుడగు "షెర్రింగు" బ్రాహ్మణుని గురించి యీరీతిని స్తుతించియున్నాడు.

"Light of complexion, his fore head ample, his countenance of striking significance, his lips thin, mouth expresssive, his fingers long, his eyes quick and sharp, his carriage noble, his fingers sublime, the true Brahmin uncontaminated by any European influence and manners, with his intense self - conciousness with the proud conviction of superiority, depicted in every muscle of his face, and manifest in every movement of his body, is a wonderful specimen of humanity walking on God's Earth."

(Vide Sherring Hindu tribes and castes.)

తా॥ "చామనచాయ, విశాలమైన ఫాలము, ఆకర్షణీయమైన ముఖవర్చస్సు, సన్నని పెదవులు, గంభీరవదనము, పొడుగువ్రేళ్లు, నిశిత నిర్మలలోచనములు, మహనీయత, ఔదార్యము, గాంభీర్యముల గలిగి పాశ్చాత్యవేషభాషాచారాది సంపర్కములచే దూషితుడుగాని సద్ధర్మ నిరతుడైన బ్రాహ్మణుడు సంపూర్ణమైన ఆత్మగౌరవముగలిగి, ఆధిక్యత

ముఖమునందును, ప్రతి అంగవిన్యాసమునందును ప్రతిఫలింపగా ఈశ్వరసృష్టమైన లోకమునందు మానవజాతికి ఆదర్శప్రాయుడుగా మూర్తీభవించినట్లుండుచున్నాడు.”

డబ్ల్యు. డబ్ల్యు. హంటరు పండితుడు :—

“The Brahmins, therefore, were a body of men, who in an early stage of this world's history bound themselves by a rule of life, the essential precepts of which were self - culture and self - restraint. The Brahmins of the present day are the result of nearly 3000 years of hereditary education and self - restraint and they have evolved a type of mankind quite distinct from the sorrounding population. Even the passing traveller in India makes them out. The Brahmin stands apart from both (i. e. the Rajput or the Aryan warrior class and non Aryans) — the man of self - centered refinement. He is an example of a class, becoming the ruling power in a country, not by force of arms, but by the Vigour of hereditary culture and temperence. One race has swept across India after another; dynasties have risen and fallen, religions have swept themselves over the land and disappeared. But since the dawn of history, the Brahmin has calmly ruled swaying the minds and receiving homage of the people and accepted by foreign nations as the highest type of Indian mankind.”

“The paramount positiou which the Brahmins won, resulted in no small measure from the benefits which they bestowed.”

(Indian Empire by W. W. Hunter 2nd ed. P. 96-97)

తా॥ “ జగత్తుయొక్క ప్రారంభదశలోనే బ్రాహ్మణ సంఘము యొక్క జీవితవిధానము నియమబద్ధమై విజ్ఞానము, ఇంద్రియనిగ్రహము ముఖ్యముగాగల నిబంధనలతో కూడియున్నది. ఇప్పుడు కనబడుచున్న బ్రాహ్మణ సంఘము సుమారు మూడువేల సంవత్సరముల నుండి వంశ పారంపర్యముగా సంక్రమించిన విద్య, ఆత్మనిగ్రహము లతో పరిణామమును పొందిన జాతియొక్క ఫలము. వారు ఇతర

జాతులకంటె విలక్షణమైన చిహ్నముగల ప్రత్యేక జాతిగా పరిణమించి యున్నారు. హిందూదేశమునకు నూతనముగా వచ్చి ప్రయాణము చేయుచున్న అన్యదేశీయుడు కూడా బ్రాహ్మణులను ప్రత్యేకించి గుర్తించును. బ్రాహ్మణుడు స్వకీయమైన విజ్ఞానమును కలిగియుండుటం జేసి రాజపుత్ర ఆర్యునికంటెను, అనార్యునికంటెను భిన్నమైనట్లు నిర్దిష్టముగా గుర్తింపవచ్చును. భుజపరాక్రమముతోను ఆయుధ సామగ్రితోను నిమిత్తంలేకనే వంశపారంపర్యముగా వచ్చిన స్వకీయమైన దార్ఢ్య రాహిత్యమైన విద్యామేధవల్లను, ఆత్మనియతివల్లను, దేశమునకు ప్రభుత్వముచేసిన యొకజాతి కావర్ణమై యున్నాడు. విదేశీయులొకజాతివెంబడి వేరొకజాతి హిందూదేశముపై దండెత్తి నాశనముచేసి యుండిరి. రాజవంశములు యొకటి వెంబడి వేరొకటి ప్రభుత్వముచేసి నశించినవి. అనేక మతములు దేశము నావరించినవి. కాని చరిత్రయుగారంభమునుండి బ్రాహ్మణుడు స్థైర్యముగలిగి శాంతచిత్తతతో ప్రజారంజకుడై వారి మన్ననలకు పాత్రుడగు చున్నాడు – భారతవర్షీయు లందరిలోను బ్రాహ్మణుడుత్కృష్టజాతి వాడైనట్లు విదేశ జాతీయులందరంగీకరించియున్నారు."

"మానవజాతికి బ్రాహ్మణులు కలుగజేసిన సౌకర్యములే బ్రాహ్మణులధిష్ఠించిన సర్వోన్నతి పదవికి కారణములై యున్నవి." అని హాంటరు మహాశయుడు స్తుతించియున్నాడు.

వేదములన్నియు కంఠతాజేసి బ్రాహ్మణులు వప్పగించుటవలన ప్రాచీనకాలమునుండి కాపాడబడుచుండినవని మాక్సుమూలరు పండితుడు తన వుపన్యాసములో "ఆక్సుఫర్డు" విశ్వవిద్యాలయములో చెప్పుచు యింకను యిట్లు చెప్పియున్నాడు:—

"This may sound startling, but - what will sound ill more startling, and yet is a fact than can easily ascertained by anybody who doubts it - at the resent moment, if every manuscript of the Rig-Veda were lost, we should be able to recover the whole of

it - from the memory of the Srotriyas in India. These native students learn the Veda by heart, and they learn it from the mouth of their Guru, never from a manuscript, still less from any printed edition - and after a time they teach it again to their pupils."

"I have had such students in may room at oxford who when looking through my printed edition of the Rig - Veda, could point ont a misprint without the slightest hesitation." (P. 208)

"We are not dealing with theories, but with facts, which any body may verify——A boy, who is to be brought up as a student of the Rig - Veda, has to spend about eight years in the house of his teacher. He has to learn ten books: first, the Hyms of Rig-Veda then a prose treatise on sacrifices, called the Brahmana; then the so called forest book or Aranyaka then the rules on domestic ceremonies; and lastly, six treatises on pronunciation, grammar, etymogly, metre; astronomy, and ceremonial.

These ten books contain nearly 30,000 lines, eac line reckoned as thirty-two syllables......Much ancien Sanskrit lore will be lost for ever when that race o Srotriyas becomes extinct."

(Do. Book P. P. 209-210.)

తా॥ "ఈవిధముగా వేదములను కంఠతాచేసి వప్పగించుచుండిరని చెప్పిన మీాకు మనస్సుకు బెదురుగా (ఆశ్చర్యముగా) తోచవచ్చును. కాని యింతకంటె ఆశ్చర్యకరమైన విషయమింకొకటిగలదు. అది మీాకు సంశయముగా నుండిన యెడల యిప్పుడు ప్రత్యక్షముగా చూచి ఋజువుపరచుకొనఁదగియున్నది. ఋగ్వేదముయొక్క వ్రాతప్రతులన్నియు నశించిపోయిన వనుకొందము. కాని దానిని భారతదేశములోని శ్రోత్రియ బ్రాహ్మణుల జ్ఞాపకమునుండి తిరిగి పొందగలము. ఈ బ్రాహ్మణులు వేదమునంతను కంఠతాచేసి తిరిగి వప్పగించగలిగియుందురు. వేదమును వారు తమ గురువువలన చెప్పించుకొని

వల్లెవేయుదురుగాని వ్రాత ప్రతినుండిగాని, అచ్చు ప్రతినుండిగాని చదువరు. గురువువలన చెప్పించుకొని వల్లెవేసి తిరిగి తమశిష్యులకు చెప్పుచుందురు.

"అట్లు గురువువద్ద అధ్యయనముచేసిన విద్యార్థులు ఆక్సుఫర్డు లోని నాతరగతులలోగలరు. వారు అచ్చు వేయబడిన నాయొక్క ఋగ్వేదప్రతిని చూచి యెట్టి సంకోచము లేకుండ అందలి అచ్చు పొరబాటును చెప్పగలిగియుండిరి."

"మనమిప్పుడూహాగానము చేయుటలేదు. వాస్తవముగా జరుగు చుండిన సంగతులనే మాట్లాడుచుంటిమి. ఎవరుబడితే వారు దీనిని పరీక్షించి సరిచూచుకొనవచ్చును. ఋగ్వేదమును చదువుకొనెడి విద్యార్థి యెనిమిది సం॥గములు తనగురువుగారి యింటివద్ద గడుపవల యును. ఆతడు పదిపుస్తకములను చదువవలసియుండును. ప్రథమమున ఋగ్వేదములోని ఋక్కులు (మంత్రములు) పిమ్మట వచనరూపమున నున్న బ్రాహ్మణము నేర్చుకోవలయును. తరువాత ఆరణ్యకము చదువవలయును. అటు పిమ్మట నిత్యములైన వైదికకర్మలను నేర్చు కొనవలెను. ఆఖరుకు వేదోచ్చారణకు సంబంధించిన ఆరు ప్రబంధము లను, వ్యాకరణము, శబ్దవ్యుత్పత్తిశాస్త్రము, ఛందస్సు, జ్యోతిశ్శా స్త్రము, కర్మాంగములు నేర్వవలెను.

ఈ పదిపుస్తకములు ముప్పదివేల (30,000) పంక్తులను కలిగి యుండును. ప్రతిపంక్తిలోను 32 అక్షరములుండును.

<u>ఇండియాలో నుండిన శ్రోత్రియబ్రాహ్మణులు నశించిన ప్రాచీన సంస్కృతవాఙ్మయములో చాలాభాగము శాశ్వతముగా నశించిపోగలదు."</u> అని వ్రాసియున్నాడు.

చీనాయాత్రికుడైన "ఇచ్చింగు" ('(Itsing') క్రీ॥శ॥ 671 లో చీనానుండి బయలుదేరి క్రీ॥శ 673 సం॥రములో భారతదేశముకుచేరి 'నలాంద' విశ్వవిద్యాలయములో సంస్కృత భాషను నేర్చుకొని క్రీ॥శ 695 లో తిరిగి చీనాదేశము చేరి క్రీ॥ శ 713 సం॥ లో మృతి నొందెను. ఈతడు భారతదేశమున చూచినదానిని తనచే చీనా

భాషలో వ్రాయబడి నేటివఱకు ప్రచారమును గలిగియున్న గ్రంథములలో నొకదానియందిట్లు వ్రాసియున్నాడని మాక్సుమూలరు పండితుడు తన గ్రంథములో 210-212 పుటలలో (India what can it teach us?) నిట్లుదహరించియున్నాడు. ఇచ్చింగు వ్రాసినదేమనగా !

"They (the Brahmins revere their Scriptures, the four Vedas, containing about 100,000 lakh verses...... The Vedas are handed down from mouth to month, not written on paper. There are in every generation some intelligent Brahmins who can recite those 100,000 Verses ...... I myself saw such men." (P. 212)

"As the Brahmins lived for others, and were excluded from most of the lucrative pursuits of life, it was a social and it soon became a religious duty, that they should be supported by the community at large." (Do. Book P. 236)

తా॥ "బ్రాహ్మణులు నాలుగు వేదముల నెక్కువ పవిత్రమైన వానిగా నెంచెదరు. అవి ఒక లక్ష చరణములుగల గ్రంథము. వేదములు గురువువల్ల చెప్పబడి శిష్యునివలన నేర్చుకోవలసినవిగాని పుస్తకములో వ్రాసియుంచబడినవి కావు. ఈ నాలుగు వేదములను (లక్షగ్రంథమును) కంఠతా చేసి వప్పగించగల మహామేధావులైన బ్రాహ్మణు లన్నితరములలోను గలరు. నేను స్వయముగా అట్టి బ్రాహ్మణులను (నాలుగు వేదములు అప్పగించగలవారిని) చూచియుంటిని."

"బ్రాహ్మణు లితరులకొరకు జీవించువారైనందున లాభకరమైన వృత్తులను జేయుట కవకాశము లేదు. అందువలన సంఘమంతయు వారిని పోషించవలసిన మతసంబంధమైన విధియైనది."

"The Aryas of India are the framers of the most wonderful language, the Sanskrit, the fellow-workers in the construction of our fundamental concepts, the fathers of the most natural of natural religions, the

makers of the most transparent of mythologies the inventors of the most subtle philosoply, and the givers of the most elaborate laws"

(Max - Muller's India P. 15)

తా॥ "భారతవర్షములోని ఆర్యులు అద్భుతములలో అద్భుతమైన సంస్కృతభాషను కల్పించిరి. మనకు మూలాధారమైన భావనల నిర్మించుటలో పనిచేసినవారు. స్వాభావికమైన మతములలో నతి స్వాభావికమతమునకు పితామహులు. మహిమాన్వితమైన పురాణములను రచించినవారు. అతిచతురతతో గూడిన తత్త్వశాస్త్రమును కనుగొనినవారు-అతి విస్తృతమైన న్యాయశాస్త్రము నొసంగినవారు."

Lord Elphinstone writes :—

"The Hindus are mild and gentle people, more merciful to prisoners than any other Asiatics. Their freedom from gross debauchery is the point in which they appear to most advantage; and their superiority in purity of manners is not flattering to our self - esteem."

(Max - Muller's India P. 61)

తా॥ భారతీయులు సాధువులు. నెమ్మదిగా పోవువారు. ఇతర ఆసియా వాసులవలెగాక ఖైదీలయందతిదయారసము జూపెడివారు. వ్యభిచారము నెరుగరు. పవిత్రమైన నడతగల వారియాధిక్యత మనకంటె నధికమనిన ముఖస్తుతి కానేరదు."

ఎలిఫిన్ స్టోన్ ప్రభువు :—

"The early excellence of the Brahmins in all these branches of learning."

(History of India. By Lord Elphinstone. P.92-95 2 nd. ed. Also Ante P. 41 foot notes.)

తా॥ "మొదటినుండియు బ్రాహ్మణులు సమస్త శాస్త్ర విద్యాపారంగతులై యుండిరి."

"సీలీ" (Seely) పండితుడు :—

"Perhaps no race has shown a greater aptitude for civilization. Its customs grew into laws, and were consolidated in Codes. It imagined the division of

labour. It created poetry and philosophy and the beginings of Science. Out of its bosom sprang a mighty religious reform called Buddhism which remains to this day one of the leading religious systems of the world, which created our own civilization."

(The expansion of England. By Prof J. R. seely M. A. Edition 1890 P. 241)

తా॥ "నాగరికత సంపాదించుటలో బ్రాహ్మణజాతి చూపిన ఆతురత యే యితర జాతియు చూపియుండలేదు. బ్రాహ్మణులవలం బించిన ఆచారములు శాసనములై స్మృతులుగా పరిణమించినవి. కర్మ విభాగము (చాతుర్వర్ణ్యవ్యవస్థ) నొనరించినది. కావ్యములను, షడ్దర్శనముల నొనర్చి శాస్త్ర విజ్ఞానముల కంకురార్పణ చేసినది. ప్రపంచమందుగల మతధర్మములలో నేటివఱకు ప్రాముఖ్యతను జెందిన బౌద్ధమతము బ్రాహ్మణమతమునుండి పుట్టిపెరిగినదై యున్నది. మన నాగరికతా నిర్మాణమున కాధారభూతమైన మతములకది మూల స్థానమై యున్నది.

డబ్ల్యు. డబ్ల్యు. హంటరు మహాశయుడిట్లు స్తుతించుచున్నాడు :—

"The Brahmins had advanced far in astronomy before the Greeks arrived in India in 327 B. C."

(W. W. Hunter's His. of the Indian People P. 55)

తా॥ "గ్రీకులు క్రీ॥ పూ॥ 327 సం॥రములో ఇండియాకు రాక పూర్వమే బ్రాహ్మణులు ఖగోళశాస్త్రములో పండితులై యుండిరి."

"In medicine the Brahmins learned nothing from the Greeks, but taught them much. Arab medicine was founded on translations from Sanskrit works about 800 A. D, European medicine, down to the 17 th. century, was based upon the Arabic"

(Do. P. 55; 56)

తా॥ వైద్యవిషయములో బ్రాహ్మణులు గ్రీకులయొద్ద నేర్చు కొనిన దేదియు లేదు. బ్రాహ్మణులే గ్రీకులకు హెచ్చుగా వైద్యవిద్యను నేర్పిరి. సంస్కృత వైద్యశాస్త్రముల తర్జుమాలనుండి అరబ్బులు వైద్యవిద్యను క్రీ॥ శ॥ యెనిమిదవశతాబ్దములో నేర్చుకొనిరి. పదిహే

డవశతాబ్దమువఱకు ఐరోపీయుల వైద్యశాస్త్రము అరబ్బువైద్యము మీాద ఆధారపడియున్నది.

"The Brahmins had also an art of music of their own. The seven notes which they invented, at least four centuries before Christ, passed through the Persians' to Arabia, and were thence introduced into European music in the II th. century A. D."

—— "Hindu music is highly original and interesting from a scientific point of view."

(Do. Book P. 56)

తా॥ బ్రాహ్మణులు స్వంతముగా కనిపెట్టిన సంగీతశాస్త్రము కూడను వారికి గలదు. అధమపక్షము క్రీస్తుకు పూర్వము నాలుగు శతాబ్దములక్రిందట వారిచే కనిపెట్టబడిన సప్తస్వరములు పర్షియనుల ద్వారా అరేబియాకు చేరి అచ్చటనుండి ఐరోపాఖండములో క్రీ॥ శ॥ పదకొండవశతాబ్దమున ప్రవేశపెట్టబడినది... ... ... ... ... ... ... హైందవుల సంగీతము స్వంతముగా కనిపెట్టబడినది.

అది ఆనందమును కలిగించునట్టి శాస్త్రజ్ఞానము గలది.

"The Brahmins were the civilisers of ancient India" (Do Book P. 57.)

తా॥ ప్రాచీన భారతవర్షమునకు నాగరికత ప్రసాదించిన వారు బ్రాహ్మణులైయున్నారు.

The Brahmins were not merely the keepers of the Sacred Books, the Philosophers, the men of Science, and the law - makers of the Hindu people. They were also its poets." (Do. Book P. 57)

తా॥ బ్రాహ్మణులు కేవలము మతసంబంధముగల పవిత్రమైన వేదములను కాపాడువారు మాత్రమే కారు, వారు తత్త్వశాస్త్రజ్ఞులు, (జ్యోతిషము, తర్కము, వ్యాకరణాది) ప్రకృతిశాస్త్రములను తెలిసిన వారు. హిందువులకు ధర్మశాస్త్రములను వ్రాసినవారు. వారు భారతీయ విజ్ఞానమును కవిత్వముతో కూర్చియుండిరి.

తా॥ "ఏ రాజు తనకంటె ముందుపుట్టిన బ్రాహ్మణుని గౌరవించి ధనము లొసంగునో, అట్టిరాజు తన గృహమునందే సుఖముగా నుండి ఐశ్వర్యమును, శాంతిని, సమృద్ధిని పొందును. వాని రాజ్యము సంపూర్ణముగా ఫలించును. అట్లు ఫలసమృద్ధిగలవారలైన వైశ్యాది ప్రజలు రాజభాగమును తమంతట తామే తెచ్చి చెల్లించెదరు. ఆ రాజుయందు పూజ్యభావముగలవారలై ప్రజలందరు రాజభక్తి గలిగి విధేయులై యుందురు." (ఋక్కు ౮)

"ధనరహితుడైన బ్రాహ్మణుడు తనను కోరినను కోరకున్నను ఏ రాజు ఆవశ్యకమగు ధనమును తనంతట తాను పూజ్యభావమున అట్టి బ్రాహ్మణున కిచ్చునో, అట్టి రాజు ఐశ్వర్యమును, శత్రుజయము ద్వారా శత్రుధనమును, తన ప్రజలవలన భక్తిపూర్వకముగాను ధనమును పొందును. అతడు బలపరాక్రమములు గలవాడగును. అట్టి రాజును దేవతలెల్లపుడును కాపాడుచుందురు." (ఋక్కు ౯)

అని వేదమాత బహుముఖముల బ్రాహ్మణుని కాపాడుమని ఆదేశించుచున్నది.

ధర్మరాజుకు భీష్మునిచే నుపదేశింపబడిన యుత్తమధర్మము :
భారతమందు :—

శ్లో॥ "బ్రాహ్మణాన్ భరరాజేంద్ర పునశ్చ బ్రాహ్మణాన్ భర ।
తస్మాత్సర్వప్రయత్నేన బ్రాహ్మణారాధనం కురు॥

అని యుపదేశింపబడినది. (మహాభారతం. అనుశాసనిక పర్వము పంచమాధ్యాయము)

తా॥ (వేదశాస్త్రవేదివైన) "బ్రాహ్మణులను పోషింపుము. తిరిగి బ్రాహ్మణులను పోషింపుమనియే చెప్పుచుంటిని." (బ్రాహ్మణుల నిదివరకే పోషింపుచుంటిని గనుక యింక నుత్తమధర్మము నుపదేశింపు డని ధర్మజు డర్థింపగా భీష్ముడిట్లు చెప్పియున్నాడు.) "అందువలననే సర్వప్రకారములచేతను వేదవిద్యాపారంగతులైన బ్రాహ్మణులనే ఆరాధింపుము" అని ముమ్మారు తన ఆఖరుపదేశముగా ధర్మరాజుకు

చెప్పియున్నాడు. మానవజాతికంతకు ఇహపరతరుణోపాయము "వేదము, బ్రాహ్మణుడు" తప్ప గత్యంతరము లేదని తాత్పర్యము. ఇంకను భీష్ముడు ధర్మరాజునకిట్లు ధర్మమార్గమును బోధించియున్నాడు.

క॥ "విను మక్రోధము దానం
బు నహింసావ్రతము సత్యమునునా నాల్గున్
మనమున గైకొని యుండుట
యను నిదియే ధర్మమార్గ మందురు పెద్దల్."
(శ్రీకృష్ణభారతం. అను. 5-21)

చ॥ "మఱియొకమాట చెప్పెదను మానవనాథ! మహీసురవర్యులన్
నెఱిగలవాడవై కొలిచి నిచ్చలు వారల వృత్తులెల్లనే
ర్పఱుఁ గలుగంగ నేలుచుఁ దదీయహితంబ మదిందలంచుచున్
వఱలుము మూర్ఖతన్ విడిచి వారె ప్రమాణము భూతధాత్రిన్."
(డిటో 5-212)

తా॥ క్రోధము లేకపోవుట, దానము, అహింసావ్రతము, సత్యము యీ నాలుగును ధర్మమార్గమునకు మూలములని వేదవిదులైన పెద్దలు చెప్పియుండిరి. ఇది గాక యింకొక ధర్మమును చెప్పెదను వినుమని యిట్లనియె.

ఓ రాజా! బ్రాహ్మణులను సేవించి వారలకు జీవనోపాధుల గలుగజేసి, వారిని గాపాడుచు వారిక్షేమము నెల్లపుడు దలంచుచుండుము. వారలె (అనగా బ్రాహ్మణులె) యీభూలోకమున ధర్మము నెఱిగింప ప్రమాణభూతులు.

అని చెప్పి భీష్ముడు తన యవసానకాలమున శరీరత్యాగమున కందఱయొద్దను ననుజ్ఞనడసి వేదవిదులను, ఆచార్యులను సేవించి యిహపరములు నొందుడని అందర కుపదేశించి పిమ్మట ధర్మజుని దగ్గఱకు బిలిచి తన తుదిమాటలుగా శరీరత్యాగకాలమునం దిట్లుపదేశించియున్నాడు.

సీ॥ అని పల్కి ధర్మజునాననంబున దృష్టి
నిలిపి బ్రాహ్మణులను గొలిచి మనుము
ఋత్విజులాచార్యు లెపుడుఁ బూజ్యులు నీకు
నేమఱిల్లకు మని యెలుగఁబలికి
కనుమూసి క్షణమాత్రకాల మూరకయుండె
ధారణాక్రమమునుద విలియువల
నాత్మసమాహితం బగునట్లు జేయుడు
సన్నిరుద్ధంబులై సర్వదేహ
తే॥ వాయువులు నూర్ధ్వగతి నొందె వాని విడిన
గాత్రములు విశల్యంబులై కానవచ్చె
దానికచ్చెరు వడిరెల్ల మానివరులు
వ్యాసముఖ్యులు కృష్ణాదు లైనవారు.

(శ్రీ కృష్ణభారతం. అనుశాసనికం. 5-269)

తా॥ బ్రాహ్మణులను సేవించుము. అందును విశేషించి ఋత్విజులు, గురువులను బూజించుము. వేదవిదులగు బ్రాహ్మణపోషణమున నేమరియుండకుము అని నొక్కిజెప్పి భీష్ముడు శరీరంబును త్యజించి వసువులం గలిసె.

మనుస్మృతియందు మనువిట్లాదేశించుచున్నాడు:—

శ్లో॥ ఆవృత్తానాం గురుకులాద్విప్రాణాం పూజకో భవేత్
నృపాణా మక్షయో హ్యేషనిధి ర్బ్రాహ్మోఽభిధీయతే."

(మనుస్మృతి 7-82)

తా॥ గురుకులమున వేదాధ్యయనము పూర్తిగావించి మఱలి వచ్చిన బ్రాహ్మణులను ధనధాన్యము లొసగి, శాస్త్రప్రకారము పూజింపవలయును. ఇట్లు బ్రాహ్మణులందుంపబడిన ధనధాన్యాదులు రాజులకు నిధివలె దఱుగనివై యెల్లప్పుడు మేలు గావించును.

శ్లో॥ "నతం స్తేనానచా మిత్రా హరంతి నచనశ్యతి।
తస్మాద్రాజ్ఞా నిధాతవ్యో బ్రాహ్మణే ష్వక్షయోనిధిః"॥
(మను 7-83)

తా॥ కనుక, అట్లు బ్రాహ్మణులందుంచిన యీ ద్రవ్యనిధిని దొంగలపహరింపరు. శత్రువులు గైకొనరు. అది తనంతట తఱుగదు. కాన రాజెప్పటికిని నశింపని ధనధాన్య దానరూపమైన నిధిని బ్రాహ్మణులయందుంచి దాచుకొనవలయును.

శ్లో॥ "ప్రాధీతే శతసాహస్రమనంతం వేదపారగే"॥ (మను 7-85)

తా॥ వేదాధ్యయనము చేయు బ్రాహ్మణుని కొసగిన దానము లక్ష గుణముల ఫలముగలది యగును. నాలుగు వేదములను బఠించినట్టి బ్రాహ్మణుని కొసగిన దానము అనంత పుణ్యఫలము నిచ్చును.

శ్లో॥ "యస్యరాజ్ఞస్తువిషయే శ్రోత్రియస్సీదతి క్షుధా।
తస్యాపితక్షుధా రాష్ట్రమచిరేణేవసీదతి"॥ (మను 7-134)

తా॥ ఏరాజు దేశమందు శ్రోత్రియుడాకలిచే నకనకలాడునో, అట్టిరాజు దేశమునందు జనులు క్షామ పీడితులై యాకలిచే జిక్కిపోదురు.

వేద శాస్త్రాది విద్యలయందు ప్రవృత్తులై తత్తత్కర్మాచరణము జేయుచుండిన బ్రాహ్మణులు జీవనాభావమున యిపుడు బాధనొందు చున్నారు. వైదిక ధర్మసంరక్షకుడైన క్షత్రియుడేనాడో యంతరించి యుండెను. ధర్మరక్షణ నిమిత్తము క్షాత్రమవలంబించిన బ్రాహ్మణ రాజులు మహమ్మదీయులతో చేయబడిన యుద్ధములలో నశించిరి. అంతటితో వైదికధర్మము సంరక్షకుడు లేనందున మ్లేచ్ఛులచే యణగ ద్రొక్కబడి ప్రాణావశిష్టమై నిలిచియున్నది. భారతజాతి విదేశీయ మ్లేచ్ఛ రాజులనుండి విముక్తిని బొందినది గాన ధర్మసంరక్షణము జరుగునని యాశించుచుదమనిన యిప్పటి ప్రభుత్వమువారు ఆసుర సంపదతోగూడిన పాశ్చాత్య మ్లేచ్ఛ నాగరికతావలంబనమున తమ ధర్మమును తామే నిరసించుకొనుచు దాని నాశనముసే గోరుచుండిరి. "యథారాజా తథాప్రజాః" అను నార్యోక్తి ననుసరించి ప్రజలును

ద్వేషాసూయాదులతో గూడినవారలై తమ స్వధర్మమును విడిచి పరధర్మావలంబు లగుచుండిరి ఇట్టి స్థితిలో వేదశాస్త్ర విద్యల నాదరించువారెవరు ? వేదశాస్త్రవేదియగు బ్రాహ్మణుని కాపాడు ధర్మమును ప్రభుత్వము, ప్రజలు విడిచినందున దానికి ప్రతిఫలముగ మనువుచే వచింపబడిన పైవాక్యానుసారము (మను 7-134) నిత్యక్షామములచే ప్రజలు భరింపరాని కష్టపరంపర లొందుచుండిరి. ప్రభుత్వము, ప్రజలు దీనిని గమనించెదరుగాక !

## భారతవర్ష స్తుతి

"If I were to look over the whole world to find out the country most richly endowed with all the wealth, power and beauty that nature can bestow - in some parts a very paradise on earth-I should point to India. If I were asked under what sky the human mind has most fully developed some of its choicest gifts, has most deeply pondered on the greatest problems of life, and has found solutions of some of them which well deserve the attention even of those who have studied Plato and Kant - I should point to India. And if I were ask to myself from what literature we, here in Europe, we who have been nurtured almost exclusively on the thoughts of Greeks and Romans, and of one Semitic race, the Jewish, may draw that corrective which is most wanted in order to make our inner life more perfect, more comprehensive, more universal, in fact more truly human, a life, not for this life only, but a transfigured and eternal life again I should point to India."

(Max Muller's India P. 6)

తా॥ ప్రకృతియొసంగగల సంపదను, శక్తిని, సౌందర్యమును సమృద్ధిగపొంది కొన్నిపట్టులందు భూలోకస్వర్గమా యనిపించునట్టి దేశమెక్కడనున్నదో లోకమంతయు వెదకి చెప్పుమన్న యెడల అదిగో భారతవర్షము ! అని వ్రేలెత్తి చూపుదును. ఏయాకాశము క్రింద మనుష్యుని బుద్ధి తన ఉత్తమ ప్రజ్ఞల గొన్నింటిని పరిపూర్ణ

ముగ వికసింపజేసికొని, జీవన సమస్యా ప్రశ్నములను గాఢముగ వితర్కించి, వానిలో, గొన్నింటిని ప్లేటో, కాంటుల సిద్ధాంతముల చదివినవారిని సహితము సావధానముగ చెరియొగ్గజేయుగలుగునట్టి పరిష్కారములను కనిపెట్టినవి సన్నడిగినయెడల అదిగో భారతవర్షము! అని వ్రేలెత్తి చూపుదును. ఇక్కడ యిరోపాలో ఉన్న మనము గ్రీకుల, రోమనుల, సెమిటకులగు యూదుల ఆలోచనలతో దాదాపు పూర్ణముగ బోషింపబడినవారము. మన అభ్యంతర జీవనము నింకను నిర్దోషముగ, ఇంకను సమగ్రముగ, ఇంకను సర్వతోముఖముగ, వేయేల ఇంకను అచ్ఛముగ మానవోచితముగ నొనర్చుకొని, ఇహ బ్రతుకును సంస్కరించుకొని శాశ్వత జీవనమును సంపాదించుకొనుటకు కావలసిన రసాయనము యేదేశపు సారస్వతములో దొరకనాయుని యడిగితును గదా, అదిలభించినచోటు అదిగో భారతవర్షము! అని తిరిగి వ్రేలెత్తి చూపుచుంటిని" అని మాక్సుమూలరు పండితుడు భారతవర్షమును స్తోత్రము చేసియున్నాడు.

## దానార్హులు

కొందరిక్కాలమున దానధర్మముల నొనర్చుట కర్హాతా నర్హాతల నీ దిగువ విధమున నిర్ణయించుచున్నారు. వికలాంగులగు వారలును, నిత్యవ్యాధిపీడితులును దానధర్మముల కర్హులనియు, అవయువ స్వాస్థ్యము గలిగినవారల కీయనక్కర లేదనియు చెప్పుచు ప్రాచీన విద్యాలయందారితేరిన బ్రాహ్మణుల కెట్టి సాయము చేయ కుపేక్షించుటయే గాక యితరులనుగూడను ప్రేరేపించుచు అట్టి దానధర్మములను మాన్పుచుండిరి. దీనివలన కలుగుచుండిన యనర్థమును వారు గుర్తించుటలేదు. సుమారు యేబదిసంవత్సరములనుండి యిట్టి విపరీతభావములు భారతీయులలో ప్రబలి యిప్పటికి చాలా హెచ్చుస్థాయికి వచ్చియున్నందున ప్రాచీన విద్యలు చదువుకున్న పండితుల కెట్టి పోషణయు లేక కృశించి వారి సంతానము నావిద్యలనుండి మరల్చి వ్యావహారికవృత్తి విద్యల నేర్పుచున్నందున ప్రాచీన విద్య లంతరించు స్థితిలోనికి వచ్చియున్నవి. సనాతన ధర్మావలంబులగు చాతుర్వర్ణ్యముల వారిలో

కొందఱు అధ్యయనపరులను పోషించుచునే యుండిరి. కాని వైశ్యాది వర్ణములవారిలో హెచ్చుమంది అల్పకారణముల పురస్కరించుకొని అసూయాపరులై పండితపోషణము నొదిలి యుండిరి.

పండితాదరణము నుపేక్షించుచున్నందున ప్రపంచమందలి యితర దేశములలోని పండితులందరిచేతను బాగ శ్రద్ధను గాంచుచుండిన వేదశాస్త్రాది విద్యలు క్షీణించుచున్నవి. అనగా అనాదినుండియు వేద శాస్త్రాధ్యయన సంపన్నులుగా నుండిన వారలు దాని నొదులుటకు కారణమగుచున్నది. వికలాంగులకు దానధర్మములు చేయుచున్నందున నాజాతి వృద్ధిని గాంచుచున్నది. అనగా విద్యావంతులైన పండితులు తగ్గిపోవుటయు, వికలాంగుల సంఖ్య వృద్ధియగుటయు మనము నిత్యము గాంచుచుంటిమి. ఏబది సంవత్సరముల క్రిందనుండిన వికలాంగులకంటే యీనాడీ కృష్ణాజిల్లాలో నూరురెట్లు వికలాంగు లెక్కువగా వృద్ధియైరి. అంగవైకల్యము దానపాత్రము కావడమువల్లను, దానివలన సులభముగా జీవనోపాధిగడచుచుండుటవలనను హీనజాతుల వారనేకులు అంగవైకల్యమును బొందుటకు శారీరకముగాను, మానసికముగాను ప్రయత్నించి కృతకృత్యులై తమ వికలాంగమును లోకులకు ప్రదర్శించి జీవించుచుండిరి. ఇది చాలా అపాయకరమైన దానపాత్ర నిర్ణయము. దీనివల్ల జాతిలో వికలాంగు లెచ్చిపోవుచున్నారు. పండితపోషణము లేనందున ప్రాచీన విద్యలు నశించిపోవుచుండినవి. గనుక యీ విషయమున యిప్పటికాలపు వారినిర్ణయము విపరీత ఫలమిచ్చి జాతిని నిర్వీర్యము చేయుటకు హేతువగుచున్నది. ప్రాచీన భారతవర్షమునందిట్టి వికలాంగుల విషయమున జాతి కపకారములేని విధమున చక్కని యేర్పాట్లు చేయబడినవి. వికలాంగులును, నిత్యవ్యాధి పీడితులును, సంఘములో ప్రజలకు దృగ్గోచరము గాకుండునట్లు వారిని సంఘమునకు దూరముగా ప్రత్యేక ప్రదేశములలో నుంచి వారిని రాజు భరింపవలయునని ధర్మశాస్త్రములు విధించుచున్నవి. గర్భిణీస్త్రీలట్టి వికలాంగుల దర్శించిన నాదృశ్యము వారి చిత్తమందంకితమై కలుగబోవు సంతానమున కంగవైకల్యము సిద్ధించును. అందువలన గ్రహణకాలమున చంద్రునిలో

గలుగు కోరికనుగూడ చూడనీయరు. పురుషులు కూడనట్టి యంగ వికలులను, నిత్యవ్యాధి పీడితులను తరుచు చూచుచుండిన వారి హృదయములందట్టి కురూపఛాయలంకితమై స్త్రీ సంగమకాలమున స్మరింపబడిన అట్టివారికి కలిగెడి సంతానము తప్పక అంగవైకల్యము నొందగలదు. కావున అట్టివారిని సంఘమునకు దూరముగానుంచి వారిని తన బిడ్డలవలె రాజు పోషించవలయునని విధింపబడినది.

శ్లో॥ "పంగ్వంధ బధిరామూకా వ్యాధి నోపహతాశ్చయే।
భర్తవ్యాస్తే మహారాజనతుదేయః ప్రతిగ్రహాః" ॥

(భారతం అరణ్యపర్వం. పరాశరమాధవీయం. ఆచారకాండ ౧ అధ్యాయం).

తా॥ "కుంటి, గ్రుడ్డి, చెవిటి, మూగవారలును, వ్యాధిపీడితులును రాజువలన పోషింపబడవలసినవారుగాని దాన, ప్రతిగ్రహములకు పనికిరారు:" అనిధర్మము విధింపబడినది.

గనుక ప్రజలు తగు ప్రయత్నముచేసి వికలాంగులను వ్యాధి పీడితులను సంఘములో కలియకుండునటుల తగిన కట్టుదిట్టముల చేయించి వారినొక ప్రత్యేక సౌకర్యముగల ప్రదేశమునందుంచి వారికి సకల సౌఖ్యములొనగూర్చి పోషించునటుల ప్రభుత్వమువారిని వత్తిడిచేయవలయును. అవసరమైన వారిపోషణకు స్వల్ప పన్ను నొసంగుటకుకూడను సిద్ధపడవలయును. ప్రాచీనకాలమున అనగా 25వ మహాయుగములోని త్రేతాయుగమున దశరథమహారాజు రాజ్యమునందు వికలాంగులుగాని, వికార రూపులుగాని లేరని శ్రీమద్రామాయణము బాలకాండమున చెప్పబడినది. (వావిలికొలను సుబ్బారావు గారి శ్రీమద్రామాయణం బాలకాండ 261 పద్యమును చూడుడు.)

శ్లో॥ "అనర్హతే యద్దదాతి నదదాతియదర్హతే।
అర్హానర్హా పరిజ్ఞానాద్దానాద్ధర్మాచ్చ హీయతే॥

(పరాశర మాధవీయం. ఆచారకాండ & మనువు.)

తా॥ దానమునకు అర్హతలేని వారికెవడిచ్చుచున్నాడో దానార్హుడైన సత్పురుషున కెవడీయడో అట్టివాడు యోగ్యతాయోగ్యతల

నెఱుగక చేయుటవలన దానధర్మముల ఫలమును పొందకపోవుటయే గాక హైన్యస్థితిని కూడా పొందుచున్నాడు

మానవుల కిహపర సౌఖ్యములనొందుటకు చేయబడు దానములు వేదశాస్త్రవేదియైన బ్రాహ్మణుని వలన శోభించును. అవి యనేక రెట్లుగా వృద్ధిపొంది ప్రతిఫలము నొసంగును. ప్రాచీన విద్యలను సంరక్షించి మానవజాతికి శాశ్వతముగా నుండునట్లు వాటిని నిలుపవలయు ననిన నాశాస్త్రములధ్యయనముచేసి వాటిని యెట్టి దోషము దొర్లకుండునటుల స్వచ్ఛముగా కాపాడువారి కుటుంబముల పోషించుట త్యవసరము. ఈకాలమందన్ని దేశములలోను క్రికెట్టు, కాలిబంతి ఆట మొదలయిన విజాతీయ ఆట కుగల ప్రోత్సాహములో సహస్రాంశ సహాయముకూడా మనదేశమున వేదాధ్యయన పరునికి లభింపకున్నది. భారతదేశముయొక్క పుణ్యావశమున సృష్ట్యాదియందున లభించి భారతీయుల కిహపరసౌఖ్యదాయకమగుటయే గాక ప్రపంచమందన్ని జాతులవారికి తారకమై వారలందరిచేతను బాగ ద్తను గాంచుచుండిన వేదమాతను యథాస్థితిగ కాపాడుకొనుట భారతీయులకు ధర్మమను విషయమును మఱచుట యీదేశీయుల దుష్కర్మఫలమని తోచుచున్నది. భారతీయులలో సనాతనధర్మావలంబులందఱు మేలుకొని వేదాధ్యయనాది వైదిక కళలను కాపాడుకొని వృద్ధిచేసుకొనుట శ్రేయము. ప్రజలే గాక ప్రభుత్వమువారును వేదాధ్యయనాది కళలను ప్రోత్సహించి నాలుగువేదములను వల్లెవేసి స్వర, వర్ణ, మాత్ర, పద, క్రమ, జట, ఘనాదిసహితముగా అధ్యయనము చేయగల మహామేధావులను తయారుజేయుట విధియని మనవి జేయుచుంటిమి—ఇందును గురించి మనుస్మృతియం దిట్లు రాజధర్మము చెప్పబడినది:—

శ్లో॥ "శ్రోత్రియం, వ్యాధితార్తౌచ బాలవృద్ధావకించనమ్।
మహాకులీన మార్యంచరాజా సంపూజయేత్సదా॥"

(మను. 8_395)

తా॥ "వేదాధ్యయన పరుండగు బ్రాహ్మణుని, రోగిని, దుఃఖితుని, బాలుని, వృద్ధుని, దరిద్రుని, గొప్పకులమున బుట్టినవానిని, ఉదారుని, దానము మానము, మేలుసేయుట యను వీనిచే నెల్లపుడు

గౌరవింపవలయును." అని రాజుకు ధర్మము విధించబడినది. వేదాధ్యయనముచేయు శ్రోత్రియబ్రాహ్మణుని దానముచేతను, రోగిని వైద్య సహాయముచేతను, దుఃఖితునాదరించి వాని దుఃఖకారణ మరసి దాని నివారించుటచేతను, బాలుడు ధనాదిసొత్తులు గలవాడై యుండిన వానికి వ్యవహారము నడుపుకొనగల ప్రాయము వచ్చువఱకు వాని ధనాదుల కాపాడుట, ధనాదులు లేనివాడైన వానిని విద్యావంతునిజేసి యొక కుటుంబీకుని జేయుట, వృద్ధుడసహాయుడై జీవనోపాధి లేక యుండిన వానిని జీవితకాలమువఱకు అన్నవస్త్రాదు లిచ్చి కాపాడుట, దరిద్రునికి తగు బ్రతుకుదెరువు కల్పించుట, గొప్పకులమున బుట్టిన వానిని గౌరవించుట మొదలగు యుపకారములచే వారినెల్లపుడును రాజు కాపాడుచుండవలయునని మనువాదేశించుచున్నాడు ప్రాచీన భారతవర్షములో అట్టి యుత్తమధర్మము లాచరణలో నుండియున్నవి. ఇప్పటికాలమునకందు కొన్ని ధర్మములు నామమాత్రముగానైనను నాచరింపబడుచుండినవి గాని వేదాధ్యయనము చేయు బ్రాహ్మణుని నామమాత్రముగానైనను నాదరించుటలేదు. విదేశీయ ప్రభువులచే నీదేశమున స్థిరముగా తమ అధికారము నిలుపుకొనుటకు కల్పించబడిన కుతంత్రములం జిక్కి ప్రజలొకకులమువారి నింకొక కులమువార ద్వేషించుచుండిరి. అందు ప్రత్యేకము దేశక్షేమమునకు, ప్రాచీనవిద్యాసంరక్షణమునకు, దేశప్రతిష్ఠ నెచ్చింపజేసి ప్రపంచజాతుల వారికందరికి గురుత్వముజేయుటకు సమర్థమగు బ్రాహ్మణవర్ణమునం దసూయాద్వేషముల పెంచుచు వేదాధ్యయన సంపన్నులగు శ్రోత్రియ బ్రాహ్మణుల పోషింపమానిరి. భారతజాతి కిది పతనహేతువగును. గనుక భారతీయులు తమకు స్వాభావికముగా సృష్ట్యాది నుండి యిప్పటివఱకు వచ్చుచుండిన వేదశాస్త్రాది ప్రాచీనవాఙ్మయ నిక్షేపమును యథావిధిగా కాపాడుకొనుచు తమకు, లోకమునగల మానవజాతికి మేలొనరించు చుందురు గాక.

లౌకిక విద్యలనేర్చి రాజకీయాది రంగములందుండెడి బ్రాహ్మణు లితరులతో సమానముగా లౌకిక వ్యాపారములం దొకరొకరికి పోటీగా నుండిరిగాని వేదాధ్యయన పరుడగు బ్రాహ్మణు డెవరికిని పోటీ లేదు.

అతడత్యంత వినీతుడు, మితజీవి, అల్పసంతోషి, పవిత్రుడు, ప్రజలకు ధర్మోపదేష్ట. వైదిక ధర్మముల శ్రద్ధాభక్తులతో నాచరించుచు లోక హితమును గోరుచుండువాడు. లౌకిక సంబంధములేకనే జీవితకాలమం తయు అధ్యయనాధ్యాపనల జేయుచుండువాడు. అట్టివారి వలననే లోకులకు క్షేమము కలుగుచున్నది. వేదాధ్యయనపరుడగు బ్రాహ్మణుడు, పతివ్రతయగు స్త్రీ, అతిథి పూజాధురంధరుడగు గృహస్థుడు జననీ జనకులను పూజించుచు వారి యాజ్ఞానువర్తియైన కుమారుడు, గురుభక్తి గలిగి చరించు శిష్యుడు మొదలగు ధార్మిక సత్పురుషుల వలననే లోకము లీకుష్కాలములో నశింపక నిలిచియున్నవి. వీరంద రికి వేదధర్మమే పరమ ప్రమాణమై వెలయుచున్నది. అట్టి వేదమాత సర్వవిధముల సంరక్షింపబడదగినదిగాని యుపేక్షింపబడదగినదికాదు. దేశమున కళాభివృద్ధి నొందింపవలయునని ప్రయత్నములు జరుగు చుండినవిగాని సర్వకళలకు మూలమైన 'వేదాధ్యయన కళ' నభివృద్ధిపరచు సంకల్పముకూడ యింతవఱకు ప్రజలయందుగాని, ప్రభుత్వమునందుగాని గలుగకుండుట శోచనీయము. వేదాధ్యయనకళా భివృద్ధికొరక యుద్యమ మెంత త్వరలో ప్రారంభింపబడిన అంత మేలు చేకూరును.

ప్రపంచ జాతులవారందరు తమకు కావలసిన సమస్త విద్యలు సంస్కృత సారస్వతమున, వేదశాస్త్రాది ప్రాచీన వాఙ్మయమునగల వనియు, వానిని భారత దేశమునగల బ్రాహ్మణజాతివలననే పొందదగు ననియు నాశించుచుండ భారతదేశములోని ప్రభుత్వమును, ప్రజలును వేదశాస్త్రనిష్ఠుడైన బ్రాహ్మణుని పోషింపక నా విద్యల నశింపుజేసు కొనుచుండుట వివేకముతోగూడిన పనికానేరదు. ప్రాచీన విద్యలు లోపించిన ప్రపంచ జాతులన్నియు ముందు కాలమున భారతీయులను దూషింపకమానరు. గనుక లోకకల్యాణ హేతువైన వేదవాఙ్మయ మును దాని నర్థముజేయగల సంస్కృత భాషను, వేదముల నధ్యయ నాధ్యాపనలద్వారా సస్వరముగా, స్వచ్ఛముగా నుండునటుల రక్షింప గల బ్రాహ్మణజాతిని కాపాడి భారతీయులు యితర జాతులవారి మన్న నలకు పాత్రులగుటయేగాక తామిహపరసౌఖ్యముల నొందుదురుగాక!

# వేదము

వేదము "విద్" అను ధాతువునుండి పుట్టినది. వేదమునకు శ్రుతి యనియు, అమ్నాయమనియు పేర్లుగలవు. "వేదయితీ తి వేదః" అనగా తెలియజేయునది గనుక వేదమని చెప్పబడినది. దేనిని తెలియజేయున దనగా !—

"ప్రత్యక్షేణానుమిత్యావా యస్తూపాయో నబుధ్యతే
ఏతం విదంతివేదేన తస్మాద్వేదస్యదత"॥

తా॥ ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములచేతగాని మఱి యే యితరోపాయములచేతగాని తెలియబడుటకు వీలులేని విషయమును తెలుపునదిగనుక వేదమునకు"వేదత్వము" సిద్ధించినది. ప్రత్యక్ష, అనుమానప్రమాణములచే తెలియుటకు వీలగు విషయములను చెప్పుట యొక గొప్పకాదు. వాని కతీతములైన విషయములను జెప్పుటచే వేదము పరమప్రమాణమైనది.

"విదన్తియతో ధర్మాధర్మావితివేదః" దేనివలన ధర్మాధర్మములు తెలియబడునో అది వేదము. "శ్రూయతి ఇతిశ్రుతిః" (పరమాత్మనుండి) స్వాభావికముగా దానంతటది సృష్ట్యాదియందు వినబడునది గనుక "శ్రుతిః"యని పిలువబడినది. ఇదిగాక శ్రోత్రేంద్రియముచే శబ్దరూపముగా తెలియబడుటనున్నట్టి "శ్రుతిః" యనియుం జెప్పబడెను. "ఆమ్నాయః" అనగా వల్లించుటయని యర్థము – వల్లన వలననే పొందతగినదని తాత్పర్యము.

ఇదిగాక ప్రతిసృష్ట్యాదియందును సృష్టికర్తకు వేదములు వినబడు చుండును. వానిని శ్రవణమువలనపొంది సృష్టికర్తయైన బ్రహ్మ ఋషుల కుపదేశించుచుండును. ఋషులు తమ శిష్యుల కుపదేశించు చుందురు. ఇట్లు గురుశిష్య పరంపరచే లోకమున ప్రచారితములగు చుండును. అందువలన వేదము లుపదేశరూపమున శ్రవణమువలన పొందతగినవేగాని లిఖితముగాచేసి వల్లించతగినవికావు. ఎల్లప్పుడును వినుటవలననే పొందతగినవై యున్నందున "శ్రుతిః" యను నామము వేదమునకు సార్థకమైనది — "ఆమ్నాయతే పరంపర యేత్యా

మ్నాయః” అనగా పరంపరగా (గురు శిష్యపరంపరగా) అభ్యసింప వలసి యుండుటంబట్టి “ఆమ్నాయము”నబడెను.

వేదములలోని కొన్ని మంత్రములకు విశ్వామిత్ర, భారద్వాజ, వశిష్ఠ,వామ దేవాదులు కర్తలైనట్లు కనుపించుచుండుటచే వేదముకాల క్రమమున ననేకులచే రచియింపబడినట్లు కొందరు చెప్పుచున్నారు. అది సరికాదు. వేదమాత అజ్ఞానులైన జీవులకు సులభంగా బోధపడుటకుగాను పేర్లను కల్పించినా యాఋషులా యాఋక్కులను రచించినట్లును దాని వలన వారలు దేవతానుగ్రహము పొందినట్లును చెప్పబడినది. వేదము లలోని పురుషనామములన్నియు కల్పితనామములు. బోధకొఱకు కల్పించబడినవి. పిమ్మట లోకములో ప్రజలు వేదములోని నామము లనే తమబిడ్డలకు పెట్టుకొనుచున్నందునను, వారు తపస్సుచే గొప్ప వారై ఋషిత్వము నొందినందున యీఋషులే వేదములలోని ఋక్కులకు కర్తలైయుందురని లోకులూహించుటకు కారణమైనది. అదియును గాక బోధకొరకు వేదములలో చెప్పబడిన సంఘటనలు ప్రతిసృష్టియందును తిరిగి తిరిగి వచ్చుచుండును. శ్లో॥ “భూతం భవద్భ విష్యచ్చ, సర్వంవేదాత్ప్రసిద్ధ్యతి.” (మను. ౧౨-౯౭). జరిగిన, జరుగు చున్న, జరుగబోవు సర్వవిషయములును వేదము ననుసరించియే సిద్ధినిబొందుచున్నవి. అని చెప్పబడియుండుటవలన అనాదిగా చక్రా కారమున వచ్చుచు పోవుచుండిన సృష్టులలో తటస్థమగుచుండిన సంఘటనలే తిరిగి తిరిగి ప్రతిసృష్టిలోను వచ్చుచుండును. వెనుకటి సృష్టియందువలెనే నామరూపనిర్దేశములగుచుండును. స్వాభావికనియ తితోగూడి తటస్థమగుచుండిన విషయములే వేదములలో వినబడు చుండినవి. ప్రతిసృష్టిలోను వేదములో వినబడు నామరూపాదులతో గూడిన ఋషులే తిరిగి తిరిగి వచ్చుచు బోవుచుందురు. గనుక వేద ములో ఋషులపేర్లున్నంత మాత్రమున మంత్రద్రష్టలని చెప్పబడిన ఋషులు మనకాలమునకు ముందు కొన్నివేల సంవత్సరముల క్రింద టనో, లక్షలసంవత్సరముల క్రిందటనో యుండి వేదఋక్కులను రచించి నందువలననే వేదములో వారిపేర్లు కనిపించుచుండినట్లు మనమెంచ రాదు. పరమాత్మయందు (లేక ప్రకృతియందు) అణగియుండి నియత

కాలమున వచ్చుచు పోవుచుండెడి యీజగత్తులోని జీవుల ననుగ్రహించుటకుగాను వేదమాత నాయా విషయములు సంఘటితములైనటుల మనకు కళ్లకు కట్టినట్లు తెలియుటకుగాను పేర్లను కల్పించి కథలరూపమున, ఆఖ్యాయికలరూపమున మనకు ధర్మాధర్మముల స్వరూపమును బోధించియున్నది. వేదములోని ఋక్కులు యీనామధారులైన పురుషులచే కల్పింపబడినవికావు. వేదములోని కల్పితనామములే లోకములో మానవులచే ధరింపబడినవి అని తెలియవలెను.

## వేదభాగములు

వేదము కర్మకాండము, ఉపాసనాకాండము, జ్ఞానకాండమని మూడుభాగములు. వేదము మంత్రములనియు, బ్రాహ్మణములనియు, ఆరణ్యకములనియు మూడువిధములు.

౧ ఋగ్వేదము, ౨ యజుర్వేదము, 3 సామవేదము, ౪ అథర్వణవేదము,నని వేదము నాలుగుభాగములుగ వేదవ్యాసభగవానునిచే విభాగింపబడినది. పూర్వయుగములలో యీనాలుగు వేదములేకముగా కలిసియుండేవి. ఆకాలపుపురుషులు దానినంతయు నేకముగా నధ్యయనము చేయగలిగియుండిరి. కలియుగమున అల్పసత్త్వులు, నిత్యరోగులు, మందబుద్ధులు, అల్పాయువులగు నరులుపుట్టుదురనియు, వేదమంతయు నధ్యయనము జేయగల మేధాసంపద వారికుండదనియు నెంచి వేదవ్యాసమహర్షి దానిని నాలుగుభాగములుగా నొనర్చియుండెను.

## ౧. ఋగ్వేదము

“ఋక్” అనగా పరమాత్మను స్తుతించు మంత్రము, అట్టి ఋక్కులు లేక మంత్రములు 10,622 ఋగ్వేదమునందుగలవు. వానితో యజ్ఞమునందు దేవతలను స్తుతించువానికి “హోత”యని పేరు. కొన్ని మంత్రములు గలదానిని సూక్తమని చెప్పెదరు అట్టి సూక్తములు 1028 గలవు. కొన్నిసూక్తములు గలదియొక అనువాకము. అట్టి అనువాకములు 85. కొన్నియనువాకములతో గూడిన దానికొక మండల

మనిపేరు అట్టి మండలములు పదిగా ఋగ్వేదము విభజింపబడినది. ఋగ్వేదమునందలి పదములు 1,53,826; అక్షరములు 4,32,000.

ఇదిగాక ఋగ్వేదము నింకొక విధముగా అధ్యయన పరులు విభాగించిరి.

అష్టకములు—8.

అష్టకముకు యెనిమిది అధ్యాయముల చొ॥ } 8 × 8 = 64 అధ్యాయములు

అధ్యాయం 1 కి సుమారు 33 వర్గములు చొ॥ గల వర్గములు మొత్తం } 2006

## ౨. యజుర్వేదము

"యజ్" అను ధాతువునుండి పుట్టినది. యజుర్వేదమనగా యాగము, బలి, దానము మొదలగువానిని గురించి చెప్పబడిన వేదము. యజ్ఞకర్మ లాచరించునపుడు చెప్పవలసిన మంత్రములిందు గలవు. వీనినధ్యయనము చేయువారి కధ్వరులని పేరు.

యజుర్వేదము. ౧. కృష్ణ యజుర్వేదము ౨. శుక్ల యజుర్వేదము అని రెండుశాఖలు. కృష్ణ యజుర్వేదము తైత్తిరీయసంహిత యనియు, శుక్లయజుర్వేదము వాజసనేయ సంహితయనియు చెప్పబడుచున్నవి.

శుక్ల యజుర్వేదమునకు ఉదాత్త, అను దాత్తములను రెండు స్వరములు. కృష్ణ యజుర్వేదమునకు ఉదాత్త, అనుదాత్త, స్వరిత ప్రచయములను నాలుగుస్వరములు. శుక్లయజుర్వేదములో చేరిన ఈశావాస్యము, బృహదారణ్యకమను ఉపనిషత్తులు ప్రధానమైనవిగా నెంచబడుచున్నవి.

ఈ వేదమునకుగల బ్రాహ్మణములు. శతపథ; తైత్తిరీయములు. తైత్తిరీయ సంహిత యనెడి కృష్ణయజుర్వేదము ఏడు కాండములుగా నున్నది. ప్రథమకాండలో ప్రపాఠకములు యెనిమిది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అందు | 1 వ | ప్రపాఠకములో | 14 | అనువాకములు | 28 | పనసలుగలవు. |
| ,, | 2 | ,, | 14 | ,, | 34 | ,, |
| ,, | 3 | ,, | 14 | ,, | 31 | ,, |
| ,, | 4 | ,, | 46 | ,, | 54 | ,, |
| ,, | 5 | ,, | 11 | ,, | 51 | ,, |
| ,, | 6 | ,, | 12 | ,, | 51 | ,, |
| ,, | 7 | ,, | 13 | ,, | 51 | ,, |
| ,, | 8 | ,, | 22 | ,, | 42 | ,, |
| వెరసి | 8 | ,, | 146 | ,, | 342 | ,, |

రెండవకాండములో ప్రపాఠకములు ఆఱు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అందు | 1 వ | ప్రపాఠకములో | 11 | అనువాకములు | 65 | పనసలు గలవు. |
| ,, | 2 | ,, | 12 | ,, | 71 | ,, |
| ,, | 3 | ,, | 14 | ,, | 56 | ,, |
| ,, | 4 | ,, | 14 | ,, | 48 | ,, |
| ,, | 5 | ,, | 12 | ,, | 74 | ,, |
| ,, | 6 | ,, | 12 | ,, | 70 | ,, |
| వెరశి | 6 | ,, | 75 | ,, | 384 | ,, |

మూడవకాండములో ప్రపాఠకములు—అయిదు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అందు | 1 | ,, | 11 | ,, | 42 | ,, |
| ,, | 2 | ,, | 11 | ,, | 46 | ,, |
| ,, | 3 | ,, | 11 | ,, | 36 | ,, |
| ,, | 4 | ,, | 11 | ,, | 46 | ,, |
| ,, | 5 | ,, | 11 | ,, | 36 | ,, |
| ,, | 5 | ,, | 55 | ,, | 206 | ,, |

నాలుగవ కాండములో ... ఏడు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ,, | 1 | ,, | 11 | ,, | 46 | ,, |
| ,, | 2 | ,, | 11 | ,, | 48 | ,, |
| ,, | 3 | ,, | 13 | ,, | 36 | ,, |
| ,, | 4 | ,, | 12 | ,, | 37 | ,, |
| ,, | 5 | ,, | 11 | ,, | 27 | ,, |
| ,, | 6 | ,, | 9 | ,, | 46 | ,, |
| ,, | 7 | ,, | 15 | ,, | 39 | ,, |
| ,, | 7 | ,, | 82 | ,, | 279 | ,, |

అయిదవ కాండములో ప్రపాఠకములు ఏడు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అందు | 1 | ,, | 11 | ,, | 59 | ,, |
| ,, | 2 | ,, | 12 | ,, | 64 | ,, |
| ,, | 3 | ,, | 12 | ,, | 48 | ,, |
| ,, | 4 | ,, | 12 | ,, | 58 | ,, |
| ,, | 5 | ,, | 24 | ,, | 62 | ,, |
| ,, | 6 | ,, | 23 | ,, | 54 | ,, |
| ,, | 7 | ,, | 26 | ,, | 58 | ,, |
| ,, | 7 | ,, | 120 | ,, | 403 | ,, |

ఆఱవకాండములో ప్రపాఠకములు ఆఱు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ,, | 1 | ,, | 11 | ,, | 76 | ,, |
| ,, | 2 | ,, | 11 | ,, | 59 | ,, |
| ,, | 3 | ,, | 11 | ,, | 62 | ,, |
| ,, | 4 | ,, | 11 | ,, | 51 | ,, |
| ,, | 5 | ,, | 11 | ,, | 40 | ,, |
| ,, | 6 | ,, | 11 | ,, | 43 | ,, |
| ,, | 6 | ,, | 66 | ,, | 331 | ,, |

ఏడవ కాండములో ప్రపాఠకములు అయిదు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ,, | 1 | ,, | 20 | ,, | 52 | ,, |
| ,, | 2 | ,, | 20 | ,, | 50 | ,, |
| ,, | 3 | ,, | 20 | ,, | 42 | ,, |
| ,, | 4 | ,, | 22 | ,, | 53 | ,, |
| ,, | 5 | ,, | 25 | ,, | 54 | ,, |
| ,, | 5 | ,, | 107 | ,, | 251 | ,, |

మొత్తం కాండలు 7, ప్రపాఠకములు, 44. అనువాకములు 651. పనసలు 2196. పదములు 19,290. అక్షరములు 2,53,868 గలవు.

## 3 సామవేదము

సామవేదమనగా, గాన రూపమైన ఋక్కులుగలది. ఈ వేదమ:వధ్యయనము చేసినవారిని ఉద్గాత్రులని పిలచెదరు. వీరిలో ఉదీచ్య సామగులు, ప్రాచ్య సామగులు అని రెండు విధములగు వారలుగలరు. ఛాందోగ్య, కేనోపనిషత్తులీ వేదములోనివే. ఇది సహస్ర సంహితా భేదముగలదిదైయున్నది కొందఱు ౧౮౭౫ బుక్కులున్నవని చెప్పెదరు. దీనికి తాండ్య, షడ్వింశ, మంత్ర బ్రాహ్మణములు చేరియున్నవి.

## ౪ అధర్వణ వేదము

అధర్వణవేదమునందు శాంతిక, పౌష్టిక, చరకాది మంత్ర, తంత్ర ప్రయోగవిధులుగలవు. ఈ వేదమును వ్యాసభగవానుడు తన శిష్యుడైన సుమంతునికిని, ఆతడు తన కుమారుడైన కబంధువునకు నుపదేశించిరి. కబంధఋషి దీనిని రెండుగ భాగించి దేవదర్శాది శిష్యులకుపదేశించెను.

ఇందు ౨౦ కాండములును ౧౦౧౬ వాక్యములును, నూటికి పైబడిన అనువాకములును ౭౩౦ కి పైన గల సూక్తములును గలవు. ఇది వలుబది ప్రపాఠకములుగా విభజింపబడియున్నది. గోపథ బ్రాహ్మ

ణము దీని కనుబంధమైయున్నది. ఈ వేదమందలి కేనోపనిషత్తు, ముండకోపని షత్తును ప్రశస్తములైయున్నవి.

పైన చెప్పబడిన వేదములు నాలుగింటియందును, తత్త్వజ్ఞాన మును బోధించెడి యుపనిషత్తులును, వేదాంగములైన షట్ఛాస్త్రము లునూ, వేదముల కనుబంధములగు ఉప వేదములును గలవు.

## ౫ ఉపనిషత్తులు

"ఉపనిషత్" అను శబ్దము మూడు పదములతో గూడి యున్నది. 'ఉప', 'ని', 'సత్' ఉప = సమీపమున, ని = చక్కగా, సత్ = పొందబడినది. అనగా గురువు సమీపముననుండి అధ్యాత్మ విద్య చక్కగా పొందబడినదని తాత్పర్యము. "ఉపనిషత్" = 'అస్యాం శ్రేయః ఉపనిషీదతి' అని విగ్రహము. అనగా మేలు కలది లేక హిత మును తెలియజేయునదియని తాత్పర్యము.

ఉపనిషత్తులకు వేదాంతములనియు, వేద శిరస్సులనియు, రహస్యములనియు వివిధములైన పేర్లు గలవు. నాలుగు వేదములలో నుండి ౧౧౮౦ ఉపనిషత్తులు గలిగెను. ఋగ్వేదమునందు ౨౧ శాఖ లును, యజుర్వేదమునందు ౧౦౯ శాఖలును,సామవేదమునందు౧౦౦౦ శాఖలును, అధర్వణవేదమునందు ౫౦ శాఖలును గలవు. ఈ ౧౧౮౦ శాఖలు ఉపనిషత్తులనబడును. వీనిలో ౮౮౦ శాఖలు కర్మకాండ మును బోధించునుగావున కర్మకాండమని యందురు. ౨౩౨ శాఖలుధ్యేయ బ్రహ్మమును బోధించును గావునఉపాసనాకాండ మందురు - ౧౦౮ శాఖలు జ్ఞేయ బ్రహ్మమును బోధించునుగాన జ్ఞానకాండమని పేరు. ఈ ౧౦౮ కి ఉపనిషత్తులని పేరు. వీనియందు దశోపనిషత్తులు ద్వైత, అద్వైత విశిష్టాద్వైత మతస్థులచే యుత్తమ మైనవిగా యంగీకరింపబడి నాయామతాచార్యులచే నాయా మత సిద్ధాంతముల కనుకూలముగ భాష్యములు వ్రాయబడినవి.

## దశోపనిషత్తులు

౧. ఈశావాస్యోపనిషత్ ౨. కేనోపనిషత్ ౩. కఠోపనిషత్ ౪. ప్రశ్నోపనిషత్ ౫. ముండకోపనిషత్ ౬. మాండూక్యోపనిషత్ ౭. తైత్తిరీయోపనిషత్ ౮. ఐతరేయ ౯. ఛాందోగ్య ౧౦. బృహదారణ్యకోపనిషత్. అను పదియు మంత్రభాగములై యున్నవి. మిగత యుపనిషత్తు లన్నియు శ్లోక, వాక్యరూపములనుండి యున్నవి.

## ఉపవేదములు ౪.

౧. ఆయుర్వేదము ౨. ధనుర్వేదము ౩. గాంధర్వవేదము ౪. అర్థవేదము. ఈఅర్థవేదమునందు శిల్పశాస్త్రము, పాకశాస్త్రము, నీతిశాస్త్రము, అశ్వశాస్త్రము మొదలైన అర్థ సంపాదన కనుకూలించు కళలనేకములు గలవు.

## వేదాంగములు

1. శిక్ష 2. ఛందస్సు 3. వ్యాకరణము 4. జ్యోతిషము 5. నిరుక్తము 6. కల్పము (లేక కల్పసూత్రములు) యీ ఆరును వేదాంగములై యున్నవి. షడంగ సహితమైన వేదాధ్యయనమువలన వేదార్థ ప్రతిపాదనము చేయుట కధికారి యగును.

ప్రపంచమందలి సమస్త వాఙ్మయములోను వేదము మొట్ట మొదటిది. వేదమునకు పూర్వముండిన గ్రంథమేదియును లేదు. వేదమనాదినుండియు నుండియున్నది. వేదము గీర్వాణ భాష (అనగా దేవభాష) లో నుండెను సృష్టి ప్రారంభ కాలమున స్వాయంభువ మనువు, ప్రజాపతులు మొదలగువారు దేవలోకమునుండి భూలోకమునకు మానవ సృష్టిసజేయు నిమిత్తం వచ్చి యుండిరి. దేవలోకమనగా ఉత్తర ధ్రువమని ప్రథమింపబడు. భూలోకము, భువర్లోకము అను రెండు లోకముల కూర్ధ్వమున సువర్లోకము (లేక స్వర్గము) అనునదొకటి కలదు. దానికి పైన మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్య

లోకము ననెడి యింక నాలుగు లోకములుగలవు. భూలోక, భువర్లోక, సువర్లోకములనుగురించియు, ఆ లోకములలో జీవులు సుఖముగా మన గలుగుటకు తగిన యుపాయములను బోధించుటకే వేదములన్నియు పూర్వ భాగమున ప్రవర్తించినవి. గనుక వేదములలో చెప్పబడిన స్వర్గలోక మీభూగోళముయొక్క యుత్తర ధ్రువ ప్రాంతమని యెవ్వ రును తలంపగూడదు. అట్టి యూహా జనించుటకు తగిన యవకాశము వేదములలో నెచ్చటను గానరాదు. స్వాయంభువాదులు మాటలాడు భాష దేవ భాష అదియే భూలోకమున ప్రథమమున (సృష్ట్యాది యందు) వాడబడినది. కాలము గడచుచు రాగా మాటలాడుచుండిన భాషలో విద్యావిహీనులైన మానవులవలన అపశబ్దములుచ్చరింపబడు చుండుటవలన క్రమక్రమముగా భాష కలుషితమై స్వరూపముమారి వేరుభాషగా పరిణామమును బొందుచువచ్చెను. అప్పుడపుడు పండి తులు సంస్కరించి వ్యాకరణముల నొనర్చి భాషను ఛందోబద్ధ మొనర్చుచుండిరి. అవన్నియు కాలగర్భములో విలీనమైపోయినవి. జనసామాన్యము మాటలాడు వాగ్వైఖరి వలన బహు రూపముల భాషలుత్పన్నమగుచు వచ్చినవి. మనముండిన యీ వైవస్వతమనువు (ఏడవమనువు) కాలములోని యిరువదియెనిమిదవ మహా యుగము లోని యీ కలికాల ప్రారంభమున పాణిని మహా ఋషి అవతరించి అప్పటి కాలపు ప్రజలలో ప్రచారములో నుండిన భాషను సంస్క రించి దానికి సంస్కరింపబడిన భాష గనుక సంస్కృతమని పేరిడెను. సంస్కృతము దేవ భాష ననుసరించియున్నను సంస్కృత పండితులకు దేవ భాషలో నుండిన వేదములర్థము కానేరవు.

అందువలన మహా పురుషులైనవారలుద్భవించి వేదముల ్రటి సంస్కృతి భాషలో భాష్యములు వ్రాసియుండిరి. అట్టి భాష్య ులు చాలాభాగము కాలగర్భములో విలీనమైనవి. ఇప్పుడు మనకు మిగిలియున్నవానిలో యాస్కమునిచే అయిదువేల సం॥ (5000 సం।) రముల క్రిందట వ్రాయబడిన భాష్యములో పోయినదిపోగా మిగిలియున్న భాగమొకటి. రెండవది శ్రీ విద్యారణ్యా స్వామివారిచే ఆరువందల సంవత్సరముల క్రిందట వ్రాయబడిన భాష్యము. అది విపులముగానుండి

లభించుట యిప్పటికాలమువారి యదృష్టము. ఆ భాగ్యమే లేని యెడల వేదము యీ కాలమున మన కర్థమయ్యెడిదికాదు. అనాది నుండియు వంశపరంపరా వచ్చుచుండిన భారతీయుల ప్రాచీనాచారములు, మానవులు వారి వారి అధికార తారతమ్యముల ననుసరించి యాచరింపదగిన ధర్మములు, కష్టకాలములయందు తమకు సంరక్షకులుగా నుండిన దేవతలు ప్రసన్నులై తమను కష్టములనుండి తరింపజేసి సుఖము నొసంగదగిన దేవతాస్తోత్రములు, అట్టి దేవతలను ప్రసన్నలను చేసుకొనదగిన యజ్ఞయాగాది కర్మ విశేషములు, స్వర్గాది పుణ్యాలోకములను బొందుట కనువగు కర్మోపాసనాదులును, విషయ విరాగము కలిగి ముక్తిని కాంక్షించువారి కనుకూలమైన జ్ఞానమార్గములను, వేయేల, జీవుల కైహికాముష్మిక సుఖంబు లొనగూర్పగల మార్గంబులన్నియు వేదమాత మన కనుగ్రహించుచున్నది. అట్టి వేదములయందు మంత్ర భాగము కొంతయు, వానికి వివరణరూపమైన "బ్రాహ్మణము"లను భాగము కొంతయుగలదు. నాల్గువేదములలోను యీ విభాగముగలదు. కాని యజుర్వేదమున మంత్రము, బ్రాహ్మణము రెండును కలిసిపోయినవి. అట్లు కలిసిపోయిన యజుర్వేదమునకు దేశమంతలోను వ్యవహారము కలదు.

"యజు" శబ్దము "యజ్" ధాతువునుండి పుట్టినది. "యజ్" అనగా దేవతల నారాధించుట. "యజుర్యజనాత్"ని విద్యారణ్య వాక్యము. అనగా యాగమును నెరవేర్చునది యజుర్వేదమని తాత్పర్యం. "యాగ"మనగా వేదోక్త కర్మ, మానసిక వ్యాపారమునకు జపమని వాగ్వ్యాపారమునకు "స్తుతి" యని పేర్లు. శ్రౌతకర్మలకు (అనగా వేదోక్త కర్మలకు) యాగమని పేరు. యజ్ఞములో ఋగ్వేద మంత్రములతో దేవతాస్తుతి చేయబడును. బ్రాహ్మణముతో కలసిన యజుర్వేద మంత్రములతో యజ్ఞకర్మకలాపమంతయు నడుపబడుచుండును. సామవేదమంత్రములతో గానము చేయుదురు. యజుర్వేదమునగల మంత్రములలో ఒక్కొక్క యాగమున ప్రత్యేకముగా నమర్పబడిన పాఠములున్నవి. ఆ మంత్రములచోటనే బ్రాహ్మణము కలిపి కర్మ విధులు కూర్చబడినవి. ఏ యాగమునుగాని చేయించువాడు "అధ్వ

ర్యుడు" ఋగ్వేదమంత్రములతో కర్మ నడిపించువాడు హోతయన బడును. సామమంత్రగానమును చేయువాడు "ఉద్గాత" యనబడును. వీరుగాక ఋత్విజులు మరికొందరుందురు - యజ్ఞములందందరి కర్మలను సరిగా సవరించుకొనుచు యెట్టిప్రమాదము రానీయక నడిపించు బాధ్యత "అధ్వర్యునిదే" యైయున్నది. అధ్వర్యుడు యజుర్వేదమును పారముచేయును. యజుర్వేదమున కధ్వర్యు వేదమనియు పేరుకలదు.

"సర్వవేదగతాని బ్రాహ్మణాని స్వాభిహితేఽర్థేదార్ఢ్యాయ ఋచమేవోదాహరన్తి" అని విద్యారణ్య భాష్యము. అనగా "మంత్రముల మొదళ్ళు తీసుకొని ఆ మంత్రములలో సూచించిన కర్మలను దార్ఢ్యము కొరకు స్పష్టపరచు వాక్యములు గలవి బ్రాహ్మణములు" అని చెప్పబడినది. బ్రాహ్మణములకు వాక్యగ్రంథమనికూడా వ్యవహారము కలదు. యజుర్వేదమందు యాగక్రమమున కర్మలవరుసయు, వానిననుసరించి మంత్రముల వరుసయు నేర్పరుపబడినవి.

మంత్రభాగమునకు "సంహిత" యనికూడను పేరు. సంహిత యనగా సంధించబడినదియని అర్థము. యజుర్వేదమున మంత్రము, బ్రాహ్మణము అను నీరెంటిని సంధించి వాడుచున్నందున యజుర్వేద సంహిత లేక తైత్తిరీయ సంహిత యని పేరుకలిగినది. మిగత వేదములలో మంత్రభాగములు, బ్రాహ్మణములు వేరువేరుగా నున్నందున వానికి సంహితలని యనజెల్లదు. కాని వాడుకలోమాత్రము ఋక్సంహిత, సామసంహితలని చెప్పుచుండుట గలదు.

మంత్రభాగము మాత్రమే వేదమని ఆర్యసమాజమువారి మతము. బ్రహ్మసామాజికులు కర్మలను బోధించెడి మంత్రబ్రాహ్మణములు రెండును వేదము కాదనియు, ఉపనిషత్తులుమాత్రమే వేదమనియుచెప్పుదురు. వైదికమతమున మంత్రము, బ్రాహ్మణము, ఉపనిషత్తులు మూడును వేదమే.

విషయముల యందనురాగము గలిగి నిరంతరము శబ్దాదివిషయసుఖముల నపేక్షించుచుండుట జనులకు స్వభావసిద్ధముగా నలవడియున్న గుణము. అట్టి జీవులు తమ విషయకాంక్షలను పొందుటకు లోకములోని లౌకికోపాయముల నలవరుచుకొని లోకుల కపకారులుగా

పరిణమించకుండ దేవతారాధనారూపమైన కర్మలద్వారా దేవతలను తృప్తినొందించి వారిద్వారా తమ కోర్కెలను పొందుటకు చేయబడు ప్రయత్నమంతయు యింద్రియనిగ్రహముతో గూడినదై, పాపభీతిని గలిగి తనవలన పరులకెట్టి హానియు గలుగకుండునట్లు క్రమశిక్షణము నిచ్చునదై యున్నది. అట్టి యింద్రియ నిగ్రహమువలన క్రమక్రమముగా నశ్వరములైన ఐహికాముష్మిక సుఖములయందు విరాగము గలుగును. విషయవిరాగమును పొందినవానికి ఆత్మజ్ఞానమును బోధించి ముక్తికి దారిజూపు భాగములకే "ఉపనిషత్తు"లని పేరు.

వేదోక్తకర్మ లాచరించుట కుపయోగపడునది మంత్రము.

కర్మలాచరింపదగు విధానమును, దాని ఫలమును సూచించునది – బ్రాహ్మణము.

కర్మలయందును, కర్మ ఫలములయందును విరాగముగలిగి ముక్తి నపేక్షించెడి జీవులకు ఆత్మజ్ఞానము నొసంగి ముక్తినొందగల నుపాయమును బోధించునది – ఉపనిషత్తు.

గనుక నీ మూడును వేదభాగములేగాని వేరుకావు.

వేదలక్షణమేమన :—"అలౌకికోపాయ బోధకత్వం వేదత్వం"

తా॥ లోకసామాన్యమునకు దెలియని యుపాయములను దెలుపునది వేదము. అప్రత్యక్షములైన స్వర్గాది ఫలముల కుపాయములగు కర్మలను బోధించునది వేదము. వస్తుగుణ పరిశోధనవలనగాని, యుక్తిచేతగాని లేక ప్రత్యక్షముగా జూడదగిన మరి యేవిధమునగాని మానవులకు తెలియరాని ఉపాయములను బోధించునది వేదమ తెలియవలెను

వేదప్రమాణము నంగీకరించువారిలో గొందరు ఆదిసృష్టిలో బ్రహ్మ వేదమును జెప్పెననియు, పిమ్మట వచ్చిన ప్రతిసృష్టిలోను ఋషులు దానినే తిరిగి వినుచు బహిర్గత మొనర్చుచుండిరని చెప్పి సమర్థింప జూచుచున్నారు. అది సరికాదు. ఈసృష్టికి ఆది లేదు. సృష్టి అనాది. వేదములు బ్రహ్మవల్ల చెప్పబడినవికావు అనాదినుండియుపరమాత్మనుండి ప్రతిసృష్టియందును శబ్దరూపమున బహిర్గతమగుచు బ్రహ్మ

దులవలన లోకములలో ప్రచారితములగుచు, ప్రళయకాలమున తిరిగి పరమాత్మలో లీనమగుచు పునస్సృష్టియందు తిరిగి బహిర్గతములగుచు లోకమున తిరిగి తిరిగి ప్రచారములగుచుండినవే వేదములు. శిశువు జనించుటకు పూర్వమే తల్లిరొమ్ములయందు ప్రకృతిసిద్ధముగానే పాలు ద్రవించి, భూమిమీద అవతరింపగనే శిశువునకుపయోగపడుటకు సిద్ధపరుపబడుచుండినట్లు ప్రళయకాలమందు ప్రకృతితో సహా పరమాత్మయందు లీనమైయుండిన జీవకోటి పునస్సృష్టియందు బహిర్గతమగుటకు ముందే జీవుల ఇహపరసౌఖ్యముల నొసంగగల ధర్మములు సృష్టికర్తయైన బ్రహ్మముఖమున (ఆతనికి తెలియకుండనే అవశముగా) వేదరూపమున బహిర్గతమై బ్రహ్మాదులవలన అన్నిలోకములలోని జీవులలో ప్రచారము చేయబడుచుండును. అట్టి ప్రకృతిధర్మములను బోధించునదే వేదము. గనుక వేదమనాది అనంతము. అనగా సర్వకాలములయందును నిత్యమైయుండునది. ఆదిసృష్టియనునదేదియు లేదు. ఈసృష్టి లయము లనాదినుండియు గలవు. వీని కాదిలేదు. అంతము లేదు. ఎల్లపుడునుండును–వేదమునకు కర్తయెవ్వడును లేడు. అది వ్రాయబడినదికాదు. గనుక ఉత్పత్తికాలమును లేదు. అది అనాది, అనంతము

## వేదము నిత్యము – అపౌరుషేయము

వేదమునకు నిత్యత్వ, అపౌరుషేయత్వము లెట్లన :—

1. శబ్దనిత్యత్వం 2. అర్థనిత్యత్వం 3, సంబంధనిత్యత్వం, 4. ఇతరగ్రంథములవలె పురుషకర్తృకత్వ స్మరణము లేకపోవుట.

యీ నాలుగు కారణములచేతను వేదమునకు నిత్యత్వము, అపౌరుషేయత్వము, స్వయంప్రకాశత్వము, అనాదిత్వము సిద్ధించును.

1. శబ్దనిత్యత్వమనగా :—

"కకారాది" వర్ణముల నుచ్చరించినప్పుడు, ఆ వర్ణములు ప్రత్యక్షము కాకపోయినను నిన్నటిరోజున చెప్పిన "కకారమునే" తిరిగి పలికితిననియు, ఆచోట పలికిన వర్ణమునే యీచోటను పలికితిననియు లోకములో అనుకుంటున్నారము. దానినిబట్టి "కకారాది" వర్ణములు

కాలములందును, సర్వదేశములందును నిత్యములై యున్నట్లు
ముచున్నది. అయినప్పటికి చీకటిలోనున్న పదార్థమువలె అవి
ష్యునికి గోచరించుటలేదు. దానిని గోచరింపజేయుటకు "ఉచ్చా
య" కారణము. ఉచ్చారణక్రియకు పూర్వమందును, ఉచ్చా
కాలమందును, ఉచ్చారణానంతరమందును అనగా త్రికాలము
ను "వర్ణములున్నవి. శ్రుతి : "త్రికాలాబాధ్యత్వం సత్యం
ంమిథ్య" అనగా "ఏది త్రికాలములయందును బాధింపబడకుం
అది సత్యము. ఏది బాధింపబడునో (ఒకకాలమునసుండి వేఱొక
యున లేకుండుటయే బాధింపబడుట) అదిమిథ్య." అనెడి శ్రుతి
మువలన త్రికాలములందుండు "వర్ణములు" సత్యములు. కాని
చ్చారణక్రియ" శబ్దమును పుట్టించలేదు. "శకారము నుచ్చరించి
అని వ్యవహార మున్నదిగాని "శకారమును చేసితిని" అని
"సృష్టించితి" ననిగాని యీ మొదలగు వ్యవహార మెచ్చటను
గనుక "శబ్దనిత్యత్వము" సిద్ధించును,

### నిత్యత్వము :—

ఇదేవిధమున "శబ్దనిత్యత్వ" మేర్పడినపిమ్మట "నిత్యమైన
" అర్థము నెప్పుడు నొదిలియుండదు గనుక "అర్థమునకు నిత్యా
ము చెప్పితీరవలయును.

### బంధ నిత్యత్వం :—

పైన చెప్పబడినట్లు శబ్దమునకును, అర్థమునకును రెంటికిని
ము సిద్ధించిన పిమ్మట వానికి అనగా "శబ్ద, అర్థము"లకు
సంబంధమున్నూ నిత్యమనియే చెప్పవలసియున్నది.

### ప్రత్యస్మరణము లేకపోవుట :—

ఈ ప్రకారముగా శబ్ద, అర్థ, సంబంధములు నిత్యమైనందున
మైన వేదము నిత్యము కాకతప్పదు. అయితే యీ యుక్తిని
లోకములోనున్న శబ్దజాలమంతయు నిత్యము కావలసి
దా! అనిన నిజమే. లోకములోని శబ్దజాలమంతయు

కానేరదు. ఆతడు వేద ధర్మములను ప్రచార మొనర్చినవాడు మాత్రమేయైయున్నాడు.

వేదములలో కనుబడు మంత్ర ఋషులు "మంత్ర ద్రష్టలు" (అనగా మంత్రములను చూచినవారు) గాని "మంత్ర కర్తలుగారు. (మంత్రములను చేసినవారుకారు) దీనికి కారణము వారు తాము మంత్రములను రచించితిమని చెప్పకుండా మంత్రములను చూచితిమని చెప్పడమువలననే రుజువగుచున్నది. లోకములో మనకు గోచరించని యొక వస్తువును క్రొత్తగా మనము చూచుట తటస్థించిన మేము దానిని "చూచితిమ"ని చెప్పుదుముగాని "చేసితిమని" యెన్నడును చెప్పము. గనుక ఋషులు కూడను వేదకర్తలు కారు. కర్త లేకనే స్వయంప్రకాశములైన వేద మంత్రముల నాయా ఋషులు చూచుచుండుటచే "ఋషయో మంత్ర ద్రష్టారః 'ఋషులు మంత్రద్రష్టలు' అని మాత్రమే చెప్పబడినది. గనుక కర్తృత్వస్మరణము లేకపోవుట వలన వేదమునకు కర్త లేడని తెలియవలెను.

శబ్ద నిత్యత్వ, అర్థనిత్యత్వ, సంబంధ నిత్యత్వములవలనను కర్త లేనందునను <u>వేదము నిత్య ప్రకాశమానమైనదని</u> ఋజువగుచున్నది. ('నిత్యము' అనగా 'అనాది, అనంతము' లేక ఆద్యంతములు లేనిది అని తెలియవలెను.)

శ్రీ బాలగంగాధరతిలక్ మహాశయులిట్లు వ్రాసియున్నారు

" It is not, however, till we come to works of the authors and expositors of the different schools of Hindu philospphy (Darshanas) that we find the doctrine of the eternity of the Vedas subjected to a searching examination; and, as remarked by Dr. muir, one who reads the discussions of these writers cannot fail to be struck —

" with the acuteness of their reasoning, the logical precision with which their arguments are presented, and the occational liveliness and ingenuity of their illustrations. " (muir O. S. T. vol. III P. 58)

They all bear witness to the fact that so far as tradition went,—an unbroken tradition of great anti - quity,— there was no remembrance of the Vadas having been ever composed by or ascribed to any human author; and taking into considera - tion the learning and the piety of these scholars their testimony must be regarded as an unimpeachable proof of the existence of such a tradition which was conside- red ancient several centuries before the Christian era"

(Vide The Arctic Home in the Vedas P.449, By B. G. Tilak.)

తా॥ ఇటీవల వివిధములగు వేదాంతమతశాఖలు (దర్శనములు) ప్రబలినపిమ్మట ఆయామతకర్తలీ వేదనిత్యత్వమును గూర్చి బహుసూక్ష్మముగ చర్చించియున్నారు. ఈమతకర్తలొనర్చిన చర్చలను పరిశీలించి చూచి మ్యూయరుపండితుడు.

"వారి తర్కములోని తీక్ష్ణతయు, వారివాద ప్రతివాదముల హేతుబద్ధతయు, సమయస్ఫూర్తిగ నుపమానముల జూపుటలో వారి కున్న చతురతయు, నుల్లాసమును, మనకాశ్చర్యము గలిగింపక మానవు" అని డాక్టరు మ్యూయరుగారు చెప్పుచున్నారు. (మ్యూయరు గారి "ఒరిజనల్ సంస్కృత టెక్స్ట్సు" అనుగ్రంధం. వాల్యూం III 58 పేజీ. చూడుడు.)

ఈ చర్చలను పరిశీలించిన మీదట మనకు ప్రధానముగ గాన్పించు సారాంశమేమనగ:—

"బహుప్రాచీనకాలమునుండియు అవిచ్ఛిన్నముగ వచ్చుచున్న పరంపరలవెంట వెనుకకుపోయి చూచినకొలది యీవేదములు ఫలాని మనుష్యునిచే రచియింపబడినవని చెప్పదగిన చిహ్నములు (లేక జాడలు) యేకోశమందును గానవచ్చుటలేదు. ఈచర్చల నొనర్చిన మతకర్తలు అసాధారణ ప్రజ్ఞగలవారుగాని సామాన్యులుగారు వీరి పాండిత్యమును ధర్మనిష్ఠాపరతయునుపమానములను సంగతిని మనము జ్ఞాపకముంచుకొన్నచో, క్రీస్తుశకమునకు పూర్వమనేక శతాబ్దముల క్రిందటనే బహుప్రాచీనమైనదని యెంచబడిన వేదనిత్యత్వ పరంపర యొకటి యుండెనని ఋజువుచేయుటకీ మతకర్తలిచ్చియున్న

సాక్ష్యమే నిర్వివాదమైన పరమప్రమాణముగ మనమంగీకరించి తీర వలెను." (బాలగంగాధర తిలక్కుగారి ఆర్కిటిక్కు హోంపేజీ 449.)

జీవులకు ముక్తిమార్గమును బోధించెడి యుపనిషత్తులలో దశోపనిషత్తులు (పది) మంత్రభాగముగా నున్నవి. దీనికి శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు భాష్యమును రచించిరి. సామాన్యులకు గూడ యర్థమగు విధమున మిగతా యుపనిషత్తులు శ్లోకరూపమునను వాక్యరూపమునను సులభమైన భాషలో వేదమాత మన కనుగ్రహించినది. అట్లనుగ్రహరూపమున సులభశైలిలో సంప్రాప్తమైన యుపనిషత్తులిటీవల కూర్పబడినటుల కొందరు విపరీతబుద్ధు లూహించుచున్నారు.

శ్రీ మచ్ఛంకరభగవత్పాదులవారు బ్రహ్మసూత్రములకు భాష్యమును వ్రాసియుండిరి. అది పండితులకుకూడను సుబోధకము కాని కఠినశైలిలో నుండియున్నది. బహుప్రయాసమునగాని దాని యర్థమునుగ్రహింపసాధ్యముకాదు. సామాన్యుల కసలు దానిని తాకుటకే చేతగాదు. అది పండితుల నుద్దేశించియే వ్రాయబడినట్లు గోచరించును. ఆమహానీయునిచే పామరులకొరకు దృగ్దృశ్యవివేకము, ఆత్మానాత్మవివేకము, వేదాంతడిండిమము, వివేకచూడామణి మొదలైన గ్రంథములనేకములు వ్రాయబడినవి. అవి సంస్కృతభాషాజ్ఞానలేశముగల యెట్టివానికైనను యర్థము కాదగిన సులభశైలిలో వ్రాయబడినవి. వేదములలోని భాషాప్రయోగముల ననుసరించి విపరీతయూహాలు జేయువారి నడిగిన సులభశైలిలో వ్రాయబడియుండిన గ్రంథములు శ్రీశంకరులవారిచే వ్రాయబడినవి కావని నిరసించుట కవకాశము గలదుగదా! బ్రహ్మసూత్రభాష్యములోని భాషయెక్కడ? వివేకచూడామణిలో వాడబడిన భాషయెక్కడ? రెంటికి పోలికయేలేదు. అట్లని ఆగ్రంథములకు కర్తలు వేరువేరుగా భిన్నకాలములలో నుండిరని నిర్ణయించవలసినదేనా? ఇవేటియూహాలు? పాశ్చాత్యపండితులు మనకు నేర్పిన పాఠము లిట్టివేయని గ్రహించి వేదమాత శ్లోక, వాక్యరూపమున మన కనుగ్రహించిన భాగము మందమతుల ననుగ్రహించుట కనిగ్రహించిన యోగ్యముగా నుండునుగదా! భారతీయుల వేదశాస్త్రాది వాఙ్మయ

మంతయు నిటీవలిదని చెప్పి దాని ప్రాచీనత్వమును, మహత్త్వమును త్రోసివేయజూచెడివారి నుపేక్షించి సత్పురుషులైన భారతీయపండితుల నాశ్రయించి వేదశాస్త్రాధ్యయన మొనర్చుట యుత్తమమైన మార్గము.

## వేదవిభాగము

ప్రతి మహా యుగములోను కృత, త్రేత, ద్వాపరములలోను వేదమునంతయు అధ్యయనము చేయుచుండెడివారు. వేదము మొదట యొక్కటిగానేయుండెను. పిమ్మట కలియుగమున మందబుద్ధులు, అల్పాయువులు, నిత్య రోగులు, దరిద్రులునైన ప్రజలు పుట్టుదురనియు అట్టి కాలమున వేదమేకముగా అధ్యయనము చేయగల సమర్థత వారి కుండదనియు తలచి భగవదంశాసంభూతుడైన శ్రీ వేదవ్యాసులు ఏకముగా అధ్యయనము చేయబడుచుండిన వేదమును ఋక్కు, యజస్సు, సామ, అథర్వణములను నాలుగు శాఖలుగా విభజించి ఒక్కొక్క వేద మొక్కొక్క శిష్యునిచే అధ్యయనము చేయించెను. అందువలన వేద శాఖలు నాలుగైనవి అందొక్కొక్క వేదము తిరిగి కొన్ని ఉపశాఖలుగా విభాగించబడి యొక్కొక్క యుపశాఖ యొక్కొక్క శిష్యుని కుపదేశింపబడినది. ఏకమైన వేదము కలియుగమున నష్టముగాకుండ నుండగలందులకు బహు శాఖలుగ విభాగింప బడినది. ఏశాఖాధ్యయనము చేసినవారలాయా శాఖీయులుగ బ్రాహ్మణులలో బహుశాఖలేర్పడెను. అట్టి వేదశాఖలు వేయిగా వృద్ధియైనవి. అట్టి శాఖాధ్యాయులైన బ్రాహ్మణులు నశించుటవలనగాని లేక వారు వారి వారి వేదశాఖాధ్యయనమును వదలి యితర విద్యల నభ్యసించుట వలనగాని అనేక వేదశాఖలు నశించినవి. (అనగా అధ్యయనము చేసిన వారు లేనందున ఆ శాఖ పేరులేకుండా పోయినది). ఈ విధమైన వేద విభాగము కలియుగ జీవుల నిమిత్తం ప్రతి ద్వాపరాంతమున వ్యాస పీఠమధిష్ఠించిన యొకానొక పుణ్యజీవునిచే జేయబడుచుండును.

ప్రథమమున ఋగాది నాలుగు శాఖలలో యజుర్వేదమొకటి. అది కృష్ణ యజుర్వేదమనియు శుక్ల యజుర్వేదమనియు రెండు విధములు. కృష్ణ యజుర్వేదములోని ఉపశాఖలలో పోయినవి పోగా యిప్పుడు

మిగిలియున్నదానిలో "తైత్తిరీయసంహిత" యొకటి. మన తెలుగు దేశమున నీ "తైత్తిరీయసంహిత" నధ్యయనము చేసినవారలనేకులుం గలరు. ఈ తైత్తిరీయ శాఖకు చెందిన బ్రాహ్మణ కుటుంబములే ఆంధ్రదేశమున హెచ్చుగా గలవు.

వ్యాస శిష్యులలో "పైల" మహాముని ఋగ్వేదమును, వైశంపాయన మహాముని యజుర్వేదమును, జైమిని మహాముని సామ వేదమును, సుమంత మహాముని అథర్వణ వేదమును అధ్యయనము చేసిరి.

## భాష్యకర్తలు

"మహీదాసు"డనెడి పండితుడు శుక్ల యజుర్వేదమునకు భాష్యమును రచించెను.

## కృష్ణయజుర్వేదము

౧ "భట్టభాస్కరమిశ్ర" యను పండితుడు కృష్ణ యజుర్వేదమునకు రచించిన భాష్యములో నీవిధముగా వ్రాసియున్నాడు.

వ్యాసుడు కృష్ణ యజుర్వేదమును వైశంపాయనునకు చెప్పెను. వైశంపాయనుడు యాస్కునికిని, యాస్కుడు, తిత్తిరికిని, తిత్తిరి ఉఖ యనుమునికిని ఉఖుడు అత్రికిని చెప్పెను. అత్రి దానిలో నొకభాగమును "ఆత్రేయశాఖ" యను పేరున విభాగించెను.

తైత్తిరీయ, ఆత్రేయశాఖలకంటె యాస్కముని పూర్వుడని స్పష్టముగా తెలియుచున్నది. ద్వాపరాంతమందు వ్యాసుడు వేదవిభాగ మొనర్చి యజుర్వేదమును వైశంపాయన ఋషిచేత అధ్యయనము చేయించెను. వైశంపాయనుడు యాస్కమునికి చెప్పెను. ద్వాపరాంతమనగా కలి పూర్వము నూరు సంవత్సరములుగా తీసికొందము. ఆ కాలమున వ్యాస భగవానులు వేద విభాగమొనర్చి యజుర్వేదమును వైశంపాయనునకు చెప్పెను. వైశంపాయనుడు వ్యాసునికి సమకాలికుడు అనగా కలికి పూర్వము నూరవ సంవత్సరమందు వైశంపాయనుడు వ్యాసునివద్ద యజుర్వేదము నధ్యయనము చేసియుండెను. ఆపిమ్మట ఆయన యాస్కుని కుపాధ్యాయుడై వేదాధ్యయనము

చేయించెను. ఆ కాలమును మనము కలి పూర్వము యెనుబదవ సంవత్సరముగా స్థిరపరచవచ్చును, పిమ్మట కొంతకాలమునకాయన వేదమునకు భాష్యము రచించెను. ఆ కాలమును మనము కలిపూర్వము అరువదిగా నిర్ణయింపవచ్చును. కలి శకము యిప్పటికి 5044 + 60 = 5104 సంవత్సరముల క్రిందట యాస్కముని వేద భాష్యమును రచించె ననుట కెట్టియాక్షేపము లేదు. యాస్కమునిచే వ్రాయబడిన భాష్య మంతయు మనకిపుడు లభించుట లేదు. కొద్ది భాగము మాత్రమే నిలచియున్నది. మిగిలినది ఖిలమైపోయి యుండవచ్చును. యాస్కునికి పూర్వము వేదభాష్యములు వ్రాయబడి యుండలేదనిగాని భాష్యము వ్రాయగల మహాపురుషు లుద్భవించలేదనిగాని మనమూహింప రాదు. అనాదినుండియు ప్రతి సృష్టిలోను ఆయాకాలములయందు మహాపురుషులుద్భవించి అప్పటి ప్రజల కర్థమగులాగున భాష్యరచనలు గావించుచునే యుండిరి. అవి క్రమక్రమముగా ప్రజలయందు వ్యాప్తి తగ్గుటయు, వ్రాయబడిన గ్రంథములు శిథిలములగుటయు మొదలు గాగల కారణములవలన నాయాకాలములయందు మహాపురుషు లుద్భవించి నాయాకాలపు మానవశక్తియుక్తుల కనువగులాగున ధర్మములను నిర్ణయించుచూ తదనుకూలముగా వేదభాష్యములను రచించుచూ వచ్చుచుండిరి. యాస్కాచార్యులుకూడను తమకు ముందు వ్రాయబడియుండు భాష్యములలో పోయినవి పోగా మిగిలి యుండువాటి నవలోకించియే యుండెననుటలో సందేహపడనక్కర లేదు. అదేవిధమున యాస్కమునియొక్క భాష్యముకూడను మూడు వేల సంవత్సరములు లోకవ్యాప్తిని గాంచెను. యాస్కునికి పిమ్మట "కాసకృష్ణ" "ఏకచూర్ణి" యనువారలు వేదభాష్యములను రచించి యుండిరి. పిమ్మట రెండువేల సం॥రముల క్రిందట అనగా కలి 3000 సం॥రములు ఆ ప్రాంతమున కౌశిక గోత్రికుడైన "భట్టభాస్కర మిశ్ర" యను పండితునిచే వేదభాష్యము రచింపబడినది. "జ్ఞాన యజ్ఞ" మనుపేరున నా భాష్యము పిలువబడినది. (బర్నెల్ (Burnell) మహాశయునిచే సంపాదింపబడిన తాళపత్ర గ్రంథముల జాబితా 12-14 పేజీలలో "జ్ఞానయజ్ఞమ"ను పేరున "భట్టకౌసిక

భాస్కరమిశ్ర ” నియొక్క భాష్యగ్రంథ మొకటున్నటుల ప్రచురింప బడినది.) ఈ భాస్కర మిశ్రులు తన భాష్యములో తమకు పూర్వ ముండిన భాష్యకర్తలను కొందరిని పేర్కొనియుండిరి. అందు— “భవస్వామిన్ ” యను పేరుగల యొక భాష్యకర్తను ప్రధానముగా యుదహరించియుండిరి వారి భాష్యము లేమియు మనకిపుడు లభించుట లేదు. అవన్నియు మహామ్మదీయుల దౌర్జన్యమునకు బలియై అగ్ని కాహుతియైనటుల యెంచవచ్చును. ఆపిమ్మట కలి 4400 సం॥ర ప్రాంతమున కృష్ణానదీతీరవాసియు, ఆంధ్ర బ్రాహ్మణుడును కృష్ణ యజుశ్శాఖాధ్యాయియు, భారద్వాజస గోత్ర పవిత్రుడు నైన సాయనమాయన పండితునకు మహానుభావుడైన మాధవాచార్యు లుద్భవించిరి. వీరఖండ పండితులు వేదములన్నిటికిని భాష్యము రచించి లోకమున బ్రవర్తింపజేసిరి. వీరి చరిత్ర ముందు గ్రంథమున చూడ గలరు—భారతీయు లందరకును నేటికిని వారి భాష్యమే శరణ్యము. ఆ భాష్యమే లేనియెడల వేదము మనకర్థమే యయ్యెడికాదని మాక్సు మూలరు మొదలైన పాశ్చాత్యపండితులు వచించియుండిరి. 33 సం॥మున గృహస్థాశ్రమమును త్యజించి యత్యాశ్రమమును స్వీకరించి విజయ నగరము లేక విద్యానగరమందు “ హంపి విరూపాక్షమున “ శారదా పీఠమును స్థాపించియుండిరి. యత్యాశ్రమమున వీరు విద్యారణ్యులను సార్థకనామమును బొందిరి. వీరు శృంగగిరిపీఠాధిపతులై ఆర్షధర్మరక్షణ మొనర్చిరి. ఈయన విద్యానగరము లేక విజయనగర రాజ్యస్థాపకుడై దక్షిణ భారతదేశమున మహామ్మదీయుల జోరసీయక కాపాడెను.

## వేదములో స్వరభేదమును బట్టి అర్థభేదము

వేదము స్వరభేదముచే అర్థము మారును. గాన స్వరయుక్త ముగా యుచ్చరింపవలయును లేనియెడల ప్రమాదము కలుగును.

ఎట్లన :—

“తే” అనుపదము ఉదాత్తముగ నుచ్చరించిన “వారు” అని అర్థ మిచ్చును. ఆపదమునే అనుదాత్తముగనుచ్చరించిన “నీకొరకు” అని అర్థమిచ్చును.

"మా" అనుపదము ఉదాత్తముగ నుచ్చరించిన నిషేధార్థకము (అనగా వద్దు అని అర్థమిచ్చును). ఆపదమె అనుదాత్తముగ నుచ్చరించిన "నన్ను" అని అర్థమిచ్చును.

ఇదే ప్రకారము నాయాస్థలముల పదములకు ఉదాత్త, అనుదాత్త, స్వరితముల యుచ్చారణల ననుసరించి యర్థము మారుచుండును గనుక స్వరాపరాధము లేకుండునటుల వేదాధ్యయన మొనర్పవలయును. ఇది గ్రంథమును చూచి చదువదగినది కాదు. గురువువద్ద పాఠము చెప్పించుకొని తానా ప్రకారముచ్చరించుచు క్రమముగా అధ్యయనము చేయతగినదిగాని యిష్టమొచ్చినటుల అచ్చు గ్రంథము న్నది గదా యని చదువుట కుపక్రమించిన స్వరాపరాధమొనర్చిన వృత్రాసురునికివలె నాశనము తప్పదని హెచ్చరిక చేయబడుచున్నది.

అనుదాత్తమునకు 'సంజ్ఞ' అక్షరమునకు అడుగున గీటు గీయబడును. ఉదాహరణ "త్రే"

స్వరితమునకు 'సంజ్ఞ' అక్షరమునకు పైని నిలువు గీటు గీయబడును. } ఉదా.
ఏగురుతు లేనిది ఉదాత్తమని తెలియవలెను. } "వాయవః"

"వాయవః" అనుపదములో 'వా'యను అక్షరము 'అనుదాత్తము'
" " 'య' " " 'ఉదాత్తము'
" " 'వః' " " 'స్వరితము'

అనుదాత్తమనగ తక్కువగవలుకుట ఉదాత్తమనగ హెచ్చుగా పలుకుట స్వరితమనగ పైరెంటియొక్క మిశ్రమస్వరము.

పాణిని మహర్షి వ్యాకరణమందీవిధముగా జెప్పబడినది.

"ఉచ్చైరుదాత్తః" (౧-౨-౨౯).

"నీచైరనుదాత్తః" (౧-౨-౩౦)

"సమాహారస్స్వరితః" (౧-౨-౩౧)

ఈ మూడు లక్షణములకు కాశికావృత్తియందు చెప్పబడినవిధము.

"తాల్వాదిషు సభాగేషు స్థానేషు ఊర్ధ్వభాగె నిష్పన్నో ఉదాత్త సంజ్ఞస్స్యాత్"

తా॥ దవడలు ఆదిగాగల వాటియొక్క మీదిభాగముతో నుచ్చరించబడినది "ఉదాత్తము"

"నీచైరుపలభ్యమానోఽయోఽచ్ సోనుదాత్త సంజ్ఞోభవతి".

తా॥ తగ్గుగా నుచ్చరింపబడినది "అనుదాత్తము"

"ఉదాత్తానుదాత్త స్వరసమాహారోఽయోఽచ్ సోస్వరితసంజ్ఞోభవతి"

తా॥ ఉదాత్తాను దాత్తములు కలియుట "స్వరితము"

ఇంగ్లీషు భాషలోకూడను స్వరభేదమున అర్థభేదము గలుగుట మనము చూచుచున్నాము.

August మొదట 'u' మీదవత్తిన = (a month) మాసమునకు పేరు.

August రెండవ u మీదవత్తిన } Grand = వైభవమైనఅనిఅర్థమువచ్చును.

Comet 2 వ అక్షరముమీద వత్తిన (నక్షత్రవిశేషము) తోకచుక్క అని అర్థము.

Comet 4 వ అక్షరంమీద వత్తిన చీట్లాటలో ఒకఆటకుపేరు. యిట్లే అనేక సాదృశ్యములు గలవు.

గనుక వేదమును స్వరయుక్తముగా స్వచ్ఛమైన ఉచ్చారణతో పలుకవలెననిన గురువువలన అధ్యయనము చేయవలసినదేగాని పుస్తకము చూచి చదువదగినది కాదు. అధ్యయనము చేయువారి పాఠమును ననుసరించి పొరబాట్లు గ్రంధములో సవరించుకోవలసినదే గాని గ్రంధము ననుసరించి అధ్యయన పరుని పాఠము మార్చుకొనబడదు.

# వేదాధ్యయనమొక కళ

" గురు ముఖాదేవ ధ్యేతవ్యం నతులిఖితపాఠః కర్తవ్యః " ॥
(హారీతస్మృతి పరాశరమాధవీయం. ఆచారకాండ ౧ అధ్యాయం)

తా॥ "గురువులననే వేదాధ్యయనము చేయవలయునుగాని వ్రాతగ్రంధమును చూచి పాఠముచేయరాదు."

" పుస్తక ప్రత్యయాధీతం నాధీతం గురుసన్నిధౌ ।
భ్రాజతే నసభామధ్యేజారగర్భ ఇవస్త్రియాః "
(నారదస్మృతి); (పరాశర మాధవీయంఆచారకాండ ౧ అధ్యాయం)

తా॥ జారపురుషునివలన ఉత్పన్నమైన స్త్రీయొక్క గర్భము వలె గురుసన్నిధియందు పాఠప్రవచనములు లేక పుస్తకమును చూచి చేయబడినపాఠము సభామధ్యమున ప్రకాశింపదు.

(స్వర, వర్ణయుచ్చారణలు స్వచ్ఛముగా నుండనందున నిందింపదగిన పాఠముగా నుండునని తాత్పర్యము).

" హస్తహీనస్తు యోధీతే స్వరవర్ణ వివర్జితః
ఋగ్యజుస్సామ భిర్దగ్ధో వియోనిమధి గచ్ఛతి " ॥
(నారదస్మృతి); (పరాశరమాధవీయం. ఆచారకాండ ౧ అధ్యాయం).

తా॥ హస్త క్రమములు లేకుండా అధ్యయనము చేయువారు స్వరవర్ణ ప్రమాదముగలవారు కాగలరు. అట్టివారు ఋగ్యజుస్సామము లను వేదరూపములైన అగ్నులచే తగులబడినవారై హీనయోనుల యందు పుట్టగలరు. (హస్తక్రమమనగా "ఉదాత్తానుదాత్తాది స్వర స్థానమునకు సంగీతపాఠకులయొక్క తాళమువలె అధ్యాపకు లధ్యయన కాలమందు చేయు హస్తసంజ్ఞలు తాళము తప్పినపుడు సంగీతము పాడువానికెట్లు విషమముగా దోచి వాని సంగీతమాగిపోవునో ఆలాగుననే స్వరలోపము ననుసరించి హస్తసంజ్ఞలు తప్పి పాఠము విషమించి ఆగిపోవును. అంతట స్వరము లోపముగాని, ఉచ్చారణ లోపముగాని, అక్షర వ్యత్యాసముగాని గలిగిన వెంటనే గుర్తించుట కవకాశము గలుగును. పుస్తకమున యిట్టిలోపములు గలిగిన తప్పుపాఠ మేర్పడ వలసినదేగాని సవరణ కవకాశము గలుగదు. గనుక గ్రంథస్థము

చేయబడినది వేదముగా నేరదు. అది అక్షరసమూహ మనిపించు కొనును. సృష్ట్యాదినుండి గురుపరంపరా వచ్చుచుండిన పాఠ ప్రవచనము లే వేదసంరక్షణకు మార్గము.

శ్లో॥ “గీతీశీఘ్రీ శిరఃకంపీ తథాలిఖిత పాఠకః
అనర్థజ్ఞోల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః”॥
(పాణినీయశిక్ష)

తా॥ రాగముతో చదువువాడును, తొందరగా చదువువాడును, శిరఃకంపములతో చదువువాడును, పుస్తకముచూచి చదువువాడును అక్షరజ్ఞానము లేనివాడును, కీచుకంఠముగలవాడును వీరు ఆరుగురు పాఠకులలో అధములు అనగా వేదాధ్యయనమునకు పనికి రానివారు.

శ్రుతి: “ఆచార్యాద్ధ్యైవ విద్యా। సాధిష్ఠత్వం ప్రాపత్”

తా॥ “ఆచార్యోపదేశమూలముగా వచ్చిన విద్యయే శ్రేష్ఠత్వము పొందగలదు.”

కాబట్టి అధ్యయనాధ్యాపనల మూలముగానే వేదాధ్యయన కళ గురుశిష్య పరంపరా కాపాడబడవలయును గాని గ్రంథస్థము చేయబడినంత మాత్రమున కాపాడబడదు.

## వేదము - యజ్ఞము

ప్రతి యజ్ఞము మూడు వేదములలోని మంత్రములచేతను ఆచరింపబడును. మూడు వేదములనగా ఋగ్యజుస్సామములు. అనాది నుండియు మూడు వేదములునుగలవు. ఈ మూడును కలిసియే యుండునుగాని యొకదానిని విడిచి యొకటి యుండుటకు వీలులేదు ఈ మూటిలో నేదిలేకపోయినను యజ్ఞాచరణమునకు వీలుపడదు. వేదములలో పూర్వభాగమంతయు యజ్ఞమునిమిత్తమె ప్రవర్తించినది. యజ్ఞమునకు ముఖ్యమైనది యజుర్వేదము. యజుర్వేద మంత్రముల తోడనే యజ్ఞము నడిపించబడును. యజనమునకు ముఖ్యమైనందుననే

"యజుర్వేదము"ని పేరుగలిగినది. యజ్ఞమును యజుర్వేద మంత్రములతో "అధ్వర్యుడు" నడుపుచుండును. యజ్ఞకర్మ యందెట్టి ప్రమాదము రాకుండ చూచుచు కర్మలను సవరించుకొనుచుండవలసిన వాడును అధ్వర్యుడే. యజుర్వేదమంత్రములతో అధ్వర్యుడు యాగ కర్మను నడుపుచుండుటవలన దీనికధ్వర్యు వేదమనియు పేరు ఋగ్వేద మంత్రములతో యజ్ఞమునందా యా భాగములను నడిపించువాడు "హోత". యజ్ఞమునందు దేవతాప్రీతి నిమిత్తం సామవేదమంత్రములను గానము చేయువాడు "ఉద్గాత" అధ్వర్యుడు, హోత, ఉద్గాత, యీ ముగ్గురును మూడు వేదములలోని మంత్రములతో యజ్ఞమును నడుపుచుందురు. మూడు వేదములలో నేవేదము లేక పోయినను యజ్ఞకర్మ నడుపుటకు వీలు లేనే లేదు. అందువలన సృష్ట్యాదినుండియు (లేక అనాదినుండియు) మూడు వేదములు కలిసియే యున్నవనియు, మూడు వేదములతోడను యజ్ఞకర్మ నడుపబడుచుండినదనియు స్పష్టపడు చున్నది. ముందు యొక వేదము వ్రాయబడినట్లును పిమ్మట కాల క్రమేణా మిగత వేదములు వ్రాయబడినవనియు చేసెడివాదము సరి కాదు. ఆవాదము సాంప్రదాయ విరుద్ధమైనందున విజ్ఞులంగీకరించునది కాదు.

శ్రుతి :—"వాచా విరూపనిత్యయా" అనగా "వేదము నిత్యమైనది" అని శ్రుతియే వినబడుచున్నది.

"అలౌకికోపాయబోధకత్వం వేదత్వం" అనగా లోకసామాన్యమునకు తెలియని యుపాయములను వేదము చెప్పును. అనగా అప్రత్యక్షములైన స్వర్గాదిఫలముల కుపాయములగు కర్మలను వేదము బోధించును. వస్తుగుణపరిశోధనమువలనగాని, యుక్తిచేతగాని మానవులకు యెరుకపడుట కవకాశములేని విషయములను బొందుటకు తగిన యుపాయములను జెప్పునదే వేదము. అట్టి వేదము ఋక్కు యజుస్సు, సామము అని మూడువిధములుగా నుండి యజ్ఞమును నడుపునదిగా నున్నది.

శ్రుతి :—ఋక్సామాభ్యాం యజుషాసన్తరన్తః" (తై॥ సం॥ ౧-౨-౩-౩-౮). (౩౬ పంచాశత్తు) వరుస లెఖ్ఖ

తా॥ ఋగ్యజుస్సామ వేదములందలి మంత్రములచే సోమయాగముసు పూర్తిని బొందించితిమి. —(మూడు వేదమంత్రములతోను యజ్ఞము పూర్తిచేయబడినట్లు వేదమంత్రముననే వినబడుచున్నది.)

శ్రుతి:—"అయజ్ఞోవా ఏష యోఽసామా."

(తై॥ సం॥ ౧-౫-౭-౧-౧) (౧౭౧ పంచాశత్తు).

అండ్ ( ,, ౨-౫-౮-౧)

తా॥ ఏ యజ్ఞము సామరహితమో అది యజ్ఞమే కానేరదు.

శ్రుతి:—"ఋచఃసామానియజూగ్ంషి."॥

(తై॥సం॥౨-౮-౧౨-౭)

తా॥ ఋక్సామయజుస్సులు మూడు వేదములు.

శ్రుతి:—"దేవావైసర్చిన యజుష్య శ్రయన్తతే సామన్నేవాశ్రయన్త" (తై॥ సం॥ ౨-౫-౭-౧)

తా॥ దేవతలకు ఋక్కు యజుస్సులమీదకంటె వారికి సామము మీదనే యెక్కువప్రీతి.

శ్రుతి:—"ఆయుష్మత్యా ఋచోమాంగాతతనూపా థ్సామ్నః"

(తై॥ సం॥ 3-౨-౭-3)

యజ్ఞములో సామగానము నెప్పుడును విడువగూడదు. ఋక్కు యజ్ఞమునకు ప్రాణము. సామము యజ్ఞమునకు శరీరము.

శ్రుతి:—"వ్యృద్ధంవా ఏతద్యజ్ఞస్యయదయజుష్కేణక్రియత"

(తై॥ సం॥ ౫-౧-౨-౧)

తా॥ యజుస్సులేకుండా చేయబడు యజ్ఞము ఫలమునీయదు.

శ్రుతి:—"నమ ఋక్సామ యజుర్వషట్" (తై॥సం॥౭-3-౧౨)

తా॥ ఋక్సామయజుస్సులను మూడు వేదములుగలవు.

శ్రుతి:—"ప్రథమాహిసువాచసా హోతారా దైవ్యాకవీ యజ్ఞంనోయక్షతామిమం" (ఋగ్వేదం ౧-౨౮-౧౩౮-౭)

తా॥ అనాదినుండి యునున్నట్టియు, మధురవాక్కులుగలట్టియు బ్రహ్మణ్యులైనట్టియు దైవతములైన, హోతలిద్దరును మాయొక్క ఈ యజ్ఞమును పూర్తిచేయుదురుగాక!

శ్రుతి:—"త్వంనో అసిభారతాగ్నే వశాభిరుక్షభిః అష్టాపదీభి రాహుతః" (ఋగ్వే. ౨-౧-౭-౫)

తా॥ ఓ యనాదిసిద్ధమగు అగ్నే ! ఉచ్చైస్స్వరమున పాడబడిన సామగానములతోడను, అష్టపదయుక్తమగు ఋక్కులతోడను స్తుతింప బడి నీవు మమ్మనుగ్రహించితివి.

శ్రుతి:—"ఉఖేవాచోవదతి సామగాఇవ"(ఋగ్వే౨-౮-౮౩-౧)

తా॥ సామగానముచేయు వానివలె (గాయత్రి త్రైష్టుభములు) రెండు విధముల పాడుచుంటివి.

శ్రుతి:—అకారి బ్రహ్మసమిధానతుభ్యం శంసాత్యుక్థం" (ఋగ్వే. ౮-౧-౬-౧౧)

తా॥ ప్రకాశస్వరూపుడవైన ఓ యగ్ని రూపపరమాత్మా! ఈ బ్రహ్మ నిన్ను ఋగ్వేదమంత్రములతో స్తోత్రము చేయుచున్నాడు. ఉద్గాత సామగానము చేయుచున్నాడు (యజుర్వేదమంత్రములచే అధ్వర్యుడు కర్మనునడుపు చున్నాడు)

ఇంకను ఋగ్వేదములో సామగానమును గురించిన వాక్యము లెన్నియోగలవు. కొన్ని ఋక్కులీయబడుచున్నవి. చూడవచ్చును.

(ఋగ్వే. ౮-౨-౧౬-౧౫; ౮-౨-౨౦-౧౦; ౮-౨-౨౧-౫; ౮-౨-౨౮-౭; ౮-౩-౩౦-౧౬; ౮-౮-౮౨-౬; ౫-౧-౭-౯)

పై ఋగ్వేద వాక్యములవలన మూడువేదములు అనాది నుండియు కలిసియే యున్నవని రుజువగుచుండగా మన పాశ్చాత్య సోదరులు ఋగ్వేదమునకు పిమ్మట కొంతకాలమునకు యజుర్వేద మును, ఆపిమ్మట సామవేదమును వ్రాయబడియున్నవని సిద్ధాంతీక రించుటలోని రహస్యమేదియో వారి యనుయాయులై హైందవులైన హూణ విద్యాధికులు విచారించెదరుగాక !

## కుల వైషమ్యము జాతి నాశన హేతువు

ప్రథమమున బ్రాహ్మణులలోని వైదిక, నియోగాదులైన అంత శ్శాఖలేకమై ముందు జరుపదగు కార్యక్రమమును నిర్ణయించుడు. ఆపిమ్మట ద్విజులందరేకీభవించి తగు విధానము నాలోచింపుడు. తరు

వాత చాతుర్వర్ణ్యములవారు నేకమై ఐకమత్యముతో ముందాచరింప దగు విధానమునరయుడు-నాలుగు వర్ణములలోను నాస్తికులుగానుండు వారినిప్పుడుపేక్షించి ఆస్తికులగువారుముందు రొకటిగా గూడుడు. పిమ్మటందరును క్రమక్రమముగా మిమ్మనుసరింపగలరు.

ఒక కులమువారి నింకొక కులమువారణగద్రొక్క-వలయుననెడి హీన భావములకు చోటీయకుడు. ఎవరును నెవరిని అణగద్రొక్క లేరు. తనను అణగద్రొక్క జూచువాని నేవిధముగానైనను వ్యర్థునిగా జేయ ప్రతివాడును ప్రయత్నించును. అంతటితో సంఘము విచ్ఛిన్నమై యొకరొకరిని ద్వేషించెడి వర్గములుగా విడిపోవుదురు. ఇదంతయు సంఘనాశనమునకు తోడ్పడును. ఒక ప్రత్యేక సంఘము నణగద్రొక్క జూచుట యెవరికిని పొసగదు ఆర్యసంఘ మనేక వర్గములతో గూడినదై సృష్ట్యాదినుండియు ఐకమత్యమున మెలగుచు వృత్తి విభాగముతో గూడినదై ప్రపంచ పొగడ్తను పొందిన జాతి. అట్టి యైకమత్యమును అల్పములైన స్వప్రయోజనములకుగా బలిగొన జూచుట మహాపాతకము, దేశద్రోహము, సంఘద్రోహము అనిపించు కొనును. ఎట్టి ఆపదయందును తన జాతి యైకమత్యమును భిన్నమొన ర్చుట తగదు. భారతీయులందరు దీనిని గమనించి ప్రవర్తించుట దేశ క్షేమమునకు మార్గమని మనవిచేయుచుంటిమి ఇందునుగురించి శ్రుతి మాత యిట్లుపదేశించుచున్నది.

శ్రుతి : "సుఖంహ్యావమతశ్శేతే సుఖంచ ప్రతిబుధ్యతే
సుఖంచరతిలోకేఽస్మిన్నవమంతా వినశ్యతి ॥
(నారద పరివ్రాజకోపనిషత్, తృతీయోపదేశః; మనుస్మృతి ౨-౧౬౩)

తా॥ పరుల నవమానించిన నోర్పుతో విచారమును మాని యున్నవాడు సుఖముగ నిద్రించును. సుఖముగ నిద్రలేచును. ఈలోకమున సుఖముగ దిరుగుచు వృద్ధిబొందును. అవమానము చేసినవాడా పాపముచే నశించును.

గనుక పరుల నవమానించు ప్రయత్నము వ్యక్తిగతముగగాని సాంఘికముగాగాని చేయరాదు. ప్రయత్నపూర్వకముగ అట్టి పాప చింతను మనసునుండి తొలగించుకొనవలయును.

# వైదిక, నియోగ, శాఖలు

శాఖ, సూత్రము, గోత్రము, ఋషులు ఆచారము, నడవడిక మొదలగునవన్నియు వైదిక, నియోగశాఖలకు సమానమైయున్నవి. అందొకరు వేదవిద్యల నధ్యయనాధ్యాపనలద్వారా కాపాడిరి. రెండవ వారు ధర్మసంరక్షణార్థము రాజ్యాధికారమున నియోగింపబడి వైదిక ధర్మమును కాపాడుటయేగాక ప్రజలను ధర్మముగా పరిపాలించుచు దేశమును శత్రుభయము లేకుండ కాపాడి, విద్యలను, కళలను ప్రోత్స హించిరి. ఈ బ్రాహ్మణరాజులకాలములో దేశమైశ్వర్యవంతమైనది. అమరావతి, నాగార్జునకొండ, అజాంటా, ఎల్లోరా మొదలుగాగల శిల్పములు బయల్వెడలి నేటికిని ప్రపంచమున కాశ్చరము గొలుపుచు నిలిచియున్నవి. ప్రజలు ధర్మమార్గమున సంచరించుచు, సత్యమును తప్పక చౌర్యహింసాదులు లేక పరోపకారపారీణులై నీతి, నియమ ముల గలిగి జీవించుచుండిరి. అసూయాద్వేషములు లేక యెవరి వర్ణ ధర్మములయందు వారు ప్రవర్తించుచు పరస్పర సుహృద్భావము గలిగి బాంధవులవలె ప్రవర్తించుచుండిరి. వృత్తిసాంకర్యము లేనందున వంశ పరంపరానుక్రమించి యాచరింపబడుచుండిన వృత్తులలో ప్రజ్ఞావిశేష ములు కలిగి ఆతరమున కాతరమున కళాప్రావీణ్యమేర్పడుచుండెడిది. ప్రజలు యోగ్యప్రవర్తన గలిగియుండిరి. క్రీ॥ పూ॥ 300 సం॥రమున యీ దేశమందు గుప్తచంద్రగుప్తుని కోర్టులో రాయబారిగా నుండిన "మెగాస్థనీసు" యీవిధముగా వ్రాసియున్నాడని డబ్ల్యు. డబ్ల్యు. హంటరు పండితుడు వ్రాయుచున్నాడు.

"The Greek ambassador observed with admiration the absence of slavery in India, the chastity of women and the courage of the men. In valour they excelled all other Asiatics; they required no locks to their doors; above all, no Indian was ever known to tell a lie. Sober and industrious, good farmers, and skilful artisans, they scarcely ever had recourse to a lawsuit, and lived peaceably under their native chiefs.

The Village system is well described, each little rural unit seeming to the Greek an independent republic.

(The History of the Indian People — By W. W. Hunter. Ed. 1881 Page 77 - 78.)

తా॥ హిందూదేశములో బానిసలు లేరు. స్త్రీలు పతివ్రతలు పురుషులు ధీరులు – పరాక్రమమున ఆసియాజాతులన్నిటిని మించి యుండిరి. వారియిండ్ల తలుపులకు తాళములు అవసరములేదు. అన్నిటికంటె యెక్కువ దేమనగా అబద్ధముచెప్పిన హిందువుడున్నట్లు యెరుగము. ప్రాలుమాలిక లేకుండా కష్టపడి పనిచేయువారు. మంచి వ్యవసాయదారులు, కళానైపుణులు, తరుచు కోర్టులకు వ్యాజ్యమునకు వెళ్లువారు కారు– వారిరాజుల పరిపాలనములో సంతృప్తులై యుందురు గ్రామపరిపాలనమును గురించి (మేగస్థనీసు) బాగుగా వివరించి యుండెను. ప్రతిగ్రామము యొక స్వాతంత్ర ప్రజాపరిపాలనరాజ్యముగా కనుపడుచున్నది. అని ఆశ్చర్యముతో వ్రాసియున్నాడు. అని హంటరు మహాశయుడు వివరించియున్నాడు.

ఇది బ్రాహ్మణ నాగరికతయొక్కయు, బ్రాహ్మణరాజుల పరిపాలనయొక్కయు ఫలము.

అతి ప్రాచీన కాలమున క్షత్రియుల పరిపాలనలో దేశప్రజల స్థితిని గురించి వేదమునందిట్లు వినబడుచున్నది. అశ్వపతి మహారాజు తన రాజ్యప్రజలనుగురించి ఋషులకు చెప్పి అట్టి సత్ప్రవర్తనగల ప్రజలతో గూడిన రాష్ట్రము పవిత్రమైనదనియు, అట్టి రాష్ట్రప్రజల వలన సంప్రాప్తమైన ద్రవ్యమతి పవిత్రమైనదిగాన అట్టి ద్రవ్యమును మీకొసంగెదననియు, దానిని గ్రహించవలసినదిగ ఋషులను ప్రార్థించుచు యిట్లు చెప్పెను.

శ్రుతి : "నమే స్తేనో జనపదే నకదర్యో నమద్యపో నానాహితాగ్ని ర్నావిద్వాన్నస్వైరీస్వైరిణీకుతః ॥"

(ఛాందోగ్యం. ౫ ప్రపాఠకం ౧౧ ఖండ, ౫ మంత్రం)

తా॥ నా రాజ్యమున దొంగ లేడు; దాత కానివాడు లేడు; మద్యపానము జేయువాడు లేడు; అగ్నిహోత్రము చేయనివాడు లేడు;

అవిద్వాంసుడు లేడు: స్వేచ్ఛావిహారి లేడు. అనగా పరదారగమనము జేయువాడు లేడు); ఇకను స్వేచ్ఛావిహారిణి (అనగా వ్యభిచరించు స్త్రీ) యెట్లుండగలదు ? అని చెప్పి నాధనము పవిత్రమైన ధనముగనుక మీరు స్వీకరించదగినదియని కేకయ పుత్రుడగు అశ్వపతియను మహా రాజు, ప్రాచీనశాల, సత్యయజ్ఞ, ఇంద్రద్యుమ్న, జన, బుడిల, యనెడి ఋషులు తనను చూడరాగా వారితో చెప్పెను.

## అయోధ్యయందలి ప్రజల వర్ణనము

### ( శ్రీ మద్రామాయణము )

ఉ॥ "అందఱు హృష్టమానసులె యందలి యందఱు ధర్మవేదులే
యందరు శాస్త్రచింతన పరాయణులే మఱి స్వస్వతుష్టులే
యందఱుఁ ద్యాగశీలురట నందఱు సత్యవచోభిభాషణా
మందులు భూరిసంచయుల మానగవాశ్వధనాఢ్యులందఱున్".

(వాసుదాసుగారి శ్రీమద్రామాయణ మందరము. బాల
కాండము 405 పేజీ 256 పద్యము)

క॥ "జననియు జనకుడు వధువులు
దనయులుఁ దనయయును గృహిణి దాను నతిథియున్
దనివిగ నిండక యుండెడి
మనికి యొకండైన లేదు మందున కైనన్."

(డిటో 406 పుట. 257 పద్యము)

"తన్ను ధర్మవిధులఁ దనయులఁ
దనయుల, తల్లిఁ దండ్రిఁ దనదు దార నన్న
దమ్ములను గదర్యతావశచిత్తుఁడై
యేఁచువాఁడు లేడ యెచటనేని."

(డిటో 406 పుట. 258 పద్యము)

క॥ "పోడిమిగల తత్పురమున
లేడుఖలుడు, దుష్టకామి లేడు చదువులం
దాడిమి మీఱని పురుషుడు లే
డట నాస్తికుడు నెందు లేడు వెదకిననం."

(డిటో 406 పుట 259 పద్యము)

తా॥ అయోధ్యానగరవాసులందరు సంతుష్టిగల మనస్సులు గలవారే; అందఱు ధర్మము నెఱిగినవారే; అందఱు శాస్త్రచింతనము చేయుటయందు సమర్థులే. అందఱును తృప్తిగలిగియుండువారే. అందఱు స్వాభావికముగా త్యాగబుద్ధిగలవారే; అందఱు నిజము చెప్పువారే; అందఱు కావలసినంత సంపాదించుకొని యున్నవారే; అందఱు గోవులు గుఱ్ఱములు, ధనములు, గలిగిన ఐశ్వర్యయుతులే.

తల్లి, దండ్రి, ఇరువురు కోడండ్రు, యిరువురు కొడుకులు, కుమార్తె, భార్య, తాను, అతిథి యీపదుగురు గలది కుటుంబము. ఇంతకు తక్కువ కుటుంబముగల గృహమాపట్టణమున లేదు.

తాను దినక ధర్మముచేయక, కొడుకులను భార్యను నెవడు కడుపునిండ గూడుపెట్టక బాధించునో యట్టి పరమలోభి కదర్యుడన బడును. అట్టి వాడొక్కడైనను నాపట్టణమున లేడు.

అయోధ్యానగరమున దుష్టుడు లేడు; పరస్త్రీల నాశించువాడు లేడు. తనభార్యతోనైనను నిషిద్ధదినములందుగాని నిషిద్ధసమయము లందుగాని క్రీడించువాడు లేడు. వేశ్యాలంపటుడు లేడు. చక్కగా చదువురానివాడు లేడు. నాస్తికుడు లేడు (నాస్తికుడనగా వేదనిందకుడు) 261 పద్యములో అయోధ్యయందు అంగవైకల్యము గలవారుగాని, వికారరూపులుగాని లేరని చెప్పబడినది — (అంగవికలుల నాకాల మున ప్రజలలో కలసి తిరుగనీయక వేఱుగా వారినందర నొకచోట నివసింపజేసి రాజురాజ్య బొక్కసమునుండి ధనమును వెచ్చించి వారిని కాపాడుచుండెడివాడు. వికలాంగులు సంఘములో కనుబడుచుండిన కొంతకాలమునకు సంఘములో వికలాంగు లెక్కువగుదురు. అదే ప్రకారమీకాలమున యేబది సంవత్సరముల క్రింద సంఘమందుగల

వికలాంగులకంటె యిప్పుడు నూఁగురెట్లు పెరిగినట్లు కనుబడుచున్నది. గనుక ప్రభుత్వమువారు వికలాంగులు సంఘములో కలిసి తిరుగకుండు నటుల చేయుటత్యంతవుసరము.)

దశరథమహారాజు రాజ్యము చేయుచుండిన కాలమున బ్రాహ్మణులను గురించి చెప్పుచున్నాడు.

ఉ. "అందఱు నిర్జితేంద్రియులు నందఱు యజ్వాలు నాహితాగ్ను ల
య్యందఱటెటన్ స్వకర్మరతు లందరు నిత్యము బ్రహ్మచింతనుల్
అందరు సంతతాధ్యయను లందఱు సంయమితుల్యు లప్పురిం
జెందిన యట్టిలోకులు సుశీలరతుల్ కరుణాపరాయణుల్

(262 పద్యము)

తా॥ అయోధ్యానగర బ్రాహ్మణులందరు నింద్రియముల జయించిన వారే. అందఱు సోమయాగము చేసినవారే' అందఱు నగ్నిహోత్రములు కలవారే, అందరు వారివారి వర్ణాశ్రమ ధర్మములననుసరించి కర్మలు చేయువారే, అందరు బ్రహ్మవిచారణపరులే, అందఱు వేదాధ్యయనము చేసినవారే, అందఱు ఋషులవలె తపస్సంపన్నులే, అందఱు దయాళులే, అందఱు చక్కని నడవడిగలవారే.

ఆ॥ "ఆహితాగ్నిగాని యాతఁడయజ్వయు,
నధమజనుఁడు దొంగయైన వాఁడు
వృత్తసంకరుండు, వెదకిన దొరకఁడా,
కాలమందు నాజి, పాలనమున.

(డిటో 411 పుట. 263 పద్యము)

తా॥ దశరథమహారాజు పాలించుకాలమున అగ్నిహోత్రము లేనివాడు, సోమయాగము చేయనివాడు, అల్పవిద్య, అల్పధనముగలవాడు, వర్ణసాంకర్యము, వృత్తిసాంకర్యము చేయువాడు, దొంగతనము చేయువాడు, వెదకిపట్టుదమనినను యొక్కఁడుగూడ లేడు.

# నాలుగుకులములవారిని గురించి

తే॥ "దేవతాతిథి పూజల, దీక్షితులును,
కృతమెఱింగిన వారలు, నీగిగలరు
శౌర్యవిక్రమవంతులు, సత్యధనులు,
నాల్గువర్ణంబులందలి నరులుపురిని"

తా॥ ఆ పట్టణమునగల నాలుగువర్ణములవారును దేవపూజ చేయక అతిథి వచ్చినసనాదరింపక ముందుభోజనము చేయరు — ఇది వారిదీక్ష. పరులు తమకుచేసిన మేలు మఱువరు. యాచకులకు తృప్తిగా నిచ్చెడివారు — శౌర్యపరాక్రమములు గలవారు — సత్యమే ధనముగా గలవారు అనగా సత్యవ్రతముగలవారని అర్థము—

దశరథమహారాజు కాలము వైవస్వత మన్వంతరములోని యిరువదియైదవ మహాయుగములోని త్రేతాయుగము. అనగా యిప్పటికి వకకోటి నలుబది ఆరులక్షల సంవత్సరములకు పై కాలము. వేదమందు వినబడిన పై మంత్రములోని వర్ణనమెట్లుండెనో అటులనే దశరథుని కాలములోను ప్రజల యోగ్యత వర్ణింపబడినవి. ఆ ప్రకారమే రెండు వేల సం॥రములనాడు గ్రీకులీదేశము వచ్చినప్పుడు గ్రీకుచరిత్రకారు లందరు భారతీయులు సత్యవంతులని, మంచి యోగ్యతగలవారని వర్ణించియుండిరి.

పిమ్మట క్రీ॥ శ॥ ఏడవశతాబ్దములో మన దేశమును దర్శించి పదిహేను సంవత్సరము లీదేశమందు సంచారము చేసియుండిన చీనా యాత్రికుడైన "హూనుత్సాంగు" న్నూ, పదకొండవ శతాబ్దములో రాబడిన "అల్బెరూని" అను మహమ్మదీయ పండితుడును భారతీయులను గురించి వ్రాసియుండిరి. తిరిగి క్రీ॥శ పదమూడవ శతాబ్దములో "మార్కోపోలో" యను పోర్చుగీసు వర్తకుడు హిందువులు సత్యవంతులని చెప్పియున్నాడు. ఆపిమ్మట మహమ్మదీయ చరిత్రకారులును, పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభములోని కొందఱు బ్రిటిషు ప్రముఖులును హిందువుడెట్టి యాపదయందును అబద్ధమాడడని వ్రాసియుండిరి.) అట్టి యుత్తమచరిత్ర ఒక శతాబ్ద కాలముగాగల బ్రిటిషు

పరిపాలనలో సంపూర్ణముగా మార్పుజెంది యీనాడు అభక్ష్య భక్షణము, అసత్యము, వ్యభిచారము, మిత్రద్రోహము, అసూయ, పరకులద్వేషము, అసంతృప్తి, హింస మొదలగు పిశాచ లక్షములు దేశములో తాండవమాడుచుండినవి. ఆనాటిహైందవ రాజుల పరిపాలనలోని నాగరికతకును యీనాటి పాశ్చాత్య విద్యావాసనతో కూడిన పరిపాలనలోని నాగరికతకును గల భేదమును గమనింపుడు.

## భారతీయులు సత్యవ్రతులు

"స్ట్రాబో" (Strabo says) అను గ్రీకు చరిత్రకారుడిట్లు వ్రాసియున్నాడు :

"They are so honest as neither to require locks to their doors nor writings to bind their agreements."
(Strabo. Lib. XV. P. 488.) (Ed. 1587)

తా॥ భారతీయులు చాలా సత్యప్రవర్తన గలవారు. వారి యిండ్లకు తాళములతోగాని, వారిచ్చిపుచ్చుకొనెడి అప్పు మొదలగు వానికి లిఖితాధారముతోగాని పనిలేదు.

"ఆరియన్" (Arrian) అను గ్రీకు చరిత్రకారుడు (రెండవ శాబ్దములో) యిట్లు వ్రాసియున్నాడు :

"No Indian was ever known to tell an untruth"
(M. C. Crindle Indian Antiquary 1876)

తా॥ హిందువుడు అబద్ధముచెప్పినట్లు ఎప్పుడు వినియుండలేదు.

క్రీ॥ శ॥ నాలుగవ శతాబ్దములో "ఫ్రైయరు జార్డానసు" (Friar Jordanus) యిట్లు వ్రాసియున్నాడు :

"The people of India are true in speech and eminent in "Justice"
(Marco Polo Ed. H. Zule Vol 11. P. 354)

తా॥ భారతీయులు సత్యము మాట్లాడువారు. న్యాయశీలురు.

Ancient India knew no thieves nor knew why to shut the doors of its houses" (Strabo. 1587 Ed. P. 488)

తా॥ ప్రాచీన భారతవర్షములో దొంగలు లేరు. వారి యిండ్ల తలుపులకు తాళములు వేసుకొనుట వారెఱుగరు. అని గ్రీకుచరిత్ర కారుడైన 'స్ట్రాబో' వ్రాసియున్నాడు.

"హానుత్స్యాంగు" యిట్లు వ్రాసియున్నాడు:— (వాల్యూం 2. పేజి 83.)

"ఆర్జవము, న్యాయబుద్ధి హిందువులవిశేషగుణములు ధనము విషయములో జూతమూ, వారొక్క పైసన్మైన అక్రమముగా గొనరు. న్యాయము విషయములో తమహక్కులను విశేషముగ త్యజించియైన సామరస్యముకొరకు యత్నింతురు" అని వ్రాసియున్నాడు.

"కాంగ్ తై" యను చైనారాయబారి యిట్లుచెప్పుచున్నాడు.

"The Indians are straight - forward and honest." (Max-Muller's India What can it teach us.)

తా॥ భారతీయులు ఋజుప్రవర్తన, న్యాయబుద్ధిగలవారు.

క్రీ॥ శ॥ పదకొండవశతాబ్దిలో తనచే వ్రాయబడిన భూగోళ శాస్త్రములో "ఇద్రిసి" యను పండితుడు యిట్లు వ్రాసియున్నాడు.

"The Indians are naturally inclined to Justice, and never depart from it in their actions. Their good faith honesty and fidelity to their engagements are well known, and they are so famous for these qualities that people flock to their country from every side." (Elliots History of India Vol. I P. 88)

తా॥ భారతీయులు సహజముగ న్యాయమందాసక్తిగలవారు. ఏకార్యములోగాని న్యాయమార్గమును దప్పరు. వారు విశ్వాసపాత్రులనియు, న్యాయబుద్ధిగలవారనియు, ఎట్టి వ్యవహారములందైన నాడి తప్పనివారనియు జగద్విదితము. ఈ సుగుణసంపదయొక్క కీర్తిని విని నానాదేశజనులు నలుదెసలనుండి భరతఖండమునకు మూగుచున్నారు.

పదమూడవ శతాబ్దములో షంషుద్దీన్ ఆబూ అబ్దుల్లా యను వాడు చెది-ఎజర్-జమాన్ యొక్క నిశ్చితాభిప్రాయము నిట్లుదహరించి యున్నాడు.

"The Indians are innumerable, like grains of sand, free from deceit and violence. They fear neither death nor life." (India Wat can it teach us. P. 275)

తా॥ భారతీయు లిసుకరేణువులవలెనసంఖ్యాకులు. అయినను వారిలో మోసముగాని కాఠిన్యముగానీ లేదు. వారికి చావుభయము గాని బ్రతుకు భయముగాని లేదు.

Abul Fazal says :—

"Hindus are admirers of truth and of unbounded fidelity in all their dealings."

(Tod's Rajasthan Vol. I Page 643)

అబులు ఫాజల్ అను మహమ్మదీయ చరిత్రకారుడు యిట్లు వ్రాసియున్నాడు: "హిందువులకు సత్యమందాదరముగలదు. ఎట్టి వ్యవహారములలోగాని ఇంతింతనరాని విశ్వాసపాత్రులు—

Phillimore and later writers speaking of the Indians said that :—

"They (Hindus) were a peculiarly truthful people. Truth was specifically an Indian virtue."

(Lecture on Education as the Basis of National life at Adyar.)

తా॥ ఫిల్లిమోరుమున్నగు గ్రంథకారులు భారతీయులనుగూర్చి వ్రాయుచు వారి సత్యసంధత యనన్యసామాన్యమని యద్భుతపడుచున్నారు.

"సత్యసంధత కేవలము భారతీయుల సొమ్ము, సూనృతవాక్యము నిట్లాదరించి యాచరించిన వారన్యదేశములలో లేరు."

Colonel Sleeman says :—(Commissioner for the suppression of Thuggee)

"I have had before me hundreds of cases in which a man's property, liberty and life has depended upon his telling a lie and he has refused to tell it."

(Max-Muller's India P. 50)

తా॥ కలనలుస్లీమన్ యిట్లు వ్రాసియున్నాడు—

"నావద్దకువచ్చిన వందలకొలది వ్యాజ్యములలో ప్రతివాదియొక్క ఆస్తి, స్వాతంత్రత, ప్రాణము ఒక్క అబద్ధమాడిన రక్షింపబడుస్థితిలో నుండి యుండినను వానిని పోగొట్టుకొనుటకైనను అంగీకరించిరి గాని యెవడును అబద్ధమును చెప్పియుండ లేదు."

మహామ్మదీయ చరిత్రకారుడైన అబులుఫాజలిట్లు వ్రాసియున్నాడు:—

" The Hindus are religious, affable, courteous to strangers, cheerful, enamoured of knowledge, lovers of Justice, able in business, grateful, admirers of truth, and of unbounded fidelity in all their dealing.s"

(Tod's Rajasthan Vol. I P. 643)

తా॥ హిందువులు మతనిష్ఠ గలవారు – కలుపుగోలుతనము గలవారు – అపరిచితుల నాదరణభావముతో జూచువారు, ఉత్సాహవంతులు, జ్ఞానాసక్తి గలవారు – న్యాయప్రియులు, వ్యవహారదక్షులు, కృతజ్ఞులు, సత్యమును బలుకువారు – సమస్తవ్యవహారములయందును మిక్కిలి విశ్వాసపాత్రులు.

"In order to understand the long rule of the Brahmins, and the influence which they still wield, it is necessary ever to keep in mind their position as the great literary caste."...

"Throughout twenty-two centuries the Brahmins have been the writers and learned men of India, the counsellers of Hindu Princes and the teachers of the Hindu people."

" Besides the epic chronicles of their Gods and heroes, the Brahmins composed many religious poems."

(The History of the People of India P. 63) By W. W. Huntur Ed. 1881.)

తా॥ హిందూదేశములో బ్రాహ్మణుల దీర్ఘకాల పరిపాలనమును, వారిప్పటికిని కలిగియుండిన పలుకుబడిని గ్రహించుటకు అదియొక గొప్ప విజ్ఞానముతో కూడిన వర్ణమని మనసులో నెప్పుడును జ్ఞాపకముంచుకొనుటత్యావసరము.

గత యిరువదిరెండు శతాబ్దములనుండియు, బ్రాహ్మణులు హిందూదేశములో గొప్ప శాస్త్రములను రచించినవారలును, పండితులును, హిందూరాజాస్థానములందు మంత్రులు, సభికులుగాను, ప్రజలకుపాధ్యాయులుగా నుండిరి. వారు పురాణములు, ఇతిహాసములు వ్రాయుటమాత్రమే గాక మతసంబంధమైన వాఙ్మయము నెక్కువగా వ్రాసియుండిరి అని వ్రాసియున్నాడు.

పూర్వులకంటె యెక్కువ నాగరికులమని చెప్పుకొనెడి యీకాలములో ప్రజలు పొందుచుండిన విద్యవలన కలిగిన ఫలితములన్నియు పూర్వపు రాజ్యపరిపాలకుల కాలములోని వానికి వ్యతిరేకము. పూర్వము వర్ణధర్మములవలన ప్రజలైకమత్యము గలిగియుండిరి. ఇప్పుడు ఐకమత్యము, ఏకత్వము, మానవ సమానత్వమను పేరున భేదములెక్కువై యొకరియందొకరికి అసూయాద్వేషములను గలిగించినవి. ఒకరు మరొకరికి ఘాతకులుగా తయారగుచుండిరి. విద్యవలన కలుగవలసిన వినయాది సుగుణములు పూజ్యమై అవినయము, అసంతుష్టి, అహంభావము, నాస్తికత్వము, పాపచింత, [illegible]రకులద్వేషము, మొదలుగా మానవజాతిని నాశనము చేయుదగిన [illegible]ప్తశక్తు లెన్నియో వృద్ధియగుచున్నవి. ఇప్పుడు మనము నాగరికుల[illegible]గుచుంటిమో లేక మహోన్నత నాగరికతా శిఖరమునుండి జారి [illegible]ందపడుచుంటిమో యోచింపుడు—ఆర్యనాగరికతకు మ్లేచ్ఛ నాగరి[illegible]కు మధ్య అంతరువెక్కువగాగలదు. ఒకదానికొకటి వ్యతిరేకము. [illegible]ర్యనాగరికత దైవసంపత్తుతో కూడినది. మ్లేచ్ఛనాగరికత ఆసుర[illegible]ంపత్తిగలది. ఆసురసంపత్తు పరపీడన, పరకులముల హింసవలన వృద్ధి బొందజూచును. కాని నాయుద్యమమున జయమును గాంచలేక పగులను కొంతవరకు హింసించి తాను సంపూర్తిగా నశించిపోవును. దైవసంపత్తు పరుల నభివృద్ధిలోనికి దెచ్చుచు తాను మహోన్నతిని బొందును.

# బ్రహ్మక్షత్రవంశములు

౧. ప్రమర, ౨. తోమర, 3. శుక్ల, ౪. పరిహారులను వారలు నాయాపేర్లను పొందిన నాలుగు బ్రహ్మక్షత్రవంశములకు మూలపురుషులైరి.

యు॥ శ॥ 28 వ, శతాబ్దమున (క్రీ॥ పూ॥ 4 శతాబ్దము) యీ బ్రహ్మక్షత్రరాజులు తమ తమ రాజ్యములను స్థాపించిరి.

అందు — ౧. ప్రమరమహారాజు ఆంధ్రదేశములోని "శ్రీ శైలము"ను రాజధానిగ జేసికొని ఆంధ్ర, మహారాష్ట్రదేశములను పాలించెను.

ఈవంశమునకు పావారు లేక పార్ వారు లేక పరమారవంశము వారని పేరు. ఘిలోట్సు, లేక గుహాలోట్ అనుశాఖ యిందుండి పుట్టినది. వీరు చివరవఱకును ఆంధ్రులుగానే యుండిరి.

౨. తోమర లేక పయుహానిమహారాజు అజ్మీరును రాజధానిగ జేసుకొని రాజపుటానా, సంయుక్తపరగణాలలో భాగము, పంజాబు మొదలుగాగల దేశభాగములను పరిపాలించెను. ఈ వంశమునకు "చాహుమాన" లేక "చౌహాన్" వంశములని పేరు. వీరు క్రమముగా ఢిల్లీని సంపాదించి పండ్రెండవ శతాబ్దమునకు రాజధానిగ జేసికొని యుండిరి. రహాతోరు లేక రాటోరులనెడిశాఖ యిందుండి చీలినశాఖ

3. శుక్లమహారాజు పశ్చిమసముద్రతీరమునగల ద్వారకానగరము రాజధానిగ గుజరాతు, సౌరాష్ట్రములను వానికి తూర్పు, దక్షిణముల కొంతభాగమును పాలించెను. ఈ శుక్లవంశమునకు "సోలంకు" లనియు "చాళుక్య" వంశమువారనియు "చారాసు" లనియు పేర్లు. వీరి నుండియే శాలంకాయనులు, బృహత్ఫలాయనశాఖలును, తూర్పు చాళుక్య, పశ్చిమచాళుక్యులను విభాగమున్నూ, చోడమహా రాజు

లతో సంబంధములు చేసినందున క్రమముగా రెండువంశములు యేకమై చాళుక్యచోళులనియు మొకలుగాగల శాఖోపశాఖలుగానైరి.

(Vide The Early History of India — By V. A. Smith 4th Edition Page 428; 440.)

వీరు తుదివఱకు ఆంధ్రులుగానేయుండి సంస్కృత, తెలుగు భాషల నాదరించి వృద్ధిజేసిరి.

౪. పరిహారలేక ప్రతిహారవంశమువారు. బెంగాలు (వంగ దేశము) దేశమును పరిపాలించిరి.—వీరు వేషభాషాదులలో వంగీయులుగా నైరి.

మహమ్మదుగోరీ ఇండియాదండయాత్రా కాలముకు అనగా 1190 సం॥రముకు ఈ నాలుగు వంశములవారును రాజ్యము చేయుచున్న భాగములు.

1. ఢిల్లీరాజ్యము—చోహానులు లేక తారులు (వీరు తోమర వంశములో రొుక శాఖ).

2. కనోజి రహతోరులు - (వీరు కూడను తోమరవంశీయులలో యింకొక శాఖవారు).

3. మీవారు లేక మేవాడ్. ఘిలోట్సు-వీరు ప్రమరవంశములోని యొకశాఖ.

4. అనుహుల్వారా రాజ్యము. చారాసులు లేక సోలంకీయులు లేక చాళుక్యులు.

పై నాలుగురాజ్యములలో (1) ఢిల్లీరాజ్యము గొప్పది. పశ్చిమమున కాబూలునదివరకు విస్తరించినది - ఢిల్లీకనోజీ రాజ్యములకు మధ్య కాళిందీనది హద్దు.

(2) కనోజి లేక కన్యాకుబ్జ రాజ్యము :- ఉత్తరమున హిమాలయములు, తూర్పున కాశీపట్టణము వరకును, పశ్చిమమున బుందేలు ఖండ్ వరకును, దక్షిణమున మీవారు వరకును వ్యాపించి యున్నది.

(3) మీవారు, లేక మేవాడ్, మధ్యదేశము. ఉత్తరమున ఆరావళీ పర్వతములు,

దక్షిణం - ధారానగరం ప్రమరవంశంవారి పరిపాలనలోనున్న రాజ్యము.

తూర్పు-కనోజికి సామంతులుగానుండిన రాజులుంలు రాజ్యములు.

పడమర - అనుహల్వారా రాష్ట్రము.

(4) అనుహల్వారా రాష్ట్రము:-ఉత్తరం రాజపుటానా యెడారి.

దక్షిణం-సముద్రము. పడమర సింధునది. (ముక్కోణాకారము) ఢిల్లీ, మీవారు రాష్ట్రముల రాజులు మిత్రులు - హాంసాయి రాజ్యములు గలవారు. ఢిల్లీ, కనోజీ రాష్ట్రముల రాజులు ప్రబల శత్రువులు.

క్రీ॥ శ. 1193 సం॥రములో యీ రాజ్యములు నాల్గును మహమ్మదీయులచే నాశనము చేయుబడినవి. ఈ నాలుగురాజ్యములు యేకమైయుండి ప్రతిఘటించియుండిన మహమ్మదీయులకీ భారత భూమిలో చొచ్చుట కవకాశ ముండెడిది కాదు.

(Antiquities of Rajasthan — By Col. Tod. Vol. II Ed. 1880 3rd reprint. 1st print 10th March 1832.)

## "స్మిత్" మహాశయుని వర్ణసంకర గాధలు

పశ్చిమ దేశమునుండి భారత దేశమునకు వచ్చి రాజ్యములను సంపాదించిన శక, యవన, హూణ మొదలుగాగల మ్లేచ్ఛజాతుల వారిని శుద్ధిచేసి క్షత్రియులలో చేర్చుకొనినట్లు అనేకములైన యూహలనుచేసియు, కొన్నిచోట్ల తాను బాగుగా ఋజువు చేయగలిగినట్లు స్థిరపరచియు, మఱికొన్నిచోట్ల జయస్వాల్, భండార్కారు మొదలు గాగల హైందవపండితులచేతను, ఫ్లీటు, బీమ్సు, ఎలియటు, కన్నింహాం మొదలుగాగల వారలచేతను వ్రాయబడిన చరిత్రలలో నాగ్రంధ కర్తలు వైదికసాంప్రదాయమెఱుగక వ్రాసిన విషయములను ప్రమాణముగా దీసికొనియు వి. ఎ. స్మిత్ మహాశయుడు తన గ్రంధమును నింపి యున్నాడు. ప్రపంచములోని యితర మతములకన్న వైదికమతము నందొక విశిష్టతగలదు. ఇతర మతములన్నియు తమ మతమే ప్రపంచములోని మానవులందరికి యేకైకమతమనియు, తమ మతమువలం

బించిన వారలకే గతులు గలవనియు బోధించును. వారి దేవుని మత వ్యాపననిమిత్తము అవిశ్వాసులమీద యుద్ధముచేసి వారి నెంతమందిని సంహరించిన అంతమంచిది. కాని వైదికధర్మమట్టిదికాదు. లోకమున జన్మించు జనులనేకవిధములైన సంస్కారములతో జనింతురు. పూర్వజన్మానురూపములైన సంస్కారములకు దగిన యభిప్రాయము లను గలిగియుందురు. కనుక తమ తమ యిష్టముల ననుసరించి మతా వలంబన చేయవచ్చును. లేక యెట్టిమతము లేక వుండవచ్చును. కాని పరులకు పీడాకరముగా నుండరాదు. పరులకెట్టి హింసయు తనమతము వలన గలుగరాదు. ఎవరేజాతియందు జన్మించిరో వారాజాతియం దుండి హింసను వర్జించి, పరధన పరదారాపహారణములకు జోరక యుండిన యెక్కడున్నవాడక్కడనే తరించుట కవకాశముగలదు. అని బోధించును. శ్లో॥ "పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం" అనగా పరోపకారము పుణ్యము. పరులను హింసించిన పాపము. వైదిక మతమనున దేదియు లేదు, వేదము ధర్మమునే ప్రధానముగా చెప్పును. వైదికధర్మము అనగా వర్ణాశ్రమధర్మమే వేదమతము. వేదముధర్మమే మూలముగాగలది ఎవడే వర్ణమందు బుట్టునో, నేయాశ్రమము నాశ్రయించునో అట్టి వర్ణధర్మములను, ఆశ్రమధర్మములను నాచరించు చుండుటయే ముక్తికిమార్గము. ఇతర మతములవారు గూడను వారి వారి మతములను విడువకనే వారి వారి మతాచారముల నవలం బించుచు చౌర్యహింసాదులు లేకుండిన క్రమక్రమముగా జన్మాంతర ములయందు వైదికధర్మము ననుష్ఠింపదగిన జన్మము వచ్చి వైదిక ధర్మానుష్ఠానమొనర్చినవాడై ముక్తుడగును. అందువలన ఇతరులను తమమతములోనికి కలుపుకొనుటకు వైదికధర్మమంగీకరించదు. తన ధర్మమునుండి భ్రష్టుడైన వానిని సంఘమునుండి త్రోసివేయును. ధర్మ బాహ్యునికి సంఘములో స్థానము లేదు. ఒకవర్ణములో పుట్టినవాడు సత్కర్మానుష్ఠానమువలన క్రమక్రమముగా ఉత్తమదేహములను బొందుచు చివరకు వైదికధర్మానుష్ఠానమున ముక్తినొందగల దేహ మును బొందును అని వేదములు బోధించుచున్నవి. అందువలన యే జాతియందు పుట్టినవా డాజాతి ధర్మముల నాచరించుచు యితర భూత

ములయందు దయగలిగి వర్తించుటయే శ్రేయస్సాధనము. పాశ్చాత్యులును, వారి యనుయాయులైన హూణవిద్యాధికులును వైదిక సాంప్రదాయము నెరుగనందున మ్లేచ్ఛులను ప్రాయశ్చిత్తములచే క్షత్రియులుగా మార్చినట్లు వ్రాసియుండిరి. ఇట్టి దేశాలమందు జరిగియుండలేదు. ఇప్పటికిని అట్టి యాచార మెచ్చటను వుండియుండలేదు. తనకులధర్మమును త్యజించినవాడు వెంటనే భ్రష్టుడగుటకు సందేహము లేదు. కాని వైదిక ధర్మముగాని, వర్ణముగాని జన్మాంతర కర్మవలన పొందదగినదేగాని ప్రాయశ్చిత్తాదులవలన యొకవర్ణమునుండి వేరొక వర్ణముగల శరీరమును బొందనవకాశము లేదు. తన కులధర్మమును వీడి భ్రష్టుడైనవాడు శాస్త్రీయమైన ప్రాయశ్చిత్తాదులచేఅధర్మజనిత దోషమును పోగొట్టుకొనుటకర్హుడగునుగాని యొకకులమునుండి వేఱొక కులమును బొందలేడు.

ఈ చరిత్రకారుల వ్రాతల ననుసరించి చూచిన ఐరోపాఖండమున వేలువేలు మ్లేచ్ఛ జాతులు సాంకర్యమునుబొంది యేకమైనటుల భరతఖండమున గూడను కులములన్నియు సంకరమగుటయేగాక ఇతర మ్లేచ్ఛజాతులతో కలిసి సంకరమై యుండవలెను. కాని యింతవరకు స్వచ్ఛమైన ఆర్యజాతి రక్తము భారతదేశములోని చాతుర్వర్ణ్య ప్రజలలోను వ్యాపించియున్నది. ఇప్పుడు స్వతంత్రమను పేరున పాశ్చాత్య భావములతో గూడిన నాయకులవలన యికముందు జాతిసాంకర్య మొనర్చెడి శాసనము లేర్పడి వర్ణ సంకరము జరిగిన జరుగవచ్చునేమోగాని యింతవరకింకను స్వచ్ఛమైన చాతుర్వర్ణ్యములు భారతదేశమం దుండియున్నవని మనవిచేయుచున్నాము. కుల సాంకర్య వివాహము లేనాడును యీ దేశములో లేవు. ఈ విషయములో సాక్ష్యముగా క్రీస్తుకు పిమ్మట శతాబ్దములలో యీ దేశాచారము లెట్లున్నవో తెలుసుకొనుటకు క్రీ॥శ 1030 సం॥రములో ఆల్బెరూని పండితుని వాక్యముల నిచ్చుచుంటిమి.

"The Brahmins were invariably marrying women of their caste only.

(Alberuni India II P. P.155-56—By Sachau.)

తా॥ బ్రాహ్మణులు విధిగా తమకులములోని స్త్రీలనే వివాహ మాడుచుండిరి" అని వ్రాసియున్నాడు. ఒక్క బ్రాహ్మణులే గాక యీ దేశములో నన్ని కులములవారును నేటివరకు తమ కులస్త్రీలనే వివాహమాడుచుండిరిగాని అన్యకులములలోని స్త్రీల నేకులమువారును వివాహ మాడుట లేదు. ఆల్బెరూని పండితుడు ఖగోళశాస్త్ర విషయము లను తెలుసుకొనుటకు విస్తారముగా బ్రాహ్మణులతోడనే కాలక్షేపము చేసియున్నందున బ్రాహ్మణకులమునకు సంబంధించిన ఆచారములనే తెలుసుకొని వ్రాయగలిగినాడు.

"We have alredy said many times that the bias of most European and a few Indian scholars is to look upon khatriya clans as developed out of aborigines and even untouchbles or foreigners. The above is a very striking instance of how most illogical and absurd inferences are drawn through this bias."

(Downfall of Hindu India — By C. V. Vaidya III Vol. Page 307 Ed. 1926.)

"In caste-ridden India is it possible that chiefs of untouchable peoples could have risen to this high status?" (Do Book Page 308)

తా॥ ఈ దేశములోని క్షత్రియశాఖలన్నియు అనాగరికులగు కొండజాతులనుండియో లేక బాహ్యజాతులనుండియో లేక బయట దేశములనుండి యీ దేశమును దోచుకొనుటకు వచ్చిన (శక, హూణ, గూర్జరాది) జాతులనుండియో యేర్పడినవని చెప్పుటయే పెక్కుమంది పాశ్చాత్య పండితులకును, (వారి యనుయాయులైన) కొంతమంది హైందవ పండితులకును యెక్కువ యిష్టము. (అనగా ఉద్దేశ్యపూర్వకముగా ముందే నిశ్చయించుకొన్న యొక నిశ్చయమున కనుకూలముగా సమన్వయము వ్రాయుట) అని మేమింతవరకనేక పర్యాయములు చెప్పియుంటిమి." "కులకట్టుబాటులతో ఘనభవించి యుండిన ఇండియాలోని హీనజాతీయులైన మ్లేచ్ఛులిట్టి యుచ్ఛదశకు వచ్చుట సాధ్యమా?" అని వ్రాసియుండెను.

వర్ణ సంకర వివాహములు జరిగినవనియు, యితరజాతుల వారిని హిందూమతములో కలుపుకొనిరనియు, క్షత్రియశాఖ లన్నియు

మ్లేచ్ఛజాతులనుండి యేర్పడినవనియు మొదలుగాగల వర్ణ సంకరగాధ లన్నియు పాశ్చాత్య పండితులచే కల్పింపబడిన శుద్ధ అబద్ధములు. అవి వారి యూహాలేగాని యెట్టి ప్రమాణము ననుసరించియు వ్రాయ బడినవి గావు. అట్టి వివాహము లేనాడును ఈ దేశములో జరిగి యుండలేదు. పాశ్చాత్యులచే వ్రాయబడిన యీ అనృతము లన్నిటిని ప్రోగుచేసుకొని కొంతమంది హైందవ పండితులు విమర్శనాశూన్యులై తాముగూడా గ్రంథకర్తలము గావలెననెడి కుతూహలమున పాశ్చాత్య పండితుల యూహాల నన్నిటికి ప్రతిధ్వనింపజేసి గ్రంథములు వ్రాసియుండిరి. వర్ణసాంకర్య వివాహములుగాని, వర్ణాంతర భోజన ములుగాని యీ దేశమున నెన్నడును జరిగియుండలేదు. అట్టి ప్రమాణము నొక్కటేనియు వారు జూపలేదు. కులమును వదలి సంకరులైనవారలే అట్టి పనులను జేయుచుండిరి. అట్టివారలు వారి వారి కులములనుండి బహిష్కరింపబడిరి.

"The Smriti works, their commentaries, Grihya-sutras, and Puranas regulated every action, however minute and unimportant, of a Hindu life. The authority of these compilations has, in the absence of the political power, saved the Hindus from being absorbed by the conquering races."

(History of India By Mahamahopadhyaya Haraprasada Sastry P. 61.)

తా॥ స్మృతులును, వాని వ్యాఖ్యానములును, గృహ్యసూత్ర ములు, పురాణములు హిందువులచే చేయబడు ప్రతిపనిని నియమిం చును. ప్రతి కార్యమునకు విధులు నిర్ణయించును. అది యెంతటి స్వల్ప కార్యమైనను, ప్రాముఖ్యము గలది కాకపోయినను నియమబద్ధ మొ ర్చును. హిందూజాతికి రాజకీయాధికారములు లేని కాలములో యి శాస్త్రగ్రంథములలో నిర్ణయింపబడిన ధర్మములకు బద్ధులైయుండుట వలననే యీ హైందవజాతి విజేతలైన యితరజాతులవారితో కలిసి సంకరము గాకుండునట్లు కాపాడబడినది, అని వ్రాసియున్నాడు

"All through history down to the period of British rule we see one foreign power after another

breaking through the North-Western gate-way, and the strongest of these winning the suzerainty over India. But the result in all cases was little more than a change of rulers — the deposition of one dominent caste and the substitution of another. The lives of the common people, their social conditions and systems of local Government, were barely effected by such conquests. Indian institutions have therefore a long unbroken history which makes their study especially valuable."

(The Cambridge History of India Vol. I Ancient India—By E. J. Rapson, M. A., Ed. 1922 Page 53.)

తా॥ భారతదేశచరిత్ర ప్రారంభము మొదలుకొని బ్రిటిషు ప్రభుత్వమేర్పడువఱకును చూచిన ఒకజాతికి పిమ్మట యింకొకజాతి పశ్చిమోత్తర కనుమలగుండా దేశములో ప్రవేశించి బలవంతులగు వారలీదేశములో ప్రభుత్వము చేసియుండిరి. అయితే పర్యవసానము యీదేశమున రాజుల మార్పే జరిగినది. ఒకరాజు పోవుట యింకొక రాజువచ్చి అధికారమును చలాయించుటయు జరిగియున్నది. కాని సామాన్య ప్రజాజీవితము, వారి సాంఘిక కట్టుబాట్లు, వారి గ్రామ స్వరాజ్యములు అట్టి రాజుల జయములవలన యెట్టి మార్పును చెంది యుండలేదు. భారతదేశములోని ప్రజాసంస్థలు మతసాంఘిక వ్యవస్థలు చెక్కుచెదరక అనాదినుండియు తెంపులేక (తేక సాంకర్యము అనగా మార్పు లేక) సాగివచ్చుచుండినవి. వాటిని బాగుగా అవగాహన చేసుకొనుట శ్రేయస్కరము. ఎక్కువ ఉపయోగము గలవిగా నుండును.

"A man is obliged to marry outside his family, but within the caste, and usually within the sub-caste, to which his family belongs" (Do. Book P. 53)

తా॥ తన గోత్రమునకు చెందిన కుటుంబమునుండి గాక తన కులములోని యితర కుటుంబములనుండియు, అందునను తనకులములో తనకు చెందిన అంతశ్శాఖలోను వివాహమాడవలయుననునదియే భారతీయునికి ధర్మము.

"A caste may, therefore, be defined as an endogamous group or collection of such groups bearing

a common name and having the same traditional occupation, who are so linked together by these and other ties, such as the tradition of a Common origin and the possession of the same tutelary deity, and the same social status, ceremonial observances and family priests, that they regard themselves and are regarded by others, as forming a single homogeneous Community."

(Census report. 1911, 1. P. 367 Vide E. J. Rapson's Cambridge His, of India Vol 1. Ancient India, Ed. 1922 P. 53)

తా॥ తమ కులములోనె వివాహమాడెడి నిబంధనతోఁగూడి యొకేపేరును పొంది, వంశపరంపరాగతమైన యొకే కులవృత్తిని గలిగి నటువంటియు, ఇంకను యితరములైన కట్టుబాట్లతోఁగూడి, యొకే విధమైన యుత్పత్తిని, కులదేవతలను, సరిసమానమైన సాంఘిక ప్రతిపత్తిని, యొకే విధమైన మతాచారములను, కులగురువులను గలిగి యుండి, యెట్టి సాంకర్యములేని యేక జాతీయతను పొందినవారుగా నున్నటుల తమచేతను, యితరులచేతను గుర్తింపబడుచుండెడి, యొక సంఘమును వర్ణము లేక కులము అనిమనము నిరూపించవచ్చును.

"One conqueror follows another, but the administration of each individual state remains unchanged either under the same prince or under some other member of his family, and the Charters of monastaries are renewed as a matter of course by each new overlord." (Do. Book P. 61)

తా॥ ఒకరి తరువాత యొకరుగా యీ దేశమును జయించిరి. పరిపాలించిరి కాని ప్రతిరాష్ట్రము పరిపాలనలో యెట్టి మార్పులేక ఆరాజుక్రిందగాని లేక వాని కుటుంబమునకు చెందిన యింకొక రాజు యొక్కగాని పరిపాలనలో యుండి మతసంస్థలకీయబడిన దానములు ప్రతిపరిపాలకునిచేతను అంగీకరింపబడి తిరిగి సనదులు యివ్వబడు చుండెడివి.

"The Brahmins made law a part of their religion... (Grihya Sutras B. C. 700 and Manu Code B C. 500). They contain many rules about marriage, inheritence and

food. They keep castes apart, by forbidding them to inter - marry or to eat to-gether. They were accepted as almost divine laws by the Hindus; and the spread of these Codes was the work of the Brahmins as the civilisers of ancient India."

"The Brahmins were not merely the keepers of the Sacred Books, the Philsophers, the men of Science, and the law makers of the Hindu people - they were also its poets."

ఈ విషయమున డబ్ల్యు. డబ్ల్యు. హంటరు పండితుడు తన "A Brief History of the Indian People" అనెడి చరిత్ర 57 పుటలో నిట్లు వ్రాసియున్నాడు :—

తా॥ బ్రాహ్మణులు ధర్మశాస్త్రములను (గృహ్యసూత్రములు క్రీ॥ పూ॥ 700; మనుస్మృతి క్రీ॥ పూ॥ 500) తమ మతములో నొక భాగముగా నొనర్చిరి. వానిలో వివాహమునకు, వారసత్వమునకు, భోజనమునకు సంబంధించిన ధర్మములనేకములుగలవు. కులము లొక దానితో నొకటి కలియకుండ విడిగా నుండునటుల యొక కులము వారితో యింకొకరు వివాహములు చేసుకొనకుండను, భోజన ప్రతి భోజనములు లేకుండను శాసించినవి. ఆ ధర్మములు దివ్యములైన వని హిందువులందరు భావింతురు.

ప్రాచీనభారతవర్షమున నాగరికతను వ్యాపింపజేయుటకే ధర్మశాస్త్రములు ప్రచారము జేయబడినవి.

బ్రాహ్మణులు వేదశాస్త్రాది మతగ్రంథములను కాపాడువారలే కాక, హిందూజాతికి తత్త్వవేత్తలుగాను, ప్రకృతిశాస్త్రజ్ఞులుగాను, ధర్మశాస్త్రకర్తలుగా నుండి వానినన్నింటిని చక్కని కవిత్వముతో గూర్చియుండిరి.

కె. యం. పానిక్కరు మహాశయుడు తన శ్రీహర్షచరిత్ర 45 పుటలో నిట్లు వ్రాసియున్నాడు :—

"There is no doubt whatever that the caste-system as we know it to-day with all its elaborate restrictions with regard to marriage, food, ceremonial

pollution, etc. existed in its fully developed form in the days of Harsha." (i.e. 606—640)

తా॥ వర్ణవ్యవస్థ, వివాహము, ఆహారము, జాతమృతాశౌచములు మొదలుగాగల వానియందు తన బహుళనియమములతో గూడినదై యీదినమున నున్నదానికంటె హెచ్చు వికాసముగలదై క్రీ॥ శ॥ 606-640 సం॥రములలో గల శ్రీహర్షుని కాలమందుండి యున్నదని చెప్పుటకు సందేహింపనక్కరలేదు, అని వ్రాసియున్నాడు.

"The description that Bana gives us of the life in Brahmin villages is not very far from prevailing conditions. Caste restrictions which form the basis of Hindu religious and social activity were rigid then as they are now. (i. e. in 606 A. D)

తా॥ బాణకవిచే (శ్రీహర్ష చరిత్రయందు) వర్ణింపబడిన బ్రాహ్మణ అగ్రహారములలోని ప్రజాజీవితము యీకాలమునందున్న దానికంటే యెక్కువ తేడా లేదు. హిందువుల మత, సాంఘిక వ్యాపారములకాధార భూతమైన వర్ణనిబంధనలు యీరోజున నున్నటులనే ఆరోజులలో కూడా నియమబద్ధముగా నుండియున్నవి.

"The severest social penalty which can be inflicted upon a Hindu is to be put out of his caste"

(A Brief History of the Indian people By W. W. Hunter Ed. 1881. Page 87)

తా॥ సాంఘికముగా దోషమొనర్చిన హిందువునకు కులమునుండి బహిష్కరింపబడుట కఠినమైన శిక్షగా యెంచబడుచుండినది - అని వ్రాసియుండిరి.

కులధర్మముల నొదిలినవారును, వర్ణాంతర స్త్రీల వివాహము లాడినవారును, వర్ణాంతరులతో కలిసి భుజించినవారును వారి వారి కులములనుండి బహిష్కరింపబడిరేగాని యీదేశములో యే నాడును యితరకులములవారిని పైకులములలోనికి కలుపుకొనియుండ లేదు. అట్టివాక్యము నే గ్రంథమునను జూపలేరు - ఇట్టి స్థితిలో హిందూజాతికి విరుద్ధమైన యితరజాతులను అనగా శక, హూణ, గూర్జరులను

హిందూసంఘమున జేర్చుకొనిరని వ్రాయబడిన ప్రమాణశూన్యమైన ఊహాజన్యవాక్యముల నెవరొప్పుకొందురు? దిగువవర్ణములవారిని ప్రాయశ్చిత్తాదులచే పైవర్ణములలో జేర్చుకొనుట కెట్టి స్వల్పావకాశము శాస్త్రములయందీయబడియుండినను యీదేశములోనందరు బ్రాహ్మణ, క్షత్రియులుగా జేయబడియుండెడివారని వేఱుగ జెప్పనక్కఱలేదు. ఈదేశములోని స్వతంత్ర ప్రభువులలోను, జమీందారులలోను, గొప్ప భూస్వాములలోను తాము చతుర్థకులజులమని యీరోజువరకు వ్రాసుకొనుచుండువారనేకులుండియున్నారు. కులసంక్రమణమున కవకాశమే గలిగియుండిన యెడల వీరు శూద్రులుగా నెంచుకొందురు? ఇది గాక బాహ్యజాతులుండవలసిన యవసరమేమిగలదు? ప్రాయశ్చిత్తాదులచే వీరందరి నేల పై కులములలో జేర్చియుండలేదు? ఇతరజాతుల వారెవరైనను హిందూమతములోని శైవ, వైష్ణవమతముల స్వీకరించిన వారింకొక పేరుతో శూద్రులకు తరువాత గల జాతులవారుగా పరిగణింపబడిరేగాని చాతుర్వర్ణ్యములలో దేనిలోను జేర్చుకొనబడియుండలేదు. అట్లు కులసంక్రమణము జరిగినట్లు వ్రాయబడిన వ్రాతలనృతములని గ్రహింపవలెను.

పాశ్చాత్య పండితుల అసత్య వ్రాతలను వాదనలను గురించియు, హైందవ సంస్కృత పండితుల యోగ్యతనుగురించియు, మాక్సుమూలరు పండితుడు తన అనుభవము నిట్లు వ్రాసియున్నాడు.

"During the last twenty years however, I have had some excellent opportunities of watching a number of native scholars under circumstances where it is not difficult to detect a man's character, I mean in literary work. and, more particularly, in literary controversy. I have watched them carrying on such controversies both among themselves and with certain European scholars, and I feel bound to say that, with hardly one exception they have displayed a far greater respect for truth' and a far more manly and generous spirit than we are accustomed to even in Europe and America. They have shown strength, but no rudeness; nay, I know that nothing has surprised them as much as the coarse invective to which certain

Sanskrit scholars have condescended, rudeness of speech being, according to their view of human nature, a safe sign not only of bad breeding but of want of knowledge. When they were wrong they have readily admitted their mistake; when they were right they have never sneered at their European adverseries. There has been, with few exceptions, no quibbling, no special pleading, no untruthfulness on their part, and certainly none of that low cunning of the scholar who writes down and publishes what he knows perfectly well to be false, and snaps his fingers at those who still value truth and self - respect more highly than victory of applause at any price. Let me add that I have been repeatedly told by English merchants that commercial honour stands higher in India than in any other country, and that a dishonoured bill is hardly known there."

(India : What can it teach us. By MaxMuller P. 63)

తా॥ "గతించిన యిరువదియేండ్లలో నేను పెక్కుసార్లు హిందూ పండితులు సారస్వతగోష్ఠిలో నుండ గనులార గాంచగల్గితిని. సామాన్యముగా, ఒకానొక పండితుడు విద్యాగోష్ఠిలో నున్నప్పుడు విశేషించి వాదప్రతివాదములు సలుపుచున్నప్పుడు అతని నిజస్వభావ మెఱుగుట సుకరము. హిందూపండితులు తమలోతాము చర్చించుకొనుచుండగను, కొందఱైరోపీయ పండితులతో దర్కించుచుండగను ఉభయత్ర నేను గమనించియుండిని. సత్యాదరమునందును, బౌరుషౌదార్యములందును వారిని మించినవారిని మనసైరోపా, అమెరికా ఖండములలోనైన గాంచియుండనని నేను విధిగా చెప్పవలసి యున్నది.

వారు తమ వాదబలమునే ప్రదర్శించిరిగాని మోటుతనమును జూపలేదు. ఐరోపీయ సంస్కృత పండితులలో గొందఱు అప్పుడప్పుడు అసభ్య దూషణములకు సహితము సిద్ధపడిరి. ఇది హిందూ పండితులకాశ్చర్యజనకమై రోతపుట్టించెను. మోటుప్రసంగము మంచి శిక్షణము లేకపోవుటనేగాక అల్పజ్ఞతను గూడ దెలియబరచునని వారి

యభిప్రాయము. వారు తాము పొరబడినప్పుడు వెంటనే తప్పు నొప్పుకొనెడివారు. తమ వాదము సక్రమమని ధ్రువపడినపుడు ఎదురునున్న ఐరోపీయ ప్రతిపక్షుల నగతాళి చేసెడివారు కారు. ప్రస్తుతాంశము తమ వాదమునకు బలహీనమని తోచినచో దాటించుకొనిపోవ ప్రయత్నించుట; తమ వాదనకు బలమైన యంశములు పదేపదే నొక్కి చెప్పుట; వాస్తవమును గప్పిపుచ్చుట, సాధారణముగా వారియందు (హిందూపండితులందు) గానరావు. ప్రత్యక్షముగ నసత్యములని తెలిసిన యంశములనే వ్రాసి ప్రకటించి, జయకాంక్షగాని, ప్రతిష్ఠాపేక్షగాని లేనట్టియు, సత్యమును, ఆత్మగౌరవమును ప్రధానములుగ నెంచుకొనినట్టియు మహనీయులను వంచించు కుతంత్రబుద్ధి (కొందరు పాశ్చాత్య పండితులవలె) హిందూపండితులలో వెదకినను గానరాదు.

ఆంగ్లేయవర్తకులు నాతో బలుమారు చెప్పుచు వచ్చిన యొక యంశము నీ సందర్భమున జొప్పింప ననుజ్ఞ వేడుచున్నాను. వర్తక వ్యాపారములందు న్యాయబుద్ధి హిందూదేశములో నున్నంత యింకెక్కడను లేదు. ఆదేశములో హుండీలుగాని, బరాతములుగాని చెల్లింపక త్రిప్పివేసినట్లు ఎన్నడును వినియుండలేదు" అని మాక్సుమూలరు పండితుడు హిందూదేశములోని బ్రాహ్మణపండితులను, వర్తకులను గురించి ఆయనగారి ప్రత్యక్షానుభవమును వెల్లడించియున్నాడు. (ఇది భారతదేశములోని వైశ్యసంఘమును గురించిన ప్రశంస. వ్యాపారమును వృత్తిగా చేయుచుండిన యితర భారతీయులకు గూడను వర్తించును.)

ఐరోపీయపండితులు "ప్రత్యక్షముగ నసత్యములని తెలిసిన యంశములను వ్రాసి ప్రకటించి లోకమును వంచింప ప్రయత్నించెడి అలవాటు గలిగియున్నటు"లపై వాక్యములలో స్పష్టము చేయబడినది. అట్టి యలవాటు గలవారగుటవలననే భారతదేశచరిత్రను తమ యూహాకల్పితములైన అసత్యప్రసంగములతో నింపి హైందవ పురాణవిద్యార్థుల బుద్ధులను చెడగొట్టిరి. ఇప్పటికైనను మేలుకొని మనవారు వారిసంస్కృత వాఙ్మయమును పరిశోధించి సత్యచరిత్రలను వ్రాసుకొనుట శ్రేయము.

# బ్రహ్మక్షత్రులు

బ్రహ్మక్షత్రాన్వితులైన రాజులను కొందరిని శాసనములలో పేర్కొనియుండుటవలన విధిలేక "బ్రహ్మక్షత్రు"లను వారలు బ్రాహ్మణులలో గలరని స్మిత్ మహాశయుడంగీకరించుచున్నాడు. కాని వీరందరు సంకరులును విజాతీయులైన మ్లేచ్ఛులనియు వారిని బ్రాహ్మణక్షత్రియులుగా శుద్ధిచేయబడి కలుపుకొన్నట్లూహించి యున్నాడు.

"We have already seen that a Chatsu inscription speaks of a Guhilot King Bhartribhatta as Brahma-Kshatr-anvita, (బ్రహ్మక్షత్రాన్విత) which I have translated by "possessed of both priestly and martial energy", but a foot-note has been added below saying that what is also implied is that Bhartribhatta was a Brahmakshatri, i. e. belonged to the Brahmakshatri caste. Bhartribhatta is not the only ancient King of India who is so called. In the Deopara inscription of Vijayasena, of the well-known Sena dynasty of Bengal, Samantasena; is described as Brahma-kshatriyanam Kula-siro-dama,..................which expression was rendered by Prof. Kielhorn by "head-garland of the class of the Brahmins and Kshatriyas", but which ought to be rendered, I think by "head garland of the Brahma-Kshatri family." That the latter is the correct translation is shown by the term Brahma-Kshatra used with reference to the Sena Kings in the Ballala-Charitra (Bibl. India.)

(Vide 'The Early History of V. A. Smith; P. 435.)

తా॥ "ఛాత్సుశాసనము" గుహిలాటురాజు బ్రహ్మక్షత్రాన్వితుడగు "భర్త్రిభట్టు" అను రాజును గురించి చెప్పుచున్నది. "బ్రహ్మ క్షత్రాన్విత" అనగా బ్రహ్మత్వము, క్షాత్రము రెండధికారములను కలవాడనే నేను తర్జుమా చేసియుంటిని. కాని దిగువ వ్రాయబడిన వివరణలో "భర్త్రిభట్టు" బ్రహ్మ క్షత్రకులమునకు చెందినవాడను అర్థమిమిడియున్నట్లు సూచించితిని. ఆ ప్రకారము "బ్రహ్మ క్షత్రుడని చెప్పబడిన ప్రాచీనరాజు ఒక్క భర్త్రిభట్టు

మాత్రమే కాదు. బెంగాలులో రాజ్యముచేసిన సేనవంశమునకు చెందిన "సామంతసేనుడ"ను రాజు "బ్రహ్మక్షత్రియానామ్ కుల శిరోదామ" అని విజయసేనునియొక్క 'డియోపార' శాసనములో వర్ణింపబడియున్నాడు. 'బ్రహ్మక్షత్రియానాం కులశిరోదామ' అను పదము బ్రాహ్మణ, క్షత్రియ కులములలో శ్రేష్ఠుడని కీల్‌హారన్ పండితు డర్థముచేసియున్నాడు. కాని యీ వాక్యమునకు "బ్రహ్మ క్షత్ర" రాజులలో శ్రేష్ఠుడని అర్థము చేయవలసియున్నది. భల్లాల చరితలో సేనరాజుల కుపయోగింపబడిన "బ్రహ్మక్షత్ర" పదము నిచ్చట తీసుకొనుటయే సమంజసము." (స్మిత్ హిస్టరి 435 పేజీ)

"Now, there is a caste called Brahmakshatri, corresponding to this Brahmakhatra; the members of which are found all over the Punjab, Rajputana, Kathiawar; Guzarat, and even in the Dekkan."

(Early His. of India—By V. A. Smith, P. 435.)

తా॥ "బ్రహ్మక్షత్రి లేక బ్రహ్మక్షత్ర యనెడి బ్రాహ్మణశాఖ పంజాబు, రాజపుటానా, కథియవారు, గుజరాతు, దక్కను దేశములలో నంతను గలదు." "స్మిత్" మహాశయుడు "బ్రహ్మక్షత్రులను" పేరున బ్రాహ్మణులు రాజ్యములను పరిపాలించిరని వ్రాసియున్నాడు.

"ట్రైబ్సు" (అనగా గుంపులు లేక తెగలు) భారతదేశమందు లేవు. అది యూరోపుఖండ విషయము. చాతుర్వర్ణ్యములను, సంకీర్ణ జాతులను "ట్రైబ్సు" అని పిలువతగదు. ఇతరదేశములనుండి రాబడిన మ్లేచ్ఛులైన శక, హూణాదులను ప్రాయశ్చిత్తాది విధులచే క్షత్రియులుగా, మార్చిరని చెప్పెడివారికి భారతీయసాంప్రదాయమేమియు తెలియదనుట కెట్టి సందేహమును లేదు. ఇట్టి విపరీతభావ మీ చరిత్ర కారుల బుద్ధిలో దోచినందుకు, విచారింపవలసియున్నది. వీరిచే వ్రాయబడిన హంశములలో చారిత్రిక విలువలేనిభాగములే హెచ్చుగా కనబడుచున్నవి. చాలా భాగము వీరి యూహాపోహాలే ఈచరిత్రల కాధారము. తమవలెనే భారతదేశములోని చాతుర్వర్ణ్యములును సంకరజాతీయులను నిర్ధారణ చేయుటయే వీరి ముఖ్యాభిప్రాయముగా వారిచే వ్రాయబడిన చరిత్రలను చదివిన ఆర్యసాంప్రదాయ మెరిగిన

వారికి తప్పక గోచరించును. గనుక సత్యాన్వేషణాపరులు భారతీయ సాంప్రదాయమునకు విరుద్ధమైన భావములను విసర్జించుట శ్రేయము.

"The Sena Royal family originally Brahmin. Mr. Bhandarkar is perfectly right. Consequently the ancestor of the Sena Kings must have been a Brahmin from the Deccan."

(Early History of India —By V. A. Smith, P. 436.)

తా॥ "బంగాళా దేశము (వంగదేశము) ను పరిపాలించిన "సేనరాజవంశము" ప్రథమమునుండి బ్రాహ్మణవంశీయులే. ఈ విషయమున భండార్కారుయొక్క నిశ్చయము న్యాయమైనదే. సేన రాజవంశమునకు మూలపురుషుడు దక్షిణదేశమునుండి వచ్చిన బ్రాహ్మణుడై యున్నాడు." అని స్మిత్ మహాశయుడు వ్రాసియున్నాడు.

"The Kanaujiya Brahmins, who supplied many sepoys to the old army, used to say, if irritated "Ham Khatriya Brahmin haiu, as a boast."

(Wilson's Indian Caste ii. 151 & Smith's History Page 436 foot.note 1.)

తా॥ "పూర్వపు బ్రిటిషు సైన్యమునకు హెచ్చుమంది సిపాయిలను సప్లైచేసిన కనోజీయ బ్రాహ్మణులు యితరులు తమకు కోపము తెప్పించినపుడు "నేను క్షాత్రమునొందిన బ్రాహ్మణుడను" అని డంబము పలుకుట మామూలు" అని విల్సను, స్మిత్ మొదలయిన వారలు వ్రాసియుండిరి.

పైన వుదహరింపబడిన 1. ప్రమర 2. వయహాని 3. శు 4. పరిహారవంశములు నాలుగును బ్రాహ్మణ వంశములు. వీ నలుగురును ఆంధ్ర శాతవాహన కుటుంబములలోనివారు. ఈ నాలుగు వంశములు బ్రహ్మక్షత్రులను పేరున ఉత్తరభారతమున పిలువబడు చుండిరి. అట్లు క్షాత్ర మవలంబించి రాచకార్యములందు నియోగింపబడిన బ్రాహ్మణులు "నియోగ బ్రాహ్మణశాఖ" గా యేర్పడినట్లు కనుబడుచున్నది.

# బ్రాహ్మణరాజులు

ఈ బ్రాహ్మణరాజులు నాలుగువంశములవారు. దేశము నాలుగు ప్రక్కల నాలుగురాజ్యములను క్రీ॥ పూ॥ నాలుగవ శతాబ్దములో నే స్థాపించియుండిరని లోగడ చెప్పియుంటిమి. కాని కొన్నిపురుషాంతరములవఱకు వీరికి ప్రాముఖ్యము వచ్చియుండలేదు. వీరు బ్రహ్మక్షత్రియరాజులనియు, ఆంధ్రదేశమున నియోగబ్రాహ్మణ ప్రభువులనియు పిలువబడుచుండిరి. వీరు ఆంధ్రశాతవాహనవంశజులు. ఆంధ్రశాతవాహనులు చక్రవర్తులుగా నుండిన కాలములో జ్యేష్ఠకుమారులను యువరాజులుగా చేసి మిగత కుమారులు, దౌహిత్రులు రాజపుటానాలో అల్పరాజ్యములకు ప్రభువులుగా చేయబడి పంపబడుచుండిరి. అట్లు యేర్పడిన రాజపుత్రకుటుంబములు ముప్పదియారు. వారు ముప్పదియారు శాఖలకు మూలపురుషులైరి.

వారినుండి—

1. ప్రమర లేక పరమార లేక పావారు. వీరినుండి ఘెలోట్లు లేక "గుహాలోట్" అనుశాఖ పుట్టినది.

2. తోమర లేక వయహాని. చాహుమాన, చౌహాన్ అనియు పేర్లు వీరినుండియే రహతోరు లేక రాటోరు అను శాఖయేర్పడినది.

3. శుక్ల లేక సోలంకి లేక చాళుక్యవంశము. వీరికి చారాసులనియు పేరుగలదు.

4. పరిహార లేక ప్రతిహారవంశము అను నాలుగువంశములు "బ్రహ్మక్షత్ర"వంశములను పేరున యేర్పడినవి. ఈవంశములరాజులు క్షాత్రమవలంబించిన బ్రాహ్మణులై యున్నందున వారిపేర్లకు చివర "శర్మ" "వర్మ"లను వానిలో దేనినైనను భేదములేక చేర్చుకొని యుండిరి. 'వర్మ'యని చేర్చబడినంత మాత్రమున వారు క్షత్రియులని యెంచబడరాదు. కేరళదేశమును క్రీ॥ పూ॥ ఐదవ శతాబ్దములో పరిపాలించిన "కదంబ"వంశపు బ్రాహ్మణరాజు "మయూరశర్మ". ఇతనికి తరువాత వచ్చిన యీతని వంశీయులైన రాజులందరు "వర్మ" శబ్దమును చేర్చుకొనియుండిరి. అంతమాత్రమున వారిని క్షత్రియులుగా

నెంచరాదు. యు. శ. 2811 లు 4331 వఱకు (కలి. 2775_4295; క్రీ॥ పూ॥ 327_క్రీ॥ శ॥ 1193) యీ బ్రహ్మక్షత్రరాజులు పరిపాలించిరి. కాని క్రీ॥ పూ॥ 327_82 సం॥రము వఱకు గుప్తవంశపురాజులు బలవంతులుగా నుండి రాజ్యము చేయుచుండినందున యీ బ్రాహ్మణ రాజ్యములకు ప్రాముఖ్యత వచ్చియుండలేదు గుప్తరాజులు క్షత్రియులు. వైదికధర్మమార్గప్రవర్తకులై వర్ణాశ్రమధర్మముల కాపాడుచు ప్రజలను ధర్మమార్గమున పరిపాలించుచుండిరి. పరదేశీయుల నీ దేశమునందడుగుపెట్టనీయక దేశమును కాపాడిరి. గుప్తరాజులలో రెండవ రాజైన "సముద్రగుప్తుడు" (గ్రీకులచే చెప్పబడిన "శాండ్రకోసిట్టను") గొప్ప సైన్యముతో బయలుదేరి ఆసేతుహిమాచలము గాగల భారత దేశమునంతను జయించి రాజులనందరను లోబరచుకొనెను. పంజాబును దాటి పశ్చిమోత్తరమునగల కాబూలు, పరిషియా, సిస్తన మొదలుగా గల మ్లేచ్ఛరాజ్యములను గూడను జయించి వారివలన కప్పములగొనెను. ఆకాలమున ఈబ్రహ్మక్షత్రరాజులు గుప్తరాజులకు లోబడియుండిరి. గనుక యీనాలుగు బ్రాహ్మణరాజ్యములు ప్రాముఖ్యాతను బొందియుండలేదు. క్రీ॥ పూ॥ 82 సం॥రమున గుప్త రాజ్యమంతరించినది గుప్త రాజు లల్పభాగముల కధిపతులై, పాటలీపుత్రమున రాజధానిగ చేసుకొని మగధవఱకుగల భాగమును (ఉత్తరబీహారు మాత్రము రాజ్యముచేయు చుండిరి. పరదేశీయులైన శకహూణాదులు దేశముమీద దండెత్తి దోచుకొనుచు ప్రజలను హింసింపుచు మిడుతల దండువలె చెలరేగిరి. గుప్తరాజులకీ దోపిడి దొంగలతో యుద్ధము చేయుటతో సరిపోయినది. తుదకా గుప్తరాజ్యమే యంతరించినది. శకులు ఉజ్జయినీయందుండిన బ్రాహ్మణరాజునుసంహరించి ఆ రాజ్యమును పరిపాలించుచుండిరి.

కలిశక నిర్ధారణ చేయుట యీ గ్రంథముయొక్క యుద్దేశ్యమై యున్నందున వరుసను రాజవంశావళుల నిచ్చుటనవసరము. క్రీ॥ పూ॥ 327 సం॥ ఆంధ్ర సామ్రాజ్యము విభాగమైపోవుటయు, చివర ఆంధ్రచక్రవర్తిని చంపి గుప్త వంశీయుడైన క్షత్రియుడు చంద్రగుప్తుడనువాడు రాజ్యమునకు వచ్చుటయు, గుప్తవంశము

245 సం॥రములు రాజ్యపాలన మొనర్చి క్రీ॥ పూ॥ 82 సం॥ రమున తన ప్రాముఖ్యతను పోగొట్టుకొనుటయు తటస్థించినది. గుప్తవంశ పాలన మంతరించిన క్రీ॥ పూ॥ 82 సం॥రము లగాయతు ఉజ్జయినీని జయించి పాలించిన బ్రహ్మక్షత్ర వంశములకు చెందిన ప్రమరవంశము లోని "విక్రము" డను రాజును తీసుకొని కలిశకమును తెంపులేకుండ కాలగణనము చేయుచుంటిమి.

## ప్రమరవంశపు రాజులు

వీరు బ్రాహ్మణులు. వీరి గోత్రము వసిష్ఠగోత్రము. యు॥ శ॥ 2811 లగాయతు వీరు ఆంధ్ర దేశములోని శ్రీశైలమును రాజధానిగ జేసుకొని ఆంధ్ర మహారాష్ట్ర దేశముల పరిపాలించిరి. గుప్తవంశ మంతరించిన యు. శ. 3056 (కలి. 3020 క్రీ॥ పూ॥ 82) వఱకు మనకు తెలియవచ్చిన రాజులపేర్లు అయిదుమాత్రము ఈ యైదు గురిలో మొదటిరాజు ప్రమర మహారాజు. శ్రీశైలములోని "ప్రమ రాంబ" యనెడి దేవత పేరీయనకు పెట్టబడినది. 1. ప్రమర 2. మహా దేవ 3. దేవాపి 4. దేవదూత 5. గంధర్వసేన. అను వారైదుగురు. ఐదవరాజైన గంధర్వసేనునకు 6. శంఖ 7. విక్రములను కుమార్లిద్దరు. అందు శంఖమహారాజు శ్రీశైలమునం దభిషేకింపబడి రాజ్యము చేయుచుండెను. రెండవ కుమారుడైన విక్రముడు గొప్ప సైన్యమును చేర్చుకొని ఉజ్జయినీయందుండిన శకరాజుపైకి దండెత్తి యుద్ధమున వాని నోడించి శకుల నీదేశమునుండి తఱిమివేసి తాను ఉజ్జయినీ రాజ్యమునకు క్రీ॥పూ॥ 82 సం॥రమున రాజయ్యెను. ఉజ్జయినీ పట్టణము "మాల్వా" రాష్ట్రమునకు రాజధాని. మాల్వారాష్ట్రము క్రమముగా సౌరాష్ట్రమును చేర్చుకొని ఉత్తరమున రాజపుటానాలోని క్షీణభాగమంతయు స్వాధీనము చేసుకొనబడినది. ఈ ఉజ్జయినీ ప్రభువైన విక్రమార్క మహారాజు శకకర్తయై విక్రమశకమును స్థాపించెను. శంఖుని వంశములోని రాజ పరంపర మనకు తెలియ రాలేదు. కాని శ్రీశైలరాజ్యము క్రీ॥శ॥ యెనిమిదవ శతాబ్దము వఱకు వృద్ధిపొందినట్లు కనుబడుచున్నది.

విక్రమశకము యు. శ. 3081, కలిశకం 3045 క్రీ॥ పూ 57 సం॥రము చైత్ర శుద్ధ పాడ్యమిరోజున గురువు ధనస్సులోను; సూర్యుడు, చంద్రుడు మిగత గ్రహములును మేషములో ప్రవేశించిన సమయమున ప్రారంభింపబడి బార్హస్పత్యమాన మేర్పడినది. బౌద్ధయాత్రికుడైన "హ్యునిత్సాంగు" ఉజ్జయినీ రాజులను, మధ్య భారతమునగల రాజులందరు బ్రాహ్మణులని వ్రాసియున్నాడు.

ప్రమరవంశపు ఉజ్జయినీ రాజులపట్టీ (యు॥శ 3056-4831; క్రీ॥పూ 82-1193)

1. విక్రమ
2. దేవభక్త
3. శాలివాహన
4. శాలిహోత్ర
5. శాలివర్ధన
6. శకహంత
7. సుహోత్ర
8. హావిర్హోత్ర
9. ఇంద్రపాల
10. మాల్యవాన్
11. శంభుదత్త
12. భీమరాజ
13. వత్సరాజ
14. భోజరాజ
15. శంభుదత్త
16. బిందుపాల
17. రాజపాల
18. మహీనర
19. సోమవర్మ
20. కామవర్మ
21. వీరసింహ
22. రంగపాల
23. కల్పసింహ
24. గంగసింహ

ఇంక వీరనేక శాఖలై దేశమందనేక ప్రదేశములలో రాజ్యము చేసియుండిరి.

"The Kings of Ujjain and other Kingdoms in Central India, which must have been more or less subject to Harsha's control, belonged to the Brahmin Caste."

(Early History of India—By V. A. Smith, P. 369.

తా॥ ఉజ్జయినీ రాజులును, మధ్య ఇండియాలో కొద్దిగానో గొప్పగానో శ్రీహర్షుని అధికారమునకు లోబడియుండిన ఇతర రాజ్యముల రాజులును బ్రాహ్మణ వర్ణస్థులైయుండిరి. అని హావునిత్సాంగ్ అను చైనా యాత్రికుడు వ్రాసియున్నాడు.

శకకర్తయైన విక్రమార్క మహారాజు గొప్ప విద్వాంసుడు. పండితుల ననేకులను పోషించెను. ఈతని యాస్థానముననే రఘువంశము మొదలుగాగల సంస్కృతకావ్యములను, జ్యోతిర్విదాభరణమును జ్యోతిశ్శాస్త్రము మొదలుగాగల గ్రంథములను రచించిన కాళిదాసు వరాహమిహిరుడాదిగాగల తొమ్మండుగురు పండితులు, కవులు "నవరత్నముల"ను పేరున యుండియుండిరి. ఇతడు మొదటి కాళిదాసు భోజరాజాస్థానమందుండిన కాళిదాసు రెండవ కాళిదాసని పిలువవచ్చును. ఈ విక్రమార్కుని వంశముననే శకకర్తయైన శాలివాహనుడుండి క్రీ॥ శ॥ 78 సంవత్సరమున శాలివాహన శకము నేర్పాటు చేసియుండెను. శాలివాహనుడు శకులను జయించి యీ దేశమునుండి తరిమివేసెను. ఈ వంశముననే భోజమహారాజుండియున్నాడు. అతడు విద్యలను ప్రోత్సహించెను. ఆతని కీర్తి దేశమంతటను వ్యాపించెను. ఈ ప్రమర వంశపురాజులు ధర్మాత్ములై ప్రజానురంజకముగా పాలించిరి. వేదశాస్త్రాదివిద్యలను, శిల్పాదికళలను హెచ్చుగా పోషించిరి. శత్రురాజులవలన భయము లేకుండ రాజ్యమును కాపాడిరి. క్రీ॥ శ 1193 సం॥రములో రాబడిన మహమ్మదీయులతోటి యుద్ధమున తమ బలపరాక్రమములను జూపి దేశముకొరకు ప్రాణములను వీడిరి. అంతటితో వీరి రాజ్యము మహమ్మదీయుల క్రూరత్వమునకు గురియై ప్రజలు విపరీత కష్టనష్టములను పొందిరి. యు॥ శ 4331 (కలి. 4295 క్రీ॥ శ॥ 1193) సం॥రములో యీ రాజవంశ మంతరించినది.

క్రీ॥ శ॥ పన్నెండవ శతాబ్దాంతమున “షహాబుద్దీన్ గోరీ” యను వాడు భారతదేశముమీదికి దండెత్తివచ్చినపుడీ పరమారవంశపు రాజులలో నొకరు ‘ఆబూగఢ’ మను కోటయందుండి ఆచుట్టును గల రాజ్యము నేలుచుండెను. ఈ పరమారవంశములో యొక శాఖీయులైన గుహాలోటు వంశజుడగు ‘సమరసింహుడు’ మేవారాంతర్గతమైన “చితోడ్” దుర్గము రాజధానిగ ప్రభుత్వము చేయుచుండెను. మేవాడు రాష్ట్రమునకు పూర్వపు రాజధాని “చితోడ్”. ఇప్పటి రాజధాని “ఉదయపురం”. ఈ రాష్ట్రపు రాజైన ‘సమరసింహుడు’ ఢిల్లీ రాజగు “పృథ్వీరాజున” కు చెల్లెలి పెనిమిటి. ఈ బావమరదులిద్దరకు నెక్కువ స్నేహము. ఈ సమరసింహుడు సుశీలుడు. యోగ్యమైన ప్రవర్తన గలవాడు సైన్యవ్యవస్థలో మిక్కిలి కుశలుడు — యుద్ధమునం దర్జనుడని పేరుగాంచెను. ఈతడు శాంతుడు, గంభీరుడు, వక్త, దూరదృష్టియు, సదసద్విచారమును, మిత్రాభిమానమును మొదలయిన విశేషసద్గుణములు గలవాడు. ఈతడు నీతిమంతుడు, రాజ్యకార్యవిశారదుడు, దయాసంపన్నుడు, తన సరదారులకును, ప్రజలకును తండ్రియని కీర్తి వహించెను. ఈ వర్ణన మీతనికి సమకాలికుడగు ‘చాంద్ భాటు’ అను పండితుని గ్రంథమునుండి గైకొనబడినట్లు కె. వి. లక్ష్మణరావు పంతులుగారు తమ మహమ్మదీయ యుగమను గ్రంథము 22 పుటలో వ్రాసియుండిరి.

తోమర లేక పయహానివంశము యు. శ. 2811–4331 (క్రీ॥ పూ॥ 327–1193)

## బ్రహ్మక్షత్రియను బ్రాహ్మణవంశము

ఈ వంశమునకు చాహుమాన లేక చౌహాన్ అనియు పేర్లు గలవు. వీరినుండి ‘రహాతోరు’ లేక ‘రాఠోరు’ అను శాఖయేర్పడినది. క్రీ॥ శ॥ పన్నెండవ శతాబ్దాంతమున రాబడిన “గోరీ” దండయాత్ర కాలమున ఢిల్లీ అజ్మీరురాజ్యములు యీ వంశములోని ఆఖరు రాజైన “పృథ్వీరాజు” పరిపాలనయందుండినవి. ఈతని తండ్రిగారివలన ‘అజ్మీరు’ రాష్ట్రమును, మాతామహునివలన ‘ఢిల్లీ’ రాష్ట్రమును సంక్రమించినవి.

అజ్మీరు పట్టణములో తోమర లేక చాహుమానవంశీయులు రాజ్యమ చేయుచుండిరి. క్రీ॥ శ॥ 1096 సం॥రములో వీసలదేవుడను" రా రాజ్యకాలములో రాబడిన మహమ్మదీయ దండయాత్రలో వీస దేవుడు తురుష్కులను పూర్తిగా నోడించి తఱిమివైచెను. ఆ యు మందనేక బ్రాహ్మణరాజు లతనికి తోడ్పడిరి. ఈ వంశమ నందు సోమేశ్వరుడను రాజునకు క్రీ॥ శ॥ 1159 లో పృథ్వీరా జన్మించెను.

ఢిల్లీ పట్టణమునకు పూర్వపునామము "హస్తినాపురము" యయాతి కుమారుడగు "పూరు" ని నుండి యిరువదియేడవ ప్రము వంశములోని "హస్తి" యను రాజుచే కట్టబడినందున దీని హస్తినాపురమని పేరువచ్చెను. ఇటీవలి కాలమున క్రీ॥ శకారంభమ నుండి తువర వంశజులచే నేలబడుచుండెను. ఈ వంశములోని ఆఖ రాజు అనంగపాలుడు. ఈతనికాలములోనే హస్తినాపురమున "ఢిల్లీ" యని పేరుగలిగెను. అనంగపాలునికి పుత్రసంతానము లేదు ఇద్దరు పుత్రికలుండిరి. అందు 'కమలాదేవి' యనునామెను అజ్మీ రాజైన సోమేశ్వరునకిచ్చెను. ఈమె కుమారుడే పృథ్వీరాజు. అనం పాలుని రెండవకుమార్తె కనోజీరాజైన విజయపాలుని కిచ్చియుండిరి ఈమెయే జయచంద్రుని తల్లి. అనంగపాలుడు రాజ్యమును త్యజిం బదరికాశ్రమమునకు బోవునపుడు తన 'ఢిల్లీ' రాజ్యమును దౌహిత్ర డైన పృథ్వీరాజున కొసంగెను. అందువలన పృథ్వీరాజు అజ్మీరు, ఢి రాజ్యముల కధిపతియయ్యెను. అనంగపాలుడొక దౌహిత్రున రాజ్యమిచ్చినందున రెండవ కుమార్తె కుమారుడైన 'జయచంద్రు నకు కోపమువచ్చి పృథ్వీరాజునందు వైరమును దాల్చియుండెన నాగోర్ పట్టణమువద్ద పృథ్వీరాజునకు ధననిక్షేపము దొరికెను చందేలు రాజుతో జరిగిన యుద్ధములో పృథ్వీరాజుకు జయముగలి చందేలురాజ్య మాతనికి లోబడెను. ఈవిధముగా తన వైరియై పృథ్వీరాజుకు జయపరంపరలు గలుగుచున్నందున జయచంద్రుడో లేకపోయెను. ఇట్టి స్థితిలో 'కనోజి' (అనిహిలపుర రాష్ట్రము ముఖ్యపట్టణము) రాజైన జయచంద్రుడు తన కుమార్తెయై

"సంయుక్త" వివాహము చేయ సంకల్పించి స్వయంవర మహోత్స
వము జరుపుటకు రాజులనాదర నాహ్వానించెను. పృథ్వీరాజున
కాహ్వానము పంపియుండక పోగా నాతని నవమానించుటకు పృథ్వీరాజు
పోలికతో ప్రతిమ నొకదానిని చేయించి దానిని సభ వాకిట కావలి
వాని స్థానమందుంచెను. అంతట స్వయంవర విధి ప్రారంభమయ్యెను.
సంయుక్తాదేవి చేత పుష్పమాల ధరించి, సఖీసహితయై యామండపము
నకు వచ్చెను. సభ నొక్కమారు దిలకించి తన కిష్టుడైన పృథ్వీరాజు
లేకుండుటయు, ఆయన ప్రతిమ ద్వారమునందుంచబడి యవమానింప
బడుటయు దిలకించి యామె తిన్నగా సభాద్వారమువద్ద కరిగి
యా పుష్పమాలను పృథ్వీరాయుని ప్రతిమ కంఠమునందుంచెను.
సభయందంతటను కల్లోలము పుట్టెను. జయచంద్రుడు కుమార్తె
చేసినపని కవమానపడి యామెను దూషించెను.

పై కారణమువలన పృథ్వీరాయునికిని జయచంద్రునకును వైర
మధికమయ్యెను. దేశములో రాజులందరు రెండు తెగలై యిరువాగు
లలో చేరిపోయిరి. దేశములో బలిష్ఠములైన రెండు ముఠా లేర్పడెను.
ఇట్టి స్థితిలో తమ బలమునకు దోడు మ్లేచ్ఛ సైన్యముల సహాయ
మర్థించి జయచంద్రుడు "గోరీ" మహమ్మదు నాహ్వానించెను. షహా
బుద్దీన్ గోరీ యిదివఱ కేడుసారులు పృథ్వీరాయునిచే యోడింపబడి
చెఱబెట్టబడెను. కాని పృథ్వీరాజు భారతీయ యుద్ధధర్మముల ననుస
రించి చేజిక్కిన శత్రుని సంహరించుట నీతిగాదని యెప్పటికప్పుడు
వానిని కరుణించి వదలుచుండెను. పచ్చిమాంసము తినెడి మ్లేచ్ఛునకు
ధర్మబుద్ధి యెట్లుకలుగును ? తననెన్నోసారులు చెఱబట్టియు చంపక
నొదిలిన సత్పురుషుని యోగ్యత నెట్లు తెలిసికొనగలడు ! ఉభయ
సైన్యములు స్థానేశ్వరమువద్ద క్రీ॥ శ 1193 సం॥రములో యుద్ధమునకు
డీకొనెను. అందు జయచంద్రుని సహాయముగల మ్లేచ్ఛ సైన్యములు

గెలుచుటయు పృథ్వీరాయని యా మ్లేచ్ఛుడు పట్టుకొని కండ్లు పొడిపించి చంపుటయు తటస్థించినది. గోరీసైన్యములు డిల్లీకిపోయి పట్టణమును స్వాధీనపర్చుకొనియెను.

ఆ పిమ్మట కొద్దిదినములకే తగిన సైనిక సన్నాహాములతో "గోరీ" కనోజీ రాజైన జయచంద్రునిమీదకు యుద్ధమునకు బోయి కనోజీ పట్టణమును ముట్టడించెను. జయచంద్రుడు తన తప్పిదమునకు పశ్చాత్తాపపడి నదీజలములయందుబడి మరణించెను. డిల్లీ, అజ్మీరు, కనోజి రాజ్యములు మ్లేచ్ఛుల చేజిక్కి వారికి బలమైన స్థావరములైనవి. అచ్చటనుండి క్రమక్రమముగా దేశమంతటను దండయాత్రలు జరుపుచు హైందవరాజులను సంహారించి నారాజ్యములు మహమ్మదీయుల పాలు చేయబడుచు ఆఱు శతాబ్దములు దేశమంతయు యుద్ధభూమిగా మార్చబడెను హిందూరాజులు మహమ్మదీయులను సుఖముగా రాజ్యమునమభవింపనీయలేదు. పిమ్మట బ్రిటిషువారికీ దేశము సులభముగా హైందవయోధుల సహాయమున యంకితమైనది. ఈ యుద్ధము నందనేకులైన బ్రహ్మక్షత్రరాజులు నశించిరి. తోమరవంశమంతటితో యంతరించినది.

## కనోజి పట్టణము

ఇది బహుపురాతన పట్టణము. ఒకప్పుడిది సార్వభౌమత్వము [illegible]గియుండినది. వైశాల్యమునుబట్టియు, జక్కని మందిరములను [illegible]టియు కనోజి పట్టణము మిక్కిలి ఘనతవహించి యుండెను. క్రీ॥ శ॥ [illegible]017 సం॥రములో గజినీ మహమ్మదీపట్టణమునకు వచ్చినప్పుడు దాని [illegible]శోభ కిచ్చెరువంది దానిని గుఱించి తనవారికిట్లు వ్రాసెను.

"ఇచ్చట వేలకొలది మందిరములుగలవు. అవి నిశ్చలభక్తు నమ్మకమువలె దృఢమైనవి. అందు జాలవరకు చంద్రకాంత శిలలతో

నిర్మింపబడినవి. ఇవిగాక యసంఖ్య దేవాలయములు కలవు. ఈ కనోజి పట్టణమునకింత చక్కదనము వచ్చుటకు గోట్లకొలది దీనారులు సెలవై యుండవలెను. రెండువందల సంవత్సరములలోగూడ నిట్టి పట్టణము గట్టుట దుర్లభము." రాజస్థాన చరిత్రకారుడగు కర్నల్ టాడ్ అను నాతడీ పట్టణమునుగూర్చి "ప్రస్తుతపు లండను పట్టణమువలె జయచంద్రుని రాజధానియగు కనోజి పట్టణమెటు చూచినను పదునైదు కోసులు వైశాల్యము కలదియై యుండె"నని వ్రాసియున్నాడు. "ఆ నగరమందు నాకులమ్ముకవారి గడపలు ముప్పదివేలుండెనట. ఈ రాజునొద్ద గొప్ప సైన్యముండెను."

(కె. వి. లక్ష్మణరావుగారి మహమ్మదీయ మహాయుగము 21 పేజి)

గోరీకాలమునకు పృథ్వీరాజు భార్య "సంయుక్త"కు తండ్రియైన జయచంద్రుడీ రాష్ట్రము నేలుచుండెను. ఈ జయచంద్రుడు తోమర వంశములోని యొక శాఖయైన "రహతోరు లేక రాథోరు" శాఖకు చెందిన బ్రహ్మక్షత్ర శాఖీయుడైన బ్రాహ్మణరాజు.

## తోమరవంశపు రాజవంశావళి

ఆజ్మీరురాజధాని యు. శ. 2811-4331.

(క్రీ॥ పూ॥ 327-క్రీ॥ శ. 1193) కలి. 2775-4295

ఈవంశమునకు వయహోనివంశమనియు, 'చాహుమాన' లేక 'చౌహాన్' అనియు పేర్లు. ఈతోమరవంశమునుండి 'చాహుమాన' 'రాథోడు'లను శాఖలుద్భవించినందున యేపేరైనను తోమరవంశముగా నెంచబడి చరిత్రలలో నచ్చటచ్చట వివిధనామములతో పిలువబడినది. ఇవన్నియు తోమరవంశాంతర్గతములు. వీరికి 'అజ్మీరు' రాజధాని. వీరిది "వత్సస"గోత్రము రాథోరుశాఖవారిలో గౌతమగోత్రీకులు గూడను గలరు—

మూలపురుషుడు

1. తోమర (లేక వయహాని)
2. తోమర
3. సమలదేవ
4. మహాదేవ
5. అజయ
6. వీరసింహా
7. బిందుసార
8. వీరవిహాంతక
9. మాణిక్య
10. మహాసింహా
11. ప్రధమచంద్రగుప్త
12. ద్వితీయచంద్రగుప్త
13. మోహాన
14. శ్వేతరాయ
15. నాగవాహా
16. లోహాధర
17. విబుధ
18. చంద్రరాజ
19. హరిహార
20. వసంత
21. బాలాంగ
22. ప్రమధ
23. అంగరాయ
24. విశాల
25. సారంగదేవ
26. మంత్రదేవ
27. జయసింహా
28. ఆనందదేవ
29. వీసలదేవ
30. అనంగపాల
31. సోమేశ్వార
32. పృధ్వీరాజ.

వీరనేక శాఖలై దేశమంద రాజ్యముల నెలకొల్పిరి.

శుక్లవంశము యు॥ శ 2811-4331 (క్రీ॥ పూ॥ 827—క్రీ॥ శ॥ 1193)

# ద్వారకా నగరం రాజధాని

ఈ శుక్లవంశముకు 'చాళుక్య' 'సోలంకి' యను పేర్లుగలవు. సాలంకాయనులను శాఖ యిందుండి కలిగినదై యున్నది. ఈ రాజులకు ద్వారకానగరం రాజధాని. గుజరాత్ దేశమును, యింకను దాని చుట్టు నుండెడి ప్రదేశములను యీ రాజులేలుచుండిరి. గోరీ దండయాత్రాకాలముకు గుజరాత్ దేశములోని అన్హిలపురమీ రాజులకు రాజధానిగ నుండినది. 'భీమదేవుడ' ను నాతడు రాజుగా నుండెను. ఇతడు మిక్కిలి పరాక్రమవంతుడు. పెక్కుసేనలు గలవాడు. ఈతడును, పృథ్వీరాజును, జయచంద్రుడును కలిసియుండిన యెడల దురుష్కులీ దేశమున యడుగుబెట్టుట కవకాశ ముండెడిది కాదు. కాని యీతనికిని పృథ్వీరాజునకును వైరము తటస్థించెను. ఇట్టి అంతఃకలహములవలన యొకరాజ్యము తరువాత నొకటిగా మహమ్మదీయుల పాలైనవి. దేశమునకు పారతంత్ర్యము తటస్థించి ప్రజలేడు శతాబ్దము లష్టకష్టముల పాలైరి.

ఈ చాళుక్య వంశమువారు ద్వారకానగరమునుండి క్రమక్రమముగా దక్షిణమునకు వ్యాపించి మహారాష్ట్ర, ఆంధ్ర, కళింగ, పల్లవ, చోళ, కేరళరాష్ట్రములను కూడను జయించి రాజ్యముచేసిరి. వీరు ఆంధ్రులు. ప్రత్యేకము వీరాంధ్రదేశములో హెచ్చుకాలము రాజ్యముచేసిరి. మహాభారతమును నన్నయభట్టుచే ఆంధ్రీకరింప జేసిన రాజరాజనరేంద్రుడీ చాళుక్యవంశీయుడు - చాళుక్యవంశము వారిది మానవ్యస గోత్రము. ఇందులో భారద్వాజ గోత్రీకులు కూడను గలరని కాచూరి శాసనములో గలదు. వీరిలో భారద్వాజస గోత్రీకులు కూడను గలరని సి. పి. వైద్య తన "Downfall of India" అనెడి గ్రంథము 207 వ, పేజీలో వ్రాశియున్నారు.

# శుక్ల లేక చాళుక్యవంశపు రాజవంశావళి

“బ్రహ్మక్షత్ర” అను బ్రాహ్మణ రాజవంశము

మూలపురుషుడు

1. శుక్ల లేక చాళుక్య
2. విష్వక్సేన
3 జయసేన
4. వైసేన
5. మదసింహ
6. సింధువర్మ
7. సింధుద్వీప
8. శ్రీపతి
19. భుజవర్మ
10. రణవర్మ
11. చిత్రవర్మ
12. ధర్మవర్మ
13. కృష్ణవర్మ
14. వాప్యకర్మ

గుహిల

16. కాలభోజ
17. రాష్ట్రపాల
18. జయపాల
19. వేణుక
20. యశోవిగ్రహ
21. మహాచంద్ర
22. చంద్రదేవ
23. మందపాల
24. కుంభపాల
25. దేవపాల
26. జయచంద్ర
27. రత్నఖాకల
28. లక్ష్మణ
29. మంధకార
30. కృష్ణకుమారక

ఈ వంశమువారు శాఖోపశాఖలై దేశమంతటను వ్యాపి
త్రములు చేసియుండిరి. దక్షిణదేశములోనికి ముసల్మాను

చొచ్చుకొని వచ్చువఱకు క్రీ॥ శ పదునాలుగవ శతాబ్దమువఱకు వీరు రాజ్యములు చేయుచుండిరి.

“చాళుక్యులు అగ్నికులక్షత్రియులు (Tod's Rajastan P. 99.)

క్రీ॥ శ॥ పదకొండవ శతాబ్దములోని చాళుక్య ప్రభువులు తమ పూర్వస్థితిని మఱచి క్షాత్రధర్మమవలంబించి తమ పేర్ల చివర వర్మ శబ్దముండుటవలన తాము చంద్రవంశజులమని శాసనములలో వ్రాయించుకొన మొదలుపెట్టిరి. వేంగీదేశమును పాలించిన కుబ్జవిష్ణు వర్ధనుడు మొదలు విమలాదిత్యునివరకు 26 గురు చాళుక్యరాజులు రాజ్యముచేసిరి. వీరు శాసనములు వ్రాయించిరిగాని అందుచంద్రవంశ క్షత్రియులమని చెప్పుకొని యుండలేదు. పశ్చిమ చాళుక్యుల శాసనములయందుకూడ నెచ్చటను చంద్రవంశక్షత్రియులమని చెప్పుకొనలేదు. క్రీ॥ శ॥ 11వ శతాబ్దములో విమలాదిత్యుడను చాళుక్యరాజు సూర్యవంశీయుడనని చెప్పుకొనెడి మొదటి “రాజరాజు” అనుచోడరాజు కుమార్తె “కుందవాంబాదేవిని” వివాహమాడిన పిమ్మట చాళుక్య రాజులు చంద్రవంశజులమని వ్రాసుకొనుటకు ప్రారంభించిరి. అందు “భీమనభట్టుచే వ్రాయబడిన “రణస్థిపూడి” శాసనము మొదటిది. దీనిని నమ్మి రాజరాజనరేంద్రుడు “నందమపూడి” శాసనంలో వ్రాయించెను. ఆతని మనుమడగు వీరచోడుడుకూడ “చెల్లూరు” శాసనములో భ్రమప్రమాదముచే వ్రాయించెను. దీనినంగీకరించుటకు వీలులేదు. వీరిలో యొకశాఖవారు క్రీ॥ శ॥ ఆరవ శతాబ్దములో బొంబాయి రాజధానిలో చేరిన విజాపుర జిల్లాలోని “వాతాపి” యిప్పుడు “బాదామి” యనబడు నగరము రాజధానిగ రాజ్యముచేసియుండిరి. పిమ్మట ఆంధ్ర దేశమంతను జయించి “వేంగి” నగరము రాజధానిగ జేసికొనిరి. ఈ శుక్లవంశము ఉత్తర దేశమున యంతరించినది. కాని దక్షిణదేశములో వ్యాపించియుండిన రాజులు 13, 14 శతాబ్దములవఱకు రాజ్యములు చేయుచుండిరి.

# పరిహార లేక ప్రతిహారవంశము

యు॥ శ॥ 2811-4331. క్రీ॥ పూ॥ 327 — క్రీ॥ శ॥ 1198.

బ్రహ్మక్షత్రయనెడి బ్రాహ్మణ వంశీకులు

మూల పురుషుడు.

1. పరిహార
2. గారవర్మ
3. ఘోరవర్మ
4. సుపర్ణ
5. రూపన
6. కౌరవర్మ
7. శాక
8. భగవర్మ
9. కలివర్మ
0. కౌశిక
1. కాత్యాయన
12. హేమవత
13. శివవర్మ
14. భావవర్మ
15. రుద్రవర్మ
16. భోజవర్మ
17. గవవర్మ
18. వింధ్యవర్మ
19. సుఖసేన
20. బాలక
21. లక్ష్మణ
22. మాధవ
23. కేశవ
24. శూరసేన
25. నారాయణ
26. శాంతివర్మ
27. నందివర్మ
28. గంగవంశ
29. సారంగదేవ
30. అనంగభూపతి
31. మహీపతి
32. రాజేశ్వర
33. నృసింహ
34. రెండవ కలపర
35. ధృతివర్మ
36. రెండవ మహీ

ఈ వంశమువారు బంగాళాదేశమును, ఆ చుట్టుప్రక్కల త
హెచ్చుగా దేశములో వ్యాపించినటుల కనబడదు. ఈ వంశమ
గురించి తెలిసినంతవరకు క్రిందీయబడినది.

# వైశ్యరాజవంశము

థానేశ్వరములో నరేంద్రవర్ధనమహారాజు రాజ్యముచేసెను. ఈతడు "పుష్పభూతి"యను వాని కుటుంబములోనివాడు. ఈకుటుంబమునకు రాజ్యమెట్లు యెప్పుడు సంక్రమించినదియు తెలియదు. ఈ వంశములో నాలుగవ పురుషుడు ప్రభాకరవర్ధనుడు. "మహారాజాధిరాజ"యను బిరుదమితనికి గలదు. హూణులతోను, గూర్జరులతోను యితడు యుద్ధములుచేసియుండెను. ప్రభాకరవర్ధనుని కుమారుడు "రాజ్యవర్ధనుడు". ఈతని సోదరుడు "హర్షవర్ధనుడు". ఇంతకంటెకుటుంబము యొక్క పూర్వచరిత్ర మనకేమియు తెలియదు. ఈతడు నేపాలు దేశముమీదికి యుద్ధమునకు వెళ్ళినట్లును హర్షశకమను నొకశకము క్రీ॥ శ॥ 606 సంవత్సరములో యేర్పాటుచేయబడినట్లును చేయబడిన ఆరోపణ నిజముకాదు. దానికేమియు ప్రమాణములేదు. అది పాశ్చాత్యుల కల్పన. హైందవప్రాచీనతను తగ్గించుటకు తమచే చేయబడిన నిర్ణయములను సమర్థించుకొనుటకే శకకల్పన చేయబడినది. క్రీ॥ శకము ఆరు, ఏడు శతాబ్దములలో "హర్షశక"మనునదేదియు ప్రవర్తితముగాలేదు. నేపాలు దేశమునకు యీ శ్రీహర్షునికి యెట్టి సంబంధములేదు. ధుంజీబ్రాహ్మణరాజవంశములో క్రీ॥ పూ॥ అయిదవశతాబ్దములో మాల్వారాష్ట్రమును పరిపాలించిన శ్రీహర్షమహారాజొకడు గలడు. ఆతని పేరున శ్రీహర్షశకం క్రీ॥ పూ॥ 457 సం॥రములో యేర్పడినది. దానినే నేపాలుదేశమున శాసనములయందు వాడియుండిరి.

ఆల్బెరూనిపండితుడు క్రీ॥ శ॥ పదకొండవశతాబ్దములో యీ దేశమునందు వాడబడుచుండిన శకములన్నిటి జాబితా యిచ్చియున్నాడు. దానిని యీ గ్రంథము ప్రథమభాగములో నిచ్చియుంటిమి. అందులో క్రీ॥ పూ॥ 457 సం॥ శ్రీహర్షశకమును చెప్పియున్నాడు. కాని క్రీస్తుకు పిమ్మట 606 సం॥రములో గాని దానికి పిమ్మట గాని శ్రీహర్షశకమున్నట్లుల వ్రాసియుండలేదు. క్రీ॥ శ॥ ఏడవశతాబ్దములో యెట్టిశకము ప్రవర్తింపజేయబడియుండలేదు. పాశ్చాత్యపండితులు భారతీయ ప్రాచీనతను తగ్గించుటకు గాను భారతయుద్ధము లగాయతు

యేర్పడిన యుధిష్ఠిరశకమునున్నూ, కలిశకమునున్నూ, వదిలి హైందవ చరిత్ర వ్రాయుటకు అలెగ్జాండరు హిందూదేశముపై చేసిన దండయాత్రాకాలమున మౌర్యచంద్రగుప్తుడున్నట్లు భ్రాంతిపడి ఆకాలవ క్రీ॥ పూ॥ 323 సం॥రంగా నిర్ణయించి భారతదేశచరిత్ర వ్రాయుట ప్రాతిపదికగా చేసి యున్నందున కలిగిన కాలవ్యత్యాసమును స వ్యాఖ్యానము చేయుటకు వీలుగానుండునట్లు క్రీ॥ పూ॥ ఐదవశతాబ్దవ లోని శ్రీహర్షశకము నొదిలి క్రీ॥ శ॥ ఏడవశతాబ్దములోని హర్షవ నుని కాలమున యొకశకస్థాపన జరిగినట్లు కల్పించిరేగాని సత్యము? అట్టిశకమేదియు ఆకాలమున యేర్పడియుండలేదు. శ్రీహర్షశిలాదిత్యు ఆస్థానమున 15 సం॥రములుండిన హ్యూనిత్సాంగు కూడను శకస్థాప జరిగినట్లు వ్రాసియుండలేదు.

క్రీ॥ శ॥ ఏడవశతాబ్దములోని శ్రీహర్షశిలాదిత్యుడు వైశ్యుడ 'హ్యూనుత్సాంగు' వ్రాసియున్నాడు. "స్మిత్" మహాశయుడు తన వ్రాయబడిన చరిత్రలో దానినంగీకరించియున్నాడు. కాని చరి కారులెవరును దీని నంగీకరించినట్లు కనుబడదు. ఈవిషయమున మిగ చరిత్రలన్నియు మూకీభావము వహించినవి. ఈహర్షవర్ధన మహ రాజుకు గురుతుల్యుడుగానుండి యీతని కోర్టులో చాలా కాలవ పూజ్యభావమున గౌరవింపబడియున్నందున "హ్యూనుత్సాంగు" చెప్పి నది బాగుగా తెలిసి చెప్పినదేగాని పాశ్చాత్యచరిత్రకారులవలె ఊహ గానముకాదు. హ్యూనుత్సాంగు దర్శించిన ప్రతిరాజును గురించిచెప్పుచ ఆరాజుల కులమునుకూడను వర్ణించియున్నాడు. గనుక యీత వాత యవశ్యమంగీకరింపతగినదేగాని సందేహింపతగినదికాదు. దే మున కవసరమగుకాలమున హూణ, గూర్జరాది మ్లేచ్ఛజాతులనుం దేశమును కాపాడుటకు మన వైశ్యసోదరులు కూడను తమ విధి తాము నిర్వర్తించి ప్రజలమన్ననలకు పాత్రులైరి. హర్షవర్ధన మహ రాజు శౌర్యపరాక్రమములు గలిగిన బలవంతుడైన రాజు. ఆతడు దే మంతటిని ఆసేతుహిమాచలమువరకు జయించి చక్రవర్తి కాగలంద లకు ప్రయత్నించియుండెను గాని ఆంధ్రదేశమున రెండవ 'పులకేశి మహారాజువలన యోటుపడి వెనుకకు తగ్గవలసివచ్చినది. ఉత్తర

మధ్యభారతమున గల బ్రాహ్మణరాజులందరీతనికి లోబడియుండినట్లు హూనుత్సాంగు వ్రాసియున్నాడు. ఆకాలమున దేశమంతయు అల్ప రాజ్యములుగానుండి హెచ్చుభాగము "బ్రాహ్మణ" రాజులవలన పరిపాలింపబడుచుండినట్లు హూనుత్సాంగు వ్రాసియున్నాడు. ఈతడీబ్రాహ్మణ రాజుల నాదరించి, గౌరవించినాడేగాని యేరాజున కెట్టియపకారము గావించినట్లు కనుపడదు. బంగాళాదేశపురాజు యీతని అన్నయగు రాజ్యవర్ధనుచే మోడింపబడి సంధిచేసుకొని ఆతనికి లోబడినట్లు నటించి నాతనితన శిబిరమునకు విందుకు పిలిచి నాతడు నిరాయుధుడై రాగానాఘాతుకు డాతని చంపించెను. అందువలన హర్షవర్ధనుడు బంగాళముమీదికి పోయి నారాజును చంపి ఆదేశమును తన రాజ్యములో కలుపుకొనెను.

"The younger brother of Rajyavardhana conquered Bengal and made himself master of the whole of Aryavarta, and removed his capital from Thaneswar to Kanouj. Harshavardhana was a Buddhist, and it was during his reign that Hiouen-Tsang, the great Chinese monk, came to India and travelled all over the country for fifteen years."

(Vide History of India— By Mahamahopadhyaya Haraprasada Sastry, M. A., P. P. 35, 36.)

తా॥ రాజ్యవర్ధనుని తమ్ముడైన "హర్షవర్ధనుడు" బంగాళా దేశమును జయించి ఆర్యావర్తమంతటికి ప్రభువయ్యెను. ఈతడు థానేశ్వరమునుండి తన రాజధానిని "కనోజి" పట్టణమునకు మార్చుకొనెను. హర్షవర్ధనుడు బౌద్ధుడు. ఈతని రాజ్యకాలముననె క్రీ॥ శ॥ 630 సం॥రమున చైనా బౌద్ధభిక్షువైన "హువునిత్సాంగు" ఇండియాకు వచ్చి పదునైదు సం॥రములు దేశమంతటను పర్యటన మొనర్చెను."

ఈ హర్షవర్ధనుడు బౌద్ధధర్మమును స్వీకరించియుండినందున వివాహమాడినట్లు కనుబడదు. ఒక బ్రాహ్మణకన్యను పెంచి వల్లభిరాజు "ధృవభట్టు" కిచ్చి వివాహమొనర్చి పశ్చిమభారతమున బాంధవ్యమును కలుపుకొనెను. ఈతనికి పిమ్మట యీతనికి సంతానము లేనందున యీతనితో యీ వంశమంతరించినది.

(Vide Sri Harsha of Kanouj P. 28 – By K.
Panikkar Ed. 1922.)

ఈ మహారాజు బౌద్ధధర్మమును స్వీకరించినను వైదికధర్మమ
కెట్టి హానియు జేసియుండలేదు. వేదశాస్త్రవిద్యలకు ప్రోత్సా
మిచ్చెను. పండితుల నాదరించెడివాడు. ప్రసిద్ధుడైన బాణకవి యీ
యాస్థాన కవి. బాణకవి యీ మహారాజు పరిపాలనమును యీయ
గుణగణములను, యీయన జయములను చక్కగా వర్ణించు
"శ్రీహర్ష చరిత్ర"యను పేరున యొక చక్కని సంస్కృత కా
మును వ్రాసియున్నాడు. కాని అందులోకూడను యీతనిగారి కి
గోత్రమునుగాని యీయన వంశపరంపరనుగాని వర్ణించియుండలే
శ్రీహర్షుడనెడి గొప్ప రాజొకానొకడు గలడని గ్రంధప్రారంభము
యీ రాజుగారి జీవితము రాజ్యపరిపాలనము, దిగ్విజయము మొదల
వివరములతో గ్రంధము ముగింపబడినది. ఇందుకు కారణమూహిం
శక్యము. ఊహలెన్నడును సత్యములుకావు. అది చరిత్రలకెందుక
పనికిరావు. ఊహలనే చరిత్రకు, చారిత్రకకాలమునకు ప్రాతిపదికగా
వ్రాయబడిన చరిత్ర పాశ్చాత్య పండితులచే వ్రాయబడిన భారత
చరిత్రయొక్కటి మాత్రమేయైయున్నది. ఊహలతో ప్రారంభింప
పర్యవసానములు దేల్చబడిన తప్పుడు చరిత్రనే మనవారు గొప్ప
దానిని ప్రమాణముగా నంగీకరించి తాము చరిత్రలను వ్రాసుకొన
హేయము.

వైశ్య రాజవంశము (థానేశ్వరము రాజధాని)

1. పుష్పభూతి
   యీమధ్య పరంపరగా రాబడినవారు ముగ్గురు. పేర్లు తెలియవు.
2. నరేంద్రవర్ధన
3. తెలియదు
4. తెలియదు
5. ప్రభాకరవర్ధన (మహారా
   రాజు అను బిరుదు)
6. రాజ్యవర్ధనుడు (నిస్సంతు)
7. ఈతనిసోదరుడు హర్షవర్ధ
   ఈతడే క్రీ॥శ ఏడవ శ

బ్దములో ప్రసిద్ధి వహించిన హర్షవర్ధన మహారాజు. క్షత్రియవంశము లంతరించిన పిమ్మట రాజ్యపరిపాలనను తమ చేతులలోనికి తీసుకొని బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులును క్షాత్రతేజమును పొందిన వారై తమ శక్తివంచన లేకుండ దేశమును కాపాడి ప్రజలను సుఖపెట్టిరి. వేదశాస్త్రాది ప్రాచీన విద్యల నభివృద్ధిపరచిరి. ప్రజలను ధర్మయుక్తముగా పాలించిరి. ప్రజల కిహపర సౌఖ్యముల కాకరమైన వర్ణాశ్రమ ధర్మమును కాపాడిరి. వర్ణములన్నియు వారివారి కేర్పడిన హద్దులలోనుండి పర్స్పర మైత్రితోకూడి అసూయా ద్వేషములు లేక సుఖించునటుల శాసించిరి.

యఫ్. ఇ. పర్గిటరు, రిటైర్డు జడ్జి, కలకత్తా హైకోర్టు తనచే వ్రాయబడిన Ancient Indian Genealogies and Chronology' అను గ్రంథములో పురాణములలోని రాజవంశావళులను గురించి యిట్లు వ్రాసియున్నాడు.

"These old geneologies, with their incidental stories, are not to be looked upon as legends and fables devoid of basis or substance, but oontain genuin historical tradition, and may well be considered an dealt with from a common sense point of view."

తా॥ ఈప్రాచీన రాజవంశావళులు (వానికాలములు) వానిలో సంభవము లయిన కథలును కేవలము కల్పనాకథలనిగాని, వాటి మూలముగాని అంశసత్యముగాని లేదనిగాని మనమెంచరాదు – అవి యథార్థమైన, సాంప్రదాయమును దెలుపుచరిత్రలు. గనుక వాటిని జాగ్రత్తగాయోచించి ప్రమాణముగా తీసుకోతగినవి. అని వ్రాసియున్నాడు.

కాని యీపండితుడు తానుమాత్రము తనభావముల కనుకూలించునంతవఱకు తీసుకొని, తాను ముందు నిశ్చయించుకొనిన భారతీయ ప్రాచీనతను తగ్గింపవలయు ననెడి నిశ్చయమును ధృవపరుప జాలిన వానిని మాత్రము తీసుకొనియు, మిగతావి పొరబాటులని తప్పులని దిద్దియు తన యూహాలకే ప్రాధాన్యమిచ్చి కాలములను స్థిర పరుప జూచుట అన్యాయము. ఈతడు చెప్పినదొకటి తాను జేసినది మఱియొకటియై యున్నది.

# వివిధ రాజ్యములు

## మహమ్మదీయ దండయాత్రలు

మహమ్మదీయ మతము పుట్టినది లగాయతు నేటివరకు యొకే విధమైన నీతితోగూడియున్నది. వీరి మతప్రవక్తయైన "మహమ్మదు" క్రీ॥ శ॥ 570 సం॥రములో జన్మించెను. మతస్థాపన చేసి క్రీ॥ శ॥ 632 సం॥రములో యొక శుక్రవారమునాడు మృతినొందెను. మహమ్మదీయమతము యూదుమతమునుండి చీలిన యొక శాఖ. క్రైస్తవ మతము కూడను యూదుమతమునుండియే చీలిపోయిన వేరొక శాఖ. ఈ మూడుమతములకు సృష్టి లగాయతు లోకవిషయములను, మత విషయములను బోధించెడి గ్రంధము యూదుల "పాత నిబంధన" యను గ్రంథము. ఈ మూడుజాతులకు సృష్టి ప్రారంభమున మూల పురుషులు ఆదాము, హవ్వలను దంపతులు. వీరి ప్రమాణ గ్రంథమైన పాత నిబంధనలో చెప్పబడినప్రకారం ప్రపంచ సృష్టి క్రీ॥ పూ. 4004 వ, సం॥రం అనగా క్రీ॥శ॥ 1944 సం॥రముకు 5948 సంవత్సరములు మాత్రమే. యూదుల దేవునిపేరు "యెహోవా". పాపులను రక్షించుటకు రక్షకుడొకడు ముందు పుట్టబోవుచున్నాడని యూదులైన ప్రవక్తలు పాత నిబంధనలో ప్రవచించి యుండిరి. ఇంతవఱకు మూడు మతములు యొక్కటే. ఈ ముగ్గురు యొకే గ్రంథమునకు జెందిన మానవులు. (People of the Book అని పేరు.) పాతనిబంధనలో ప్రవచింపబడిన "రక్షకుడు" "యేసుక్రీస్తు" గా అవతరించినాడనియు, నాతని నమ్మియుండిన పాపములనుండి రక్షించుననియు క్రైస్తవుల నమ్మకము. కాని యూదులు క్రీస్తు పుట్టినట్లంగీకరింపరు. వారి ప్రవక్తలచే ప్రవచింపబడిన రక్షకుడింకను పుట్టియుండ లేదని చెప్పుచుండిరి. పిమ్మట ఆరు శతాబ్దములకు పాతనిబంధనలో ప్రవచింపబడిన రక్షకుడు "మహమ్మదు" ప్రవక్తగా యవతరించినాడనియు, నాతడాఖరు ప్రవక్తయనియు, దేవుడు తన ఆజ్ఞలను ఆతని ద్వారా లోకములోనికి పంపియున్నాడనియు, ప్రపం

చములోని జాతులవారందరు "మహామ్మదు" ఆఖరు ప్ర
అనియు, "ఖురానుషరీఫ్" దేవుని ఆజ్ఞలను దెలిపెడి గ్రంథమని
తుదిదినము (అనగా చనిపోయి సమాధియందుంచబడిన వార
పుణ్యాపాప విచారణ దినము) ముందెన్నడో వచ్చుననియు, ఆదిన
సమాధులనుండి చనిపోయినవారందరు తిరిగి లేవగొట్టబడి
సమ్ముఖమున నిలువబెట్టబడి విచారింప బడుదురనియు, అందు
లందఱు శాశ్వత నరకములో బడవేయు బడుదురనియు, పుణ్యా
శాశ్వత స్వర్గములో బంగారుపళ్లెములలో అనేకవిధములైన పక
ములు భుజించుచు సౌందర్యవతులైన స్త్రీలతో విలాసముగా వి
చుచుందురనియు నమ్మవలెనని మహామ్మదీయులు చెప్పుచుండిరి.
నిబంధనలోని యెహోవా దేవుడే "అల్లా"యను పేరున ఖురా
చెప్పబడినది. ఈ మతములో ముఖ్యమైన విషయములు

1. "అల్లా" దేవుని నిత్యము అయిదుసార్లు నమాజు చేయు
వలెను.

2. "ఖురానుషరీఫ్" దేవునివలన "మహామ్మదు" ప్రవక్తద
మానవుల కొసంగబడిన ఆజ్ఞాగ్రంథము. దానిని నమ్మవలెను. అం
చెప్పబడిన "అల్లా" తప్ప యితర దేవతల నారాధింపకూడదు. వి
రాధన చేయరాదు. ఉపవాసదినములలో భుజించక వుండవలెను.

3. తుదిదినము అనగా విచారణ దినమొకటున్నదని
వలెను.

4. మతముకొఱకు యుద్ధముచేసిన వానికి స్వర్గసు
లొసంగబడును. ఇంట్లో కూర్చునేవానికంటె మతవ్యాప్తికొ
పోరాడువాడు దేవునకి ప్రియుడు. అవిశ్వాసులమీదకి యుద్ధమ
బోయి వారితో పోరాడి వారిని చంపినంతమందిని చంపి మిగతా
సంకెలలు వేసియుంచి వారు తమ మతము నొదలి దేవుని మ
నవలంబించి, కోరినభిక్షము నిచ్చిన వారిని వదలివేయవచ్చును.
ములో దోపిడి చేయవచ్చును. అట్టి దోపిడివలన రాబడిన ద్రవ
నుండి మశీదులకు, అనాధవిశ్వాసస్త్రీలకు కొంతభాగమీయవలయ

ఇట్టి సాధనములతో గూడినవారలై మహమ్మదీయ మతావేశ పరులైన అరబ్బుమోటుజాతివారలు మతవ్యాప్తిని జేయ ప్రారంభించిరి. మతమునకును, రాజ్యమునకు యొకే పీఠమును స్థాపించిరి. మతాధిపతియే రాజ్యాధిపతి. ఇతనికి "ఖలీఫా"యని పేరు. ఈపీఠమునకు "ఖిలాఫత్తు" అని పేరు. ఈఖిలాఫత్తు పీఠము క్రీ॥ శ 632 ల॥ 660 వఱకు మదీనాలోను 660 ల॥ 750 వఱకు డమాస్కస్ పట్టణములోను, 750_1258 వఱకు "బాగ్దాదు"లోను వుండెను.

ఈ పీఠాధిపతులు "ఖలీఫాలు" తమ మతమును యుద్ధమూలముగా వ్యాపింపజేసిరి. సిరియా, పరిషియా, ఈజిప్టు (మిసర్) లు వీరి దౌర్జన్యమునకు గుఱియై తమ నాగరికత, మత, విజ్ఞానములను బోగొట్టుకొనినవి. ఈజిప్టుకు రాజధానియైన అలెగ్జాండ్రియా పట్టణములో అలెగ్జాండరు దిగ్రేటువలన స్థాపింపబడి వృద్ధిపొందింపబడిన గొప్పదైన అలెగ్జాండ్రియా గ్రంథాలయము నీ మతస్థులు తగులబెట్టి లోకమున కింతింతనరాని నష్టమును కలుగజేసిరి. మొదటి ఖలీఫా అబూబకర్, కాలములో డమాస్కస్ పట్టణమును తీసికొనిరి. రెండవ ఖలీఫా ఊమర్ "జెరూసలెం" పట్టణమును గెలిచెను. ఈ పట్టణమున యేసుక్రీస్తుయొక్క సమాధి కలదని చెప్పుదురు. దాని కొఱకు క్రైస్తవులైన ఐరోపాజాతీయులకు మహమ్మదీయులకు అనేక యుద్ధములు జరిగియుండెను. మూడవ ఖలీఫా "ఉస్మాన్" యనువాడు సముద్రసేనను సిద్ధముచేసి మాల్టా, గ్రీసు, రోడ్సు మొదలు గాగలవానిని స్వాధీనపరచుకొనియెను. "అలీ" యను నతడు నాల్గవ ఖలీఫా మహమ్మదుకు అల్లుడు – ఈతనికి హాసేన్, హుసేన్ లను యిద్దరు కుమారులు. అనగా మహమ్మదు ప్రవక్తకు దౌహిత్రులు. ఖిలాఫత్తుపీఠము కొఱకు కలహములుకలిగి "అలీ" యను మహమ్మదు అల్లుడు చంపబడినాడు, ఆఱవ ఖలీఫాయగు "మువావియా" కాలములో మహమ్మదు దౌహిత్రులైన హాసేన్ హుసేనులు చంపబడిరి. (క్రీ॥శ 669) ఈ క్రూరకృత్య సూచకముగా మహమ్మదీయు లిప్పటికిని వీర్ల పండుగను జేయుచున్నారు. క్రీ॥శ 684 సం॥రములో "అబ్దుల్ మలీక్" అనువాడు పదవ ఖలీఫా యయ్యెను. ఈతని

కాలమున యీతని సేనాధిపతి "తరీక్" అనువాడు స్పెయిను దేశ మును గెలిచి దాని దక్షిణపు కొనమీద "జబల్ తరీక్" అను కోట కట్టించెను. అదియే "జిబ్రాల్టరు"గా మారినది. పిమ్మట మహమ్మ దీయులు "ఫ్రాన్సు" దేశములోనికి జొరబడిరి. క్రీ॥ శ 732 సం॥రములో ఫ్రాన్సుదేశపు రాజైన "ఛార్లెసు మార్టెల్" అనువాడు వీరినోడించి వీరిని ముందుకు సాగకుండ వెనుకకుగొట్టివేసెను. ఆ కాలములోనే అరబ్బీదేశ మహమ్మదీయులు ఆశియాఖండములోని టర్కీ, తురక స్థాన్, పారసీకము, ఆఫగనిస్థానములను జయించి అచ్చటి ప్రజలను బలాత్కరించి మహమ్మదీయులుగా నొనర్చిరి. ఇట్లు మహమ్మదీయులు ద్రొక్కిన దేశము నంతను పాడుచేసి అచ్చటి మతమును, నాగరి కతను విజ్ఞాన సంపదను నాశనమొనర్చి తమ మతము నంటగట్టిరి.

## మహమ్మదీయ నవాబులు

అబ్దులు మలిక్కను సామానిరాజువద్ద 'అల్తగీన్' అను తురక బానిసగానుండెను. వాడు క్రీ॥ శ. 967 తన పరాక్రమమున స్వతం త్రుడై "గజ్నీ" పట్టణమును రాజధానిగ జేసుకొని రాజ్యముచేయ ప్రారంభించెను. ఈతడు క్రీ॥ శ 976 సం॥రమున మరణమందగా నాతని యల్లుడగు సబక్తగీన్ గజ్నీ రాజ్యమునకు రాజయ్యెను. పిమ్మట క్రీ॥ శ 997 సం॥రములో నీతడు మృతుడయ్యెను. అతనికి పిమ్మట నాతని యెుంపుడుకత్తె కుమారుడు "గజినీ మహమ్మదు" గజ్నీ రాజ్యమునకు ప్రభువయ్యెను. ఈతడే భారతదేశము మీదికి పన్నెండుసార్లు దండెత్తి దేశమును దోచుకునిపోయినవాడు. ఆఖరుదాడిలో సోమనాథదేవాలయ మును పాడుచేసి లింగమును బ్రద్దలుకొట్టి అందుండిన రత్నరాసులను అపారమైన ధనమును దోచుకొని పోయియున్నాడు. సోమనాథస్వామి లింగము తొమ్మిది అడుగుల యెత్తుగలది. సోమనాథుని దేవాలయ కవాటములు మంచిగంధపు చెక్కతో చేయబడినవై అనేకములైన వింతవింతల చెక్కడపు పనులతో గూడి నగిషీ చేయబడియున్నవి. ఆ తలుపుల నాతడెత్తుకొని పోయెను. క్రీ॥ శ 1842 సంవత్స

రములో అప్పటి హిందు దేశగవర్నరు జనరలగు "ఎలింబరో" ప్రభువు తిరిగి ఆ తలుపులను మన దేశమునకు దెచ్చియుండెను. అవి యిప్పుడు ఆగ్రాకోటలోని యొక చీకటికొట్టులో భద్రము చేయబడియున్నవి. ఇప్పుడు సోమనాథ దేవాలయమును తిరిగి కట్టు ప్రయత్నములు జరుగుచున్నవి. దేవాలయము తిరిగి కట్టబడిన పిమ్మట యీతలుపు లాదేవాలయమునకు బిగించబడునని చెప్పుటకు సంతసము కలుగుచున్నది.

పంజాబు, కాబూలురాజ్యమును యేలుచుండిన అనంగపాలుడను బ్రాహ్మణరాజు గజినీమహమ్మదు నోడించి పరాభవించెను. "కాబూలులోని బ్రాహ్మణరాజులు" అనువంశమును గురించి యిట్లు "ఆల్బెరూని"యను చరిత్రకారుడు వర్ణించియున్నాడు.

"ఈరాజులు మిక్కిలి రాజ్యవిస్తారముగల వారయ్యును, ఉత్తమ సద్గుణమండితులుగను, ఆడినమాట తప్పనివారుగను, తమకంటె తక్కువవారిని దయతో జూచువారుగను నుండిరి. అమీరు మహమూదునకును అనంగపాలునికిని వైరమున్నపుడనంగపాలుడు మహమూదుకు వ్రాసిన యీయుత్తరమునకై యాతని గొనియాడవలసియున్నది.

"నీరాజ్యముమీదికి తురకలు (Turks) దండెత్తివచ్చిరనియు, ఖురాసాన్ ప్రదేశమంతయు నాక్రమించిరనియు విన్నాను. వలయునెడ నైదువేల గుఱ్ఱములతోను, పదివేల సైనికులతోను, నూరుయేనుగులతోను నీకు సహాయ్యము చేయుటకువచ్చెదను; లేదా నీ కిష్టమున్న యెడల నైని బేర్కొన్నదానికంటె రెండింతల సైన్యముల నిచ్చి నా కుమారునిబంపెదను. నీ యనుగ్రహామునకై నేనిట్లు వ్రాయలేదు నేను నిన్ను బూర్తిగ పరాభవించినను - అట్టి గౌరవము నాకు దప్ప నితరుల కుండగూడదని నా యుద్దేశము."

(కె. వి. లక్ష్మణరావుగారి మహమ్మదీయ మహాయుగము 18 పుట చూడుడు. డిటో గ్రంథపీఠిక IX పేజీకూడా చూడుడు)

(Vide Elliot's Indian History. as told by its own Historians. Vol 11. P. 124 & 404)

"ఆల్బెరూని" మహమూదు ఆస్థాన పండితుడు. ఆ
ఇండియాలో చాలాకాలముండి ఖగోళ శాస్త్ర విషయముల న
పండితులయొద్ద గ్రహించెను. ఆతడిండియానుగుఱించియు, ప్రజ
గుఱించియు యొక గ్రంథమును రచించియున్నాడు. అందుండి పై
యములు సంగ్రహించి వ్రాయబడినవి. అనంగపాలుని యనం
మీా మహమూదు కాబూలు, పంజాబు రాజైన అన
పాలుని కుమారునిమీాద దండెత్తి నావంశమువారి నందరిని సం
రించియు అక్కడి హిందువుల నందరిని మతాంతరులుగా నొనర్చిం
నారాజ్యమును హరించెను.

ఆల్బెరూని ఇండియా గ్రంథమును అరబిక్కు భాషను
ఇంగ్లీషులోనికి తర్జుమా చేసిన "సాచా"న నునాతడా వాక్యము
మార్చి అనంగపాలుడే మహమూదువల్ల జయింపబడినట్లు తల్ర
దులుచేసి అసత్య చరిత్రను వ్రాసియున్నాడు. (కె వి లక్ష్మణరా
గారి మహమ్మదీయ యుగము XI పేజీ చూడుడు)

## శహబుద్దీన్ గోరీ క్రీ॥ శ 1157-1206

హిందూకుశపర్వతముయొక్క యుత్తరశాఖా ప్రాంతమ
"గోరీ" లేక "ఘోర్" అను మండలము గలదు. ఆ మండలమున
"శహాబుద్దీన్ గోరీ" ప్రభువుగా నుండెను ఈతడు "గజని" మం
లమును గెల్చి అచ్చటి ప్రజలను వధించి దానిని తగులబెట్టి భస్మీపట
మొనర్చెను. అరబ్బు మహమ్మదీయు లెచ్చటకేగినను, యే దేశమునుగె
నను దానిలోని ప్రజలను సంహారించుట, రాజవంశమును పేరులేకుం
నాశనము చేయుట, పట్టణమును దోచుకొనుట, దాని తగులబె
టయు వారి స్వభావము. యితర మతస్థులను బలాత్కారమ
కత్తినిచూపి తమ మతములోనికి కలుపుకొనుట మొదలగు ఘో
కృత్యముల నాచరించెడి అనాగరిక మోటుజాతి. ఈమత మరేబియ
యెడారిలో పుట్టినది. దౌర్జన్యములో పుట్టి హింసదోపిడి మొదల
ఘోరకృత్యములతో పెరిగినది. ఇతరులు తమ మతమును నాశనః
చేయ సంకల్పించుచున్నారనెడి సాకును కల్పించి యితర మతమ

మీాదను, యితర జాతులమీాదను దండెత్తి వారిని నాశనముచేసి వారి ఆస్తులను దోచుకొని, వారి నివాసములను తగులబెట్టి మిగిలినవారిని బలత్కారముగ మతాంతరులను చేయుట వారి మతధర్మమనియు, పుణ్యమనియు భావింతురు.

శహాబుద్దీన్ గోరీ భారతదేశముమీాది కనేక పర్యాయములు దండెత్తెను. ఎప్పటికప్పు డిచ్చటిరాజులచే యోడి శరణాగతుడగుచుం డెను. భారతీయరాజులు శరణాగతునికాపాడెడి వ్రతముగలవారైనందున వానిని కరుణించి విడుచుచుండిరి. ఇట్లేడుపర్యాయము లీదేశము మీాదకు దండెత్తి వచ్చి యోడి పట్టుపడి యిచ్చటిరాజులచే విడిపింప బడి బోవుచుండెను. అఖరుకు యెనిమిదవసారి యీదేశము మీాదికి వచ్చి యుద్ధమున గెలిచి తననేకపర్యాయములు చేజిక్కినను చంపక కరుణించి విడిచిన పృథ్వీరాజును ఖైదీగా పట్టుకొని వానితో సంధి చేసుకొని విడిచిపుచ్చుటకు బదులు యీ నీచుడాతని కళ్లుపొడిపించి క్రూరముగా చంపించెను. శరణాగత త్రాణమను బిరుదము దుష్టుల యెడ చెల్లించుటయే భారతదేశపారతంత్రమునకు కారణమైనది. ఇది గాక భారతదేశములోని అల్పరాజ్యముల నేలు రాజులన్యోన్య వైర మున తమలో దాము పోరాడుకొనుటయే గాక యితర మ్లేచ్ఛరాజు లకు సహాయమొనర్చి తమ శత్రునాశనము జేయ సమకట్టుట వలన గూడ భారతదేశ పారతంత్ర్యమునకు దారి తీసినది.

## గోరీ కాలమునాటి భారతదేశములోని రాజ్యములు

ఆకాలమందు ఢిల్లీ, యజ్మీరుపట్టణములలో "చహువాన్" లేక "చాహుమాన" వంశజుడగు పృథ్వీరాయడును. "కనోజ్" పట్టణ ములో "రాథోడ్" లేక "రహాతోడ్" వంశజుడగు జయచందుడును, మేవాడాంతర్గతమైన "చితోడ్" దుర్గముమీాద "గుహాలోట్" వంశజు డగు సమరసింహుడును, ఆబూగడముపై పరమారవంశజుడగు జైతు డును "పట్టణ"మను నామాంతరముగల అనిహిలపురములో చాళుక్య వంశజుడును, గుర్జరాధిపుడును అగుభోలాభీముడును రాజ్యముచేయు చుండిరి. వీరు గాక అల్పరాజ్యముల నేలురాజన్యులనేకులుండిరి.

వీరందరు స్వతంత్రులై పరస్పర కలహములతో గూడియుండిరి. — అందుముఖ్యములైన రాజ్యములు.

## కనోజ్

ఇది బహుపురాతనకాలమునుండియు విఖ్యాతిజెందిన రాజ్యము. ఒకప్పుడిది సార్వభౌమత్వమును వహించియుండినది. క్రీ॥ శ 1017 సం॥ రములో గజినీమహమ్మదీపట్టణమునకు వచ్చినప్పుడు దానిశోభ కచ్చెరువడి దానిని గుఱించి తనవారి కిటుల వ్రాసెను. "ఇచ్చట వేలకొలది మందిరములు గలవు. అవి దృఢమైనవి. అందు చాలవరకు చంద్రకాంతశిలలతో నిర్మింపబడినవి. అసంఖ్య దేవాలయములుగలవు. దీని కింత శోభవచ్చుటకు కోట్లకొలదిదీనారములు ఖర్చుపెట్టియుండవలెను. రెండువందల సంవత్సరములలో గూడ నిట్టి పట్టణమును గట్టుట దుర్లభము."

రాజస్థాన చరిత్రకారుడగు కలనల్ "టాడ్" యిట్లు వ్రాసియున్నాడు.

"ప్రస్తుతపు లండనుపట్టణమువలె జయచంద్రుని రాజధానియగు 'కనోజ్" పట్టణమెటుజూచినను పదునైదుక్రోశములు వైశాల్యముగల దైయుండెనని వ్రాసియున్నాడు. ఆనగరమందు తమలపాకులమ్ము వారి గడపలు ముప్పదివేలుండెనట దీనికి రాజు "రహాత్తోరు" వంశమనెడి బ్రహ్మక్షత్రవంశపురాజు జయచంద్రుడు. (బ్రహ్మక్షత్రియన ధర్మ సంరక్షణార్థము క్షాత్రమువలంబించి దేశరక్షణమును, ప్రజాపాలనమును చేయు బ్రాహ్మణరాజని అర్థము.) ఈతని యొద్ద గొప్పసైన్యముండెను. ఈతడు దక్షిణదేశమునకు బోయి కొన్ని ప్రదేశములను జయించినట్లు "పృథ్వీరాజరసా"యనెడి గ్రంథమువలన తెలియుచున్నది. ఈతనికిని ఢిల్లీ రాజ్యాధిపతియైన పృథ్వీరాజునకును శత్రుత్వముగలదు.

## అన్హిలపురము

గుజరాత్ దేశమున "అన్హిలపుర"మను పట్టణముగలదు. దానికి "పట్టణ"మని మాఱుపేరు - అచ్చట "సోలంకీ" లేక "చాళుక్య"

వంశజుడగు బ్రహ్మక్షత్రరాజు శహాబుద్దీన్ గోరీకాల మందిచ్చట రాజ్యము చేయుచుండెను. ఇతడు మిక్కిలి పరాక్రమవంతుడు. పెక్కు సేనలుగలవాడు. ఈతడును, కనోజిరాజు జయచంద్రుడును ఢిల్లీరాజు పృధ్వీరాజును యేకమైయుండిన యెడల మ్లేచ్ఛ సైన్యములీ దేశమున కాలుపెట్టుటకు వీలులేకుండెడిది. దేశదౌర్భాగ్యమువలనను, ప్రజల పాపకర్మవలనను వీరిలో వీరికి వైరము తటస్థించి యెవరికి వారు వేరై ముగ్గురును విడివిడిగా మహమ్మదీయులచేబడి నశించి దేశప్రజలను పారతంత్ర్యమున జిక్కుకొనునట్లుచేసిరి;

## మే వా డ్ రా జ్య ము

ఈ రాజ్యమునకు పూర్వపు రాజధాని 'చితోడ్' ఇప్పటి రాజధాని "ఉదయపురము". దీని రాజు సమరసింహుడు. ఈతడు పృధ్వీరాజురొయొక్క చెల్లెలి పెనిమిటి. ఈ బావమరదులకిద్దర కత్యంత మైత్రి. ఈ రాజు సుశీలుడు యోగ్యమైన ప్రవర్తనగలవాడు. సైన్యవ్యవస్థలో మిక్కిలి కుశలుడు. యుద్ధమందర్జునుడని పేరుగాంచెను. శాంతుడు, గంభీరుడు. వక్త, దూరదృష్టియు, సదసద్విచారమును, మిత్రాభిమానమును గలవాడు. నీతిమంతుడు రాజ్యకార్యవిశారదుడు. దయాసంపన్నుడు - ప్రజలచేతను, సరదారులచేతను, పితృతుల్యుడుగా నెంచబడుచుండెడివాడు. ఈతనికి సమకాలికుడగు "ఛాంద్ భాట్" అనునతని గ్రంథములో నీ వర్ణనముగలదు.

## అజ్మీరు, ఢిల్లీరాజ్యములు

ఈ రెండు రాజ్యముల కా కాలమున "పృధ్వీరాజు" ప్రభువుగానుండెను. ఈతని తండ్రివలన అజ్మీరును మాతామహునివలన ఢిల్లీయును నీతనికి సంక్రమించినవి ఈతడేడుసారులు "గోరీ"ని యోడించి ఖైదీగా పట్టుకొని విడిచిపుచ్చెను. ఎనిమిదవసారి నాతనిచేబడి చంపబడినాడు - ఈతనికిని కనోజిరాజు జయచంద్రునికిని శత్రుత్వము కలిగి యున్నందున జయచంద్రుడు పృధ్వీరాజు షహాబుద్దీన్ గోరీల చివర యుద్ధమున గోరీకి సహాయమొనర్చినందున క్రీ॥ శ॥ 1193 సం॥రమున

జరిగిన జ్ఞానేశ్వరయుద్ధమున గోరీ గెల్చి పృథ్వీరాజును సంహరిం
రాజ్యమును హరించుటయేగాక కనోజిమీదకు దండెత్తి దాని నా
మించెను. కనోజిరాజైన జయచంద్రుడు తనచే చేయబడిన దేశద్రో
కార్యమునకు వగచి గంగాజలమునబడి మరణించెను. పృథ్వీరాజు భార
సంయుక్త యీ జయచంద్రుని కూతురై యున్నది. జయచంద్ర
యవివేకముచే రెండు రాజ్యములేగాక దేశమంతయు పరాధీనమైన
శహాబుద్దీన్ మహమ్మదుగోరీ తన కాలములోనే యొక్క మాల
రాష్ట్రమును తప్ప మిగత ఆర్యావర్తమునంతను సింధుదేశము ల
యతు బంగాళముతో సహా జయించెను. ఈతడు 1206 సం॥రము
మరణించెను. ఈతనికి పిమ్మట నీతనివద్ద బానిసగానుండిన కుతుబ
ననువాడు రాజ్యమునకువచ్చెను. ఈవంశమునకు బానిసవంశమని పే

బానిసవంశపురాజులు 10 మంది — క్రీ॥ శ॥ 1206 – 1288
ఖిల్జీవంశము ,, 1289 – 1320
తుఘ్లక్ వంశము ,, ,, 1320 – 1414

ఈ వంశములు 1351 – 1388 వఱకు రాజ్యముచేసిన ఫిరో
తుఘ్లుఖ్ క్రీ॥ శ॥ 1388 లో చనిపోయెను. ఈతని కుమారుడైన మ
మ్మదను వాడు 1388 – 1394 వఱకు రాజ్యము చేసెను. పిమ్మట మ
మ్మదు కుమారుడైన మహమూదు 1394 లో రాజ్యమునకువచ్చె
ఈతని రాజ్యకాలములో 1398 లో చైనా, మధ్యఆసియా రాజ్యమ
నన్నిటిని గెల్చి పరిపాలించిన ఛంగిజ్ ఖాన్ వంశస్థుడైన "తైమూ
లంగ్" అనువాడు 1398 లో నీదేశము మీదికి దండెత్తివచ్చె
సామర్ ఖండ్ యీతనికి రాజధాని. పశ్చిమ టర్కీస్థానమును పార
మును గెలిచి మాస్కోపట్టణము వఱకు దేశమును గెల్చెను.

## తైమూరులంగ్ దండయాత్ర

క్రీ॥ శ॥ 1398 సంవత్సరములో తైమూరులంగ్ హిందూదే
మీదికి దండెత్తి సింధునదిని దాటి తులంబ్ పట్టణములో ప్రవేశి
యందలి జనులనందరిని నరికివేసి మహమ్మదీయ మతము పరమతస్థ
సంహారమను దారుణకర్మమే ప్రధాన ధర్మముగా గలదని సత్యమ

లోకమునకు వెళ్లడిచేసెను. ఈ 'తులుంబ్' పట్టణము చీనాబ్, రావి యను నదుల సంగమమునొద్ద నున్నది. అచ్చటనుండి నాతడు "షహానవాజు" అను పట్టణమునకు బోయి యచ్చట ప్రజలవద్దనున్న ధాన్యమునుండి తనకు కావలసిన దానిని పుచ్చుకొని మిగత ధాన్యమును ప్రజలకుండనీయక కాల్చివేసెను. తైమూరులంగ్ అనువాడును నాతని మనుమడగు 'పీర్ మహమ్మదు' అనువాడును కలిసి 'భాటనీర్' అను పట్టణమునకు బోయి నిరపరాధులగు నసంఖ్యాక జనులను సంహరించిరి. సరస్వతి, ఫతేబాదు, రాజపూరు మొదలైన పట్టణములను తగులబెట్టి ధ్వంసము చేయుచు ఢిల్లీకిబోయిరి. ఢిల్లీ పాదుషాయగు మహమూదు యుద్ధముచేసి యోడి పాఱిపోయెను. ఢిల్లీ పట్టణమీ రాక్షసుల చేతిలోబడెను. ప్రజలందరొచ్చి శరణాగతులైరి. కాని శరణాగతులను రక్షించుట ధర్మమని యీతనికి దెలియదాయె. ఈతని సైనికులు ఢిల్లీ పట్టణములో జొరబడి నిరపరాధులు, శరణాగతులు నగు యసంఖ్య జనులను నఱికి వీధులన్నియు రక్తముతోడను, శవములతోడను నింపివేసిరి. దోచుకొనిన ధనమింతయని చెప్పుటకు నలవికాదు. తైమూరు పదునైదు దినములవఱకు ఢిల్లీ పట్టణమును దోచుకొని, ఆ ధనముతో తన దేశమునకు తిరిగి వెళ్ళెను. వెళ్లునపుడు త్రోవలో గాన్పించిన పట్టణములను గాల్చియు, వేలకొలది జనులను సంహరించియు దేశమునందంతటను నగ్ని ప్రళయము గావించి మీరట్, హరిద్వారమార్గమున వెడలిపోయెను. జనులను సంహరించుట, పట్టణములను తగులబెట్టుట, ప్రజలను దోచుకొనుట యితనికి సహజలీలలు. ఈతడు 1405 లో మరణించెను. తైమూరుపోయిన తరువాత పాఱిపోయిన మహమూదు పాదుషా ఢిల్లీకి వచ్చి సింహాసనము నెక్కి నామమాత్ర పాదుషాగా నుండెను. రాజ్యములో నన్ని భాగములు స్వతంత్రరాష్ట్రములైనవి. వారినేమియు చేయలేక నీతడు ఢిల్లీ పట్టణమును మాత్రము పరిపాలించుచు 1412 లో చనిపోయెను. అంతటితో తుఘ్లుఖ్ వంశమంతరించినది.

| | | |
|---|---|---|
| సయ్యద్ వంశము | — | 1414 – 1450 |
| లోడీ వంశము | — | 1450 – 1526 |

క్రీ॥ శ॥ 1193 సం॥రమున జరిగిన స్థానేశ్వరయుద్ధము
ఉత్తరహిందూస్థానము తురుష్కుల వశమయ్యెను - 1316 లో అ
ఉద్దీన్ ఖిల్జీయను వాని కాలములో దక్షిణ హిందూస్థానములోని య
రాజ్యములు తురకలచే నాక్రమింపబడినవి. కాని కృష్ణానదికి ద
ణమునందున్న దేశమనేక సంవత్సరములవఱకు మహమ్మదీయుల
స్వాధీనమైనదికాదు. క్రీ॥ శ॥ 1206 సం॥రము లగాయతు 1526 స
వఱకు దేశమంతయు తురుష్కులచే నొక్క రణరంగముగా మా
బడినది. దేశములో ప్రజలకు నెమ్మది లేకుండెను - ఒకరిద్దరు పా
షాలు తప్ప మిగతవారందరును హిందువులను, వారి మతము
ద్వేషించి హిందువులకనేక బాధలు కలుగజేసియుండిరి. కాని హిం
వులు యెన్ని బాధలైనను అనుభవించిరిగాని తమ మతమునువ
యుండలేదు. పారసీకము, తురుష్కము, ఈజిప్టు మొదలయిన
ములలోని ప్రజలు వర్ణాశ్రమధర్మములాదిగాగల నియమములు లే
దున మరణభీతివలన నాదేశవాసులందరు చిరకాలముగా వ
చుండిన తమ మతములను, సాంప్రదాయములనొదిలి మహమ్మదీ
లైరి. హిందువులట్లుగాక తమ ప్రాణ, విత్తములనొదిలిరేగాని వ
మును, సాంప్రదాయములనొదిలి మ్లేచ్ఛులుకాలేదు. మహమ్మదీ
మతములో కలిసినవారలలో నెచ్చుభాగము పంజాబు, బెంగా
రాష్ట్రములలో అదివరకు హిందూమతమునుండి పోయి వర్ణాశ్రమమ
నొదిలి బౌద్ధులైన వారలే భయమున బలాత్కారమతాంతరమ
కంగీకరించిరిగాని వర్ణాశ్రమ ధర్మమను కోట నాశ్రయించినవార
ధైర్యముతో శత్రువు నెదుర్కొని ప్రాణములర్పించిరిగాని త
మతమునొదిలి యుండలేదు. పెద్ద పట్టణములలో మ్లేచ్ఛ దౌర్జ
మెచ్చుగానుండి హిందువులకు బాధ లెక్కువగా గలుగుచుండిన
గ్రామములలో మాత్రము గ్రామ సంఘములు గ్రామపరిపా
మొనర్చుచుండినవి. రాజు కీయవలసిన పన్ను గ్రామసంఘములి
పంపుచుండెడివారు-పన్నులు వసూలుచేయుట, న్యాయపరిపాలన
గ్రామసంరక్షణము మొదలుగాగల పరిపాలనావిధానమునంతను గ్రా

సంఘములు నిర్వహించుచుండెడివి. అందువలన తురుష్కుల బాధ గ్రామస్థుల కెక్కువగా తగిలియుండలేదు.

క్రీ॥ శకము పదమూడవ శతాబ్దములో వెనిస్ వర్తకుడు "మార్కో-పోలో" యీ దేశమునకు వచ్చియున్నాడు. ఆతడు కన్యాకుమారివద్ద తన చరిత్రను వ్రాసెను. ఆతనికచ్చట మనుష్యులవంటి కోతులు కానుపించెనని వ్రాసియున్నాడు. ఆతడు కొంకణదేశపు బ్రాహ్మణులతో హెచ్చుగా రత్నవ్యాపారమును చేసినాడు. వారిని గురించి నాతడిట్లు వ్రాసియున్నాడు.

"వర్తకములో నీప్రాంతమందలి బ్రాహ్మణులకుగల చాతుర్యము లోకములో మరెవ్వరికిని లేదు - ఎట్టి కష్టములు సంభవించినను వారబద్ధమాడరు. మద్యమాంసముల నంటరు. యజ్ఞోపవీతముల ధరించెదరు. భార్యలయెడల విశేషానురక్తులైయుందురు. వారు ప్రతిమా పూజకులు. శకునములను నమ్ముదురు. చల్లతో అన్నము తిని వారు విశేష కాలమువఱకు జీవించెదరు. కొందరు 150, 200 యేండ్లవఱకు బ్రతికియుండెదరు." అని వ్రాసియున్నాడు.

## మొగలాయి రాజ్యము - బాబరు

### క్రీ॥ శ॥ 1526 - 1530

ఈతడు తైమూరులంగ్ వంశములో నాతనినుండి ఆరవ పురుషుడు. ఈతడు మధ్యాసియాలో పిత్రీయమైన రాజ్యము బోగొట్టుకొని కొద్దిసైన్యమును గూర్చుకొని కాబూలు రాజ్యమును సంపాదించెను. తరువాత తగిన సైన్యమును గూర్చుకొని హిందూదేశము మీదికి దండెత్తి 1526 సం॥ రములో జరిగిన పానిపట్ యుద్ధములో ఢిల్లీ నవాబైన ఇబ్రహీం లోడీని చంపి ఢిల్లీ సింహాసన మెక్కెను. 1530 లో యీతడు చనిపోయెను.

| | |
|---|---|
| హుమయూన్ | 1530-1540 |
| సూర్ వంశము | 1540-1555 |
| తిరిగి హుమయూన్ | 1555-1556 |
| అక్బరు | 1556-1605 |

ఈతడు మహమ్మదీయులలో యోగ్యుడైన రాజు. పరమత సహనము గలవాడు – ఈతడు ప్రజలను సుఖపెట్టెను.

జహాంగీరు 1605–1627

షాహాజహాన్ 1628–1658.

ఈ పాదుషా చాలా యోగ్యుడని పేరు పొందెను. ప్రజలను తండ్రివలెనే పాలించి సుఖపెట్టెను. వ్యవసాయమున కనేకవసతులు గల్పించెను. ఇతడాగ్రాపట్టణములో "తాజ్ మహాల్" అను దివ్యమందిరమును తన భార్యాజ్ఞాపకార్థమై కట్టించెను. ఇతడారుకోట్లరూపాయలు వెచ్చించి మయూరాసనమును కట్టించియున్నాడు. (Peacock_throne.)

ఔరంగజేబు 1658–1707.

మొగలుచక్రవర్తులలో నీతడు కడపటివాడు – విద్వాంసుడు ప్రజ్ఞావంతుడు, ధైర్యశాలియైనప్పటికిని కపటాచరణము, మతద్వేషమును గలవాడగుటచే విఫలమనోరథుడై పశ్చాత్తాపముతో దేహమును వీడెను. ఈతడు హిందువులనందరను మహమ్మదీయులను జేయవలయునని సంకల్పించెను. 1669 సం॥రములో కాశీపట్టణములో బ్రాహ్మణులందరు తమమతమును మహమ్మదీయులకుగూడను బోధించుచున్నారని విని యాతడచ్చటి హిందూమతాధికారికి ఇచ్చుచున్న వర్షాజనముల నాపివేసి, తనరాజ్యములోని హిందూపాఠశాలలను, మఠములను, దేవాలయములను విధ్వంసము చేయవలసినదని తన యధికారులకు నాజ్ఞాపించెను. కాశీ, మధుర మొదలైన క్షేత్రములలోని దేవాలయముల బడగొట్టించి యందలి ప్రతిమల నాగ్రాపట్టణమునకు తెప్పించి మశీదుల పునాదులలో వేయుంచెను. హిందువులు పండుగలు చేసుకొనగూడదనియు యాత్రలకు పోగూడదనియు నిర్బంధించెను. ఢిల్లీపట్టణము నొద్దనుండిన "నార్నోలు" గ్రామములో "సత్నామీ" లను గోసాయిలుండిరి. 1676 సం॥రములో నా గ్రామముమీదికి తన సైన్యమును బంపి నా గోసాయిలందరను చంపించెను.

హిందువులను బాధపెట్టవలయుననియు, అగౌరవింపవలయుననియు మహమ్మదీయుల ప్రోత్సహించి తాఖీదులు పంపుచుండెను.

'జిజియా'యను జుట్టుపన్ను హిందువుల మీద విధించెను. లక్షలకొలది ప్రజలిది యన్యాయమని మొఱపెట్టుకొనుచు శుక్రవారము నాడతడు మసీదునకు పోవునపుడు వారందరాతనిని అడ్డగించి మనవి చేసుకొనిరి. కాని యాతడు వారిని యేనుగులచే త్రొక్కించి మడియించెను.

బహాదుర్ షాహ 1707-1712

జహాందరుషాహ 1712

ఫరుల్ సియర్ 1713-1719

మహమ్మదుషా 1719-1748

ఈతని కాలములో "నాదిర్‌షాహ" యను పారశీక రాజు యొక్క దాడివచ్చెను. నాదిల్‌షాహ గొప్ప సైన్యముతో వచ్చి ఢిల్లీ నాక్రమించి మహమ్మదుషాను ఖైదీచేసెను. ఢిల్లీపట్టణములో ప్రజల నందరిని చంపుట కాజ్ఞనొసంగెను. ఢిల్లీపట్టణములో అప్పుడు జరిగిన చిత్రవధ ప్రకారమును వినినయెడల నెట్టి క్రూరకర్మునికైనను శరీరము గగుర్పొడువక మానదు. పీనుగుల గుట్టలతోను, నెత్తురు సెలయేళ్ళతోను ఢిల్లీపట్టణము నిండెను ముప్పదివేలకంటె నెక్కుడు జనులు చంపబడిరి తుదకు బాదుషాయగు మహమ్మదుషా చేతులు జోడించి కనులు నీరు తెచ్చుకొని యీ చిత్రవధను నాపమని నాదిర్‌షాహను వేడెను. అంతటితో నా చిత్రవధ నాపి ఆతడు ఢిల్లీ పట్టణమును దోచుకొనుటకు తన సైన్యమున కాజ్ఞయిచ్చెను. రెండు మాసములు ఢిల్లీ ముట్టడింపబడి ప్రజలు దోచుకొనబడిరి. బాదుషా మొదలు పేదవానివఱకందరు దోచుకొనబడిరి. షాజహాన్‌చే నిర్మింపబడిన మయూరాసనమును, కోహినూరు వజ్రమునుగూడ దీసికొని అపరమిత ధనముతో నాతడు పారశీకమునకు బోయెను. పిమ్మట నతడు 1742 లో చంపబడెను.

జొరాష్ట్రగు ప్రవక్తవలన బోధింపబడినవారై పారశీకులు అహింసా, సత్య, దయ, శౌచాది గుణములతో గూడి పాపభీతిగలవారై దైవభక్తి ప్రేరితులై యుండిరి. అరబ్బుదేశములనుండి రాబడిన మహమ్మదీయులచే చంపబడినవారును, భారతదేశమునకు పారిపోయిన

తిరిగి వచ్చిన యెడల వారిని పట్టుకొని కనబడినచోట్లనెల్ల నరికి వేయుము." (5_4_12_2).

4. "ఇంటకూర్చుండిన వారికంటె పట్టుదల గలిగి పోరువారికి గొప్ప బహుమానమును, గొప్పపదవిని, క్షమాపణ, కరుణయు ప్రసాదించును." (5_4_13_4,5.)

5. మరియమ్మ పుత్రుడే దేవుడు అనువారే (క్రైస్తవులు) యిపుడవిశ్వాసులు" (6_5_3_6)

6. "విశ్వాసులారా! (అనగా మహమ్మదీయులారా!) యూహూదీయులతోడను (అనగా యూదులు) నస్రానీలతోడను (అనగా క్రైస్తవులు) స్నేహముచేయుకుడు. వారికి వారే స్నేహితులుగా నుండనిండు. మీలోనెవ్వరైనను వారితో స్నేహము జేసినచో వారిలో జేరిపోయిన వారగుదురు. (6_5_8_1).

7. "విశ్వాసులు (మహమ్మదీయులు) యూహూదీయులు (యూదులు) "సబా" ననుసరించువారు ('సబా' యను దేవతను మొక్కు విగ్రహారాధకులు) నస్రానీలు (క్రైస్తవులు) నెవరైనను సరే దేవునియందును, తుదిదినమునందును నమ్మకము కలిగి క్రమవర్తన లైనచో వారికేభయముగాని దుఃఖముగాని గలుగబోదు." (6_5_10_3

8. "అవిశ్వాసులై మానూచనలు అసత్యములను వారిని నిశ్శేషముగా జంపితిమి." (8_7_9_8).

9. "దేవునితో నితరదైవముల జేర్చువారు నీకెచట కంట నను జంపివేయుము, వారిని పట్టుకొని వారిని ముట్టడించి అన్నివిధము లను వారికై పొంచియుండుము. వారు నీమతమును స్వీకరించి ప్రార్థన సలిపి విధింపబడిన భిక్షము నిచ్చినచో వారిని వారి దారిని విడిచి పెట్టుము." (10_9_1_5).

10. "దివ్యగ్రంథము పంపబడినను, దేవునియందును, తుదిదిన మునందును, నమ్మకము లేక దేవుడును నాతని ప్రవక్తయు నిషేధించిన దానిని నిషేధింపక, సత్యము నవలంబింపక యుండువారు తమ చేతనుండు ధనమునుండి పరిహారమును చెల్లించి నమ్రులగువఱకును వారిపై యుద్ధముచేయుట మానకుము." (10_9_4_5).

11. "దేవునిమార్గమున యుద్ధమునకు బయలుదేరమని చెప్ప గానే విశ్వాసులందరు యుద్ధమునకు వెళ్లవలెననియు, ఇహముకంటె పరమే యెక్కువనియు, దేవుని పేరుమీద చంపి చావవలెననియు, అట్టి వారికి పరములో స్వర్గసుఖములు యివ్వబడుననియు బోధించు చుండిన వాక్యములు—

{ 10-9-6-1, 2
10-9-11-9
10-9-14-1 }

12. "విశ్వాసులారా! (మహమ్మదీయులారా!) మీరు దగ్గర నుండు నవిశ్వాసులపై యుద్ధమునకు వెడలి మీ కఠినులను సంగతి వారికి తెలియనిండు." (10-9-16-1)

13. "వారెచట (అవిశ్వాసులు) నున్నను శప్తులే; వారిని పట్టు కొని నఱికివేయుము వారి పూర్వులకు దేవుడట్లే చేసెను. దేవుని విధానములో నేమార్పునుండబోదు." (22-33-8-3,4)

14. "వారు మాకు కోపము కలిగించినంతనే మేము వారిపై బగదీర్చుకొని, నీటముంచి చంపి వారి తరువాత వారికి మా శిక్ష నుదాహరణముగా జేసితిమి." (25-43-5-10,11)

15. "నీవు అవిశ్వాసులతో బోరాడుచు దారిలో చాలామందిని చంపి మిగిలిన వారికి గట్టిగ సంకెలలు తగిలింపుము (26-47-1-4)

16. "నే నవిశ్వాసకులను శిక్షించితిని. నాపగ చాలా గొప్పది." (22-35-3-12)

17. "మా సూచనలు కాదనువారు శిక్షాపాత్రులగుదురు." (22-34-5-38)

18. "అవిశ్వాసుల (మహమ్మదీయులు కానివారని అర్థము) హృదయములలో నేను భయోత్పాతమును కలిగించెదను. వారిచేతి వ్రేళ్ళ చివరలను నరికి, వారి తలలను నరికివేయుము." (9-8-3-2)

ఈ చివరవాక్యమునకు యింగ్లీషు తర్జుమా "జార్జిసీల్" అను పండితుడు వ్రాసిన వాక్యముల నిచ్చుచుంటిమి,

"I Will Cast a dread into the hearts of the unbelievers. Therefore strike off their heads, and strike off all the ends of their fingers"

(Vide Alkoran of Muhammud, Translated into English from the Original Arabic with explanatory notes taken from the most approved Commentators by George Seal, London. Chap. V111 Page 127)

ఇట్టి వాక్యములనేకములు గలవు. వీనినెంత త్వరలో సంస్కరించిన అంత మేలు కలుగునని మనవి చేయుచుంటిమి.

అహమ్మదు షాహా — 1748 - 1754.

ఈతని రాజ్యకాలములో సామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయినది.

రెండవ అలంఘీరు — 1754 - 1761.

ఈతని కాలమున మరాటావారు ఢిల్లీలో పీఠము పెట్టి అధికారమును చలాయించుచు రాష్ట్రాదాయములో నాలుగవ వంతు ఆదాయమును పుచ్చుకొనుచుండిరి.

షా ఆలమ్ — 1761 - 1806.

ఇతడాఖరు పాదుషా. ఇతనిని మరాటావారు బంగాళమునుండి ఢిల్లీకి తీసుకొనిపోయి సింహాసనమెక్కించిరి. 1803 సం॥రములో మరాటావారికిని ఇంగ్లీషువారికిని యుద్ధము జరిగెను. ఇంగ్లీషువారు విజయులై ఢిల్లీ పట్టణమును స్వాధీనపరచుకొనిరి. పాదుషాకు అలవెన్సు యేర్పరచి నాతని రాజ్యమంతను స్వాధీనము చేసుకొనిరి. అంతటితో మొగలు సామ్రాజ్యమంతరించెను. షా అలం 1806 లో తన 92 వ, యేట మృతినొందెను.

షా అలం కుమారుడైన "అక్బర్" ఇంగ్లీషువారిచ్చు పింఛను పుచ్చుకొనుచు పాదుషాయను పేరుమాత్రము ముంచుకొనుచు 1837 లో చనిపోయెను. ఇతని కుమారుడు మహమ్మదు బహదూర్ షాహా. ఇతడు 1857 వరకును ఇంగ్లీషువారి యొద్దనుండి పింఛను పుచ్చుకొనుచుండెను. కాని 1857 లోని సిపాయి తిరుగుబాటులో చేరినందున ఢిల్లీ యుద్ధములో నితని కుమారులను మనుమలను చంపి

యుతనిని చెఱబెట్టి బర్మాదేశమునకు దీసికొనిపోయి యుంచిరి. ఇతడచ్చటనే మృతినొందెను. అంతటితో మొగలు చక్రవర్తుల వంశమంతరించెను. (కె. వి. లక్ష్మణరావుగారి మహమ్మదీయ మహాయుగమును చూడుడు.)

ముసల్మానులు భారతదేశమునంతను స్వాధీనపరచుకొని భారత జాతినంతను బలాత్కారముగా మహమ్మదీయులను జేయ సంకల్పించిరి. కాని భారతీయులు వారికి వశులుకాలేదు. మహమ్మదీయులను దేశమంతకు చక్రవర్తులుగానీయలేదు. ఒక వైపునుండి మహమ్మదీయులు దేవాలయములను పడగొట్టి మశీదులు కట్టుచుండ వేఱొక వైపున భారతీయులు మశీదులను తీసివేసి దేవాలయములను నిర్మించుచుండిరి. ఒక భాగమును జయించి వేరుభాగమును జయించుటకు మహమ్మదీయులు బోవుచుండ జయింపబడిన భాగము తిరుగ బొల్లెక్కువై మహమ్మదీయాధికారమునుండి విముక్తలగుచుండిరి, ఈ విధముగా యెడతెగని పోరాటములతో కల్లోలితమైయుండినదిగాని శాంతియుతముగా మహమ్మదీయులు దేశముమీద అధికారమును చలాయింపలేకుండునట్లు చేయబడినది. ఈ విషయమును గురించి డబ్ల్యు. డబ్ల్యు. హంటరుమహాశయుడు (W. W. Hunter) ఇండియన్ ఎంపైరు మూడవకూర్పు. 323 పుటలో నిట్లు వ్రాసియున్నాడు.

"The popular notion that India fell an easy prey to the Mussalmans is opposed to historical facts...... At no time was Islam triumphant throughout the whole of India. Hindu dynasties always ruled over large areas. At the height of the Muhammadan power, the Hindu princes paid tribute and sent agents to the Imperial Court. But even this modified supremacy of Dehli did not last for 150 years (1560-1707.) Before the end of that brief period, the Hindus had begun the work of re-conquest. The Hindu Chivalry of Rajaputana was closing in upon Delhi from the south; the religious confederation of the Sikhs was growing into a military power on the North - West.

The Mahrattas had combined the fighting powers of the low - castes with the statesmanship of the Brahmins, and were subjecting the Muhammadan kingdoms throughout all India to tribute. As far as can now be estimated, the advance of the English power at the beginning of the present Century alone saved the Mogul Empire from passing to the Hindus. "

(Dr. W. W. Hunter's Indian Empire" 3 rd. Edition Page. 323)

తా॥ మహమ్మదీయులకు హిందూ దేశము సులభముగా స్వాధీనమయ్యెనని సామాన్యముగా జనులను కొనుమాట నమ్మదగిన చరిత్రాంశము కాదు. మహమ్మదీయులు హిందూ దేశ మంతయు నెప్పుడును జయింపలేదు. గొప్ప రాజ్యములను హిందూ రాజులే యెల్లప్పుడు నేలుచుండిరి. మహమ్మదీయ ప్రభుత్వము మహోన్నత దశయందున్నప్పుడు కొందఱు హిందూ రాజపుత్రులు ఢిల్లీశ్వరునకు గప్పముకట్టుచు నాతని యాస్థానమునకు దమ రాయబారుల బంపుచుండిరి. కాని ఢిల్లీశ్వరునికి యసంపూర్ణ సార్వభౌమత్వముగూడ నూటయేబది యేండ్లయినను (1560_1707) దక్కినది కాదు. ఇంతలోనే హిందువులు దేశ దిగ్విజయమును మరల ప్రారంభించిరి. రాజపుత్రస్థానములోని శౌర్యాగ్ని ఢిల్లీ రాజ్యమును దక్షిణమునుండి ముట్టడి వేయుచుండెను వాయువ్య దిక్కున సిక్కులను మతసంఘము వారు తీవ్రవిరులుగా మాఱొచ్చిరి. క్రిందిజాతులవారి యుద్ధ సామర్థ్యమునకు, బ్రాహ్మణుల రాజనీతి నైపుణ్యంబు జతపరచి మఱాటవారు హిందూదేశమునందంతటను దురుష్కరాజులు తమకు కపములు కట్టునట్లుగా జేయుచుండిరి. ప్రస్తుతము మన మూహింపగలిగినంతవఱకు జూడగా ఇంగ్లీషు వారీశతాబ్ద ప్రారంభమున నడ్డపడియుండని యెడల మొగలురాజ్యము హిందువులస్వాధీనమై యుండెడిది.

బ్రిటిషువారు మహమ్మదీయులవద్దనుండి ఇండియాను గెల్చుకొన్నట్లు కొందరభిప్రాయపడుచుండిరి. అది సరికాదు. బ్రిటిషు జాతీయుడైన డబ్ల్యు. డబ్ల్యు. హంటర్ (W. W. Huntur) మహా

శయుడు తనచే వ్రాయబడిన హిందూ దేశ ప్రజాచరిత్ర (A brief-History of the Indian people) 140 పేజీలో యుదాహరించ బడిన వాక్యము లీ విధముగా సాక్ష్యమిచ్చుచున్నవి.

"The British won India, not from the Moghals, but from the Hindus. Before we appeared as conquerors, the Moghal Empire had broken up. Our final and most perilous wars were neither with the Delhi King, nor with his revolted governors, but with the two Hindu confedrations, the Marhattas and the Sikhs. Muhammadan princes fought with us in Bengal, in the Karnatic, and in Mysore; but the longest opposition to the British conquest of India came from the Hindus. Our last Marhatta war dates as late as 1818 and the Sikh confederation was overcome only in 1848."

తా॥ బ్రిటిషువారు ఇండియా దేశమును జయించినది మహమ్మదీయులవద్దనుండి కాదు. హిందువులవద్దనుండియే జయించియుండిరి. మేము (బ్రిటిషువారు) దేశమును జయింపకాంక్షించునాటికే మొగలు సామ్రాజ్యము విచ్ఛిన్నమొనర్పబడినది. మాచే ఆఖరున చేయబడిన భయంకరమైన యుద్ధములు ఢిల్లీరాజులతోగాని లేక అతనితో విరోధించిన రాష్ట్రాధిపతులతోగాని కానేకాదు. హిందువులైన మహారాష్ట్రులతోడను, సిక్కులతోడను చేయబడినవి. మహమ్మదీయ రాజులు బెంగాలులోను, కర్నాటకములోను, మైసూరులోను మాత్రమే మాతో యుద్ధమొనర్చిరి. కాని బ్రిటిషువారి నెక్కువగా నెదిరించి యెక్కువకాలము పోరాడిన వారు హిందువులు. మాతో యుద్ధ మొనర్చిన ఆఖరు మహారాష్ట్ర యుద్ధము క్రీ॥ శ 1818 సం॥మున్నూ, సిక్కులు జయింపబడినది 1848 సం॥మున్నూ అయియున్నది." అని వ్రాసియున్నాడు.

## ఓరుగంటి కాకతీయులు 10, 11, 12 శతాబ్దములు

తూర్పుచాళుక్యరాజుల తరువాత ఆంధ్రదేశమును పరిపాలించిన వారు కాకతీయరాజులు. వీరికి గణపతివంశజులని కూడ పేరుగలదు.

వీరి రాజధాని ఓరుగల్లు. ప్రస్తుతమిది నైజాము రాజ్యములో నున్నది. దీనికి వరంగల్ అని యిప్పటిపేరు. ఈ కాకతీయరాజులు గంగవంశపు వారని కొందఱును, చోళవంశపు వారని కొందఱును, యాదవవంశపు వారని కొందఱును వ్రాసియున్నారు. గంగ, చోళవంశములలో నెవ రైనను "బ్రహ్మక్షత్ర"వంశమునకు చెందిన వారని వేఱుగ జెప్ప నక్కఱలేదు. యాదవవంశపువారైన మొదల క్షత్రియులు. వీరికి యాదవవంశపురాజులతో సంబంధబాంధవ్యములున్నందున క్షత్రియు లని చెప్పవచ్చును. మొదట వీరు చిన్నసంస్థానాధిపతులుగా నున్నను క్రమముగా పన్నెండవ, పదమూడవశతాబ్దములలో వీరు మహాబల వంతులై తెలుగుదేశమంతయు నాక్రమించుకొనిరి. వీరి మూలపురు షుడు సోమదేవరాజు కుమారుడగు మాధవవర్మయని చెప్పెదరు. ఈవంశములో ఐదవరాజు పెంటి గుండమరాజు. ఏడవరాజు ఎరుక దేవ రాజు. ఎనిమిదవరాజు భువనేకమల్లుడు. ఈతని కాలమువఱకీ రాజులు అనుమకొండలో నివసించియుండిరి. వీరిచే అనుముకొండలో దివ్యమైన, శివమందిరములు నిర్మింపబడినవి. అందు వేయి స్తంభముల గుడియను నది మిక్కిలి శిథిలమైపోయినను, దాని పనితనమిప్పటికిని చూచు వారి కాశ్చర్యమును గొలుపుచున్నది. తొమ్మిదవరాజు బేతరాజు. ఈతని కుమారుడు పదవరాజగు కాకతి ప్రోలరాజు. క్రీ॥ శ 1109 సంవత్సరము వఱకు రాజ్యముచేసి ఓరుగంటి దుర్గమును కట్టించెను. పదకొండవ రాజు రెండవ బేతరాజు. పన్నెండవరాజు రెండవప్రోలరాజు. ఈరాజు మిక్కిలి బలవంతుడై పశ్చిమచాళుక్యరాజుల గెలిచెను. ఈతనిరాజ్యము ఉత్తరమున కటకమువఱకును, దక్షిణమున శ్రీశైలమువఱకును, తూర్పున సముద్రము, పశ్చిమమున మాల్యవంతపర్వతమువఱకును వ్యాపించియుండెనని యొక సంస్కృతశ్లోకమున గలదు. మొదట వీరు పశ్చిమచాళుక్యులకు సామంతులై చోళరాజులతోడను, చోళచాళుక్య రాజులతోడను పశ్చిమచాళుక్యులకు తటస్థమైన యుద్ధములలో పాల్గొని మెప్పును పొందిరి. వారు చేసిన సేవకు సంతసించి పశ్చిమచాళుక్య ప్రభువులు వీరికి ఓరుగల్లు రాజ్యమును యిచ్చియుండిరి. క్రమక్రమ ముగా వీరు బలవంతులై పశ్చిమచాళుక్యరాజైన భువనైకమల్ల సోమే

శ్వర మహారాజు కాలములో పశ్చిమచాళుక్యసామంతత్వమునుండి స్వాతంత్ర్యమును సంపాదించిరి. రెండవప్రోలరాజున్నూ యీతని కుమారుడు ప్రతాపరుద్రదేవరాజున్నూ తమరాజ్యము చుట్టూనుండే దేశాన్ని జయించి తమరాజ్యమును విస్తరింపజేసిరి. ఆంధ్రదేశమంతా వీరి రాజ్యములో చేరిపోయినది. వీరివలననే దక్కనుపశ్చిమభాగములోయాదవ రాజ్యమేర్పడినది. దీనికి నైజాంలోని దేవగిరి ముఖ్యపట్టణం. రెండవది దక్షిణమున హోయిసలుల రాజ్యము. దీనికి ముఖ్యపట్టణం యిప్పుడు మైసూరు రాజ్యములో చేరియుండిన ద్వారసముద్రము. ఇవి రెండును కూడా స్వాతంత్ర్యరాజ్యములు. వీరు ముగ్గురు తమ తమ రాజ్యములను విస్తరింపచేసుకొనుటకు ప్రయత్నించుచుండినందున తరుచు వారిలో వారికి యుద్ధములు జరుగుచుండినవి.

రెండవ ప్రోలరాజు కుమారుడు మొదటి ప్రతాపరుద్రదేవుడు. ఇతడు 1187 సం॥రము వరకు రాజ్యము చేసెను. ఈతడనేక శివాలయములను కట్టించెను. ఈతనికి పిమ్మట యీతని సోదరుడు మహాదేవరాజు రాజై 1190 సం॥రమున దేవగిరిమీదకు దండెత్తి అచ్చట జరిగిన యుద్ధమున హతుడయ్యెను.

**గణపతిదేవరాజు:** ఈతడు ప్రతాపరుద్ర మహారాజు కుమారుడు. పినతండ్రి మరణానంతరమీతడు రాజ్యమునకు వచ్చెను. ఈతడు దేవగిరిమీదికి దండువెడలి దేవగిరిని ముట్టడించెను. ఇతని ప్రతాపమున కాగలేక దేవగిరి రాజీతనితో సంధిచేసుకొని విశేష ధనముతో తన కుమార్తె "రుద్రమదేవి"నిచ్చి వివాహమొనర్చెను. ఈ రాజు దేవగిరిరాజులనేగాక చోళ, కటకరాజులను మన్నెరాజులను గెలిచినట్లాతని శాసనములవలన గానవచ్చుచున్నది. ఈతని శాసనములలో "పరనారీ సహోదర" అను బిరుదొకటి కనుపడుచున్నందున నితడు పవిత్రమైన నడవడికలవాడని తెలియుచున్నది ఇతడనేక తటాకములను, గ్రామములను, దేవాలయములను గట్టించెను. ఈతడు 1256 లో మృతుడయ్యెను. ఆంధ్రమహాభారతమును పూర్తిచేసిన తిక్కనసోమయాజి మహాకవి యీ రాజునకు సమకాలికుడుగా నెల్లూరు

మండలము నేలుచుండిన మనుమసిద్ధిరాజుకు మంత్రిగాను ఆస్థాన కవిగాను వుండెను. గణపతిదేవరాజుకు కుమారులు లేరు. ఈయన భార్య రుద్రమదేవియందును 'ఉమ్మక్క' యనుకూతురొకర్తె యుండెను. గణపతిదేవమహారాజు ఉత్తరమున కళింగమును దక్షిణమున కాంచీపట్టణమునుకూడా జయించి పరిపాలించియున్నాడు.

**రుద్రమదేవి:** ఈమె గణపతిదేవమహారాజు భార్య. దేవగిరి యాదవుల యింటి ఆడపడుచు. పతి మరణాంతమీామె రాజ్యభారమును వహించి పాలించెను. శివదేవయ్య యను శైవబ్రాహ్మణుడీమెకు మంత్రిగా నుండెను ఈమె యోరుగంటికోటను తిరిగి కట్టించి శత్రుదుర్భేద్యమగునట్లొనర్చెను. దేవగిరిరాజులు తనపై దండెత్తిరాగా యీామె ధైర్యముతో నెదిరించి వారిని పారదోలెను. ఈమె ప్రజలను బిడ్డలవలెపాలించినది. ఈమెరాజ్యము చేయుచున్నపుడు మార్కోపోలో యను యూరోపు దేశస్థుడు మనదేశమునకు వచ్చియుండెను. ఆతడీమెను గురించి యిట్లు వ్రాసియున్నాడు.

"పూర్వమొకరాజీ రాజ్యమును చేయుచుండెను. ఆతని మరణానంతరము సుమారు నలుబది సంవత్సరములనుండి యాతనిభార్యచే నీ రాజ్యము పాలింపబడుచుండినది. ఈమె మిక్కిలి వివేకవంతురాలు. పెనిమిటియెడలగల ప్రేమాతిశయమువలన మరల వివాహమాడినది కాదు. ఈ నలుబది సంవత్సరములును నీమె పెనిమిటికాలముకంటె నెక్కుడు బాగుగా రాజ్యమేలెను. ఈమె తన రాజ్యములో నెప్పుడును శాంతము, దయ, న్యాయము మొదలగు వానినే యభివృద్ధి పరచుచుండెను.

అందువలన ప్రజలందరు నీమెయెడ మిక్కిలి భక్తిగలవారై యుండిరి. ఇక్కడ యేరాజుయెడలను, యేరాణియెడలను ప్రజల కింత భక్తిలేదని నేను నిశ్చయముగా చెప్పగలను" అని వ్రాసియున్నాడు.

ఈమె కుమార్తెయగు ఉమ్మక్కకు ప్రతాపరుద్రుడు, అన్నమదేవుడు అనుపిద్దఱు పుత్రులు గలిగిరి. అందు ప్రతాపరుద్రుడను వానికి రాజ్యమొసంగి రుద్రమదేవి 1295వ సంిరములో గీర్తిశేషురాలాయెను.

**ప్రతాపరుద్రుడు:** ఈతడు 1296 మొదలు 1323 వఱకు రాజ్యమేలెను. ఈతడు మహాశూరుడు. అనేకులగు రాజులను గెల్చి గప్పముగొనెను. ఈరాజు సంస్కృతవిద్యాభివృద్ధి నొనర్చెను. "విద్యానాథకవి" ప్రతాపరుద్రీయ మను సాహిత్యగ్రంథమును రచించి యీతని కంకితముచేసెను. ఈరాజు స్వయముగా 'ప్రతాపమార్తాండ' మను గ్రంథమును వ్రాసెనట. ఇతడు వెలమవారికిని, రెడ్డివారికిని తన సైన్యములో నాయకత్వము లొసంగి వీరిని రణశూరులగునట్లుచేసెను. ఈతడనేక తటాకములను, దేవాలయములను నిర్మించినటులు శాసనముల వలన గాన్పించుచున్నవి. నైజాంరాజ్యములోని పాకాలచెరువు అనుపేరుగల సముద్రమును బోలిన యొకచెఱువు యీతనిచే నిర్మింపబడినటుల ప్రతీతి. రెండుపర్వతముల నడుమనున్నయంతరము రాతితో బూడ్చబడి యీచెరువు బహువిచిత్రముగ నిర్మింపబడినది.

క్రీ॥ శ 1303 లో ఢిల్లీ నవాబు సేనానాయకుడగు మాలిక్ గాఫర్ అనువాడు ఓరుగంటిపై దండెత్తి వచ్చి పరాభవమును బొంది తిరిగి పోయెను. కాని తిరిగి 1309 సం॥రములో వాడు తిరిగి ఓరుగంటి బాద దండెత్తి వచ్చి ఓరుగంటిరాజుల శత్రువుల సహాయముతో కోటను ముట్టడించెను. కాని శత్రువుల కుట్రచే ఓరుగంటి ప్రతాపరుద్రుడు మ్లేచ్ఛులకు కప్పము చెల్లించునట్లొడబడి సంధిచేసుకొవలసినవాడాయెను. అటుపిమ్మట 1320 లో తురుష్కసైన్యము 'ఉల్లూఖాన్' ను వాని నాయకత్వము క్రింద ఓరుగల్లును ముట్టడించెను. కాని సైన్యములన్నియు ప్రతాపరుద్రునిచే పూర్తిగా నాశనమొందింపబడెను. తిరిగి 1323 సం॥రములో డిల్లీనుండి మఱియొక సైన్యము పంపబడెను. రాజ్యములో అంతఃకలహములు మెండాయెను. యుద్ధమునందు ప్రతాపరుద్రుడు చెఱబెట్టబడి డిల్లీకి గొనిపోబడుచు దారిలో ఆత్మహత్యచేసుకొనినట్లు కొందఱు చెప్పెదరు. ఆతని మంత్రియగు యుగంధరరాయుడు యుక్తిచే నాతని డిల్లీనుండి చెఱవిడిపించి తెచ్చినటుల గొందఱు చెప్పుచున్నారు. ఆతనితో ఓరుగల్లు రాజ్యమంతరించినది కొంతకాలమునకు పిమ్మటది బహామనీరాజ్యములో కలిసిపోయినది.——

కాకతీయుల రాజ్యకాలములో సంస్కృతమునను, తెనుగునను యనేక గ్రంథములు వ్రాయబడినవి.

# విజయనగర సామ్రాజ్యము

## శ్రీ విద్యారణ్యస్వామి

ఉత్తర భారతము మహమ్మదీయ మతావేశమునకు జిక్కి రక్త ప్రవాహములతో నిండియుండి దక్షిణ భారతవర్షముకూడను మహమ్మదీయ దౌష్ట్యమునకు బొల్పడనున్న కాలమున యు॥ శ॥ 4418 (కలిశకం 4382) సం॥ర ప్రాంతమున (అనగా క్రీ॥ శ॥ 1280 సం॥ర ఆ ప్రాంతమున) ఆంధ్ర దేశమందు సాయణవారను యింటిపేరుగల మాయణనార్యునికి ౧. సోమనాథుడు, ౨. మాధవాచార్యులను యిరువురు కుమారు లుదయించిరి. వీరి జనని పేరు శ్రీమతీదేవి వీరిది కృష్ణయజుర్వేదము బోధాయనసూత్రము. భారద్వాజసగోత్రము. వీరు ఆంధ్రులు. కృష్ణా తీరవాసులు. యు॥ శ॥ 4451 సం॥రమున (కలి 4415) అనగా వీరి 33 సం॥రమున సన్యాసాశ్రమమును స్వీకరించిరి. వీరు యు॥ శ॥ 4518 సం॥రము వఱకు (కలి 4482) (క్రీ॥ శ॥ 1380 సం॥) జీవించియుండిరి. వీరు గొప్ప లౌకిక, వైదిక ప్రజ్ఞగలవారు. వీరు శృంగగిరి పీఠాధిపతులై ఆర్ష ధర్మరక్షణ మొనర్చిరి. వైదికధర్మమును వీరు సంరక్షించునట్లు మరెవ్వరును చేసియుండ లేదు. శ్రీ విద్యారణ్యులు నాలుగు వేదము లకు భాష్యములను రచించిరి. వీరిచే రచింపబడిన భాష్యమిదివరకుండిన భాష్యములన్నిటికిని మిన్నయై వాటిని మరుగుపరచినవి. వీరికి విద్యా రణ్యులని బిరుదునామము. మాక్సుమూలరు మొదలైనపాశ్చాత్య పండి తులు యీ విధముగ వ్రాసియుండిరి. "విద్యారణ్యభాష్యమే లేనిచో వేదమంధకారబంధురమని" వ్రాకుచ్చిరి. వీరిచే వ్రాయబడిన వేదాంత పంచదశియను వేదాంతగ్రంథమత్యుత్తమము. అది అద్వైతజ్ఞానమును కరతలామలక మొనర్చినట్లు మరియేయితర వేదాంత గ్రంథ మొనర్చి యుండ లేదు. వీరిచే వ్రాయబడిన 'అనుభూతి ప్రకాశిక' 'వివరణ ప్రమేయ సంగ్రహము' మొదలయిన యితర వేదాంతగ్రంథము లత్యా ద్భుతములు. "సర్వదర్శన సంగ్రహము" న తత్త్వ విచారణమున గల

రీతు లన్నియు వివరింపబడినవి. మీమాంసాశాస్త్రమున వారిచే వ్రాయబడిన "న్యాయమాలావిస్తర" మహాగ్రంథము. వారిచే వ్రాయబడిన శంకరవిజయము లేనిచో శ్రీ ఆదిశంకరుల జీవిత చరిత్రయే మనకు తెలిసియుండెడిదికాదు. ధర్మశాస్త్రవిషయములో వారిచే వ్రాయబడిన పరాశరమాధవీయము పరాశరస్మృతికి ప్రాముఖ్యము దెచ్చినది. వ్యాకరణము, వైద్యము, జ్యోతిషము మొదలయిన వాసిలోగూడను వీరు బహుగ్రంథముల రచించిరి. వీరు ముట్టని జ్ఞానశాఖ లేదని చెప్పిన యతిశయోక్తి కానేరదు. వీరిచే వ్రాయబడిన యేగ్రంథమైన నాశాఖలో సత్యోత్తమముగా నేటికిని పఠింపబడుచున్నది.

తమ శిష్యుల సహాయముతో వీరిచే రచింపబడిన గ్రంథములు పదునాలుగువందల వఱకునున్నట్లు (1400) చెప్పబడుచున్నది. అందువనే వీరికి - "విద్యారణ్యు"లని బిరుదు నామము కలిగినది. తమకు గ్రంథరచనలో తోడ్పడిన పండితవరులకు వీర గ్రహారము లిప్పించిరి. వీరఖండ పండితులై శ్రీ భువనేశ్వరీదేవినిగూర్చి తప మొనర్చిరి. దేవి యనుగ్రహముచే వీరికి ధన నిక్షేపము దొరకెను ఆ నిక్షేపముతో వీరు తుంగభద్రానదీతీరమున "విద్యానగర"మను గొప్ప నగరమును నిర్మించి రెండు లక్షల హిందూసైన్యమును జేర్చి రాజ్యస్థాపన మొనర్చి దానికి తమ శిష్యులైన శ్రీ హరిహర, బుక్కరాయలను రాజులుగా నొనర్చి తానే మంత్రియై సామ్రాజ్యమును నడిపియుండిరి. వారిచే స్థాపించబడి పరిపాలింపబడిన సామ్రాజ్యమన్నివిధముల నాదర్శప్రాయముగ నుండెనని చారిత్రకులనేకవిధముల బొగడియుండిరి. ఆర్యవిజ్ఞాన మత, జాతిసంరక్షణ నిమిత్తం మాధవాచార్యులు, చేతకత్తిబట్టి మహమ్మదీయ సామ్రాజ్యము నెదుర్కొనిన ఘట్టములుగూడను గలవని చెప్పుదురు. ఈ మహామహుని దేశభక్తి, ధర్మరక్షణాదీక్షవలననే నేడు దక్షిణాపథమంతయు మహమ్మదీయ దౌర్జన్యమున కాహుతిగాక సంరక్షింపబడినది. వీరడ్డుపడినందుననే దక్షిణాపథమున మహమ్మదీయు లధికసంఖ్యాకులుగా జొరబడ లేకపోయిరి.

మాధవాచార్యులవారు ప్రథమహరిహర, బుక్కరాయ, ద్వితీయ హరిహర రాజులకాలములో నారాజులు ముగ్గిరికి పరమార్థగురువు

గను, మంత్రిగను, ఉండిరి. రాజులు నామమాత్రముగా నుండిరి. రాజ్య భారమంతయు మాధవవిద్యారణ్యులే వహించిరనియు ప్రతీతి.

## విజయనగర రాజులు

యు॥ శ॥ 4473 (కలి. 4437 సం॥రం. క్రీ॥ శ 1335) సం॥రము ఆప్రాంతములు హరిహరరాయలు విజయనగరసింహాసన మెక్కెను. అతని సోదరుడగు బుక్కరాయుడతనికి మంత్రిగను యువరాజుగను ఉండెను. పూర్వము ఓరుగల్లు, ద్వారసముద్రము, దేవగిరి, కొంకణ దేశము మొదలైన దేశపురాజులయొద్దనుండి మహమ్మదీయులు తీసుకొనిన ననేకభాగములను హరిహరరాయుడాక్రమించి తన రాజ్యమును విస్తరింపజేసెను. క్రమక్రమముగా మైసూరు, కన్నడదేశము, వనవాసి, నాగరఖండము మొదలైన ప్రదేశములను జయించి రాజ్యాభివృద్ధి గావించెను. పదునాల్గు సంవత్సరములు రాజ్యముచేసి, విశాల రాజ్యమును, ప్రచండసేనను, అపరిమితధనమును సంపాదించెను. ఒక్క దౌలతాబాదు దుర్గము తప్ప మహమ్మద్ తుఘ్లక్ సుల్తానుకు దక్షిణ దేశములో నున్న రాజ్యమంతయు హిందువులు స్వాధీనము చేసుకొనిరి. ఇట్లని ఫెరిస్తాయను మహమ్మదీయ చరిత్రకారుడు వ్రాసియున్నాడు. విజయ నగర పట్టణము క్రీ॥ శ॥ 1336 సంవత్సరమునకు సరియైన శాలివాహనశకం 1258 ధాతృ నామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమినాడు నిర్మింపబడినది. రామాయణములో చెప్పబడిన కిష్కింధ యనబడు పర్వతప్రదేశము నందు తుంగభద్రానదికి దక్షిణతీరమున నీపట్టణము కట్టబడినది. ఆప్రదేశమునందు తుంగభద్రానది రామాయణములో వర్ణింపబడిన అంజనపర్వతము, మాల్యవంత, మతంగ ఋష్యమూకపర్వతములనంటి ప్రవహించుచున్నది. ప్రస్తుత మాప్రదేశమును హంపీవిరూపాక్షమని చెప్పెదరు. ఈపట్టణము చుట్టును ఏడుప్రాకారములు గలవు. ఈప్రాకారములు తుంగభద్రా నదియొడ్డు నంటుకొనియుండుటవలన, నటువైపు నుండి యది శత్రువుల కభేద్యమయ్యెను. నైఋతిదిక్కున నొకగొప్ప చెరువు నిర్మింపబడినది. చెఱువుకట్ట యొక్క మైలు వైశాల్యము గలదియై రాతితో గట్టబడినందున అభేద్యమైన దుర్గముగోడవలెనే యు

ఈ చెఱువుయొక్క వైశాల్యము నాలుగు చదరపుమైళ్ళు. అది యెల్లప్పుడును నాలుగు నిలువుల నీరుండును. దక్షిణదిక్కున నొక కోటగట్టి దానిని బట్టణములోనున్న పర్వతములతో గలిపిరి ఆ దుర్గమున కచ్చటచ్చట బురుజులుండి యవి రక్షకభటులచే గాపాడబడుచుండెను. ఈ గొప్ప పట్టణము పదునాలుగుమైళ్లు పొడవు, పదిమైళ్ళు వెడల్పును గలిగిన నూటనలుబది చదరపుమైళ్ళ వైశాల్యమును గలిగి యుండెను. ఈ పట్టణమందా కాలములో నివసించియుండిన జనసంఖ్య ముప్పది లక్షలకు మించియుండెనని అంచనా వేయబడినది. ఈ పట్టణము సకల విద్యాసంపత్తులచే శోభితంబగుటచే విద్యానగరమనియు, అప్రతిమశూరాగ్రేసరులకు స్థానమగుటచే విజయనగరమనియు ప్రఖ్యాతిని బొందియున్నది.

హరిహరరాయుడు క్రీ॥ శ॥ 1336 ట॥ 1350 సం॥ వఱకు పదునాల్గు సంవత్సరములు రాజ్యము చేసినట్లు శాసనములవలన దెలియుచున్నది. ఇతడు 1343 లో కీర్తిశేషుడైనట్లు 'నూయల్' వ్రాసిన యంశము నమ్మదగినదిగా లేదని శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు తమ మహమ్మదీయ మహాయుగమను చరిత్ర గ్రంథములో వ్రాసియుండిరి.

## బుక్క భూపాలుడు క్రీ॥ శ॥ 1350 ట॥ 1377.

ఈ మహారాజు మిక్కిలి పరాక్రమవంతుడు. ఈయన ప్రభుత్వములో విజయనగరము మహోన్నతదశకు వచ్చెను. విద్యారణ్యులవారు వేదభాష్యమీతనికంకితమొనర్చిరి. ఈతడు ప్రజారంజకముగా రాజ్యమొనర్చెను. ప్రజలు రాజభక్తిగలిగియుండిరి. దేశము ప్రజాబాహుళ్యముగలదియై, ప్రజలు సంతుష్టులై యుండిరని 'ఫెరిస్టా' యను నెడి మహమ్మదీయ చరిత్రకారుడే వ్రాసియున్నాడు. బుక్కభూపాలుడు తన రాజ్యకాలములో అనేక తటాకములను, చెఱువులను, బావులను కాల్వలను త్రవ్వించి సస్యసమృద్ధిచేసి ప్రజలకు సౌఖ్యము కలుగజేసెను. ఈతడు వైదికమతమునందెక్కుడభిమానము కలవాడయ్యును యితర మతములను ద్వేషించినవాడుకాడు. తన రాజ్యములోని

హిందువులను, జైనులను, లింగాయతులను, మహమ్మదీయులను సమానముగా జూచియుండెను.

## రెండవ హరిహరరాయలు క్రీ॥ శ 1377_1404.

ఈమహారాజుకాలమున రాజ్యము శత్రువులకభేద్యమైయుండెను. ఈతడనేక దానధర్మములనుచేసెను. చోళ, పాండ్య, కేరళ దేశంబులను జయించెను. సర్వమతములను, సర్వజాతులను సమానభావముతో జూచియుండెను.

## రెండవ బుక్కరాయలు క్రీ॥ శ 1404-1422.

ఈరాజు తుంగభద్రానదికి ఆనకట్ట కట్టి నదీజలమును పట్టణములో ప్రతివీధి ప్రక్కను కట్టించిన మంచినీటికాలవలలోను ప్రతియింటిలోను వంట యింటిగుండా కట్టబడిన చిన్నకాలువల గుండా ప్రవహించుచుండునట్లు చేయబడినది. అట్లు ప్రవహించుచుండిన కాలువలిప్పటికిని గలవు.

రెండవ దేవరాయలు క్రీ॥ శ 1423_1446.
మల్లికార్జునరాయలు క్రీ॥ శ 1446_1465.
విరూపాక్షరాయలు క్రీ॥ శ 1465_1478.
సాళ్వనరశింహరాజు క్రీ॥ శ 1478_1490.

ఈరాజు ప్రథమవంశపు రాజులలో ఆఖరు వాడగు విరూపాక్షరాయనిని అతని పెద్దకుమారుడగు రాజశేఖరరాయలు క్రీ॥ శ 1478లో చంపించెను ఈరాజశేఖరరాయలను నాతని సోదరుడైన రెండవవిరూపాక్షరాయలు చంపించెను. రాజకుటుంబములో జరుగుచుండిన హత్యాకాండను చూచి ప్రజలు విసిగిపోయిన కాలమున దండనాయకుడగు సాళువనరశింహరాజు మిగత సరదారులందఱను వశపరచుకొని ప్రజాసమ్మతిని పొందినవాడై భ్రాతృహంతయైన రెండవ విరూపాక్షరాయని దేశమునుండి వెడలగొట్టి క్రీ॥ శ 1487 సం॥రంలో తాను రాజాయెను. అంతటితో ప్రథమవంశమంతరించెను. సాలువనరశింహరాజు మూడు సంవత్సరములు మాత్రమే పరిపాలించెను ఈతడతిపరాక్రమవంతుడు. తురకలవద్దనుండి లోగడవారు విజయనగరరాజులనుండి గెలుచుకొనిన

ప్రదేశమునంతను రాబట్టెను. కాని అంత్యకాలము సమీపించుటచే ఉదయగిరి, రాయచూరు, కొండవీడు అను మూడు దుర్గములు మాత్రము మిగిలిపోయెను. అందువలన మరణ కాలమున నామూడుదుర్గములను సాధించునట్లు తన మంత్రి నాజ్ఞాపించెను. ఈ సాళువవంశమువారు విజయనగర రాజులకు దగ్గరబంధుకోటిలోనివారు.

ప్రథమ వంశపు రాజులు అనగా మొదటి హరిహరరాయలు, బుక్కరాయుల వంశమువారలు రాజ్యకాలములో అనగా క్రీ॥శ 1420 వ, సం॥మున నీ దేశమునకు వచ్చిన ఇటలీ దేశస్థుడగు "నికోలో కోంటి" అనునాతడీ విజయనగర పట్టణమును దర్శించి లాటిన్ భాషలో దీనిని వర్ణించుచు చరిత్ర వ్రాసియున్నాడు. దానినుండి కొన్ని వాక్యము లీదిగువ నిచ్చియున్నాము.

"విజయనగరమను మహానగరము మిక్కిలి నిట్టముగా నున్న పర్వతములమీద గట్టబడినది. ఆ నగరముయొక్క చుట్టుకొలత యిరువది మైళ్ళుండెను. ఆ నగరమున నాయుధములను ధరించిన భటులు తొంబదివేలున్నారు." ......... వారి ప్రభువు హిందూ దేశములోని ప్రభువులకన్న మిక్కిలి శక్తిగలవాడు" అని వ్రాసి యున్నాడు.

క్రీ॥ శ 1443 సం॥రమున "అబ్దుల్ రజాక్" అను నతడు పారశీక రాజువద్దనుండి కల్లికోట జామొరీన్ వద్దకు రాయబారిగా వంపబడినవాడు. ఈవిధముగా విజయనగరమును వర్ణించి యున్నాడు.

"1443 వ సంవత్సరము, యేప్రిలు నెల చివరకు విజయనగరము ప్రవేశించితిమి. మమ్ము దోడ్కొని పోవుటకై మాకెదురుగా బరివార జనమును బుత్తెంచి మేము బసచేయుటకై మాకొక సుందరమైన గృహము రాయలిప్పించెను. ఆతని రాష్ట్రము కృష్ణానది మొదలు గాని కన్యాకుమారి వరకు వ్యాపించియుండెను. ఆ నగరమున ఏకృతాకారములు గలిగి పర్వతములను బోలిన వేయి యేనుగులు గలవు. పదునొకండు లక్షల సైన్యము గలదు. హిందూస్థానము నందా కాలమున నిరంకుశాధికారముగల మఱియొక రాయలుగాన రాడు. విజయనగరము వంటి మహానగరము నెన్నడును గన్నులతో

జూచియుండలేదు. ఆ నగరమును బోలిన మఱియొక నగరము ప్రపంచమున నెచ్చోటనైన నున్నట్లు వినియుండలేదు. సప్త ప్రాకారములచేత జుట్టబడిన యేడు దుర్గములచే సురక్షితమై యీనగర మొప్పుచున్నది. మొదటి దుర్గముచుట్టును నిలువెడెత్తు గల రాళ్ళు, గుఱ్ఱములుగాని, భటులుగాని నడచుటకు వీలులేని యట్లు భూమిలో సగమువఱకు పాదుకొనియున్నవి. ఉత్తరముగా నున్న యేడవ దుర్గమే రాజు నివసించు నంతఃపుర మందిరముగా నున్న యది. మొదటి దుర్గముయొక్క దక్షిణపుకొన మొదలుకొని ఉత్తరపు కొనవఱకు దూరమెనిమిదిమైళ్ళుగా నుండెను ... ... బజారులు విశాలములును పొడవులును గలిగి రమణీయములై యుండినవి... ... ... ముత్యములు, కెంపులు, నీలములు, వజ్రములు మొదలగునవి బహిరంగముగా బజారులలో విక్రయింపబడుచున్నవి. ఈప్రదేశములందును, రాజాంతఃపుర ప్రదేశములందును నున్నగా పాలగచ్చు చేయబడిన రాతి గొట్టములగుండ కాలువలు పెక్కులు జలపూర్ణములై ప్రవహించుచున్నవి... మిక్కిలి వైశాల్యముగల సింహాసనము సువర్ణముతో జేయబడి యమూల్యములగు మణులచే బొదుగబడియున్నది... ...ఆ మందిరముయొక్క గోడలును పైకప్పును మణులచే బొదుగబడిన బంగారు పలకలచే గూర్పబడియున్నవి అవియును బంగారపు మేకులతో బిగింపబడియున్నవి." (మహామ్మదీయ మహాయుగము. కె. వి. లక్ష్మణరావు గారిచే విరచితము 347, 348 పేజీలు)

## తుళువ వంశము

సాళువ నరసింహరాజుయొక్క జ్యేష్ఠ కుమారునెవరో చంపిరి. ద్వితీయ కుమారుడు రాజు కాగా వానిని జంపించి తుళువ వంశజుడును సాళువ నరసరాజునకు అన్నమనుమడును అయిన తుళువ నరసరాజు రాజ్యమధిష్ఠించెను. ఈతని తండ్రి ఈశ్వరరాజు. ఈతడు విజయనగర సైన్యాధ్యక్షుడుగాను, మంత్రిగాను వుండినందున రాజ్యమాక్రమించి రాజగుట సులభమయ్యెను. ఈతడు విద్యాప్రియుడు. కవుల నాదరించి పోషించువాడు. ఈతని యాస్థానమునందు నంది మల్లయ్య, ఘంట

సింగయ్య అను కవులిద్దఱుండిరి. వీరిఱువురును వరాహపురాణము, ప్రబోధచంద్రోదయము, అను తెలుగుకావ్యములను రచించిరి. వీరు ఆర్వేలనియోగశాఖకు చెందిన బ్రాహ్మణులు – నరసరాజునకు ముగ్గురు భార్యలు. తిప్పాజీ, నాగలాంబిక, ఓబాంబిక, ఇందు నాగలాంబిక వలన కృష్ణదేవరాయలు జననమొందిరి.

## కృష్ణదేవరాయలు క్రీ॥ శ॥ 1509–1530

ఈతడు విజయనగరరాజులలో ప్రసిద్ధుడు. ఈతనికాలమున విజయనగరసైన్యము అపజయ మెన్నడు నెఱుంగవు. ఈ మహారాజు కాలమున విజయనగరము మహోన్నతస్థితినందియుండెను. శాలివాహనశకం 1430 కి సరియైన శుక్లనామ సం॥ర మాఘశుద్ధ చతుర్దశి యగు 4 వ ఫిబ్రవరి 1509 సం॥రము కృష్ణరాయడు పట్టాభిషిక్తుడైనట్లు హంపీలోని పంపావతి దేవాలయములో నున్న యొక శాసనము వలన దెలియుచున్నది. ఈతనికి పితృతుల్యుడుగా నుండి నితని ప్రాణమును కాపాడి నితని రాజుగా నొనర్చిన వాడు సాళువతిమ్మరుసు మంత్రిసత్తముడు. ఈతడార్వేలనియోగ బ్రాహ్మణుడు. ఈమంత్రి శిఖామణి నరసరాజునొద్దను, వీరనరశింహరాజునొద్దను, కృష్ణదేవరాయల యొద్దను ముఖ్యమంత్రిగా నుండెను. ఈతడసమాన శేముషీ ధురంధరుడు. కృష్ణదేవరాయలీతనను "అప్పాజీ"యని పిలుచుచుండెడివాడు. ఈమంత్రిపుంగవుని దానశాసనము లనేకములు గలవు. ఈతడు యుద్ధవిద్యయందారితేరిన మహావీరుడు. ఇతడు స్వయముగా సైన్యాధిపత్యమును వహించి కొండవీడు మొదలయిన దుర్గములను జయించెను. ఈతడు క్రీ॥ శ 1527 లో కీర్తిశేషుడయ్యెను. కృష్ణదేవరాయలు మహమ్మదీయులను నిర్వీర్యులనుజేసి వైదికధర్మమును కాపాడెను. ఈవిజయనగరసామ్రాజ్యమవతరించని యెడల దక్షిణదేశమంతయు మహమ్మదీయ దౌష్ట్యమునకు గుఱియై గోహత్యజేయుచుండెడి కటికు తురకలుగా మాఱియుండెడిదనుటకు సందేహింపనక్కఱ లేదు. కృష్ణదేవరాయల ప్రతాపమును, దిగ్విజయములను వర్ణించుట కిచ్చట తావు లేదు. వానిని దెలుపగల చరిత్రలు ప్రత్యేకముగా గలవు.

రాయచూరు లేక రాచూరుదుర్గము ఆదిల్ షాహాయను తురుష్కుని స్వాధీనమందుండెను. దీనిని జయించుటకు శ్రీకృష్ణదేవ రాయలు చేసిన దండయాత్రలో ఏడులక్షల మూడువేల (7,03 000) కాల్బలమును, ముప్పదిరెండువేల ఆరువందల (32,600) గుఱ్ఱములును, అయిదువందల యేబదియొక్క యేనుగులును (551) ఉండెనని "న్యూనీజు" అనెడి పోర్చుగీసు చరిత్రకారుడు వ్రాసియున్నాడు.

ఈరాజు రాజ్యకాలమున తెలుగుభాష మహోన్నత పదవిని జెందినది. ఈతని ఆస్థానమునందు, "అష్టదిగ్గజము"లను పేరిట నెన మండుగురు తెలుగుకవులుండెడివారు. (1) అల్లసాని పెద్దన (2) నంది తిమ్మన (3) అయ్యలరాజు రామభద్రుడు (4) ధూర్జటి (5) మాదయ గారిమల్లన్న (6) పింగళిసూరన్న (7) రామరాజభూషణుడు (8) తెనాలి రామకృష్ణుడు.

కృష్ణదేవరాయులు శిల్పకళలను వృద్ధిపరచెను. దేవాలయము లనేకములు కట్టించెను. సస్యసమృద్ధి కొఱకు క్రీ॥ శ 1521 సం॥ర ములో కొఱ్ఱగల్లునొద్ద తుంగభద్రానది కొక ఆనకట్ట గట్టించి యందుండి యొక కాలువను త్రవ్వించెను. అది నేటికిని జనుల కుప యోగముగా నున్నది. ఈయన గొప్ప చెఱువొకదానిని త్రవ్వించెను. ఈ రాజు రాజ్యము చేయుచుండిన కాలములో క్రీ॥ శ 1520 వ సంవ త్సరములో "ఫిగరిడో" యను పోర్చుగీసు రాయబారితో వచ్చిన "పెయిస్" అను వాడొకడు గలడు. ఇతడు తాను విజయనగరములో జూచిన యంశములను వివరముగా వ్రాసియున్నాడు. అందు ముఖ్య మైన విషయముల క్లుప్తముగా యిచట నీయబడినవి.

"......... లిస్బాను (Lisbon నగర దుర్గము (పోర్చుగల్ దేశపు రాజధాని.) యెంత స్థల మాక్రమించుకొనెనో యంతకంటె యెక్కువస్థల మాక్రమించుకొని రాయల మందిరము బలాఢ్యమై సురక్షితమై యున్న ప్రాకారము గలిగియున్నది...... ఈ వీధిలో పెక్కురకముల కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్య ములు మొదలగు రత్నములను, వస్త్రములను, ఇంకను ప్రపంచములో దొరకునట్టి ప్రతి వస్తువును విక్రయింప బడుచుండును...... ఈ నగర

విస్తీర్ణతను గురించి నేను వ్రాయను. ఏలన అదియొక ప్రదేశమునుండి చూచుటకు గానరాదు. నేనొక కొండనెక్కి యెక్కువ భాగమును చూడగలిగితినిగాని పెక్కుకొండల పంక్తులకు మధ్యనగర మంతయు నిమిడి యుండుటచేత గొంతభాగము కాన్పింపలేదు. అచటనుండి చూడగా నాకు గనుపట్టిన భాగము రోమకపురి (ఇటలీ ముఖ్యపట్టణము రోమునగరము) యంత పెద్దదిగా నుండి చూపునకు మిక్కిలి సుందరముగా గానుపించినది. ... ... ... ఈ నగరములోని జనసంఖ్య లెక్కించుట కలవిగానిదిగా నుండుటచేతను, నేనుదహరించిన గల్పితముగను, నతిశయోక్తిగాను నుండునను భీతిచేతను నుదాహరింప మానినాడను. ఈ నగరము ప్రపంచములో సమస్త వస్తుసముదాయముచేతను నిండియున్న మంచినగరముగా నున్నయది. ఆహారధాన్యములు బహు చౌకగా అమ్మబడుచున్నవి. ... ... ...

ఈ రాజునకు యుద్ధముచేయుటకు పదిలక్షల సైన్యము గలదు. వీరందరికి రాజు జీతము లిచ్చుచుండును. అవసరమైన యుద్ధభూమికి యిరువది లక్షల సైన్యములను రప్పింపగలడు. ఇంత సైన్యమును రాజుదీసుకొని పోయినపుడు దేశమున ప్రజలు లేరని తలపరాదు. దేశము జనభూయిష్టమై యుండుటచేత నేవ్యాపారమునకును భంగము కలుగదు. ఈ రాజ్యమున బ్రాహ్మణు లనేకులు గలరు. ఇత్యాది."

## అచ్యుతదేవరాయలు క్రీ॥ శ॥ 1530_1542.

ఈ రాజు కృష్ణదేవరాయులకు సవతి తమ్ముడు. ఈ రాజు భోగపరాయణుడు. పిరికివాడనియు చెప్పుదురు.

## సదాశివరాయలు 1542_1568.

ఈతడు కృష్ణదేవరాయుల సోదరుడు. ఈతనిని నామమాత్ర రాజుగాచేసి అలియరామరాజు(కృష్ణదేవరాయల మంత్రులలో నొకరు) రాజ్యమును నడపుచుండెను. ఈ రామరాజు దక్షిణదేశములోని నవాబులను యంత్రపు బొమ్మలవలె నాడించినవాడు. ఈతని కాలమున రాజ్యవైభవలక్ష్మి మహోన్నతదశకెక్కి యతనితో నశించెను.

ఇతడు క్రీ॥ శ॥ 1565 సం॥రమునాటికి తొంబదియారేండ్లవాడని "కేటో" యను చరిత్రకారుడు వ్రాసియున్నాడు.

ఈతని చివరకాలమున క్రీ॥ శ॥ 1565 సం॥రములో "తలికోట" యుద్ధము జరిగియున్నది. అందు హిందూసైన్యములోడుట తటస్థించగా మహమ్మదీయులు పట్టణములోని పసిబిడ్డ, బాలాదులనందరిని వధించుటయేగాక పట్టణమును, అందలి దేవాలయములను, గొప్ప సౌధములతో సహా నేలమట్టము గావించి తమ దుష్టత్వమును వెల్లడిచేసికొని యుండిరి. అంతటితో విజయనగరసామ్రాజ్య మంతరించినది.

తిరుమలరాజు సదాశివరాయలను తీసుకొని పెనుగొండకు పోయెను. అచ్చట నాతడు క్రీ॥ శ॥ 1568 లో సదాశివరాయులను జంపి తాను రాజాయెను. ఈ తిరుమలదేవరాయని వంశజులు కొన్ని యేండ్లవఱకు చంద్రగిరిలో రాజ్యము చేయుచుండిరి. ఈ వంశములోని వాడగు నాఱవ శ్రీరంగరాయలక్రింద చెన్నపట్టణ ప్రదేశముండెను. ఆతడే క్రీ॥ శ॥ 1639 వ, సంవత్సరమందు మార్చినెలలో ఈస్టు యిండియా కంపెనీవారికి చెన్నపట్టణపు కోట కట్టుకొనుటకు స్థలము కవులునకిచ్చియుండెను. ప్రస్తుతమునందు ఆనగొంది సంస్థానాధీశ్వరులగు శ్రీరాజా శ్రీరంగదేవరాయులవా రీవంశమునందు జన్మించినవారే. ఆనగొంది నైజాము రాజ్యములో నున్నది. (కె. వి. లక్ష్మణ రావుగారి మహమ్మదీయ మహాయుగము 407, 408 పుటలు)

దేశమును ధర్మయుక్తముగ కాపాడుచుండిన క్షత్రియరాజ లంతరించిన పిమ్మట క్షాత్రమవలంబించి కత్తిని చేబూని వైదికధర్మమును రెండువేల సం॥రములకు పైకాలము కాపాడిన బ్రాహ్మణరాజులు మహమ్మదీయ దౌష్ట్యమునకు బాల్పడి నశించిరి. విజయనగరరాజ్యము 280 సం॥రములు ప్రబలియంతరించెను. ప్రజల ప్రాణమానవిత్తములకు రక్షణ లేకుండెను. బ్రాహ్మణ, స్త్రీ, బాలాదుల హింసనిరంతము సాగింపబడుచుండెను. దేవాలయములు నేలమట్టము గావింపబడి వాని స్థానమున మసీదులు నెలకొల్పబడుచుండెను. స్త్రీజన మవమానింపబడుచుండిరి. అట్టి పాపిష్ఠికాలమున వేదధర్మమును ప్రజల ప్రాణమానవిత్తములను కాపాడుటకు పూర్వపురాజులవద్ద దండనాయకులుగా పని

చేసిన రెడ్డి, వెలమ, కమ్మ, కాపు, గొల్ల, యాదవ, మొదలు
నాయకులు దేశపరిపాలనను తమ చేతులలోనికి తీసుకొని బ్రా
మంత్రుల సహాయమున మహమ్మదీయ ప్రవాహము దక్షిణ దే
జొరకుండునటుల తమ శౌర్యసాహసములచే నరికట్టిరి. వీరలు
మందచ్చటచ్చట స్వల్పరాజ్యములను స్థాపించి వానిని తమ భ
మున విస్తరింపజేసి హైందవధర్మమును కాపాడిరి. అవకాశము
చోట మశీదులను తొలగించి పూర్వపుదేవాలయములను తిరి
కొల్పిరి. వర్ణధర్మములు యథావిధిగ సాగునట్లు దేశమును
మర్యాదననుసరించి శాసించిరి. వేదశాస్త్రాదివిద్యలను ప్రోత్సహి
ప్రజల ప్రాణవిత్తమానములకు భద్రత కలుగజేసిరి. వేయేల పి
పాలనలో ప్రజలు హాయిగా సుఖించిరి. దక్షిణహిందూదేశమున
స్థాపన జరిగి ప్రజలు సుఖించుచుండిన కాలములో ఉత్తరహి
స్థానమున ఢిల్లి పాదుషాల పరిపాలన కాలమున అక్బరువంటి
రిద్దరు పాదుషాలను మినహాయించి మిగతా పాదుషాల పరిపాల
ప్రజలు మహమ్మదీయ దౌష్ట్యమునకు బాల్పడి ఘోరదుఃఖ
పాలైరి. ఇట్టి స్థితిలో మహారాష్ట్రవీరుడైన శ్రీ శివాజి మహా
దయించి మహమ్మదీయరాజ్యములను బలహీనమొనర్చెను. ఆపి
రాబడిన మహారాష్ట్రయోధులు బ్రాహ్మణపీష్వాలనాయకత్వమున
క్రమముగా మహమ్మదీయ పరిపాలనను ఢిల్లీ యందంతరింప
గలిగిరి. వారివలన కప్పముగొనిరి. మహమ్మదీయ దౌర్జన్య
టితో అంతరించినది. పిమ్మట ఐరోపీయులు కృత్రిమపద్ధతులచే
అధికారమును సంపాదించుటయు, చక్రవర్తులగుటయు మొ
ములందరెఱింగినదే గనుక ఆవివరము లిచ్చట యిా
డలేదు. 1857 సం॥ లగాయతు 1947 ఆగష్టు 15 తేదీ వ
ఱత్తం తొంబది సంవత్సరముల బ్రిటిషుపరిపాలనవలన హై
హూణవిద్యాధికులు తాము భారతీయులమనియు, తమకు వేదశా
వాఙ్మయమపారముగాగలదనియు, అదియే వివిధకాలములలో పాశ
దేశములందు నాగరికతా వ్యాప్తిని గలుగజేసినదనియు, దానివ
తమదేశము యితరదేశస్థులచే గౌరవింపబడుచున్నదనియు మొద

గల తమచరిత్రసంతయు మఱచి పాశ్చాత్యనాగరకతావేశమునొందుట తటస్థించినది. పరమేశ్వరానుగ్రహముచే శ్రీతిలక్, గాంధి మొదలు గాగల దేశనాయకుల కృషివలన ది 15 ఆగష్టు 1947 సం॥రమున భారతదేశము తిరిగి స్వాతంత్ర్యమును పొందగలిగినది. ప్రజలలో నెల కొనిన భావదాస్యమింక కొంతకాలమునకు దానంతటదియే తొలగి పోగలదు.

పైన దెలుపబడిన రాజవంశావళినిబట్టియు, యితరవిధములు గాను యుధిష్ఠిరశకము లగాయతు 5085 సం॥రములు (కలి. పూ॥ 36ల॥ కలి 5049 సం॥ రములు) జరిగినటుల మనకు వివరముగా దెలిసి యున్నది. కలిశక ప్రారంభ కాలమునకు పూర్వాపర సందర్భము లను వివరముగా దెలిపి కలిశకముయొక్క సొష్టవమును నిర్ధారణ జేసియుంటిమి. గనుక యిక ముందు చరిత్రలు వ్రాయువారందరు క్రైస్తవ పాదరీలవలన కల్పితములయిన తప్పు శకముల లెక్కలలో బోక తమ చరిత్రలను, ఖగోళ శాస్త్రాధారములతో స్థిరపరుపబడి కాల నిర్ణయములను యోపికతో చదివి విమర్శించుకొని వాని నను సరించుట దేశమునకు, భారతజాతీయతకు క్షేమము.

ఇతర దేశముల శకములలో క్రీస్తు శకము, క్రైస్తవ సృష్ట్యా దియు వారి యూహా కల్పితములుగాన యుపేక్షింపదగినవికాని లెఖ్ఖ లోనికి తీసుకొందగినవి కావు. మిగతా కాన్స్టాంటినోపిలు, ఆంటి యోకు, అలెగ్జాండ్రియా పట్టణములు నిర్మింపబడిన తేదీలు ప్రారం మైననాటినుండి సరిగా లెఖ్ఖవేయదగిన వైనను వానికా పట్టణము కట్టకపూర్వము స్వతంత్రముగా జెప్పకొందగిన ప్రారంభయునికి లేనం దున గ్రహింపదగినవి కావు. ఇకను భారతవర్షములోని శకము లన్నియు సృష్ట్యాది నుండియు అనగా 195 కోట్ల పై చిల్లర కాలము నుండియు ఖగోళ శాస్త్రాధారమున సిద్ధాంతీకరింపబడియున్నవి. ఇందులో స్వల్పమైనవాని నొదలినను 1. సృష్ట్యాది శకము 2. వైవ స్వత మన్వాది. 3. యిరువది యెనిమిదవ మహాయుగములోని కలి యుగాది యను యీ మూడు శకములలో నేదైనను తీసుకొన వచ్చును. అందు 28 వ కలియుగాది శకము చరిత్ర కందదగిన

కాలమునుగురించి వ్రాయుటకును మిగత రెండుశకములు మనచరిత్ర కందని అతి ప్రాచీన కాలమును గురించి వ్రాయుటకును పనికివచ్చును. ఈ శకములు మూడుగా కనబడుచున్నను అవి మూడును యొక మహాశకములోని మూడు భాగములుగాని ప్రత్యేకమైనవి కావు. భారతీయ శకము లన్నిటికి మూలము బ్రహ్మ తన యేబది వకటవ సంవత్సరము మొదటి కల్పమున (మొదటి రోజు) ప్రమాధి సం॥ర చైత్రశుద్ధ పాడ్యమి ఆదివారం ఉదయము ఆరుగంటల లగాయతు అనగా సృష్టిచేయుటకు ప్రారంభించిన మొదటి ముహూర్తము లగాయతు ప్రారంభింపబడిన శకము. ఆశకప్రకారము యిప్పటికి (అనగా 1944 A.Dకి) 195,58,85,044 సం॥రములు (నూటతొంబదియైదు కోట్లయేబది యెనిమిదిలక్షల యెనుబదియైదు వేల నలుబదినాలుగు) జరిగినవి. యిందులోని విభాగములే వైవస్వత మన్వాది శకము, 28వ కలియుగాది శకములు అని మన వూహాకందుటకు గాను విభాగింపబడి ప్రత్యేక శకములుగా జూపింపబడినవిగాని వేరుకాదు. సత్యాన్వేషణకు పురాణపఠన మత్యవసరము.

"The puranas are, usually fairly in agreement with the evidence of inscriptions and coins, so far as the names of the kings and the length of their reigns are concerned."

(Ancient-India, By E. J. Rapson M. A. Cambridge P. 117)

"రాజులు, వారి పరిపాలనాకాలముల విషయములో పురాణములు, శాసనములు, నాణెములవలన తెలియువచ్చిన విషయములకు సరిగా సరిపోవుచున్నవి." అని యి. జె. రాప్సను మహాశయుడు వ్రాసియున్నాడు.

# కృతయుగాది ద్వాపర యుగాంతమువఱకు పరిపాలించిన రాజవంశములు

కలిశక ప్రారంభము లగాయతు యిప్పటికి 5044 సం॥ రము లవిచ్ఛిన్నముగా జరిగినటుల మనము సప్రమాణముగా దెలిసికొంటిమి. (క్రీ॥ శ॥ 1944 సం॥కు) కలి ప్రారంభమునకు పూర్వము ద్వాపర యుగము 8,64,000 సం॥రములు జరిగిపోయినది. ద్వాపరయుగములో నెంతవరకు మనము సప్రమాణముగా కాలమును గణింపగలుగుదుమో విచారింతము.

ద్వాపరయుగాంతమున భారతీయ జ్యోతిష్కులు లెఖ్కవేసి సం॥రము 365 రోజుల, 5 గంటల, 50 నిముషముల, 35 సెకండ్లు పొడవుగలదిగా నిర్ణయించిరి. ఇప్పుడు "లాక్కైలీ" యను పాశ్చాత్య ఖగోళశాస్త్రజ్ఞుడు లెక్కవేయగా సంవత్సరము 365 రో. 5 గం. 48 నిము. 49 సెకండ్లుగా నుండెను. ఈ రెండు లెక్కలలోని తేడా 1 ని. 46 సెకండ్లు. భారతీయులు గుణించిన సం॥రము ఇప్పటి సం॥రముకన్న 1-46"డ్లు పెద్దదన్నమాట. సృష్ట్యాదినుండియు జరుగుచుండిన కాలములో సంవత్సర పరిమితి క్రమక్రమముగా తగ్గుచుండిన విషయ మందరచే నంగీకరింపబడిన ప్రసిద్ధ విషయము. ఇకముందుకూడా నిట్లే తగ్గుచుండును. ఈ తగ్గుదలను లెక్కింపగా 4900 సం॥ (నలుబది తొమ్మిదివందల సం॥రముల)కు 40½" నలుబదిన్నర సెకండ్లు తగ్గు చుండునని శాస్త్రజ్ఞులు కనుగొనిరి. గనుక ద్వాపరయుగాంతమందు భారతీయ ఖగోళశాస్త్రజ్ఞులు వేసిన గణితములో 1-46" సెకండ్లు తగ్గుటకు సుమారు 13066 సం॥రములు పట్టును. కలిలో జరిగిన 5044 సం॥రములు మినహాయింపగా కలిపూర్వము 8022 సం॥రముల క్రిందట ద్వాపరయుగాంతమందీ గణితము వేయబడియున్నదని స్పష్ట పడుచున్నది. ఈ కలియుగము యిరువదియెనిమిదవ మహాయుగము లోనిది. ఈ మహాయుగములో కృత, త్రేత, ద్వాపరములను మూడు యుగములు గతించినవి. ద్వాపరయుగము చివర యెనిమిదివేల సం॥ర ములనాడే భారతవర్షము మహోన్నతనాగరికతనందియున్నటుల మనం

ఖగోళశాస్త్రరీత్యా తెలిసికొనియున్నాము. ద్వాపరయుగ పరిమితి 8,64,000 సం॥రములు. దానికి ముందుగతించిన త్రేతాయుగ పరిమితి 12,96,000 సం॥లు. ద్వాపర, త్రేతాయుగములు కలిసి 21,60,000 లు. కృతయుగము 1200 సం॥రములు మిగిలియుండగా "మయుడు" సృష్ట్యాది నుండి కృతయుగాంతమునకు లెక్కవేసి అప్పటివరకు 195,37,20,000 సం॥రములు సృష్ట్యాదినుండి జరిగియున్నటుల సూర్యసిద్ధాంతమందు దాహరించియున్నాడు. ఈ విషయము మనము లోగడనే తెలిసికొని యున్నాము. అప్పటి గ్రహకూటికలనుగూడా నిచ్చియున్నాడు. త్రేతా యుగమునకు ముందుగడచిన కృతయుగకాలము 17,28,000 సం॥ర ములు గలుపగా యిరువదెనిమిదవ మహాయుగాదివచ్చును. అనగా 21,60,000 + 17,28,000 = 38,88,000 లు వచ్చును. ఇది జరిగి పోయిన కృతయుగ ప్రారంభమునుండి యీకలియుగ ప్రారంభమువఱకు జరిగిన కాలము. కలిప్రారంభమునుండి కలి 5044 సం॥రమువఱకు కలు పగా యిరువదెనిమిదవ మహాయుగాదినుండి యిప్పటికి (అనగా కలి 5044 లేక క్రీ॥ శ॥ 1944 వఱకు) 38,88,000 + 5044 = 38,93,044 ౙరిగినది. ఈ కాలములోని రాజవంశావళి పురాణములయందు వర్ణింప ౘడియున్నది. అవి రాజవంశచరితములుగాని రాజుల జీవితములు కావు. ప్రతి రాజుయొక్క జీవితమును వర్ణించుట అసాధ్యము. ఒక్కొక్కరాజు సగటున ఆ కాలపరిస్థితులనుబట్టి నలుబది సం॥రములు రాజ్యముచేసి యుండునని భావించినను 97,200 మంది రాజులు పేర్లనుదహరింప వలయును. ఇది అసాధ్యము. అందువలన పురాణములలో రాజు వంశములు మాత్రమీయబడినవి. ఒక్కొక్క వంశములోని ప్రసిద్ధ నామములుదాహరింపబడినవి. కృతయుగాది రాజైన వైవస్వతమనువు కుమారుడైన ఇక్ష్వాకుమహారాజు లగాయతు ద్వాపరయుగాంతమందు జరిగిన కురుపాండవయుద్ధములో అభిమన్యునిచే చంపబడిన "బృహ ద్బల"యను రాజువరకు 83 సూర్యవంశపు రాజవంశములును చంద్ర వంశములో స్యుద్యుమ్నమ్నుడు లగా॥ పరిక్షిత్తు పట్టాభిషేకమువఱకు 61 రాజవంశములును వర్ణింపబడియున్నవి. గ్రంథవిస్తరభీతిచే రాజ వంశ

ముల జాబితానివ్వజాలమైతిమి. వంశముల లోని రాజుల పరిపాలనతో కృత, త్రేత, ద్వాపరయుగములు 38,88,000 సం॥రములు గడచినవి.

"The fact dynasties and not individuals were units of calculation, is in itself a proof of the great antiquity of the ancient Hindu Empire.

(Hindu Superioity P 5)

"పరిపాలించిన రాజులకాలములను గాక రాజవంశములను కాలమును లెక్కపెట్టు మానముగా తీసుకొనడమును బట్టియే భారతీయసామ్రాజ్యముయొక్క ప్రాచీనత్వము ఋజువగుచున్నది."

కలి ౧ సం॥రము లగాయతు కలి ౫౦౪౯ సం॥వఱకు రాజుల జాబితా లోగడనే యివ్వబడినది. గనుక యిరువది యెనిమిదవ మహా యుగాది లగాయతు యిప్పటికి (అనగా కలి 5049 వఱకు) జరిగిన కాలము 38,93,049 సం॥రములు.

శ్రుతి:"సూర్యాచంద్రమసౌధాతాయథాపూర్వమకల్పయత్."

తా॥ బ్రహ్మదేవుడు సూర్య, చంద్రవంశపు రాజులను యథా పూర్వముగా అనగా వెనుకటికల్ప, మనుకాల, మహాయుగములలో వలెనే యిప్పటికల్ప, మనుకాల, మహాయుగములలో కూడను సృష్టించి యుండెను. (అనగా ప్రతికల్ప, మన్వంతర, మహాయుగములందును సూర్యచంద్రరాజవంశములు నాయానామములతో తిరిగి తిరిగి వచ్చు చుండునని తాత్పర్యము).

ఈ ప్రకారముగా లెఖ్ఖవేయుచు బోగా యిప్పటి సృష్ట్యాదికి ముందు జరిగిన బ్రహ్మవయస్సు 50 సం॥రములలోని మొదటి సం॥ మొదటిరోజు వఱకు వెళ్ళవచ్చును. ఇందునుబట్టి మనము లెఖపెట్ట గలిగిన కాలము బ్రహ్మమానము ప్రకారం యేబది వకటవ సం॥రము లోని మొదటిరోజున యేడవ మనువైన వైవస్వతుని కాలములో యిరువది యెనిమిదవ మహాయుగములోని కలియుగము 5050 సం॥ర మందు మనమున్నామని స్పష్టపడుచున్నది. ఈ లెఖ్ఖ యావత్తు ఖగోళ శాస్త్రముచే గ్రహచలనాదులను బట్టి ఋజువు చేయగలిగినది గాని యిప్పటి కాలపు చరిత్రకారులవలె యూహాగానము కాదు.

ప్రకృతి సిద్ధముగానున్న యిట్టి కాలగణనము నొదిలి కేవల యూహలపై నాధారపడి మొదలు తుదలేని కల్పిత శకముల నాధారపరచుకొని దేశ చరిత్రలనల్లి ప్రాచీన రాజవంశావళుల కాలములను తారుమారు చేయుటవలన సత్య చరిత్రమునకు దూరుల మగుచున్నాము. అందు వలన ప్రాచీన చరిత్రలు యవిశ్వసనీయముగా దోచుచున్నవి.

భారతీయుల ఖగోళ శాస్త్రమును గురించి పాశ్చాత్య ఖగోళ శాస్త్రజ్ఞు లభిప్రాయములు:

The celebrated European Astronomer, Mr. Playfair says:—

"The Brhmin obtains his result with wonderful certainity and expedition in Astronomy."

(Playfair on the Astronomy of the Hindus. Transactions of the R. A. S. of Great Britain and Ireland Vol' II P. 138, 139.)

తా॥ "బ్రాహ్మణులు జ్యోతిషములో నొక్కొక్క లబ్ధమునే అతిత్వరితముగ గుణింతురు. అది యమోఘముళై యుచ్చైరువు గొలుపును."

This speaks volumes in favour of the original advanced and scientific methods of the Hindus and their marvellous cultivation of the Science.

Professor Sir M. Williams says:—

"It is their Science of Astronomy by which they (Hindus) heap billions upon millions, trillionsu ponbillions of years and reckening up ages, upon ages, aeons upon aeons with evn more audacity than modern Geologists and Astronomers. In short, an Astronomical Hindu ventures on arithmetical conceptions quite beyond the mental dimensions of any one who feels himself incompetent to attempt a task of measuring infinity."

(Hindu Superiority P. 295)

తా॥ హిందువుల పద్ధతులు స్వతంత్రములనియు, సగ్రేసరము లనియు శాస్త్రీయము లనియు, నిర్ధారణ చేయుటకును, వారి శాస్త్ర ములో నద్భుతముగ కృషి చేసియుండిరనుటకును, ఈ వాక్యము వేనోళ్ళ సాక్ష్య మిచ్చుచున్నది.

సర్ "మో. విలియంసు పండితుడు (Sir. M. Williams) యిట్లనుచున్నాడు. "హిందువులు తమ ఖగోళ శాస్త్రము ననుసరించి కోట్లు, ఖర్వములు, శంఖములాదిగా సంవత్సరములగుణింపగల్గుచున్నారు. యుగముల పైన యుగములు, అయనముల పైన అయనములు, ఆధునిక భూగర్భ ఖగోళశాస్త్రజ్ఞులకంటె నెక్కువ సాహసముతో లెక్కించివేయుగలరు. వేయేల అనంతమును గుణింపబూనుట కళకర్తల మనుకొను వారి మేధాశక్తికి అతీతములైన గణితవిషయములను మనసులో నూహించుటకు హిందూజ్యోతిష్కుడు సాహసించును." (ఏమి యీపండితుని విపరీతమైన నిజాల్పజ్ఞతాంగీకారము!)

In astronomy, as in other sciences, what scanty records remain not only show the astonishing proficiency of ths Hindus in the science, but contain theories not yet understood by others. Sir M. Monier Williams says ;—

" A very strange theory of the planetary motion is expounded at the commencement of the Surya Siddhanta, Chapter II," which is unknown outside India. (Monier Williams' Indian wisdom P 189)

తా॥ ఇతరశాస్త్రములలో వలెనే ఖగోళశాస్త్రమందును నశింపగ మిగిలిన కొలది లిఖితాధారములనుబట్టి, ఈశాస్త్రములో హిందు లద్భుతపాండిత్యము గలవారనియేగాక, ఇతరుల కింతవరకు బోధకా సిద్ధాంతములందున్నవని తెలియుచున్నది. సూర్యసిద్ధాంతము ద్వి యాధ్యాయారంభములో గ్రహగతిని గూర్చిన యొక విచిత్రసిద్ధాం ముపపాదింపబడియున్నది. ఇది భరతఖండమున కన్యుల యెరిక తెలియదు."

" Till of late years we did not know with <u>extreme exactness</u> the longitudes of distant places. "

"The ancient Hindu method of finding the longitude by first finding out the Deshanta Gathika, with the aid of observations made at the time of the lunar eclipse, is not only scientific but infalliable. "

(Mr. C. B. Clarke F. G. S. Geographical Reader.)
& Hindu Superiority page 296 foot-note.

తా॥ "మొన్న మొన్నటిదనుక మనము వివిధస్థలముల రేఖాంశములను స్ఫుటముగ జెప్పజాలకుంటిమి."

"పూర్వపుహిందువుల పద్ధతి శాస్త్రీయమును, యేమాత్రము తప్పురానిదియును, వారు చంద్రగ్రహణకాలమున వేధలువేసి మొదట దేశాంతరగతి గనుగొని రేఖాంశముల దెలిసికొనెడివారు."

ఈ ప్రకారమనేకులు పాశ్చాత్య ఖగోళశాస్త్రజ్ఞులాశ్చర్యముతో మన ఖగోళశాస్త్రజ్ఞానమును బొగడియుండిరి అట్టి ఖగోళములోని గ్రహగతులమీద నాధారపరుపబడిన భారతీయశకము నిస్సంశయముగా నంగీకరింపదగినది. కేవలము తమ చంచలమైన యూహాల మీద నాధారపడిన పాశ్చాత్యశకములు యవిశ్వాసనీయములును, త్యాజ్యములును నై యున్నవి.

## పూర్వ చారిత్రక శకములు

కలి **5049** వఱకు లెక్క (క్రీ॥ శ॥ **1948** సం॥రము వఱకు)

**1.** ఇప్పటి బ్రహ్మజననశకము. బ్రహ్మమానము ననుసరించి **50** సం॥ **13** ఘడియల **42** విఘడియలు.

**2.** సృష్ట్యాదిశకము — **195,58,85,049.**

**3.** వైవస్వతమన్వాదిశకము — **12,05,33,049.**

**4.** ఇరువదెనిమిదవ మహాయుగాదిశకము — **38,93,049.**

## చారిత్రక శకములు (క్రీ॥ శ॥ 1948 సంవత్సరముకు)

**1.** యుధిష్ఠిరశక సం॥రములు — **5085.**

**2.** కలిశక సం॥రములు — **5049.**

**3.** జయాభ్యుదయ యుధిష్ఠిరశకం — **5049.**

**4.** లౌకికాబ్దము లేక లోకకాలము లేక యుధిష్ఠిరకాలము లేక సప్తర్షిశకము — **5024.**

పై నాలుగు శకములును చారిత్రకముగా యిప్పుడు మనము వాడుకోతగిన శకములు.

---

# భారత యుద్ధము

యు. శ. 1 వ సం॥ లగాయతు

| | | రాజ్యము చేసిన సం॥రములు | యు॥ శ॥ |
|---|---|---|---|
| I. | క్షత్రియ సామ్రాజ్యము | 1504 సం॥ | 1_1504 |
| II. | శూద్ర సామ్రాజ్యము | 416 సం॥ | 1504_1920 |
| III. | బ్రాహ్మణ సామ్రాజ్యము | 891 సం॥ | 1920_2811 |
| IV. | గుప్తరాజులు; బ్రహ్మక్షత్రరాజులు | 245 సం॥ | 2811-3056 |
| V. | బ్రహ్మక్షత్రరాజులు (బ్రాహ్మణ రాజులు) | 1275 సం॥ | 3056_4331 |
| VI. | మహమ్మదీయ, మహారాష్ట్ర, బ్రిటిషు మొదలగువారు | 754 సం॥ | 4331-5085 |
| | | 5805 | |

యు. శ. 5085 = కలిశకం 5049 = క్రీ॥ శ 1947 సం॥రం 1947 ఆగష్టు 15 వ తేదీనుండి స్వతంత్రభారత ప్రజారాజ్యము.

# కలిరాజ వంశములు

యు॥ శ॥ 5085 వఱకు

| వరుస సంఖ్య | వంశము పేరు | రాజుల సంఖ్య | రాజ్య సం॥రములు యు. శ. | క్రీ. పూ. సం॥రములు లగాయతు వరకు. |
|---|---|---|---|---|
| I. | బార్హద్రథవంశము | 22 | 1006 | 3138_2132 |
| II. | ప్రద్యోతవంశము | 5 | 138 | 2132_1994 |
| III. | శిశునాగవంశము | 10 | 360 | 1994_1634 |
| IV. | నంద వంశము | 2 | 100 | 1634_1534 |
| V. | మౌర్యవంశము | 12 | 316 | 1534_1218 |
| VI | శుంగవంశము | 10 | 300 | 1218_ 918 |

| | | | | |
|---|---|---|---|---|
| VII. | కాణ్వవంశము | 4 | 85 | 918– 833 |
| VIII. | ఆంధ్రవంశము | 33 | 506 | 833– 327 |
| IX. | గుప్తవంశము | 7 | 245 | 327– 82 |
| X. | బ్రహ్మక్షత్రరాజులు (పరమార వంశం) | 24 | 1275 | 82 క్రీ.శ. 1193 |
| | హైందవరాజులు వెరశి | 129 | 4331 | |
| XI. | మహమ్మదీయ, మహారాష్ట్ర, హైందవ, బ్రిటిషు రాజులు | | 754 | 1193–1947 |
| | | | 5085 | 3138–1947 |

XII. స్వతంత్ర భారత ప్రజారాజ్యము 1947 సం॥ అగస్టు 15 తేదీ లగాయతు.

కలిశకవిజ్ఞానము సర్వము సంపూర్ణము.

"లోకాస్సమస్తా స్సుఖినో భవంతు"

ఓం తత్సత్.

# అనుబంధము

## కలిరాజ వంశావళి

### మగధరాజ్యము— బార్హద్రథ వంశము

| వరుస నెం. | రాజుపేరు | రాజ్యకాలము సం॥లు |
|---|---|---|
| 1. | సోమాధి లేక సోమాపి | 58 |
| 2. | శ్రుతశ్రవ | 64 |
| 3. | అప్రతీప | 36 |
| 4. | నిరామిత్ర | 40 |
| 5. | సుకృత్త లేక సుక్షత్ర | 58 |
| 6. | బృహత్కర్మ | 23 |
| 7. | శ్యేనజిత్ | 50 |
| 8. | శృతంజయ | 40 |
| 9. | మహాబల లేక విభు | 35 |
| 10 | శుచి | 58 |
| 11. | క్షేమ్య | 28 |
| 12. | అనువ్రత లేక సువ్రత | 64 |
| 13. | ధర్మనేత్ర లేక సునేత్ర | 35 |
| 14. | నిర్వృతి | 58 |
| 15. | సువ్రత | 38 |
| 16. | దృఢసేన | 58 |
| 17. | సుమతి లేక మహానేత్ర | 33 |
| 19. | సుబల | 22 |
| 19. | సునేత్ర | 40 |
| 20. | సత్యజిత్ | 83 |
| 21. | వీరజిత్ | 35 |
| 22. | రిపుంజయ | 50 |
| | బార్హద్రథులు వెరశి | 1006 |

1006

—♦ ప్రద్యోతవంశపు రాజులు ♦—

| | | |
|---|---|---|
| 23. | ప్రద్యోత లేక బలాక | 23 |
| 24. | పలాక లేక పాలక | 24 |
| 25. | విశాఖయూప | 50 |
| 26 | జనక లేక సూర్యక | 21 |
| 27. | నందివర్ధన | 20 |
| | వెరశి | 138 138 |
| | | 1144 |

—♦ శిశునాగ వంశము ♦—

| | | |
|---|---|---|
| 28. | శిశునాగ | 40 |
| 29. | కాకవర్ణ | 36 |
| 30. | క్షేమధర్మ | 26 |
| 31. | క్షేమజిత్తు | 40 |

ఇక్ష్వాకు వంశములో 23 వ వాడగు శుద్ధోదన మహారాజితనికి సమకాలికుడు. ఈ కాలమున యు॥శ 1251 సం (॥క్రీ॥పూ 1887) బుద్ధుడు జన్మించి యుండెను. ఇక్ష్వాకు వంశములో భారత యుద్ధమునకు పిమ్మట మొదటి రాజు బృహద్బలుడు. మగధరాజులలో మొదటివాడు సోమాపి. వీరినుండి లెక్కింపబడినది.

| | | |
|---|---|---|
| 32. | విధిసార లేక బింబిసార | 38 |
| 33. | అజాతశత్రు | 27 |
| 34. | దర్శక | 35 |

1144

35. ఉదయన 33
36. నందివర్ధన 42
37. మహానంది 43

శిశునాగులు
వరకి 360 360

మొత్తం వరకి 1504

—♦ నందవంశము ♦—

38. మహాపద్మనంద 88
39. ఇతని కుమాళ్ళు
8 గురు 12

100 100

మొత్తం వరకి 1604

—♦ మౌర్య వంశము ♦—

40. చంద్రగుప్త
మౌర్యుడు 34
41. బింబుసార 28
42. అశోక 36
43. సుపార్శ్వ (సుయాస) 8
44. దశరథ (బంధుపాలిత) 8
45. ఇంద్రపాలిత 70
46. హర్షవర్ధన 8
47. సంగత 9
48. శాలిశూకః 13
49. సోమశర్మ (దేవశర్మ) 7
50. శతధన్వ 8
51. బృహద్రథ
(బృహదశ్వ) 87

మౌర్యులు 316 316

మొత్తం వరకి 1920

—♦ శుంగవంశము ♦—

1920

52. పుష్యమిత్ర 60
53. అగ్నిమిత్ర 50
54. వసుమిత్ర 36
55. సుజ్యేష్ఠ 17
56. భద్రక (అంధ్రక) 30
57. పులిందక 33
58. ఘోషావసు 3
59. వజ్రమిత్ర 29
60. భాగవత 33
61. దేవభూతి
(క్షేమభూమి) 10

శుంగరాజులు 300 300

మొత్తం వరకి 2220

—♦ కాణ్వ వంశము ♦—

62. వసుదేవకణ్వ 39
63. భూమిమిత్ర 24
64. నారాయణకణ్వ 12
65. సుశర్మ 10

కాణ్వులు 85 85

మొత్తం వరకి 2305

—♦ ఆంధ్ర శాతవాహనవంశము ♦—

| వరుస నెంబరు. | రాజు పేరు | రాజ్య సం॥ |
|---|---|---|
| 66. | సింధుక లేక శ్రీముఖ | 23 |
| 67. | శ్రీకృష్ణశాతకర్ణి | 18 |
| 68. | శ్రీ మల్లశాతకర్ణి | 10 |
| 69. | పూర్ణోత్సంగ | 18 |
| 70. | శ్రీ శాతకర్ణి | 56 |

2305

71. స్కంధ స్తంభిన్ 18
72. లంబోదర 18
73. అపీతక 12
74. మేఘస్వాతి 18
75. శాతస్వాతి 18
76. స్కందశాతకర్ణి 7
77. మృగేంద్ర శాతకర్ణి 3
78. కుంతలశాతకర్ణి 8
79. సౌమ్య శాతకర్ణి 12
80. శాతశాతకర్ణి 1
81. పులోమశాతకర్ణి (మొదటి పులోమ) } 36
82 మేఘశాతకర్ణి 38
83. అరిష్టశాతకర్ణి 25

ఈతని రాజ్యకాలములో శ్రీ శంకరుల వారవతరించిరి. క్రీ॥ పూ. 509 సం॥

84. హాల 5
85. మండలక 5
86. పురీంద్రసేన 21

(ఈతని రాజ్యకాలములో క్రీ॥ పూ॥ 477 సం॥రమున శ్రీ శంకరులు సిద్ధిబొందిరి)

87. సుందరశాతకర్ణి 1
88. చకోరశాతకర్ణి ½
88. (అ) మహేంద్ర శాతకర్ణి ½
89. శివశాతకర్ణి 28

2305

90. గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి 25
91. రెండవపులోమాయి 32
92. శివశ్రీశాతకర్ణి 7
93 శివస్కందశాతకర్ణి 7
94. యజ్ఞశ్రీశాతకర్ణి 19
95. విజయశ్రీశాతకర్ణి 6
96. చంద్రశ్రీశాతకర్ణి 3
97. మూడవ పులోమాయి 7

ఆంధ్రవంశము 503 506

మొత్తం వెరశి 2811

పైనరు చంద్రశ్రీ (గుప్త చంద్రగుప్తునిచే చంపబడినవాడు).

— గుప్తరాజులు —

98. చంద్రగుప్తుడు 7
99. సముద్రగుప్తుడు 51
100. ద్వితీయ చంద్రగుప్తుడు 36
101. మొదటి కుమారగుప్త 42
102. స్కందగుప్త 25
103. నరసింహగుప్త తరఫున స్థిరగుప్త 5
నరసింహగుప్త మేజరైనతరువాత 35

బ్రాటోవరు 2811

)4. ద్వితీయ
కుమారగుప్త 44

గుప్తరాజులు 245 245

మొత్తం వెరశి 3056

105. విక్రమార్కుడు
106. దేశభక్త
107. శాలివాహన
108. శాలిహోత్ర
09. శాలివర్ధన
10. శకహంత
సుహోత్ర
హవిర్హోత్ర
ఇంద్రపాల
మాల్యవాన్
శంభుదత్త
. భీమరాజ
17. వత్సరాజ
8. భోజరాజ
9. శంభుదత్త
\. బిందుపాల
రాజపాల
మహీనర
సోమవర్మ
కామవర్మ
వీరసింహ
రంగపాల
కల్పసింహ
గంగసింహ

129. (88 అ) మహేంద్ర శాత
కర్ణి అనెడి ఆంధ్రరాజును
కలుపగా అయిన మొత్తం—
వీరి రాజ్యకాలమొత్తం 1275

వెరశి మొత్తం 4331

సగటునరాజు 1కి $33\frac{1}{3}$ సం॥రములు
చొ॥ అయినది.

పేర్లు తెలిసినంతవరకు
యీయబడినవి.

1. ప్రమరవంశములో గుప్త
రాజుల సమకాలికులు 5
గుప్తరాజుల తరువాత 25

30

2. తోమరవంశము లేక
చాహుమాన రాథోరు
వంశపురాజుల మొత్తం. 32

3. శుక్ల లేక చాళుక్యవంశపు
రాజు లనేక శాఖలైరి.
అందొకశాఖ మాత్రము
తీసుకోవడమైనది. మొత్తం
రాజులు. 30

4. పరిహారవంశములో
రాజులు మొత్తం. 36

మహమ్మదీయ, మహారాష్ట్ర,
బ్రిటిషు మొదలయిన
వారందరి రాజ్యకాలము. 754

5085

యుధిష్ఠిరశకం—5085 లేక కలిశకం 5049 లేక క్రీ॥ శ॥ 1948 సం॥రముకు సమానము.

| | |
|---|---|
| కలిపూర్వము 36 సం॥రము<br>క్రీ॥ పూ॥ 3138 సం॥రము | భారతయుద్ధము, యుధిష్ఠిరశక ప్రారంభము. పరీక్షిన్మహారాజు జననము. |
| కలిశకం 1 సం॥<br>(క్రీ॥ పూ॥ 3102 సం॥రం) | శ్రీకృష్ణనిర్యాణము. ధర్మరాజు రాజ్య పరిత్యాగము పరీక్షిన్మహారాజు పట్టాభిషేకము. కలిప్రారంభము. |

యు. శ 1 సం॥ లేక కలిపూర్వం 36 లేక క్రీ॥ పూ॥ 3138 సం॥రముకు సమానము. ఇప్పుడు జరుగుచున్నది యు॥ శ॥ 5086 = కలిశకం 5050 = క్రీ॥శ॥ 1949-50 గనుక కలిశకం ప్రారంభమునుండి యిప్పటికి (క్రీ॥ శ॥ 1949-50 సం॥రముకు) 5050 జరిగినటులను కలికి పూర్వం 36 సం॥రమున అనగా 5086 సం॥రముల క్రిందట భారత యుద్ధము జరిగినటులను స్పష్టముగాను, సప్రమాణముగాను యీ కలిశకవిజ్ఞానగ్రంధము మూడుభాగములవలనను ఋజువుచేయబడినది. ఇక ముందు భారతదేశచరిత్ర వ్రాయువారలు యీ కలిశకము ననుసరించెదరు గాక ?

కలిశకవిజ్ఞానము సంపూర్ణము.

ఓం తత్సత్.

*

# ఆర్యవిజ్ఞాన గ్రంథములు

## ఆంధ్రమహాజనులకు విజ్ఞప్తి

ఆర్యులారా!

మీ అభిమానాదరముల వలన యిప్పటికి వేయి పేజీలు వఱకు గల గ్రంథము అచ్చు పూర్తిచేసి చందాదార్లందరకు పంపుకొని యున్నాము. ఇంకను ఎనిమిది గ్రంథములు వేయిపేజీలకు పైగా అచ్చు కావలసియున్నది. ఇదివఱకు పంపిన గ్రంథములు చదివిన వారలీ కాలమున యిట్టి ప్రాచీన విజ్ఞాన విషయములను తిరిగి జ్ఞప్తికి తెచ్చు టెంత యవసరమైనదియు గుర్తించి యుందురు. గనుక దయచేసి ముందు అచ్చువేయు గ్రంథములకు దిగువ వర్గములలో చేరి ద్రవ్య సహాయముచేయ ప్రార్థన. అట్టివారికి రు 15-0-0 కిమ్మతుగల గ్రంథము లప్పుడే యీయబడును.

మహారాజ పోషకులుగా చేరువారు 100-0-0

రాజ పోషకులుగా చేరువారు 50-0-0 పోషకులు 25-0-0

ఇదివఱకు రు 10-0-0 యిచ్చిన వారు మిగతా రు 15-0-0 పంపిన వారి పేర్లు పోషక వర్గములో చేర్చి గ్రంథములో ప్రకటింపబడును. పది రూపాయలిచ్చిన వారలు వెంటనే పదిహేను రూపాయిలు పంపవలెను. అట్లు పంపిన రాబోవు గ్రంథములు [illegible]ంపబడును. పది రూపాయిలు కూడా యిప్పటివఱకు యివ్వక [illegible]ాకీ పెట్టి గ్రంథములు తీసుకొనిన వారలు బాకీ యుండిన పది రూపా[illegible]లు గాని లేక పోషక చందా యిరువదియైదు రూపాయిలు గాని పంపవలెను. ఇంతటితో విరమించుకోదలచిన వారలు వారు పుచ్చు కొన్న గ్రంథముల మూల్యములైనను పంప ప్రార్థింపబడు చున్నారు.

గ్రంథములు తీసుకొని ఆరు మాసములు దాటినను వాటి మూల్యమైనను యీయకుండుట ధర్మముకాదని మనవిచేయుచున్నాము.

[illegible]1—1—1950
[illegible] నగరం
[illegible]డ 2

కోట వెంకటాచలం
ఆర్య విజ్ఞాన గ్రంథకర్త

ఆర్య విజ్ఞానం

# జంబూద్వీపము

## (అందలి వర్షవిభాగములు)


గ్రంథకర్త అండ్ ప్రకటనకర్త:

**శ్రీ కోట వెంకటాచలం**

గాంధినగరం : : విజయవాడ 2.

అద్వైతబోధినీ, నిర్విచారజీవనం, బ్రహ్మాండసృష్టి విజ్ఞానం, మానవసృష్టివిజ్ఞానం, కలిశకవిజ్ఞానం 3 భాగములు, ఆభాసక్రైస్తవం, ఆంధ్రులెవరు ?. జంబూద్వీపం యిత్యాది గ్రంథముల గ్రంథకర్త.



విరోధినామ సం॥ర పుష్యమాసము కలి5050 క్రీ॥ శ॥ 1950 జనవరినెల

ప్రథమముద్రణం 5000 ప్రతులు. కవితిలక ప్రెస్, విజయవాడ.




వెల : ఆరణాలు



గ్రంథకర్త:
శ్రీ కోట వెంకటాచలం.

# జంబూద్వీపము - దాని విభాగములు

భూగోళస్థిత జంబూద్వీపము, దానియందలి నవవర్షవిభాగముల గురించి అనేకులనేక విధములుగా పురాణములలోని వర్ణనలను తీసుకొని విమర్శించుచున్నారు. వారి విమర్శనలను చూడగా పురాణములలో వర్ణింపబడిన జంబూద్వీపమేదియో వారికి బోధగట్టినట్లు కనుబడుట లేదు.

పురాణములలో చెప్పబడిన భూగోళ ఖగోళ విషయములు సృష్ట్యాది అనగా సుమారు 196 కోట్ల సం॥రముల నాటివైయున్నవి. పిమ్మట అనేక మార్పులు కలిగినవి. వానిని తెలియుటకు జ్యోతిస్సిద్ధాంతజ్ఞానమవసరము. పురాణములలో యే శాస్త్రమునకు సంబంధించిన విషయము ప్రస్తావింపబడునో, నాశాస్త్రజ్ఞానమున్నపుడే నా విషయ మర్థమగునుగాని అట్టి జ్ఞానము లేనియెడల అర్థముకానేరదు. సిద్ధాంత విషయములు తెలియని వారికి పురాణములోని విభాగములు సమన్వయము కానేరదు. నవీనులచే చెప్పబడిన భూభాగముల ననుసరించి పురాణములలోని విషయముల సమన్వయపరుప ప్రయత్నించుటచే ఇట్టి విపరీత భావములకు హేతువైనది.

పూర్వు లేవిధముగా వ్రాసియుండిరో నామూలాగ్రముగా దెలుసుకొని వారి దారినేపోయి మనము వాని నర్థముజేసిన తప్పులన్నియు సత్యముగా గోచరించును. విపరీత యూహలు గలుగుట మన దోషదృష్టివలనగాని పూర్వ ఋషులకు భూగోళజ్ఞానము లేక వ్రాయుటవలనగాదు. వారికి మంచి జ్ఞానము గలిగియున్నదనుట కెట్టి సంశయమును లేదు. వారు వ్రాసిన దానిని తెలిసికొనలేక చేయబడిన మన విమర్శనలు మాత్ర మజ్ఞానజన్యములైయున్నవనుట నిస్సంశయము.

పురాణములలో జెప్పునపుడు ప్రతిచోటను అక్షరాభ్యాసములగాయతు వర్ణక్రమములు చెప్పబడవు. పురాణములను చదివి అర్థము

చేసుకొనుటకు విజ్ఞానమును యితర శాస్త్రసహాయముచే సంపాదించు కొనిన అధికారియే పురాణములను చదివి అర్థము చెప్పుట కర్హుడుగాని జ్ఞానలవ దుర్విదగ్ధుడు పురాణ పఠనమున కర్హుడుగాడు. వేదార్థము నెఱుగుటకాఱు (షట్శాస్త్రములు) శాస్త్రముల జ్ఞానమెటు లవసరమో యటులనే పురాణపఠనమునకు జ్యోతిషము మొదలుగాగల యితర శాస్త్రజ్ఞానమవసరము. అంతవరకు నాతడు పురాణములను జేపట్టి అర్థము చెప్పుట కర్హుడు కాడు. అనధికారులైన వారలు పురాణపఠనము జేయుటకు మొదలిడుటవలననే మన పురాణములు తప్పుల తడికలుగా బ్రదర్శింపబడుట కవకాశము గలిగినది. హేయమైన యిట్టి దురభి ప్రాయములవలన వారు చెడుటయేగాక లోకులనుగూడను చెడగొట్టిన వారగుచున్నారు.

ప్రాచీనులచే చెప్పబడిన జంబూద్వీపము దానిలోని భారత వర్షాది విభాగములను గుర్తించుటకు అనేకులు ప్రయత్నించుచు పురాణ ములలో వర్ణింపబడిన జంబూద్వీపమును, వర్షవిభాగమును గందరగోళ ముగా జూపుచుండిరి. వారికి అర్థమైన ప్రకారము మేరువును చీనాలోని గోబీ యెడారిలో నున్నటుల గుర్తించుచుండిరి. జంబూద్వీపమనగా భారతవర్షములోని ఉత్తరభాగమని కొందరు, దక్షిణభాగమని కొందరు, యావత్తు భారతవర్షమని కొందరు జెప్పుచున్నారు.

జంబూద్వీపమును నవవర్షములుగా జేసి స్వాయంభువ మనువు కుమారుడైన ప్రియవ్రతుడు తన కుమారులకు పంచియిచ్చియున్నాడు. అందువలన భారతవర్షము జంబూద్వీపములో తొమ్మిదవ భాగమై యున్నది. తొమ్మిదవభాగమైన భారతవర్షము జంబూద్వీపమెట్లగును ?

ఇక పిరింకొక విధముగా గూడను నవవర్ష నిర్ణయము జేసిరి.

ఆసియాఖండ పటమును తీసికొని దక్షిణమున భారతవర్షమున ప్రారంభించి చీనా, తుర్కీ, గోబీ యెడారులలో ఇలావృతవర్షమును గుర్తించి దానిమధ్య మేరువును జూపి దాని కుత్తరమునగల సైబీరియా యెడారి లగాయతు ఉత్తర సముద్రమునకు రమ్యక, హిరణ్మక, కురు వర్షములను గుర్తించి మొత్తముమీద ఆసియాఖండము నంతను

మాత్రము జంబూద్వీపముగా జూపుచుండిరి. విషయ మామూలాగ్రముగా తెలియకపోవుట వేఱుమాట. విషయ మొక విధముగానుండగా దానిని సరియగు విధమున దెలిసికొనక విపరీతార్థములను గల్పించి హాస్యాస్పదములుగా బ్రదర్శించుట ప్రమాదకరమైన విషయము.

# భూగోళస్థిత జంబూ ద్వీపము

నె 1 రు పటము




మనముండిన యీ బ్రహ్మాండములో భూలోకాదిగా సత్యలోకము వఱకు ఏడులోకము లూర్ధ్వభాగమునను, అతలాది పాతాళము

వఱకు యేడు అధోలోకములును వెరశి పదునాలుగులోకములుగలవు. అందుభూలోకము రెండుభాగములు. ౧ భూగోళము. ౨ మహాభూమి.

మనము నివసించుచుండిన యీ భూగోళమునకు దిగువ అయిదు కోట్ల బ్రహ్మాండ యోజనముల దూరమున (1 బ్ర॥ యో॥ 30$\frac{3}{8}$ ఇంగ్లీషు మైళ్ళు) దక్షిణముగా "మహాభూమి" యనునదుండి యున్నది. పురాణములలో వర్ణింపబడిన లక్షయోజన విస్తీర్ణ జంబూద్వీపమును, దానిని చుట్టి లవణసముద్రమును, యిట్లొక దానిని చుట్టి యొకటిగా సప్తద్వీపములును, సప్తసముద్రములును మహాభూమియందుండి యున్నవి. పంచాశత్కోటి యోజన విస్తీర్ణ భూమండల మనునదిదియే. (అనగా యేబదికోట్ల యోజన విస్తీర్ణ భూమండలము.) దానిని గురించిన వివరములు నాచే వ్రాయబడిన "బ్రహ్మాండ సృష్టివిజ్ఞానం" అను గ్రంధమున వివరింపబడినవి ప్రస్తుతవిషయముభూగోళస్థిత జంబూద్వీపమును గురించి.

మహాభూమిమీదగల సప్తసముద్ర ద్వీపముల పేర్లతో భూగోళముమీదగూడా సప్తసముద్రద్వీపములుగా విభజింపబడినది. ఈ బ్రహ్మాండమునకు భూగోళము సమమధ్య ప్రదేశమున సమఘన వృత్తాకారముగా నున్నదని మన గ్రంధములు చెప్పుచున్నవి. ప్రాచీనులు యీ భూగోళమునకు సమమధ్య ప్రదేశముగుండా చుట్టూనొక రేఖ గీసి దాని విషువన్మండలరేఖ, లేక నిరక్షరేఖ, (అనగా ఈక్వేటరు) అని పేరిడిరి. అట్టి నిరక్షరేఖ లగాయతు ఉత్తర ధ్రువమువఱకు గల భూభాగమునకు "దేవభాగము" లేక "జంబూద్వీపము" అని పేరు. నిరక్షరేఖ లగాయతు దక్షిణధృవమువఱకు 'అసురభాగము అని పేరు.'

నెం 1 రు పటమును చూడుడు. ఇందు లవణాది సప్తసముద్రములును, జంబూద్వీపాద్యులైన సప్తద్వీపములునుగలవు. కాని యీ కాలమున భూభాగములో హెచ్చుభాగము సముద్రముగా మారిపోయి అచ్చటచ్చట కొన్ని లంకలుమాత్రము యిప్పుడు నిలచియున్నవి. ఈ విషయమును గురించి శ్రీ భాస్కరాచార్యులు తన 'సిద్ధాంతశిరోమణి' యను జ్యోతిష గ్రంధములో నీవిధముగా వ్రాసియుంచిరి.

శ్లో॥ భూమేరర్ధం క్షారసింధోరుదక్స్థం జంబూద్వీపం
ప్రాహురాచార్యవర్యాః
అన్యేర్ధేస్మిన్ ద్వీపషట్కస్యయామ్యే క్షారక్షీరాద్యంబుధీనాం
నివేశః.

(సిద్ధాంత శిరోమణి)

తా॥ లవణ సముద్రమున కుత్తరమునగల భూగోళముయొక్క అర్ధభాగమును జంబూద్వీపమని ఆచార్యులు చెప్పియుండిరి దక్షిణార్ధ భాగము లవణ, క్షీరాదులైన సప్తసముద్రములకు ఆరు ద్వీపములకు నిలయమైయున్నది. (నెం ౧ రు పటమును జూచునది)

పూర్వులు భూగోళమును నిరక్షరేఖమీదుగాకోసి రెండు భాగములు చేసిరి. ఉత్తరార్ధగోళము, దక్షిణార్ధగోళమునని రెండు భాగములుగా నేర్పడినవి. వారు "లంక" మెరిడియన్ మీద "0" సున్న డిగ్రీనుంచి భూగోళమును 360 డిగ్రీలుగా విభాగించిరి. ఇప్పుడు నవీనులు నిలువుగాకోసి పూర్వార్ధ. పశ్చిమార్ధగోళములుగా రెండు భాగములు చేసియుండిరి. వారు "గ్రీనుచ్" మెరిడియన్ వద్ద "(0)సున్న" డిగ్రీనుంచి బయలుదేరి భూగోళమును 360 డిగ్రీలుగా విభాగించిరి. నవీనుల విభాగముల ప్రకారం మనవారలు విమర్శించుచున్నందున పూర్వపు విభాగములుమనకు సరిగా గోచరించుటలేదు. వారు చేసినటుల ఉత్తర, దక్షిణార్ధగోళములుగా చేసి జూచిన జంబూద్వీపమును, దానిలోని నవవర్షవిభాగమును మనకు సులభముగా బోధపడును.

నిరక్ష రేఖ కుత్తరముగా ఉత్తరధ్రువము వఱకు నుండిన ప్రదేశమంతయు అనగా ఉత్తరార్ధగోళమంతయు "జంబూద్వీపము"గా వ్యవహరింపబడినది. ఇందు ఆసియా, ఐరోపా, ఆఫ్రికా, ఉత్తర అమెరికా ఖండములున్నూ మిగతా సముద్రములుగా యిప్పుడు మనకు గాన్పించుచున్న భాగమంతయు పూర్వము భూఖండముగానుండి యిందు జేరియున్నది. అందు ఆఫ్రికాఖండ దక్షిణభాగమునంటి తూర్పుగా ఈక్వేటరు కుత్తర దక్షిణముల కొంత భూభాగము అమెరికావఱకు యుండియుండేది.

ఆ భూభాగమంతయు సముద్రగామియైనది దాని యవశేషములే మెడగాస్కర్, సముద్రగామియైన రావణాసురుని లంక, సింహళము, సుమిత్రా, జావ, ఆస్ట్రేలియా మొదలగు లంకలు. అట్లు సముద్రగామియైన ప్రదేశము నిప్పుడు పరిశోధనలుచేసి "లెమూరియా" యనెడి యొక భూఖండము సముద్రగామియైనట్లు చెప్పుచున్నారు. అయిదు కోట్ల సం॥రముల క్రిందట సగరచక్రవర్తి కాలములో యీ భూఖండము సముద్రగామియైనట్లు మన పురాణములు చెప్పుచున్నవి. నిరక్షరేఖ (ఈక్వేటరు) కుత్తరముగాగల భాగమంతయు "జంబూద్వీపము"ని పూర్వులు నిర్ణయించిరి. నిరక్షరేఖకు దక్షిణమున అనగా జంబూద్వీపము చుట్టును ఉప్పుసముద్రము 270 యోజనములు(1 యో $=4\frac{1}{1}\frac{1}{2}$ యింగ్లీషు మైళ్ళు, వెడల్పు గలిగియుండియున్నట్లు పూర్వులు గుర్తించియుండిరి. ఆ ఉప్పు సముద్రమున మునిగిపోయిన లెమూరియా ఖండములోని నిరక్షరేఖకు దక్షిణముగా కొంత భూఖండమును, కొన్ని పర్వతములును, కొన్ని లంకలును యుండియున్నట్లు. పూర్వులచే వర్ణింపబడినది.

నిరక్షరేఖకు దక్షిణముగాగల భూభాగములేగాక నిరక్షరేఖకుత్తరముగాగల జంబూద్వీపములోకూడ చాలాభాగము (ఆసియా, ఆఫ్రికా, ఐరోపా, ఉత్తర అమెరికా యనెడి నాలుగు ఖండములును, అచ్చటచ్చట కొన్ని లంకలును తప్ప మిగతా భూభాగమంతయు) ఉప్పు సముద్రముచే నాక్రమింపబడినది. దానిని మనసున నుంచుకొని పూర్వులచే చెప్పబడిన విధమున మనము జంబూద్వీపమందలి నవ వర్షములను గుర్తించుదము. సులభముగా గుర్తించుటకు వీలగునటుల నిరక్షరేఖ కుత్తరభాగమును అనగా "జంబూద్వీప" పటము నిందుతో జతపరచడమైనది.

(నెం 2 రు పటమును చూడుడు)

# జంబూద్వీప నవ వర్షవిభాగము

భూగోళస్థిత జంబూద్వీపమునకు దక్షిణమున చుట్టును నిరక్ష రేఖ వుంకియున్నది. దానికి దక్షిణమున (అనగా ఉత్తరార్ధగోళము చుట్టూ) ఉప్పుసముద్రముగలదు.



(నె 2 రు పటము)

జంబూద్వీపములో దక్షిణమున భారతవర్షముగలదు.

ఈ భారతవర్షము పూర్వము నిరక్షరేఖవఱకు వ్యాపించి యున్నది. దిగువను "లంక" యనెడి ద్వీపముగలదు. (సింహళము పూర్వము భారతవర్షముతో కలిసి యేక ఖండముగానుండేది.) ఆ లంకా ద్వీపమున "సున్న" (౦) డిగ్రీ పెట్టి అనగా అచ్చటనుంచి ప్రారంభించి పూర్వ ఋషులు నిరక్షరేఖమీదుగా భూగోళమును 360 డిగ్రీలుగా విభాగించి యామ్యోత్తర రేఖల (Meridian or longitudes) లిఖించియుండిరి.

ఇప్పుడు నవీనులు గ్రీనిచ్ 'మెరిడియన్ వద్ద "సున్న" డిగ్రీపెట్టి యామ్యోత్తర రేఖలు లిఖించియుండిరి. లంకవద్ద బయలుదేరి లంకకు తూర్పుగా నిరక్ష రేఖమీదుగా నడచిన తొంబదవ డిగ్రీవద్ద "యవకోటి" యను పట్టణమొకటి యున్నట్లు జ్యోతిస్సిద్ధాంత గ్రంథములు జెప్పు చున్నవి. దానికి తూర్పుగా నిరక్ష రేఖమీద తొంబది డిగ్రీలు నడచిన ఉత్తరమున "సిద్ధపురి" యను పట్టణముగలదు. లంకనుండి యీసిద్ధపురి యొకే లాంగిట్యూడుమీద దక్షిణోత్తరముల నున్నట్లు స్పష్టముగా గోచరించును. భూగోళముమీద లంకవద్దనుండి వెనుకవైపు కొఱమేకు గ్రుచ్చిన నది సిద్ధపురివద్దకుపోవును. అనగా లంకకు యెదురువైపున "సిద్ధపురి" యున్నదనుట స్పష్టము.

లంక జంబూద్వీపమునకు దక్షిణముగానుండిన యెడల దాని కెదురుగా నుండిన సిద్ధపురి జంబూద్వీపమున కుత్తరముగానున్నదని వేరుగా జెప్పనక్కర లేదు.

ఈ సిద్ధపురి అమెరికాలో ఈక్వేటరుమీద గలదు. (అనగా కురువర్షములో) గనుక లంకతోగూడిన భారతవర్షము జంబూద్వీప ములో దక్షిణముగానుండి యుండిన సిద్ధపురితోగూడిన కురువర్షము (అమెరికా) జంబూద్వీపములో యుత్తరమున నున్నదని చెప్పుట కెట్టి యాక్షేపణ లేదుగదా! దక్షిణదిక్కు కెదురుగా యుత్తరదిక్కుగలదని జెప్పినవారు బాగుగా తెలిసి జెప్పిన వారేగదా!

దానిని గ్రహించలేక అజ్ఞానముచే తామే తెలివిగలవారని భ్రమించి, తెలిసి చెప్పిన వారిమాటలకు విపరీతార్థములు జేయువార లెట్టివారలో మీరే గ్రహింపుడు.

లంకకు తొంబది డిగ్రీల వద్ద తూర్పున యుండిన "యవకోటి" యను పట్టణమున కెదురు "రోమకం" యను పట్టణముండి యున్నది. తూర్పునకు కెదురుగా నుండినది పడమర దిక్కు అని ప్రసిద్ధము. ఇప్పుడు జంబూద్వీపము చుట్టునుగల నిరక్షరేఖ మీదుగా దక్షిణ సముద్రతీరమునగల "లంక"నుండి బయలుదేరి నడిచిన తూర్పున తొంబదవడిగ్రీవద్ద "యవకోటి" పట్టణమును, దానికి తొంబది డిగ్రీల

దూరమున (అనగా 180 డిగ్రీల దూరమున) ఉత్తమున "సిద్ధపురి" పట్టణమును, దానికి తొంబదిడిగ్రీల దూరమున అనగా లంకనుండి తూర్పుగా 270 డిగ్రీవద్ద "రోమక" మను పట్టణమును గుర్తించుచూ తిరిగి దక్షిణమునగల "లంక"కు జేరుదుము.

అనగా లంకకు సరిగా ఉత్తరమున 180 డిగ్రీల దూరమున "సిద్ధపురి" యున్నదన్నమాట. ఈదృష్టితో పటముమీద మనపూర్వులచే పురాణములలో చెప్పబడిన నవవర్షములను గుర్తించుదము. దక్షిణమున భారతవర్షము, దాని కుత్తరమున హిమాలయ పర్వతము, దాని కుత్తరమున కింపురుషవర్షము దాని కుత్తరమున హేమకూట పర్వతము, దాని కుత్తరమున హరివర్షము; దాని కుత్తరమున నిషధ పర్వతము, దాని కుత్తరమున ఇలా వృతవర్షమును గలవు. (ఇలా వృతవర్ష మధ్యమున మేరువుగలదు.) లంకనుండి మేరువుకు 90 డిగ్రీలు యామ్యోత్తర రేఖమీద (లాంగిట్యూడ్ మీద) దూరము. దాని కుత్తరమున నీలపర్వతమును, (ఇది అమెరికాలోనికి పోవును) దాని కుత్తరమున రమ్యక వర్షమును, దాని కుత్తరమున శ్వేతపర్వతమును, దాని కుత్తరమున హిరణ్యాక వర్షమును, దాని కుత్తరమున శృంగవాన్ పర్వతమును, దాని కుత్తరమున కురువర్షమును గలవు.

కురువర్షమున కుత్తర సరిహద్దున నిరక్షరేఖ దాని కుత్తరమున గల ఉత్తర సముద్రతీరమున "సిద్ధపురి" గలదని జ్యోతిశ్శాస్త్రవేత్తలు పురాణవాక్యములను వివరించి చెప్పియుండిరి సిద్ధపురినుండి లంక యామ్యోత్తరేఖమీద (మెరిడియన్ లేక లాంగిట్యూడ్) మేరువుకు 90 డిగ్రీల దూరం. పైన చెప్పబడిన ౧ భారత. ౨ కింపురుష. 3 హరి. ౪ ఇలావృత. ౫ రమ్యక. ౬ హిరణ్యాక. ౭ కురువర్షము లేటిండిలో మధ్య నున్నది ఇలా వృతవర్షము. దీని మధ్య మేరువు గలదు.

అనగా జంబూద్వీపము చుట్టునుగల నిరక్షరేఖనుండి యెటు కొలచినను తొంబది డిగ్రీలదూరమునఉత్తముగా మేరువుగలదు. మేరువు బ్రహ్మాండమునకు సమమధ్యను దక్షిణమునుండి ఉత్తరముగానున్నట్టు లూహింపబడిన (Imaginary) బ్రహ్మాండ మధ్యరేఖ. ఈ రేఖయం

దధోలోకము లేడును, మహాభూమి భూగోళములును, ఊర్ధ్వలోకము లారును వెరశి పదునాలుగు లోకములు గ్రుచ్చబడి యుండిన ట్లూహింపబడినది.

ఈ బ్రహ్మాండ మధ్యరేఖనే భూగోళమునకు సంబంధించినంత వఱకు భూమధ్యరేఖ యని మనము వ్యవహరించుచున్నాము. దీనికే మేరు రేఖయనియు మేరుదండమనియు, మేరు పర్వతమనియు పేర్లు. భూగోళమునకు ఉత్తరపు చివర "ఉత్తర ధ్రువ మేరువు" అని పిలువ బడుచున్నది. దక్షిణపు చివర "దక్షిణ ధృవ"మని పిలువబడుచున్నది. ఈ మేరురేఖకే స్వర్గములో ఉత్తరపు చివర ఊర్ధ్వధ్రువస్థానమని వ్యవహరింపబడుచున్నది.

ఇలావృత వర్షమునకు తూర్పున నిరక్షరేఖ వరకు ల భద్రాశ్వ వర్షము గలదు. దీనికి తూర్పునవున్న నిరక్షరేఖకు తూర్పునగల సముద్రతీరమున "యవకోటి"యను పట్టణమున్నది. ఇలావృతమునకు పశ్చిమమున గంధమాదన పర్వతమును, దానికి పశ్చిమమున కేతు మాల వర్షమును గలవు. దీనికి పశ్చిమమునగల నిరక్షరేఖ నంటి యున్న పశ్చిమ సముద్రతీరమున "రోమక"యను పట్టణము గలదు. విషయము సూర్య సిద్ధాంతముగోళాధ్యాయము 37 లగాయతు శ్లోక ములలో స్పష్టపరుపబడినది.

పురాణములలో నవవర్ష ధనమున భారతవర్షమును మొదలు బెట్టి యొకదానికు తరముగానొకదానిని చెప్పుచు ఇలావృతవర్షమువఱకు చెప్పబడిన విషయము నవీనులకు ఆక్షేపణీయముకాదు ఇలావృతవర్షము న మధ్య మేరువున్నదని చెప్పిన దానికిని సమ్మతింతురు.

ఇలావృత వర్షమునకు పూర్వపశ్చిమముల భద్రాశ్వ, కేతు మాల వర్షములు నిరక్షరేఖ వరకు వ్యాపించియున్నవనిన దానికిని అంగీకరించుట కభ్యంతరముండచు, కాని ఇలావృత వర్షమున కుత్తరమున రమ్యక, హిరణ్యక, కురువర్షములను కూడు చెప్పుచుండగా నవీనులు దాని నొప్పుకొనక అన్నిటికిని మేరువు ఉత్తరముననుండగా దానికుత్తరమని చెప్పుట వలన పూర్వ ఋషులకు భూగోళజ్ఞానము లేదని చెప్ప సాహసించిరి.

వీరి యుద్దేశ్యమున ఆమెరికాలోని ప్రదేశమును రమ్యక, హిరణ్యక కురువర్షములని యంగీకరించిన యవి మేరువుకు దక్షిణమని చెప్పబడవలయునని వారి యభిప్రాయము. ఈ జంబూద్వీపమున కనగా ఉత్తరార్ధగోళమునకు నాలుగువైపుల నాల్గు దిక్కులను నిరూపించుకొని అందు దక్షిణమునగల భారతవర్షమునుండి బయలుదేరి ఉత్తరమున నిరక్షరేఖమీది "సిద్ధపురి"కి బోయిన వరుసను యొకదానికుత్తరముగా నొక వర్షమును చెప్పుటయే సమంజసము.

ఆప్రకారమే పురాణములలో చెప్పబడినది. కాని యిప్పటి కాలమువారు మేరువును ప్రాతిపదికగా తీసుకొని బయలుదేరిన, వర్షములన్నియును నొకదానికొకటి దక్షిణముగా నున్నటులనే వారికి గోచరించును. అందువలన మేరువుకుత్తరమున అమెరికాఖండములోని భూభాగములను వర్షక్రమముగా విభాగించి చెప్పినటుల వారు గుర్తించుటకవకాశముగలుగలేదు. వారు నిరక్షరేఖను ప్రాతిపదికగాజేసి అందు దక్షిణమునగల భారతవర్షములోని "లంక" నుండి సరాసరి ఉత్తరమున నిరక్షరేఖమీదగల సిద్ధపురి వరకు బోయిన వర్షములన్నియు, ఒకదానికొకటి యుత్తరముగానున్నటుల గోచరించును. (నెం 2 రు పటమును చూడుడు).

పై వివరములనుబట్టి నిరక్షరేఖ కుత్తరముగాగల భూభాగమంతయు "జంబూద్వీపము"నియు దానినే నవవర్షములుగా పూర్వులు విభాగించి చెప్పిరనియు స్పష్టము. దీనినిబట్టి భారతీయులు యిప్పుడు మనము పిలుచుచుండిన ఆసియా, ఆఫ్రికా, ఐరోపా, ఉత్తరమెరికాలు గాక సముద్రగామియై, ఇప్పుడు పసిఫిక్కు, అట్లాంటిక్కు, హిందూమహా సముద్రములలో లీనమైయుండి, పరిశోధకులచే తెలుసుకోబడినట్లు చెప్పబడుచుండిన "లెమూరియా, అట్లాంటిసు" గాండ్వానాల్యాండు" అని పిలువబడుచుండి నిరక్ష రేఖకుత్తరమున జంబూద్వీపములో చేరి సముద్రగామియైన భూభాగమంతయు జంబూద్వీపమను పేరున సృష్ట్యాదినుండియు భారతీయులచే నాక్రమింపబడి పరిపాలింపబడుచు సోదరులవలన పంచుకొన బడుచుండినదని స్పష్టపడుచున్నది.

ఆర్యులు ప్రపంచ మంతయు వ్యాపించిరని చెప్పుటకిది ప్రబల నిదర్శనము. జంబూద్వీపములో సముద్రము లేదు. అంతయు భూభాగమే. లవణసముద్రము దానిని చుట్టియున్నది. గోళవిభాగములో లవణ సముద్రము దక్షిణార్ధ గోళములోనికి పోయినది. ప్రాచీన ఋషులు జంబూద్వీపమును దానిలోని వర్షవిభాగమును సరిగా భూగోళజ్ఞానము కలిగియే చేసియుండిరి. దానిని చదివి అర్థముచేసుకొనెడి శాస్త్రజ్ఞానము లేమిచే విమర్శకులు దానిని సరిగా తెలుసుకొనలేక తమ అజ్ఞానమును ప్రాచీన ఋషుల కంటగట్టుచుండిరి. ఇకనైనను విమర్శకులు వారి లోపమును గుర్తించి సవరించుకొందురు గాక !

## ప్రాచీనవర్ష విభాగములో చేరిన ప్రదేశములు

దక్షిణమునగల భారత, కింపురుష, హరివర్షములు మూడును ఆసియా ఖండములోని సైబీరియా పైవరకు నుండును. ఇలావృత వర్షము మేరువును చుట్టి నాలుగు ప్రక్కలనుగల భూభాగము మేరువు కుత్తరముగాగల ఇలావృతవర్ష భాగమున కుత్తరముగా అనగా అమెరికా ఖండములో చేరిన కెనడాలో ఉత్తర భాగము దాటగా కెనడా దక్షిణ భాగమును, యునైటెడ్ స్టేట్సులో ఉత్తరభాగమును కలిసి "రమ్యక వర్షము" "హిరణ్యాకవర్షములు"గా గుర్తింప వచ్చును.

దాని కుత్తరముగా "కురువర్ష" మనగా యునైటెడ్ స్టేట్సులో దక్షిణ భాగమున్నూ, మధ్య అమెరికా, దక్షిణ అమెరికాలోని ఈక్వేడారులోని నిరక్షరేఖ వరకు (అనగా ఈక్వేటరువరకు) గల ప్రదేశముగా పూర్వులచే గుర్తింపబడినది. అచ్చట నిరక్షరేఖ కుత్తర సరిహద్దున గల (అనగా అమెరికాలోని నిరక్షరేఖకు దక్షిణపు సరిహద్దు) "సిద్ధపురి" యను పట్టణము గలదని చెప్పబడినది. దక్షిణమున లంక నుండి బయలుదేరి ఉత్తరమున అమెరికాలోగల సిద్ధపురి వరకు పూర్వులు నవవర్ష నిర్ణయములను జేసియున్నందున అవి నొకదాని

కొకటి ఉత్తరోత్తరముగా నున్నట్లు చెప్పబడినది. ఇలావృతవర్షము మధ్య మేరువుగలదని చెప్పబడియున్నందున యిప్పుడు మనము దేనిని ఉత్తర ధ్రువమని చెప్పుచుంటిమో దానినే పూర్వులుకూడను ఉత్తర ధ్రువము (లేక మేరు పర్వతము) అని గుర్తించియుండిరి. ఉత్తరధ్రువ మెప్పుడును మారియుండలేదు. అది గోబీయెడారిలో నున్నట్లు పూర్వులు భావించిరనుమాట సరికాదు.



(నె 3 రు పటము)

భద్రాశ్వవర్ష మిప్పుడు పసిఫిక్కు సముద్రముగానున్నది. ఇదియె సముద్రగామియైనదని చెప్పెడి "లెమూరియా" ఖండ భాగము. "కేతుమాల వర్షము" అట్లాంటిక్కు సముద్రముగా మారినది. ఇదియే సముద్రమున మునిగిపోయినదని చెప్పుకొనబడుచుండిన "అట్లాంటిసు" భూఖండము. హిందూ మహాసముద్రమని యిప్పుడు పిలువబడుచున్న భాగములో నిరక్షరేఖకుత్తరమున పూర్వ భారత వర్షములో చేరిన భూఖండము. ఇది సుమారు అయిదు కోట్ల సం॥రముల క్రిందట సముద్రగామియైనది.

దీనిని నవీనులు "గాండ్వానా" భూఖండమనియు, మూడుకోట్ల సంవత్సరముల క్రిందట సముద్రగామియైనట్లును చెప్పుచున్నారు ఆ విషయమును గురించి ది 22-9-1946 సం॥రం "The Illustrated Weekly of India" అను ఇంగ్లీషు సచిత్ర వారపత్రికలో వ్రాయబడిన విషయముకు తెలుగు తాత్పర్యము నిచ్చుచున్నాము.

"ఇండియా ఆఫ్రికాలమధ్య రెంటిని కలుపుతూ యొక భూఖండముండెడిది. దానిపేరు "గాండ్వానాల్యాండు" సుమారు మూడు కోట్ల సం॥రముల క్రిందట యీ భూఖండమున్నటుల యిటీవల కనుగొనబడినది. ఆ భూఖండము మునిగిపోయి యిప్పుడు హిందూమహాసముద్రమని పిలువబడుచున్నది."

పై విభాగమంతయు అనగా ఆసియా, ఆఫ్రికా, ఐరోపా, ఉత్తర అమెరికా, నిరక్షరేఖ కుత్తరముగాగల పసిఫిక్కు సముద్రములో మునిగిపోయిన "లెమూరియా" భూఖండము అట్లాంటిక్కు సముద్రమున మునిగిపోయిన "అట్లాంటిసు" భూఖండము, ఇండియా ఆఫ్రికాలమధ్య హిందూ మహాసముద్రములో మునిగిపోయిన భారతవర్షములోని భాగమగు "గాండ్వానాల్యాండు" యీ మొత్తం భూమియంతయు జంబూద్వీపమని చెప్పబడినది (నెం 3 రు నెం 4 రు పటములను చూడుడు.)

"పురాణ ఋషులకు పృథివి గోళాకారము కాదు మరి చక్రాకారము" అని కొందరభిప్రాయపడుచున్నారు. ఆ పురాణములలోనే "భూగోళ వర్ణన"మని చెప్పబడినదిగాని భూచక్ర వర్ణనమని చెప్పబడియుండలేదు. గోళశబ్ద ప్రయోగములోనే భూమి గోళాకారమని దెలియుచుండగా చక్రాకారమని వారేల యూహింపవలసివచ్చినదో తెలియకున్నది గుండ్రని అద్దమువలెనున్నట్లు భావింపకూడదనియు, భూమి సమఘన వృత్తాకారమైన గోళముగానున్నదనియు, శ్రీ భాస్కరాచార్యులువారు తమ "సిద్ధాంత శిరోమణి"యను జ్యోతిష గ్రంథములో యనేక విధములుగా తర్కించి భూమి నిమ్మపండువలె సమఘన వృత్తాకారముగా నున్నదని సాధించియున్నారు. ఆ గ్రంథములో ియబడిన యుపమానములనే నవీన శాస్త్ర గ్రంథములలోగూడను

నీయబడినవి. దీని వివరములు నాచే వ్రాయబడిన "బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం" "ఆర్యులసర్వతోముఖవిజ్ఞానం" అను గ్రంథములలో చూపబడినవి.




నెం 4 రు పటములోని వివరములు ఇప్పుడు గుర్తింపబడిన ప్రకారం నవవర్షములు.

1. భారతవర్షము
2. కింపురుషవర్షము
3. హరివర్షము
4. కేతుమాలవర్షము
5. ఇలావృతవర్షము
6. భద్రాశ్వవర్షము
7. రమ్యకవర్షము
8. హిరణ్మకవర్షము
9. కురువర్షము
10. ఉత్తరధ్రువము
11. లంక
12. యవకోటి
13. సిద్ధపురి
14. రోమకం

పటములో చుట్టు చుట్టబడి నాలుగువైపు 1 అని గుర్తువేయబడిన వర్తులము (సర్కిలు) నిరక్షరేఖ. దీనిని చుట్టి 270 చిన్నయోజనములు వెడల్పుగల ఉప్పుసముద్రము గలదు.

శ్లో॥ "బ్రహ్మాండ భూర్భువాదిలోక నక్షత్ర
గ్రహ తారాదయః సర్వేగోళాకారాః"
(సూర్యసిద్ధాంతం. గోళాధ్యాయం)

తా॥ బ్రహ్మాండము, భూలోకాదులైన పదునాలుగు లోకములు, నక్షత్రములు, గ్రహములు, తారలు మొదలైనవన్నియు గోళాకారములుగా నున్నవి అని సూర్యసిద్ధాంతమందు చెప్పబడినది. ఈ సూర్యసిద్ధాంతము కృతయుగము పండ్రెండు వందల సం॥రములు మిగిలియుండగా సూర్యదేవతవలన లంకాధిపతియైన మయుని కుపదేశింపబడి ప్రచారములోనికి తిరిగివచ్చినది.

| | |
|---|---|
| కృతయుగశేషం | 1,200 సం॥ |
| త్రేతాయుగం | 12,96,000 ,, |
| ద్వాపరయుగం | 8,64,000 ,, |
| కలిలో ఇప్పటికి అనగా (క్రీ॥శ॥ 1950 సం॥వఱకు) | 5,050 ,, |
| | 21,66,250 |

ఇరువది ఒక్కలక్షల అరువది ఆరువేల రెండువందల యేబది సం॥లు క్రిందటనుండి ప్రచారములోనున్న గ్రంథము. ప్రాచీనగ్రంథములు కాలగర్భములో లీనమగుచుండగా అట్టి సిద్ధాంతములతో గూడిన గ్రంథములు వేరువేరు పురుషులచే భిన్ననామములతో తిరిగితిరిగి లోకమున బ్రచారములోనికి వచ్చుచుండును,

ఇంకను పురాణములలో నాయావర్షములందు నివసించుచుండిన మానవులనుగుఱించి చెప్పబడిన విషయములు యిప్పటి అల్పాయువులు దీర్ఘరోగులగు నీకాలపువారి కతిశయోక్తులుగ దోచవచ్చునేమోగాని 196 కోట్ల సం॥రముల క్రిందట స్వాయంభువమనువు కాలములోని మానవసృష్టినిగురించి చెప్పబడినందున ఇప్పుడు మనము వాని సాధ్యాసాధ్యములను గుఱించి విచారింప నవసరములేదు. సృష్ట్యారంభమున 150 అడుగులకంటె హెచ్చుపొడవు, యెత్తుగల మృగములు, నింకను గొప్పవైన యితర జంతువులు నుండియున్నటుల భూగర్భవస్తుశాస్త్రాది పరిశోధకు లిప్పుడు విపరీత సృష్టులను జెప్పుచున్నారు. అవి నిజమని

యంగీకరించిన 196 కోట్ల సం॥రముల క్రిందటి సృష్టిలోని పురాణ వర్ణనలు సత్యమని యంగీకరించుట కెట్టి యాక్షేప ముండకూడదు.

## అమెరికాలో రాక్షసుల అస్థిపంజరాలు

ది 20-9-47 శనివారంనాడు ప్రచురింపబడిన "జన్మభూమి" యనెడి తెలుగు దినపత్రికలో మొదటిపేజీలో పెద్దయక్షరములతో "లండన్"నుండి రాబడిన వార్త యీవిధంగా ప్రకటింపబడినది.

"లండన్" 20 సెప్టెంబరు 1947

"అమెరికాలోని" "కొలరెడో" గుహాలలో 96 అడుగుల పొడుగుగల అస్థిపంజరాలు కన్పించినవి. ఈ అస్థిపంజరాలు సుమారు ఎనుబదివేల సం॥రముల క్రిందట జీవించిన మనుష్యులవై ఉంటాయని తెలుస్తున్నది."

"గుహాలగోడలమీదనున్న చిత్రాలనుపట్టి వీరి జీవితానికి సంబంధించిన వివరాలు తెలుస్తాయని నిపుణులు భావిస్తున్నారు" అని ప్రచురింప బడినది. పై ప్రచురణలో అస్థిపంజరాలు కనుపడిన "కొలరెడో" గుహాలు ఇప్పుడు యునైటెడ్ స్టేట్సులో వున్నవి.

ఈ భాగము ప్రాచీన జంబూద్వీపములోని "కురువర్షములో చేరినదై యున్నది. ఈ వర్షములోని ప్రజ లాకాలమున పదమూడు వేల ఐదువందల సంవత్సరములు పరమాయుర్దాయము గలిగియున్నటుల పురాణములు చెప్పుచున్నవి.

ఇప్పుడు కనపడిన అస్థిపంజరాలు సుమారు ఎనుబదివేల సం॥రముల క్రిందటి మనుష్యులవైనట్లు అంచనా వేయబడినది. ఎనుబదివేల సం॥రముల క్రిందట మనుష్యుడు 96 అడుగుల యెత్తుండిన 190 కోట్ల సం॥రముల క్రిందట సృష్ట్యాది యందుగల మనుష్యుడెంత యెత్తు ఉండి యుండెనో యూహింపుడు.

ది 24 నవంబరు 1949 గురువారంనాడు ప్రచురింపబడిన "ఆంధ్రప్రభ" దినపత్రికలో యీ విధముగా ప్రచురింపబడినది.

కొల్హాపూర్, నవంబర్ 22 1949

"ఇక్కడకు 40 మైళ్ళదూరంలోగల విశాలగడ్ వద్ద ఒక రాక్షసి అస్థిపంజరం కానవచ్చింది. దీనిపొడవు 16 అడుగులు. పుర్రెచాలా పెద్దది. ఇది కొన్నివేల సంవత్సరాల పూర్వపు జీవిగా భావించబడు తున్నది. మానుషశాస్త్రజ్ఞులు దీనిని పరిశీలిస్తున్నారు." అని ప్రచురింప బడినది. పదహారు అడుగులయెత్తు అనగా కొంచెమెంచుమించు తాడిచెట్టుయెత్తు అని అర్థము. దీనినిబట్టి పురాణవర్ణనలు అసత్యము గాని, అతిశయోక్తులుగాని కావనియు, అక్షరాల అందలి వర్ణనలన్నియు సత్యములని నమ్మవచ్చుననియు స్పష్టపడుచున్నది. ఈ విషయము పై తేదీగల "ఇండియన్ ఎక్స్‌ప్రెస్సు" అనెడి ఇంగ్లీషు దినపత్రికలో గూడను ప్రకటింపబడినది. ఇందువలన పురాణ వర్ణనలలో అతిశయో క్తులు లేవని స్పష్టము. నాలుగుకోట్ల యెనిమిదిలక్షల ముప్పదియొక్క వేయి ముప్పది యెనిమిది సం॥రముల క్రిందట భారతవర్షమునంతను ఏక చ్ఛత్రముగా పరిపాలించిన అంబరీషుడను చక్రవర్తిని గురించి శ్రీ మద్భాగతమునందిట్లు ఉదహరింపబడినది—

"సప్తద్వీప విశాల భూభరము దోస్తంభంబునన్
బూన్చి సంప్రాప్త శ్రీయుతుడై ..." అని యున్నది.

ఏడుద్వీపములను యేకచ్ఛత్రాధిపత్యమున పరిపాలించిన చక్రవర్తులు భారత వర్షమునగలరు — నిత్యకృత్యముగా విమానాది యానములతోడను, కాలినడకను, సముద్రమార్గమునను, యోగశక్తి వలనను భూగోళమునంతను తిరుగుచుండిరి.

దక్షిణార్ధగోళమునగల ఆరుద్వీపములును ఆరుసముద్రములును యిప్పుడు లవణ సముద్రముచే నాక్రమింపబడి నామమాత్రావశేషము లై నందున భూగోళము నందవి మనకు గోచరింపవు.

మహాభూమియు, దానిమీదగల సప్తసముద్రములు, సప్తద్వీప ములు మొదలైన వివరములు నాచే వ్రాయబడిన బ్రహ్మాండ సృష్టి విజ్ఞానమను గ్రంథమున చూడగలరు. తత్సత్.

ఓమ్

# ఆంధ్ర మహాజనులకు విజ్ఞప్తి

ఆర్యులారా !

"ఆర్యవిజ్ఞానము" అను గ్రంథము తాలూకు వేయిపుటలుగల మూడుభాగములుమాత్రము యిప్పటికి ముద్రణము చేయింపగలిగితిమి. అందు రెండవభాగము ఇంగ్లీషులో వేయబడినదిగాని అసలు తెలుగు మాతృక అచ్చుకాలేదు. ప్రముఖులును, వార్తా పత్రికలును మా ఆర్య విజ్ఞాన గ్రంథములమీద చక్కని సమీక్షలు చేయుచుండిరి. ఇప్పటి కైదువేల రూప్యములు ఖర్చుచేయబడినవి. ఇంకను ఎనిమిదివేల రూప్యము లుండినగాని మిగత గ్రంథము లచ్చుకానేరవు. అది ఈ గ్రంథకర్తగారి శక్తినిమించి పోయినది. విజ్ఞాన తృష్ణగల ద్రవ్య వంతులు విరివిగా విరాళములిచ్చి పోషించినగాని మిగత భాగములు ముద్రింపబడజాలవు. గనుక విజ్ఞానాభిమానులు దయయుంచి యీ గ్రంథముల నెంత త్వరలో ముద్రింపించిన అంత మేలు అని విజ్ఞప్తి చేయుచుంటిమి. ఇరువది సంవత్సరములకంటె నెక్కువకాల మనే గ్రంథ పరిశోధన చేయబడి ప్రాచీన విజ్ఞానమును ఆధునిక భావముల సమన్వయించియు, ప్రాచీన విజ్ఞాన దృష్ట్యా పొరబాటభిప్రాయములు లోనైన విషయములను ఆధునిక తర్కదృష్ట్యా పొరబాటులని చూపియు యీ తరమువారికిని, రాబోవు తరములవారికిని ప్రాచీన విజ్ఞానమ కరతలామలకమగునటుల చేయుటయే ఈ గ్రంథమాలలోని విశేషము కాబట్టి ఆసేతుహిమాచలముగాగల మహాజనులందరు మా యుద్య మమునకు తోడ్పడి దీని ముద్రణ కార్యమును పూర్తిచేయించ ప్రార్థన. ఇంకను యెనిమిది గ్రంథములు ముద్రణము కావలసియున్నవి. తెలుగు గ్రంథ ముద్రణ పూర్తికాగానే హిందీలోనికిని ఇంగ్లీషులోనికిని తర్జుమా చేయించి ముద్రింప గోరుచుంటిమి.

# సహాయము చేయగోరు విధానము

1. ఒక గ్రంథమును పూర్తిగా అచ్చువేయించెడి సత్పురుషుల ఛాయాపటమునున్నూ వారి కుటుంబ చరిత్రను క్లుప్తముగానున్నూ గ్రంథములో అచ్చువేయించి చేర్చబడును. (గ్రంథ ముద్రణ వ్యయము ఏడువందల రూపాయిలు లగాయతు వేయిరూపాయిలవఱకు వుండును.)

2. ఒకేసారి నూరురూపాయిలు విరాళముగా నిచ్చు సత్పురుషులు "మహారాజ పోషకులు" అనియు,

3. ఏబదిరూపాయిలు విరాళముగా నిచ్చెడివారు "రాజపోషకులు" అనియు,

4. ఇరువదియైదు రూపాయిలు విరాళముగా నిచ్చెడివారు "పోషకులు" అనియు, గ్రంథములో చేర్చబడుదురు.

గ్రంథములన్నియు పూర్తియగునప్పటికి సెట్టు 1కి ముప్పది రూపాయిలవఱకు ఖరీదు గలవగును. పై వర్గములలో చేరి విరాళము లిచ్చినవారికి వెంటనే పదునాలుగు రూపాయిలు కిమ్మతుగల తయారైన సెట్టు గ్రంథము లీయబడును. మిగతా గ్రంథములు అచ్చు అయిన వెంటనే క్రమేపీ పంపబడుచుండును. సత్పురుషులైనవారు వెంటనే వారుత్సహించు విరాళము గ్రంథకర్తగారికి పంప ప్రార్థన.

కోట వెంకటాచలం

గ్రంథకర్త.

గాంధినగరం, విజయవాడ 2

# ఆర్యవిజ్ఞాన గ్రంథములు



గ్రంథకర్త:

## కోట వెంకటాచలం

గాంధినగరం,—విజయవాడ. 2.

వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసిన బడయగలరు.

<u>ఇంతవఱకు అచ్చుఅయిన గ్రంథములు</u>

## ౧ బ్రహ్మాండసృష్టి విజ్ఞానము

బ్రహ్మాండసృష్టి, భూగోళ, ఖగోళ వివరములు. సప్తసముద్రములు, సప్తద్వీపములు, జంబూద్వీప వివరములు, హద్దులు, చతుస్సాగరములు, దేవమానవాది వర్గసృష్టి, స్వాయంభువమను వంశము యిత్యాది విషయములు. 230 పేజీలు-అట్టబైండు— వెల 3–0–0

## ౨. మానవసృష్టి విజ్ఞానము

(ఇంగ్లీషు తర్జుమా)

or

The Genesis of the Human Race

ఇందు వేదములలో చెప్పబడిన స్వాభావిక సృష్టి వివరములు; డార్విన్ పరిణామ వాదము సంపూర్ణ సిద్ధాంతముకాదు, మానవసృష్టి, సృష్టికాలము; ప్రథమ సృష్టికి స్థానము; ఆర్యుల జనన దేశము ఆర్యావర్తమేనని దెలుపు ఋగ్వేద మంత్రములు, స్మృతులు, పురాణముల నుండి సూటిగా ఆర్యుల సృష్టిని వారు తూర్పునుండి అనగా ఆర్యావర్తము నుండి పశ్చిమ దేశముల నాకమించిన వివరములు; సప్త సింధువుల వివరణము; దస్యులెవరు? ప్రాచీన భూగోళము ఇత్యాది వివరములు. భూగర్భ శాస్త్రము, భూగర్భ వస్తు పరిశోధన శాస్త్రవాక్యములతో సమన్వయించి వ్రాయబడిన 118 పేజీల గ్రంథము-వెల 1–0–0

## 3. కలిశక విజ్ఞానము

(ప్రథమ భాగం) జ్యోతిస్సిద్ధాంతుల కాలనిర్ణయం

కలిశకం యిప్పటికి 5049 సం॥రములు జరిగినట్లు సప్తర్షి
మండల చలనము ననుసరించి ఋజువు. ఆర్యభట్టు; భాస్కరాచా
మొదలుగాగల సిద్ధాంతుల కాల నిర్ణయములు, లోగడ చేయబడిన
తప్పులని ఋజువుపఱచుచు కలిశకం 5049 జరిగినట్లు చూపుట
124 పుటల గ్రంథం— వెల 1-8-0

## ౪. డిటో ద్వితీయభాగం

(కలిరాజ వంశావళి)

భారతయుద్ధము జరిగిన కలిశకమునకు పూర్వము 36 సం॥రమ
నుండి కలి 5049 (క్రీ॥ శ. 3138-1949) వఱకు గల రాజుల జాబిత
వారి రాజ్యకాలములు వారి కాలములలో జరిగిన విశేష విషయము
లను చెప్పుచు పాశ్చాత్య పండితులైన వెబరు, మాక్సమల్లరు, రాప్సన్
స్మిత్, మొదలైనవారలున్నూ, హైందవ పురాణ విద్యాధికులై
భండార్కారు, హరప్రసాదశాస్త్రి మొదలగు వారలచే వ్రాయబడి
చరిత్రలలోని పొరబాటభిప్రాయములను ఖండించుచు, సత్యవిషయ
లతో వ్రాయబడిన భారతదేశ చరిత్ర. కలిపూర్వం 1836 ౦గాయ
కలి 2775 వఱకు (క్రీ॥ పూ 4938 ల క్రీ॥ పూ 327 వఱకు) గ
గ్రంథం. పుటలు 150— వెల 2-4

## ౫. డిటో తృతీయభాగం

(కలిరాజ వంశావళి శేషం)

(గుప్త వంశము; బ్రాహ్మణరాజులు; వివిధ రాజ్యములు.)

ఇందు కలి 2775 ల॥ కలి 5049 వఱకు (క్రీ॥పూ 327
క్రీ॥శ 1949, ఆంధ్ర శాతవాహన సామ్రాజ్య పతనము; గుప్తవంశ
రాజులు; గుప్తశక నిర్ణయం; ఆంధ్ర సామ్రాజ్య విభాగము; బ్రాహ్మ
రాజులు; మహమ్మదీయాది యితర రాజ్యముల చరిత్రకు సంబంధిం
వివరములు. 300 పేజీలుగల గ్రంథము— వెల 4-8

## ౭. ఆభాస క్రైస్తవము

శ్రీకృష్ణభక్తులైన బ్రాహ్మణులు పాలస్తీనా మఠములలో నుండి శ్రీకృష్ణభక్తిని పాలస్తీనా ఈజిప్టు మొదలగు దేశములలో ప్రచారము చేసియుండిరి. శ్రీకృష్ణునిపేరు "క్రిష్టాసు" అని అచ్చటి భాషలలో వాడబడినది "క్రిష్టాసు"భక్తులు క్రిష్టియనులు. శ్రీకృష్ణ కథనే బైబిలులో ఎక్కించుకొని క్రీస్తుగా మార్చియుండిరి. ప్రారంభ క్రైస్తవులు ముఖమున Y మార్కు నామమును ధరించుచుండిరి. క్రీ॥ శక ప్రథమశతాబ్దములలో క్రీస్తుకు సిలువవేత్తుచున్నట్లు వేయబడిన బొమ్మలకు ముఖమున నామములున్నవనియు, మొదలగు విషయము లాయా గ్రంథములనుండి సేకరించబడిన ప్రమాణములతో గూడిన గ్రంథం. 92 పేజీలుగల గ్రంథం. 1-8-0

## ౮. ఆంధ్రులెవరు?

ఆంధ్రులు శపింపబడిన విశ్వామిత్రుని సంతానముకారనియు, ఐతరేయబ్రాహ్మణములో చెప్పబడిన ఆంధ్రులు అనాగరిక జాతివారై నట్లును, ఆంధ్రదేశములోని ప్రజలు ఆర్యసంతానమనియు, వారి నొకకాలమున పరిపాలించిన "ఆంధ్ర" అను పేరుగల రాజు తన పేరును నా దేశమునకుంచి వ్యవహరించినందున నీదేశము కాంధ్రదేశమనియు, దేశములోని ప్రజలు ఆంధ్రులనియు వ్యవహరింపబడుచుండిరి. ఆంధ్ర జాతి స్వచ్ఛమైన ఆర్యజాతి. విశ్వామిత్రుని శాపదగ్ధులై అనాగరికజాతిగా మారిపోయిన హీనజాతి కాదని ఋజువుచేయబడిన గ్రంథము. 52 పేజీలు చక్కని గ్లేజుపేపరు. అందరు కొని చదువవలయునను తలంపున తక్కువ వెలకు యివ్వబడుచున్నది. 0-6-0

# ౮. జంబూద్వీపము

## (అందలి విభాగములు)

ప్రాచీన భూగోళము, అందలి జంబూద్వీపాదులైన సప్తద్వీపములు, సప్తసముద్రములు జంబూద్వీపమందలి నవవర్ష విభాగములు మొదలయిన వివరములు నవీన భూగోళమునకు సమన్వయించి డిగ్రీలు సహా యిచ్చి సమన్వయముచేయబడిన పుస్తకము. వెల 0-6-0

పై గ్రంథములను గురించి వార్తాపత్రికలలోని "గ్రంథ సమీక్షలు, ప్రముఖుల అభిప్రాయములు" దిగువ వ్రాయబడినవి చూడుడు.

# ప్రముఖుల అభిప్రాయములు

## I

శ్రీ పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీజగద్గురు

### శ్రీ విమలానంద భారతిస్వామివారు

శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి దత్తాత్రేయమందిరం, కొత్తాళం, తెంకాశితా॥

యిట్లు వ్రాసియున్నారు—

క్యాంపు విజయవాడ,
13—10—49.

"ఏ చరిత్రమునకైన, దక్కని యధారములు లేనప్పుడు దాని వ్రాయుపద్ధతులను అవిపుష్కలముగ, కల విషయములను గూర్చియు అవలంబించి, తమ చిత్తవృత్తుల ననుసరించి సిద్ధాంతములను క్రొత్త క్రొత్తవేవియో కలిపించి వానితో యొక యల్లికబుట్ట సిద్ధముచేసి, ఇదియు, యీవిషయముయొక్క యథార్థమనునది యీ విషయచరిత్ర మెన్నటికి కాజాలదు.

ఇంగ్లీషువారు... మన దేశచరిత్రమని, యెవరేది వ్రాసియున్నను ఆవిధముననే యున్నది. ఇప్పుడీ కోట వేంకటాచలపండితులు, వెనుకటి వారు మనకున్న యాధారముల నేవిధముగ తారుమారు చేసినదియు, నందు కొన్నిటి ముఖ్యమైనవాని యెట్లు అశ్రద్ధ చేసినదియు, తెల్పుచు సరియైన మార్గమును త్రొక్కి మన దేశమునుగూర్చి, సత్యమైన చరిత్ర నెట్లు బయలుపరచవలయునో విశదము చేయుచు తమకిక ముందు వచ్చువారలకు మార్గదర్శకులైరని చెప్పుట అత్యంతముదావహము.

ఏ విషయమునుగూర్చి యైనను పర్యవసానము దేల్చునపుడు భిన్నాభిప్రాయము లుండవచ్చునుగాని, ఉన్న యాధారముల నుపయోగించుటలో "పెద్దమనిషి తనము" చెడగొట్టుకొనరాదుగదా!

కావున నీయన యువలంబించిన పద్ధతి సర్వదా శ్రేయస్క
ముగ కనబడుచున్నది. సుమారు 1400 సం॥రములకు పూర్వము
మహమ్మదు లేడు. మహమ్మదీయ మతము లేదు! రెండువే
సం॥రములకు ముందు క్రీస్తును లేడు, క్రైస్తవమతమును లేద
నాలుగు వేలకు పూర్వము బుద్ధుడు లేడు, బౌద్ధమతము లేదు. ఆ
వేలకు పూర్వము యూదులు లేరు - యూదుల మతము లేదు. అ
ప్రసిద్ధపురుషు లేర్పరచిన మతములు, అన్ని దేశములలోను ప్రా
భము కలవియే.

ఇట్లే యెంతదూరము వెనుకకు బోయినను, ఇట్టివి బు
పూర్వము, మనుష్యలోకమును దాని సార్వత్రికాభివృద్ధియు
కనబడుచునే యున్నది.

ఆ, అనాదియైన మనుష్యలోక చరిత్రయే కదా! భారతీ
చరిత్ర! దీనిని వ్రాయదలచిన, నెంత భక్తి విశ్వాసములతో, ద
కున్న దివ్యాధారములను గుర్తించి ఒకడు పూనుకొనవలయును?

అట్టి యీ మొదటి ప్రయత్నము నభినందించుచు, భార
వర్ష యదార్థ చరిత్ర వ్రాయదలంపుగల వారలకు, ఇది నాందియ
నారాయణ స్మరణపూర్వకముగా నాశీర్వదించుచున్నాము.

ఇవియే నారాయణ స్మృతులు
విమలానంద భారతీస్వామి వ్రాలున్
శాకే ౨౧-౭-౧౮౭౧
18-10-49

## II

## శ్రీ జవటూరి సానందరావుగారు యలకుర్రు

యిట్లు వ్రాయుచున్నారు:

ఆర్యా! 18-4-49

తమచే రచింపబడిన బ్రహ్మాండసృష్టి విజ్ఞానమను చిన్న పొ
మును చూచినాను. అందు తమరు చేసిన సనాతన గ్రంధ సమా

చన సమన్వయములు ప్రకృతకాలమునందలి విమర్శకుల దృష్టికి సహితము ఆకర్షణీయములనుటలో అతిశయోక్తి ఆవంతయు లేదు. ఇటువంటి వ్యక్తి ఒకరున్నట్లున్నూ, అందులో కడు సమీపమున బెజవాడలో నున్నట్లున్నూ నేను యిదివరకు వినియుండలేదు... ... తమ గ్రంథములమూల్య విజ్ఞాన దాయకములు.

ఇ॥ సా॥ వ్రాలున్నది

III

రాష్ట్రపతి, డాక్టరు

## భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు

న్యూఢిల్లీ నుండి యిట్లు వ్రాసియున్నారు :

న్యూ ఢిల్లీ, 26-7-1949

ఆర్యా !

మీవద్దనుంచి యీరోజు వచ్చిన మానవసృష్టి విజ్ఞానము అనే పుస్తకము అందినది. కొంచెము హెచ్చుతగ్గుగా పుస్తకం సాంతముగా చదివినాను. అద్భుతంగా యున్నది. మీరు నిరాడంబరంగా యింత కృషి చేస్తున్నారన్న విషయము మాకు యిదివఱకు తెలియదు. ఆంగ్లమునందు తర్జుమా చేయించుట చాలా మంచిపని జరిగినది. అచ్చులోనున్న 11 పుస్తకములలో రెండవస్థానం వహించిన ఈ పుస్తకముగాక యింకను పదిపుస్తకములు రావలసియున్నవి. అవి అన్నియు ఇంత ముచ్చటగను యింత తేజోవంతముగను ఉండునని చెప్పుటకు సందేహము లేదు. మనవైపునుండి ఇంతటి గ్రంథము వెలువడినందులకు మీకు నా కృతజ్ఞత తెలుపు చున్నాను.

చిత్తగించవలెను.

(సరియైన నకలు) భో॥ పట్టాభి సీతారామయ్య

(సంతకం వున్నది)

## IV

## కె. యస్. రామస్వామి శాస్త్రియార్

రిటైర్డు డిస్ట్రిక్టు జడ్జి. యీప్రకారం వ్రాసియున్నారు.

రాయపేట, మద్రాసు

19-7-1949

My Dear Sir,

I thank you sincerely for sending me a copy of your excellent book "Manavasrishti Vijnanam". You have given convincing reasons for your views. I feel sure that your book will receive ever increasing public appreciation.

your sincerely

(Sd). K. S. Ramaswamy Sastri.

## V

## ఉయ్యూరు రాజాగారు

Nuzvid

Sir, 28—7—49

తాము పంపిన 'మానవసృష్టి విజ్ఞానం' అనే ఇంగ్లీషు గ్రంథం అందినది. చాలా పరిశోధనచేసి తమరు నిర్ణయించిన విషయం. భారత భూమి ఆర్యుల ఆదిమస్థానము—అనే సంగతి యదార్థము అని మా తండ్రిగారైన శ్రీరాజా వెంకటరంగయ్యప్పారావు బహద్దరుగారున్నూ సంస్కృతపురాణములను బట్టి నిర్ణయించి యుండిరి. అదే మా విశ్వాసమున్నూ. తమ గ్రంథము సావకాశముగా చదివి ఆనందించగలము—

సంతకం.

## VI

### శ్రీ దాసు త్రివిక్రమరావు పంతులుగారు

లేబరు కమీషనరు నైజాం,

కొత్తగూడెం,
3-9-49.

......The process of the Evolution of the Universe explained therein is convincing to all unprejudiced minds. I have my own doubts as to whether the leaders of our secular state will give the book the attention it deserves. I hope it will enable the present and coming generations to know in an understanding manner the eternal truths contained in our ancient books.

(Sd.) D. T. R.

## VII

### శ్రీ సోలస బాపనయ్యగారు

బి. ఏ. బి. యల్., వకీలు, రాజమండ్రి

Dear Sir, 13—7—49.

I thank you once more heartily for sending me the book "Manavasrishti Vijnanam" which I have read with great interest and benefit to myself, and admire the profound knowledge and close reasoning which it displays on the subject which geatly enhances the prestige of the Aryan Race.

(Sd), S. B.

# VIII

కవితిలక, కవితావిశారద, విద్వాన్

## శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు

మెన్సు - లెక్చరర్, క్వీన్ మేరీకాలేజి—యిట్లు వ్రాసియున్నారు.

బెజవాడ,

**6—10—49.**

"బ్రహ్మశ్రీ కోట వెంకటాచలంగారు సృష్ట్యాదినుండి మానవజ యార్జించిన విజ్ఞానము మన ప్రాచీన గ్రంథములను చక్కగ పరిశోధిం పఠించి "ఆర్యవిజ్ఞానమను కుసుమములచే లోకుల కామోదము గూర్చుచున్నారు—జిజ్ఞాసువుల పాలిట కల్పవృక్ష మీ గ్రంథమ యని చెప్పవచ్చును. ఆంగ్లేయభాషలో "మానవసృష్టి విజ్ఞానమ (The Genesis of the Human Race) అను గ్రంథమును ప్ర రించిరి... ... ... రెండవది ఆభాసశక్తిస్తవము... ... ... వెంకటాచల గారి పరిశోధనయొక్క సారము నీ గ్రంథము వెల్లడిచేయుచున్న బ్రహ్మాండసృష్టి విజ్ఞానమునందు సర్వశాస్త్రముల సారమును క్రో కరించినారు. "కలిశకవిజ్ఞానము" ప్రథమభాగమును ద్వితీయభాగము గూడ చదివితిని. విద్యార్థులకు సైతమీ గ్రంథములు మిక్కిలి యు రించును. హిందువులందఱు ఆబాలవృద్ధులు పఠింపదగినవి గ్రంథములని భావించుచున్నాను."—

కాం॥ క॥ సంతకం గలదు.



# పత్రికా సమీక్షలు

## IX

కృష్ణాపత్రిక యిట్లు వ్రాయుచున్నది: ది 14 మే 1949

విజయవాడ వాస్తవ్యులగు శ్రీకోటవెంకటాచలంగారు అద్వైత బోధినీ, నిర్విచారజీవనం, ఆభాసకైస్తవము, బ్రహ్మాండసృష్టి విజ్ఞానము, కలికవిజ్ఞానము, మానవసృష్టి విజ్ఞానం అనెడి ఉత్తమగ్రంథముల రచించి ఆంధ్రమహాజనులకు అపారమైన సేవచేసియున్నారు.

......"డార్విన్ సృష్టిక్రమము అసంపూర్తిగ నున్నదని ఋజువు చేయగలిగిరి." ప్రపంచ సృష్టి 195,58,85,050 సం॥రముల క్రింద జరిగియున్నదని స్పష్టపరచిరి. భారతీయులు ఆదిమనివాసులని, వేలకొలది సం॥రములకు క్రితమే నాగరికతకు, విజ్ఞానమునకు పేరు పొందిరని, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికా ఖండములు కూడ ఆక్రమించుకొని నివసించిరని యిపుడిపుడే గుర్తింపబడుట సంతోషకరము. ఆర్య విజ్ఞానమునకు మూలాధారము వేదములనియు, ఆర్యుల నివాస స్థానము సరస్వతీ నదీతీరమగు బ్రహ్మావర్తదేశమనియు, గ్రంథస్థ నిదర్శనపూర్వకముగ కళ్లకుకట్టినట్లు స్పష్టీకరింపగలిగిరి. ప్రాచీన భారతవర్ష చిత్రపటము చక్కగ ముద్రింపించి మన మన్ననలకు పాత్రులైరి

భారత దేశ చరిత్ర పునర్నిర్మాణ యుగమున యిట్టి యుత్తమ గ్రంథము లందలి విషయము లెక్కువగా ఆచరణ యోగ్యములు నుండగలవు......వారి (ఆర్యుల) ఆధ్యాత్మిక శక్తి అపూర్వమని నాగరికత నిరుపమానమని, ఆచార వ్యవహారములు సైన్సు ముఖ్యసూత్రములపై ఆధారపడి యున్నవని ఋజువుచేయబడినది...ఇత్యాది.

## X

జాగృతి : ది 15-8-1949 తేదీగల పత్రికలో

"ప్రపంచమంలో మానవుడు యెక్కడ యెలా ఉద్భవించాడు, అతని సంస్కరణ చరిత్ర యేమిటి అన్న మూల సమస్యల్ని క్షుణ్ణంగా చర్చించి ఆర్య విజ్ఞానాన్ని సుబోధం చేస్తున్న అంగ్లపుస్తకం."

## XI

THE HINDU, Sunday, July 17, 1949 (హిందూ పత్రి

Manavasrishti Vijnanam. (The Genesis of Human Race.)

By Kota Venkatachelam (Author)
Gandhinagar, Vijayavada

"This is an attempt to ascertain the crad mankind with the almost exclusive aid of Vedic mony. The author believes that the first man wa Aryan and that he was created in Aryavarta Valley of the Saraswati, because in the ten man of the Rigveda that river is mentioned 73 time against the 19 references to the Sindhu and f references to the other rivers ........................ In short his thesis is an emotional diatribe agains theory of the Aryan invasion of India,"... .......etc

## XII

INDIAN REPUBLIC Monday, July 18; (ఇండియన్ రిపబ్లిక్ పత్రిక).

Manava Srishti Vijnanam. By Kota Ven chelam.................He points out that the first of the Aryans was Aryavarta, He quotes prof from the Rigveda, Manusmriti, the Puranas, anc vedic commentaries. He supports his statements the findings of the Geological and Archaeolc researches etc...........An attempt is made in the to stimulate in the minds of the students the spir research into this "all important matter of the ings of foreigners on the subject and rejecting wh not supported by Vedic writings, by the autho wholsome feature. The maps supplied by mr. Ven cha'lam are useful. (See Pages 27, 81, 83).

The Appendix on the "Ancient Geography c Puranas" is very interesting study. The secti modern countries which correspond to ancient r may be perused with interest. The problems 1

are of practical value and should be solved with the aid of our own ancient literature and by a proper interpretation. The conclusions are thought provoking and deserve to be widely read and thought over. The need for a reorientation of the study of Indian History is well indicated by the facts brought out in this work."

## XIII

౮. ఆంధ్రులెవరు? అనెడి గ్రంథముమీాద ది 11-12-1949 "ఆంధ్రపత్రిక" సమీాక్ష.

"ఆంధ్రులెవరు? అనగా మనము ఎవరిసంతతికి చెందిన వారము? మనపూర్వీకులు ఉన్నతవంశసంభూతులా? లేక నీచవంశ సంభూతులా? మన కులగోత్రములు సంప్రదాయములు యెట్టివి? ప్రతి ఆంధ్రుడు విచారించి తెస్సగా తెలుసుకొనదగిన యీవిషయమును శ్రీ కోట వెంకటాచలంగారు ఈగ్రంథములో చర్చించుచున్నారు."

......... విశ్వామిత్రుని కుమాళ్లు ఏబదిమంది తండ్రియాజ్ఞ మీారినందున తండ్రిచే శపింపబడి వేదబాహ్యులు గావింపబడిరి. వీరే ఆంధ్రదేశములోని ఆంధ్రులని పాశ్చాత్యపండితులును, వారి అనుయాయులైన హైందవ పురాణవిద్యాధికులును జెప్పుచున్నారు. ఈ వ్రాతలు కేవలము భ్రమప్రమాదజనితములనియు, ......యదుకుల సంభూతుడైన ఆంధ్రనృపతి పేర మనదేశము "ఆంధ్రదేశమై"నదనియు వీరు చెప్పుచున్నారు. (సంస్కృతభాగవతం, నవమస్కంధము 23 అధ్యాయం 5,6 శ్లోకములు - తెలుగుభాగవతము 9-685 వీరికి ప్రమాణము).

"అత్యంతసమర్థతతో వీరు తమ వాదమును నిలువబెట్టుకొనుచున్నారు. ఈవాదము చాలా బలీయమైనదనుట కెట్టి సందియమును లేదు.........వీరు అత్యంతసమర్థతతో ప్రపంచించిన యీవాదమును ఆంధ్రచరిత్రకారులు శ్రద్ధగా విచారించి నిర్ణయము గావింపదగుదురు. భవిష్యచ్చరిత్రకారులకు తోడ్పడునదగుటచేత వీరి కృషి అత్యంతము ప్రశంసనీయమగుచున్నది."

## XIV

తెలుగు స్వతంత్ర మద్రాసు. ది 29-10-49

"ఆభాసక్రైస్తవము" జిజ్ఞాస రేకెత్తించే చురుకైన విమర్శన పుస్తకం............ రెండువేల సంవత్సరాలకి పైనుంచి ఈజిప్టులో "క్రిష్టియను" మతముండి.... ఈవిషయాన్నిటిని ఆయా గ్రంథాలనుండి సేకరించిన ప్రమాణవాక్యాలతో సహేతుకంగా వివరిస్తోంది" ఇత్యాది.

## XV

విజయవాణి పత్రిక, విజయవాడ. ది 3-11-48

"ఇది ఒక అపూర్వప్రజ్ఞాసమన్విత పరిశోధకగ్రంథం. భారత దేశంలో మనసంస్కృతి విజ్ఞానాలకు భంగం కలిగిస్తూ వున్న యీ రోజుల్లో ప్రజల కన్నులను తెరుస్తున్నదీ గ్రంథం" ఇత్యాది.

## XVI

కృష్ణాపత్రిక బందరు. ది 15-9-48

"క్రైస్తవమతస్థులు దీనిని సాకల్యంగా పరిశీలించి సత్యవిచారణ జేసుకోవడం మాత్రం వారికే శ్రేయస్కరమనుటకు సందేహము లేదు." ఇత్యాది—

## XVII

ఆంధ్రవాణి విజయవాడ. ది 4-12-48

"క్రైస్తవమతము కల్పితమని ఋజువు చేయు గ్రంథము లన్నిటికంటె యీఆంధ్రగ్రంథం యెక్కువ ప్రామాణికము గాకలదని చెప్పకతప్పదు. శ్రీ వెంకటాచలంగారు చేసిన చారిత్రక పరిశోధనకు ఆంధ్రులెల్లరు ఋణపడియున్నారు." ఇత్యాది—

---

గ్రంథములకు దిగువ చిరునామాకు వ్రాయుడు :—

కోట వెంకటాచలంగారు

గాంధినగరం—విజయవాడ 2.

ఓమ్.

## ఆర్య విజ్ఞానము 4.

# ఆర్యుల ప్రపంచవ్యాప్తి

(అచ్చులోనున్న గ్రంథము)

భూగోళముమీద భారతవర్షమే ప్రథమసృష్టిస్థానము. ప్రథమ ఆర్యుడైన స్వాయంభువ మనువు మానవజాతికి పిత. మనువు సంతానమైన మానవులు "ఆర్యు"లని పిలువబడిరి. ఆర్యులు వేదధర్మావలంబులు వైదికధర్మమునొదిలిన ఆర్యులు "దస్యు"లనబడిరి. ఆర్యులకు బాధ కలిగించుచున్నందున "దస్యులు" ఆర్యావర్తమునుండి వెడలగొట్టబడి దేశమును వీడిపోయిరని వైదిక వాఙ్మయమందుగలదని అనేకులైన పాశ్చాత్య పండితు లంగీకరించిరి. అట్టి దస్యు గుంపులచేతను, రాజ్య కాంక్ష తోడను, కృషివాణిజ్యాదులచే ధన సంపాదనార్థమును భారతము నొదిలిపోయిన చాతుర్వర్ణ్యస్థులచేతను మిగత భూగోళమంతయు అతి పురాతన కాలముననే నిండిపోయినది అను మొదలుగాగల యనేక ప్రమాణ వాక్యములతో గూడిన ఆర్యుల ప్రపంచవ్యాప్తిని గురించి వివరించబడిన గ్రంథము.

విషయసూచిక :— ఆర్యావర్తమనాది, డబిస్థాన్ పత్రము, ఈజిప్టు (ఉత్తర ద్రవిడము) గ్రీసు - (యవనదేశము) రోము (రోమకము లేక రామఠము) బ్రిటను— స్కాండినేవియా (స్కంధనాభి) జర్మని (శార్మణ్య దేశము) ఆర్యావర్త పశ్చిమ సరిహద్దు, సగరచక్రవర్తి, వివిధ వలస భూములు, అనాగరికత. సర్వశాస్త్రములకు కలను, భారతీయులు మూలపురుషులు, మన పురాణములు, వలస హేతువులు, బహిష్కార జాతులు, భారత సామ్రాజ్యము, ప్రాచీనత, దేశచరిత్రలు, భారతీయ కళశాలలు, ఖురాన్ షరీఫు, శివాజి జయసింగునకు వ్రాసిన ఉత్తరము, అల్లోపనిషత్ అల్బెరూని వాక్యములు, టవర్నీరు భారతదేశ యాత్ర, మదాంబ్లావట్స్కీ, పాశ్చాత్య పండితాభిప్రాయములు.

ఆసియాఖండము :— ౧. మిడియా, ఇరానియనులు, ఇండోసిథియనులు, పార్థియనులు, సాగ్డియనులు, కుచియనులు, కుష్ణనులు, ౨. టిబెట్టు, 3, మంగోలియా, ౪. సైబిరియా, ౫. ఆర్మీనియా (ఆర్యమణి; ౬. తురుష్కస్థానము (తుర్వసుస్థానము) ౭. అస్సిరియా (అసారియు) ౮. బాబిలోనియా ౯. అరేబియా (ఆర్యబాహ్య) ౧౦. బాక్ట్రియ (బాహ్లీకము) ౧౧. చీనా (చీనా) ౧౨. జపాన్. ౧౩. ఇన్సులిండియా, హిందూ చీనా, ఛాంప, కాంభోజ (కంబోడియా) సయాము, సుమిత్రా (స్వర్ణప్రస్థ) బోర్నియో (రమణకద్వీప) జావా (చంద్రశుక్ల లేక యవద్వీప) బర్మా (ప్రాగ్జ్యోతిష) కొచ్చిన్ చీనా, ఆస్ట్రేలియా ౧౪. సింహళము ౧౫. లంక.

ఆఫ్రికాఖండము :— ఎతియోపియా, బార్బరి రాష్ట్రములు (బర్బరదేశము) ఈజిప్టు (ఉత్తరద్రవిడము) క్రీటు (కిరాతదేశము) అట్లాంటిసు.

ఐరోపా (సురూపదేశము) :— గ్రీసు (యవనదేశము) రోము (రామత
శేక రోమకము) జర్మనీ (శార్మణ్యము) ఇంగ్లాండు, ఐర్లాండు (ఆర్యలాండు) స్కా
నేవియా (స్కంధనాభి)

అమెరికా (సిద్ధ ద్వీపము) :— అచ్చట హిందువుల నాగరికతను నా
నముచేసి వారిని అనాగరికులని, మనుష్యులను తినెడి అడివిజాతులని "రెడ్డి యిండియ
లను" అతి హీనముగా వర్ణించి వారి స్వాతంత్రయము దోచుకొని, వారిని చంపి నాశన
చేసి వారి భూములను హరించి వారి దేవాలయములను దోచుకొని క్రిష్టియను చర్చిలు
మార్చి అమెరికను హైందవుల నాగరికతా నిర్మూలన మొనరించిన స్పెయిను జాతీ
లను గూర్చియు, అమెరికా దేశమును కోట్ల సంవత్సరములక్రితమాక్రమించిన హై
వుల చరిత్ర. హిందూ నాగరికత, హిందువుల శివ, విష్ణాలయములు, సోమయాగను
మొదలగు ఆరాధనలన్నియు యిప్పటికిని అమెరికాలో యెర్ర ఇండియనులని పిల
బడువారిలో గలవు. ఆ విషయములన్నియు సవిస్తరముగా వర్ణింపబడిన గ్రంథ
ద్రవ్యసహాయమెంత త్వరలో ప్రాప్తించిన అంత త్వరలో ముద్రింపబడును.

# ఆర్యుల సర్వతోముఖ విజ్ఞానము

ప్రభుత్వము, సంఘ నిర్మాణము, ప్రజల స్వభావము, నడత, సాహసౌదా
ములు, పరాక్రమము, విదేశీయులతో సంబంధము, ఆర్యావర్తము స్వర్గభూమి.

పాణినీయ వ్యాకరణం, సారస్వతము, సంస్కృతభాష, లిపిజ్ఞానము, వై
రాత్యము, కవిత్వము, ఇతిహాస ప్రబంధకవిత్వము, నాటక సాహిత్యము, నీతిక
కావ్యములు, తత్త్వజ్ఞానము, న్యాయశాస్త్రము, వైశేషికము, సాంఖ్యవ
గము, మీమాంస, వైద్యశాస్త్రము, గణితము, అంకగణితము, క్షేత్రగణిత
గణితము, ఖగోళశాస్త్రము, రణశాస్త్రము, విమానవిద్య, సంగీతము, ఇతర శా
ములు, కళలు, చేతిపనులు. వాస్తువు, తక్షణము వర్ణాలేఖ్యములు. నేతపను
కము, ఉక్కుపరిశ్రమలు ఇతరకళలు, వాణిజ్యము.

# ఆర్యుల ధృవనివాస ఖండనము

శ్రీ తిలక్కుమహాశయునివాదము వేదకర్త యెవ్వడునులేడు. స్వర్గమన నేమి
ఉత్తరధృవముకంటె స్వర్గమువేరు, జ్యోతిశ్శాస్త్రప్రమాణము, దీర్ఘరాత్రిభయము,
సూక్తములు, దేవతల రాత్రింబవళ్ళు, ప్రళయము, పలాయన మూహాజన్మములు,
గాధ వేదమంత్రము లపార్థముచేయబడినవి. ఉత్తరగిరి, వెండిడాడ్ ప్రమాణము, వె
డాడ్‌లోని 16 దేశముల వివరము, వలసబోయి తిరిగివచ్చుట. వేదములోని పు
ప్రథమాదివాక్యములు. దేవఋషులు, యజ్ఞవేదికయందు 30 యిటుకలుబెట్టు సాం
దాయము. వైదికఉష, అనంతబ్రహ్మాండములు, పాశ్చాత్య ఖగోళశాస్త్రజ్ఞ

సూర్యుడు, నక్షత్రముల దశలు, లోకచక్రము, వేదకాలము, భూగర్భశాస్త్రము, సోమయాగములు, సోమలత.

# ఆర్యుల మతము

(i) సనాతన ధర్మము :— ౧. వేదములు, ౨. ఉపవేదములు, 3. వేదాంగములు, ౪. ఉపాంగములు, ౫. స్మృతులు,

స్మృతి సమములు :— శ్రౌత సూత్రములు, గృహ్య సూత్రములు, మంత్ర, తంత్ర శాస్త్రములు, ఆగమములు, ఇతిహాసములు, పురాణములు, ఉపపురాణములు.

ఇతర శాస్త్రములు :— వార్త (అర్థశాస్త్రము), దండనీతి, (రాజనీతి శాస్త్రము)

(ii) చతుష్షష్టి కళలు :— ౧. చతుష్షష్టిమూలకళలు, ౨. కళావిదుల చతుష్షష్టికళలు, కర్మాశ్రయములు, ద్యూతాశ్రయములు, శయనోపచారములు, ఉత్తర కళలు, 3. కామశాస్త్రాంగకళలు, ౪. శుక్రనీతిసారకళలు, 64. గాంధర్వవేదకళలు, ఆయుర్వేదకళలు, ధనుర్వేదకళలు, ఇతరకళలు, ౫. ఉపనిషత్తులు, ౬. వేదము నాది; అపౌరుషేయము, ౭. వేదాధ్యయన మొకకళ, ౮. స్వరాపరాధము, ౯. పురాణ లక్షణములు, ౧౦. వేదప్రాశస్త్యమును గురించిన కొందరి పాశ్చాత్యపండితాభిప్రాయములు.

(iii) దర్శనములు :— ౧. పూర్వమీమాంస, ౨. ఉత్తరమీమాంస 3. సాంఖ్యము, ౪. యోగము, ౫. నైయాయికము, ౬. వైశేషికము.

iv ధర్మప్రశంస :— ౧ వర్ణసాంకర్యము నిరుద్యోగ హేతువు, ౨ వృత్తిగౌరవము 3 వర్ణసంకరము వలన నష్టములు, ౪ స్వధర్మము శ్రేష్ఠము, ౫ వర్ణధర్మ పరిత్యాగము పారతంత్ర్యకారణము, ౬ వర్ణధర్మము కళాప్రావీణ్య హేతువు.

v మతస్వాతంత్ర్యము :—

vi పౌరుషేయమతములు:—క్రైస్తవ, మహమ్మదీయమత స్వరూపము.

vii వైదికమతము:—౧ బ్రహ్మనిష్ఠ, ౨ కర్మనిష్ఠ, 3 ఆత్మస్వరూపము, ౪ సర్వజీవులు విముక్తినొందుమార్గము, ౫ వైదికజాతీయనీతి, ౬ ఆత్మ దర్శింపతగినది, ౭ నమ్ముట అజ్ఞానము.

viii వర్ణవిభాగమునుగురించి పండితాభిప్రాయములు :—

ix భారతీయ దేవతల ప్రపంచవ్యాప్తి :—

# కలిశకవిజ్ఞానం

(1, 2 భాగములు)

---

24 డిశంబరు 1949 సం॥ "కృష్ణాపత్రిక" యిట్లు వ్రాయుచున్నది :

"అద్వైతబోధినీ, నిర్విచారజీవనము, ఆభాసక్రైస్తవము, బ్రహ్మాండసృష్టి విజ్ఞానము, మానవసృష్టి విజ్ఞానము అనెడి అమూల్య గ్రంథములు ఆంధ్రలోకమున కర్పించి...... "కలిశకవిజ్ఞానము" ప్రథమ, ద్వితీయభాగముల "శ్రీ కోట వెంకటాచలంగారు" సమర్పించి కృతకృత్యులైరి............ పురాణాది వాఙ్మయమును నిరసించుచు వ్రాసిన వ్రాతలు మన విద్యార్థులకు, ఉపాధ్యాయులకు ప్రమాణగ్రంథములుగ నుండుట శోచనీయము.........గ్రంథకర్త క్రీస్తుశకము కల్పితమని చెప్పుచు, కలిప్రవేశమునకు ముందు జరిగిన చరిత్ర ప్రాముఖ్యవిషయముల నిరూపించి, మానభేద వివరముల స్పష్టీకరించిరి............ ఆర్యభట్టు, కాళిదాసు, వరాహమిహిరుని, భట్టోత్పలుని, భాస్కరాచార్యుల కాలప్రశంస గావించి జ్యోతిష సిద్ధాంతముల కాలనిర్ణయము బలపరచి పాశ్చాత్య విద్వాంసుల తర్కముల ఖండించిరి............... ద్వితీయ భాగమున భీష్మనిర్యాణం, శ్రీకృష్ణ భగవానుని కాలనిర్ణయముల నిదర్శనములతో ధారణచేసి, "పర్గీటరు" మున్నగు వారి సూచనల యందలి దోషముల స్పష్టీకరించిరి............ గ్రంథకర్త వెంకటాచలంగారు పూర్వాచార పరాయణులైనను, చరిత్ర పరిశోధకులకన్న మిన్నయై పాశ్చాత్య చరిత్రకారుల వ్రాతలు విమర్శకదృష్టితో పరిశీలించి సత్యాసత్యముల గ్రహించి, జ్యోతిష, ప్రకృతివిజ్ఞాన సిద్ధాంతముల మనమునందిడుకొని సమన్వయింపజూచి తమ నిశ్చితాభిప్రాయముల నిర్భీతితో వెలిబుచ్చుట ప్రశంసనీయము."

---

గ్రంథములకు దిగువ చిరునామాకు వ్రాయుడు :—

కోట వెంకటాచలంగారు,

గాంధినగరం, విజయవాడ – 2.